**This book is published with the Financial assistance of Tirumala Tirupati Devastanam under their Scheme aid to Publishd Religious books.**

ప్రథమ ముద్రణ: 1997
ప్రతులు: 750



వెల రూ. 50.00

ప్రతులు దొరుకుచోటు:
**శ్రీమతి కల్లూరి శ్రీదేవి**
**C/o** శ్రీ కల్లూరి మురళీకృష్ణ
**A-2 P&T** క్వార్టర్స్, సర్దార్ పటేల్ రోడ్,
సికింద్రాబాదు-3

ముద్రణ :
శివాజి ప్రెస్,
4-4-53, గంజ్ బజార్
సికింద్రాబాద్-500 003



# అంకితం

సర్వవ్యాపి
అధివుడు
ఐశ్వర్యప్రదాత అయిన
శ్రీవేంకటేశ్వర స్వామిని
అహర్నిశలు ధ్యానించు
అని నా రఘు చెప్పాడు కనుక
ఆ మాట శిరోధార్యంగా
ఆ తిరుమల దైవానికే
ఈ నా తేజస్సుమాలు
అంకితమిస్తున్నా

రచయిత్రి

# నావి నాలుగు మాటలు

సాక్షాత్ ఆ అనంత జగత్ సృష్టివంటిదే సత్కావ్య సృష్టి. వ్యాసుడు, వాల్మీకి ఏం ప్రతిభని ఆశించి రచించారు? భారతీయ వాఙ్మయంలో వేదాలకో విశిష్ట స్థానముంది. వేదాలే శ్రుతులు. శ్రుతుల తర్వాతస్మృతులు. వేదసారమే పురాణాలయందు ప్రతిష్టించబడింది. శ్రుతులు స్మృతులు మానవుడికి నేత్రప్రాయాలు.

అవి రెండూ లేనప్పుడు మానవుడు వివేకహీనుడై జ్ఞానజ్యోతిని చూడలేనివాడై, అంధుడై, దారితెన్నుగానక అజ్ఞానాంధకారానబడి కొట్టుమిట్టాడుతుంటాడు.

సత్కావ్య పఠనంచేత ఉత్తమాశయాల నలవర్చుకుని, మహా కార్యాలొనర్చి ఆచంద్రార్కం ప్రసిద్ధిగాంచిన మహనీయులెందరో వున్నారు. కనుక ఆర్షధర్మమే మనకు ఆదర్శప్రాయం. ఆనాటి కావ్య నాయికలు.

ఆనాటి నారీమణుల మనోనిగ్రహం, కర్తవ్యపరాయణత్వం, వారిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా వున్న ప్రతిభాపరిమళాలు తల్చుకుని పులకించిపోతుంటాను. ఆ ప్రతిభ పరివ్యాప్తం కాగల్గినప్పుడే సృజనాత్మక శక్తికి సామర్థ్యం చేకూరుతుందనుకున్నాను.

ఇప్పుడు నేను రాసినవి వైవిధ్యంగల రచనలు.

ఒకే మూసలో మల్చినవి కావు. దేనికదే ఒక కల్కితురాయి. పర్వత రాజపుత్రి శైలజ పరమశివుని పతిగా బడయగోరి అతిక్లిష్టమైన పరిస్థితుల్లోకి దూకింది.

సతీదేవియందు విరక్తుడై ఐహిక విషయాదులయందే విముఖత

పొందియున్న మృత్యుంజయుని తనయందు అనురక్తుణ్ణి చేయగల్గిందంటే సామాన్య విషయం కాదు.

అసాధ్యమైన మహత్కార్యం తలపెట్టిందే కాని ఆ కఠోర దీక్షకు పర్యవసానం

బ్రహ్మాండమైన ఘన విజయమే చేకూరుతుందో ఘోర పరాజయమే సంప్రాప్తిస్తుందో అనే సందేహం అడుగడుగునా మనసు దొల్చేస్తుండటమే కాకుండా తన ప్రయత్నం యందు తల్లి విముఖతకూడా వుందికదా ! ఆ శైలజ కోర్కె సిద్ధించాలంటే అపరిమితమైన ఓర్పు, అనంతమైన పట్టుదల వహించాలి. అదే ఆమె తపస్సు.

*　　　　*　　　　*

వసుచరిత్రలోని గిరిక పాత్ర రామరాజభూషణుని అపురూపమైన కల్పనా సంపద.

రామరాజభూషణుడు రాయల ఆస్థానంలో గల అష్టదిగ్గజాల్లో ఒకరు. భట్టుమూర్తి అనికూడ అంటారు ఆయనని.

ఆయన ప్రత్యేకత ఏమిటంటే, సంగీత శాస్త్రాన్ని చక్కగా అధ్యయనం చేసిన గాయకుడు కూడా. కవులందరి మాదిరిగా కావ్యాన్ని చదువలేదు, కమనీయంగా గానం చేశాడీయన తన మధుర కంఠంతో. ఇక ఆయన రచించిన కావ్యమూ అన్నిటి వంటిదికాదు. ఒక గిరిని ఒక ఝురిని నాయికా నాయకులుగా మలచి ఇంత ప్రబంధం అల్లి ఖ్యాతి గాంచాడంటే ఘనుడేమరి. వీరిద్దరికి ఉదయించినది గిరిక.

ఏ విధమైన ఎగుడు దిగుళ్లు లేకుండా బహుచక్కగా సాఫీగా సాగిపోతుంది కథ. లలిత లలితమైన పదాలతో సాటిలేని మేటి వర్ణనలతో దివిని గల దేవతలందర్నీ భువికి రప్పిస్తాడు. తలొక్కపని కల్పిస్తాడు.

వసుమహారాజు గిరికను అంత ప్రాణప్రదంగా ప్రేమించాక పెళ్ళిసందడి పెళ్ళిపందిరి నిర్మించటం కవియొక్క బాధ్యత కదా?

బలమైన కథావస్తువు లేకపోయినప్పటికీ చెప్పే విధం కడు చమత్కారమైనది.

* * *

శ్రీమద్రామాయణం ప్రపంచ ప్రసిద్ధి నొందినదే దానికి తిరుగు లేదు. రామాయణంలోని రాముని పాత్ర ధర్మాచరణగాని ధర్మబోధనకి గాదు.

కైకేయి దశరథమహారాజు మూడవభార్య. ఆవిడవల్లనే కదా ముందుకు నడిచింది? ఆనాడు ఆమె తన పతిని రెండువరాలు కోరకపోతే దశరథ మహారాజు నిర్ణయించిన ముహూర్తానికే రామపట్టాభిషేకం నిర్విఘ్నంగా జరిగిపోయేది. అంతే రామాయణం బాలకాండ అయోధ్యాకాండ అంతే. ఇక తక్కినకాండలేవీ?

కైకపాత్రలోని అమాయకత, అక్రూరత, మన ఆలోచనలకు అందరు అంతే. నేటివరకు ఆ పాత్ర అడుగడుక్కి అవమానాలపాలవుతూనేవుంది. ఆమె కోరిన కోర్కెలు రెండు నెరవేరనేలేదు, సరికదా ఆ వరాలు రెండు ఎదురు తిరిగి ఘోరంగా ఆమెను శిక్షిస్తూనేవున్నాయి.

* * *

శృంగార రసోత్తుంగ తరంగ సత్యభామ.

శ్రీకృష్ణుని విశ్లేషాన్ని కొంచెమైనా భరించలేని ప్రేమమూర్తి సత్యభామ. శృంగార విరహోత్కంఠ పారిజాతం, నరకాసురవధ, తులాభారం ఏది తీసుకున్నా పెద్ద గ్రంథమై పోతుంది. రాసేవారికి తనివితీరదు, ఇంకా తక్కువరాశామా అనిపించకమానదు. నాట్యరీతుల్లో ఇక చెప్పశక్యమే కాదు. ఈ సత్యభామ పాత్ర కుదించి రాయటమంత సులువైన పనికాదు.

శాకుంతలం రచించిన కాళిదాసు చిరస్మరణీయుడు. శకుంతల సౌందర్యం అకలుషితమైన తొలిఉషస్సువంటిది. లోకమెరుగని శకుంతల వనదేవతవంటి శకుంతల ఆత్మనిగ్రహం విజ్ఞత ఆమె పుట్టుకతోనే అలవడ్డాయా? అనే సందేహం మనకు రాకపోదు.

లోకంలోని మోసం కుటిలం ఎరుగదు! భర్త తిరస్కృతిని ఎలా తట్టుకుంది. తన పుత్రుని ఎంత నిబ్బరంగా పెంచి సకలాస్త్రకోవిదుని చేసింది? అని మనం నిర్ఘాంతపోయి ఆలోచించాల్సిన పాత్ర శకుంతల.

శకుంతల వనితాలోకానికే వన్నె తెచ్చినపాత్ర ఆదర్శవంతమై మనసుని హత్తుకుపోయే వనకన్య. ఆ కుసుమారికి ఇంత గట్టితనం, పట్టుదల, ఆత్మవిశ్వాసం? శకుంతల మన మూహించినంత బేలమాత్రం కాదు. మహారాజు నిన్ను నేనెరుగను అన్నంత మాత్రంచేత బహువిధాల ప్రతిమాలి భంగపడలేదు. ఆనాటి ప్రేమ ఘట్టాలు జ్ఞాపకం చేసింది. అయినా నువ్వెవరో నాకు తెలియదన్నాడు రాజు అప్పుడు ఆ సుకుమారి క్షోభిత హృదయంతో "మహారాజా! నువ్వు అసత్యం పలుకుతున్నావు మహాపాపం అని తెలిసినప్పటికి కూడా నీవు పశ్చాత్తాపానలంలో విరహాగ్నిలో దగ్ధమయే రోజు తప్పక వస్తుంది" అని చెప్పి వెనుదిరిగింది. తండ్రిని మించిన తనయుని కన్నది. ధైర్యంలో, శౌర్యంలో, పరాక్రమంలో ధీమంతుడు, అస్త్రవిద్యాపాటవంలో అన్నిట ఆరితేరేట్టు పెంచింది.

ఆసేతుహిమాచల పర్యంతం దేశాన్ని సుసంపన్నంగా పరిపాలించగల ధీరుడిగా తీర్చిదిద్దింది.

విశ్వామిత్రుడి బ్రహ్మతేజస్సు, క్షాత్రతేజస్సు సమపాళ్ళు గలవాడు, ఆయన రక్తం శకుంతలయందు ప్రవహిస్తుంది కనుక యుగపురుషుడు భరతుడయాడు. భరతవర్షం భరతఖండం అనేపేరు సార్థకమయేట్టు సుభిక్షంగా పాలించాడు భారతదేశాన్ని.

మనుచరిత్రలో రెండవ మనువు స్వారోచిషమనుసంభవానికి చక్కని సుక్షేత్రాన్ని ఎన్నుకున్నారు పెద్దన్నగారు. ప్రేమైకమూర్తి చక్కదనాల కుప్పఅయిన వరూధిని హృదయాన్ని ఒక్క పెద్దన్నగారే తరచి చూశారు.

ఆ వరూధిని వూహలు వూపిరి అంతా ప్రవరాఖ్యుడు సద్విజుడు నిత్యాగ్ని హోత్రి మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి అయిన ప్రవరుడిని జగత్ప్రసిద్ధమైన ఆమె సౌందర్యగరిమ, యౌవనవైభవం, ఎంత మాత్రమూ ప్రలోభ పెట్టలేకపోయాయి.

ఆమె కడవరకూ స్వచ్ఛమైన మనసుతో ఆరాధిస్తూనేవుంది. అందుకే ఆ వరూధిని ప్రేమ ఆచంద్రార్కం అలా విరాజిల్లుతోంది. వరూధిని తన ప్రియుణ్ణి ఎంతగా అదాధించిందంటే మనం వెళ్ళి,

నీచేత ఆరాధింపబడేవాడు నిజమైన ప్రవరుడుకాదు సుమా" అని చెప్పినా కాని. "ఛా ఛా మీకేం తెలియదు. మీరసలు మాట్లాడకండి అని మనల్నే చివాట్లేసి నోరుమూయించగలంత గాఢ నమ్మిక ఆమెది. అచంచలమైన విశ్వాసం. అలా వారి ప్రేమ ఆమె గర్భోత్పత్తి పర్యంతమే సాగిందిమరి. పెద్దనామాత్యుల కవితాసంపద అనుపమానం ఆ శృంగార ప్రబంధం నేటికీ దానికదే సాటి.

*　　　*　　　*

ఇక శృంగార నైషధం అంటే నలచరిత్ర. నలచక్రవర్తి ఎన్ని కష్టాలు పడ్డదీ లోక విదితమే. షట్చక్రవర్తులలో నలుడు ఒకడు. ఆయనను తల్చుకున్న వారి చరిత్రవిన్నా కవి కల్మషనాశనం అని ఆర్యోక్తి.

దమయంతికి స్వయవరం ఒక విషమసంధి. అప్పటినుంచికూడా నలుని తల్చుకుంటు తన కష్టాలను అనుభవించి ఒడ్డు చేరింది.

నిత్యయౌవనులైన దేవతలనుకూడ ప్రలోభపర్చగల దమయంతి సౌందర్యం కొనియాడతగ్గది. ఆ సౌందర్య లావణ్యాలు దేవలోకానమానస సరోవరంలో విహరించేహంసలు మెచ్చుకోవటం అపూర్వమైన విషయం.

ఆ విషయాన్ని అద్భుతంగా మల్చిన శ్రీనాధుని సాహితీ ప్రతిభ అసమానమైనది.

రాయలకాలంవలె కవితలకు పైన పందిళ్లువేచి క్రింద కస్తూరి కళాపి చల్లించి రంగవల్లులుదీర్చిదిద్దిన స్వర్ణయుగంకాదిది అయినా.

సంగీత సాంప్రదాయాన్ని సమగ్రంగా పోషిస్తూనే సాహిత్య గౌరవాన్ని కూడా సమకూర్చ సమకట్టిన నాది సాహసమే.

సంగీతసాహిత్యాలు రెండూ నీర క్షీర న్యాయంగా కలసే వుంటాయని ఆర్యోక్తికదా వున్నది?

సంగీత సాధన విడువకుండానే నేచేస్తున్న సాహిత్యప్రక్రియ కొంచెంకష్టతరమే అయినా, సాహితీవేత్తలూ రసజ్ఞులూ ఈ నా రచనలు చూసి 'బేష్' అన్నప్పుడు నాకు ఇంకా శ్రమ ఎక్కడవుంటుంది?

నేను ముఖ్యంగా చెప్పేదేమంటే, కాలంతో పాటుగా మారుతూవుండే రచయితలంటే నాకు వల్లమాలిన గౌరవం, అభిమానం, నేనూ కూడా మారాలనే నా తపన, కృషికూడా.

వైవిధ్యంగల రచనలుచేయటం నా అభిమతం. ఈ తేజస్సుమాలు మీచేత ఉంచాను.

మీరే నిర్ణయించండి, సెలవ్.

రచయిత్రి

# విషయసూచిక

మహాసహస్రావధాన స్థాపనాచార్య
డా॥ మాడుగుల నాగఫణిశర్మ

శ్రీమతి కల్లూరి శ్రీదేవిగారి ఈ రచన "తేజస్సుమాలు". ఈ పేరే చిత్రమైంది. తేజస్సు పురుష లక్షణం. సుమం-సౌందర్యలక్షణం స్త్రీ ప్రకృతి. ఈ రెండింటినీ సమాసం చేసి యీ పేరు పెట్టి-దానికి అనుగుణంగానే ఈ రచన సాగించారు రచయిత్రి.

సాహితీ జగతిలో ప్రసిద్ధలయిన ఏడుగురు కావ్య నాయికలను- ఆపాత్ర స్వరూపాలనూ విశ్లేషిస్తూ స్త్రీ ప్రకృతినీ, ఆ కావ్యాలను దిద్దిన అయా మహాకవుల రచనా-శైలీ-లక్షణ విశ్లేషణంతో పుమాకృతినీ-ప్రదర్శించారు-రచయిత్రి.

ఈమె ఏడుగురు నాయికలనే వస్తువుగా ఎందు కెంచుకున్నారు ? ఏం పదిమంది కాకూడదా ? కాకూడదేమో ! జ్యోతిశ్శాస్త్రంలో ఏడవ స్థానాన్ని-కళత్రస్థానం అంటారు. ఆ రకంగా ఈ సంఖ్యకు ప్రాధాన్యం వుంది. సాహిత్య పరంగా కూడా-ఈ నాయికలు ఏడుగురూ "ఏడు" పును-దుఃఖాన్ని కార్యసాధనా సహమైన దివ్యమార్గంగా మలచుకొన్న మహనీయలు. అందుకే వీరి నెంచుకున్నారేమో రచయిత్రి. జ్యోతిశ్శాస్త్ర రహస్యాలూ అవీ తెలిసి చేయనక్కరలేదు. మన యింటిలో మంచి హస్తవాసి గలిగిన అమ్మో అమ్మమ్మో వంటచేస్తే-పప్పుకు ఉప్పెంతో కారమెంతో-ఆమెకు కొలతలు తెలియ నక్కరలేదు గానీ-ఆ చేతికి అన్నీ అమరి ఏదెంతపడాలో కుదిరి రుచి పాకంలో పడుతుంది. ఇక్కడ రచన కూడా అంతే.

కాళిదాస కమనీయ వర్ణనలో-శకుంతల సహనశీలతనూ, శ్రీనాథుని సౌందర్య చిత్రణలో-దమయంతి ధన్యతనూ, పెద్దన కవీంద్రుని పురుషార్థ నిర్వహణలో వరూధినీ శృంగార మూర్ధన్యతనూ, రామరాజ భూషణుని రసవత్ కల్పనలో-గిరికా స్వరవిపంచికా రమ్యతనూ, ముక్కు తిమ్మనార్యుని మృదు

కవితా విన్యాసంలో-ముద్దులొలుకు అలకల సత్యభామనూ-స్థాలీ పులాక న్యాయంగా దిగ్దర్శనం చేయించారు రచయిత్రి. పై ఐదుగురు కావ్యనాయికలేగాని-

రామాయణ విషయానికివస్తే యిక్కడి నాయిక సీత కావాలి. అయినా రామాయణం అనే బండిని ఒక్క ఉదుటుతో ఎన్నో మలుపులు తిప్పిన ఇరుసు కైకేయి. పెంచిన మమకారం రామయ్యపై, కన్న మమకారం భరతయ్యపై ముడివడి జగత్కళ్యాణార్థం కఠిన కర్తవ్యం నిర్వహించిన లోకసంతప్తహృదయ. అందుకే ఆ పాత్రను యిక్కడ గుదిగుచ్చారు రచయిత్రి.

ఇక రుద్రాణి. ఆమె రుద్ర గేహిని. సతిగా తన అవతారాన్ని చాలించి పార్వతిగా అవతరించి శివుని చేపట్టిన దివ్యకథా ప్రస్తారానికి కుమారసంభవం లోని కాళిదాస గళమే రచయిత్రికి యిక్కడ ఉపాధేయమైంది.

తెలుగు తీపి ఎంతో తెలుసుకోవాలని ఆరాటపడే యువతకు తెలుగు మాట్లాడటమే తెలిసి-సహజంగా సారస్వత పరిమళం కావాలని ఆశపడే తెలుగుల కందరికీ-ఆంధ్ర సారస్వతలోకాన్ని చేరడానికి తొలిమెరుగుల కళలుచిందే ప్రథమ ప్రవేశద్వారం ఈ "తేజస్సుమాలు".

సప్తమ సంఖ్యకు ప్రాధాన్యముందని మళ్ళీగుర్తుచేస్తున్నాను-తన సప్త స్వరగళ విన్యాసంలో ఆంధ్ర శ్రోతృలోకాన్ని రసాప్లావితం చేస్తున్న కల్లూరి మురళీ కృష్ణగారు శ్రీదేవిగారి పుత్రరత్నం. సంగీత సరస్వతి బాలమురళీకృష్ణ గారి శిష్యరత్నం.

ఏడాకుల అరటి (సప్తపర్ణి) వలె కళకళలాడుతున్న ఈరచన పాఠకలోక హృదయక్షేత్రాలను సస్యాయమానం చేయుగాక!

ఈశ్వర
జ్యేష్ఠ శుద్ధ సప్తమి
13-6-1997
హైదరాబాదు.

మీ
మాడుగుల నాగఫణిశర్మ.

# తేజస్సుమాలు

## శకుంతల

శకుంతల అని పేరు పెట్టటంలోనే కనిపిస్తుంది, ఈ రూపకానికి నాయకి ప్రాధాన్యత. శకుంతల అతి సుకుమారి, సౌందర్య శోభిత, శృంగార వనదేవతయా అన్నట్లు సంపూర్ణంగ పుష్పించి విరబూసిన పూలకొమ్మా అన్నట్లు విలసిల్లే వయారిలో ఎంతటి పట్టుదల, ఎంతటి గట్టిదనం, కార్యదీక్ష, ధైర్యనిగ్రహాలు ఉన్నవో ఒక్కసారి ఆమూలాగ్రం పరిశీలిస్తే అవగాహన అవుతుంది.

కాళిదాస మహాకవి అపురూపంగా ఆ పాత్రని మలచాడు-

సంపూర్ణంగా ఆమెయొక్క ఆకారాన్ని గుణగణాలన్నీ తీర్చి దిద్దాడు. దుష్యంత మహారాజు మన కథాకాలంనాటికి అన్నిటా ఆరితేరిన వాడే. అల్లరివయసూ, ఆగని మనసూకాదు అయనది. ఆయన బొత్తిగా స్త్రీ పరిచయం లేనివాడూకాదు. నూనూగు మీసాల లేతవయసువాడు కాదు. సౌందర్యంలో, ఐశ్వర్యంలో తేలియాడే అచ్చరలను మించిన మచ్చెకంఠలను అనేకమందిని చూశాడు. నిరాభరణ నిర్మలాంతఃకరణ సహజసౌందర్యనిధి. అయిన శకుంతల మోహంలో మునిగి తబ్బిబ్బయి ఆమె నవ యౌవన వినయ, సౌశీల్యాది సద్గుణాలకి వశుడయాడంటే, ఆ పాత్ర ఎంత అమోఘమైనదో ఏ అలంకారాలు లేకపోయినప్పటికి ఆ అందానికి ఎంత పదునో ఆలోచించండి.

ముందు దానిని రచించిన కాళిదాసు ప్రతిభను మెచ్చుకోకుండా

కాళిదాస మహాకవి ఋతుసంహారం, కుమార సంభవం, మేఘ సందేశం, రఘువంశం అనే కావ్యాలు, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయం, అభిజ్ఞాన శాకుంతలం అనే నాటకాలు రచించాడు.

సాహిత్యంలో ఏమాత్రం పరిచయమున్నవాడయినా కాళిదాస మహాకవి రచించిన కావ్యాలు చదివి తీరుతాడు. అలా చదవనినాడు అతని జ్ఞానం అసంపూర్ణమే అవుతుంది.

"ఉపమాకాళిదాసస్య" ఇతడికొక్కడికే ఉపమా ప్రాముఖ్యం వుంది. ఉపమాలంకారం కాళిదాసు సొత్తు అనే నానుడి ఉంది. ఉపమానాలు వాడటంలో ఆయనకు ఆయనే సాటి.

'సంచారిణీ దీప శిఖేవరాత్రౌ' అనే శ్లోకము మహత్తరమైనది. కాళిదాసుకి ఆ శ్లోకము వర్తించింది.

ఉపమాలంకారములను వాడటంలో కాళిదాసు సిద్ధహస్తుడు అనేందుకు అనేక నిదర్శనాలున్నాయి.

శాకుంతలం చాలా ప్రసిద్ధి పడసిన నాటకం. దీనికి వ్యాఖ్యాతలు పలువురు వెలసేరు.

కావ్యేషు నాటకం రమ్యం నాటక్యేషు శకుంతలా.

శృంగార రసైక వాహినులు కాళిదాసు రూపకాలు. కవులంతా ఉపమానాలు చెప్పరా అంటే ఈయన ఉపమానాలు హృదయంగమాలు. "పట్టణానికి నేను చేరిన వెంటనే నిన్ను పిలుస్తాను." అని చెప్పిన ధీరోదాత్తుడు దుష్యంత మహారాజు శకుంతలా వృత్తాంతాన్నే మరచి రాచకార్యాల్లో నిమగ్నుడయాడు.

శకుంతలా దుష్యంతుల పునస్సమాగం హేమకూటంలో అగస్త్యపాశ్రమంలో తల్లిని గుర్తింపలేకపోయినా, చక్రవర్తి చిహ్నానికి అమిత

సత్వుడూ, దుష్యంత ప్రతిముడూ అయిన సర్వదమనుడిని రాజు తన పుత్రునిగా గుర్తింపకపోవటం అసంభవము.

ఈ నాటకము గురించి ఈ క్రింది శ్లోకము పరంపరగా విన వస్తోంది.

"కాళిదాసస్య సర్వస్వం అభిజ్ఞాన శకుంతలం
తత్రాపిచ చతుర్థాంకో యత్రయాతి, శకుంతలా".

ఈ నాటకమునకున్న ప్రసిద్ధే, అనేక దేశాలలో అనేకమంది, అంటే రవీంద్రనాథఠాగూర్ వంటి మేధావుల ప్రస్తుతులను పొందింది. కాళి దాసుని ఉద్దేశించి నాటకాన్ని ప్రశంసిస్తూ ఎంతో రాశాడు యీాయన.

ఇందులో నాయకుడైన దుష్యంతమహారాజు చతుర, గంభీరా కారంగల ధీరోదాత్తుడు! నవయౌవనుడు, సత్వగుణ సంపన్నుడు మృగ యాప్రియుడు, ధనుర్విద్యయందు పినాకపాణి వంటివాడు, కర్తవ్య దక్షత గలవాడు, దుర్మార్గశిక్షణ, లోకకల్యాణమందు యిచ్ఛకలవాడు, పరస్త్రీ విముఖుడు, ఈతని ప్రజావాత్సల్యము, సౌశీల్యము అమోఘం. శకుంతల సౌందర్యం అకలుషితమైన తొలి ఉషస్సులాంటిది.

ఇందులో నాయకి అసమాన సౌందర్యరాశి. ఏ మాయా ఎరగని అరణ్యకన్య. నిర్మలాంతఃకరణ కాలానుగుణంగా ఆమె దుష్యంత మహా రాజు ప్రాణప్రియయై పుత్రవతియై మహారాజ్ఞిగా మారుతుంది. ముఖ్యంగా ఆ సుగుణరాశి గురించి నేను చెప్పదలచింది ఏమంటే ఎట్టి పరిస్థితి లోనూ శకుంతల మానసిక దౌర్బల్యానికి చోటివ్వని మహా ధైర్యశాలి. అదే స్త్రీలోకాన్నంతా అబ్బురపరిచి దిగ్భ్రమ కల్గించేది. కారణం ఏమై తేనేం భర్త తిరస్కృతయైన సమయంలోకూడా కంటికిమింటికి ఏక ధారగా దుఃఖించి విలపించలేదు. అలాగని విచారం కల్గకపోనూలేదు. గుండె ముక్కలైపోయే ఆ సంఘటన ఎవరికి దుఃఖాన్ని కల్గించదు

కనుక ? కళాస్రష్టలు అఖండ వ్యవసాయాత్మలు అనే విషయం కావ్యాల నుంచి నిరూపించవచ్చు. ప్రపంచంలోని నాటక రచయితలలో ఉత్తమ శ్రేణికి చెందిన కాళిదాసు రచించిన కృషికి శాకుంతలం నాయకమణి కదా ! దీనిలోని కళావైభవం అసమానం.

సుకవి, సత్కృతి సురభిల మకరందపూర్ణం, సుందరమయిన పుష్పం వంటిది. నిక్షిప్తమైన రసం మకరందము. ఆకృతి వైభవం, సౌందర్యం, ఇంకొక విశేషమేమంటే, కొండంత కోపకారణం వున్నా, మారుపల్కకుండా శకుంతల తన భాగధేయాన్ని నిందిస్తూ, దుష్యంతుని సన్నిధినుండి, నిగ్రహశక్తితో నిష్క్రమించింది.

అంటే శకుంతల నిగ్రహానికి ప్రాధాన్యం యిచ్చింది. భోగానికి అప్రాధాన్యత నిరూపితం అయింది. శాకుంతలలోని కల్పన, అద్భుతంగా వుందనిగాని, ప్రౌఢంగా వుందనిగాని వాదించటానికి వీలుకాదు. వస్తువు మిక్కిలి సరళమైనది. ఒక ప్రధాన వస్తువుండి దానిలో వేరొక ఉప వస్తువు ఈ రెండింటిని సమన్వయించడంతో నెరజాణతనాన్ని కనబరిచాడను కోవటానికి కూడా వీల్లేదు.

అహోరాగ పరివాహినీ గీతిః అన్నట్లుగా రసధ్వనిని మూర్తీభవించేయటంలో మాత్రం అతని చాకచక్యం మహాకవులకు సైతం వెరపు గొలుపుతోంది.

స్థూలదృష్టికి అసంభవాలుగా కన్పించే ఉదంతానికి సహజోత్పత్తిని ప్రసాదించి అవి యెంతో సంభవములే అని విశ్వాసం కలిగించడం కావ్యకళలో ఒక ఉత్తమ ప్రక్రియ. ఇందుకు ఈ పట్టున దుష్యంతుని మనః ప్రవృత్తిని శ్రద్ధగా గమనిస్తే ధర్మపత్ని శకుంతలను, వంశోద్ధారకుడగు పుత్రుని, అన్యాయంగా నిరాకరించాను అనే పశ్చాత్తాపంతో ఆయన మనసు దగ్ధమౌతుంది.

సిరిరామోకాలొడ్డు వారిలాగ, శ్రేయోప్రాప్తి సూచనలు కనబడినా

నిరాకరిస్తున్నాడా? పైకిమాత్రమే. మానసాంతర్భాగమునకుపోతే అంగీక రించాలి అన్నది. సుస్పష్టము. ఆశాభంగం అవుతుందేమో అనే సందేహం మళ్లా!

కాళిదాసుని గురించి జయదేవుడన్నాడు.

యశ్చౌరశ్చిరః చికురనికరః కర్ణపూరోమయూరో
భాసోహాసః కవికులగురుః కాళిదాసోవిలాసః
హర్షో హర్షో హృదయ వసతిః పఞ్చబాణశ్చ బాణః
రేషాం నైషా భవతి కవితా కామినీ కాంతకాయ ?
కాళిదాస గిరాం సారం, కాళిదాసః సరస్వతీ
చతుర్ముఖోధవా సాక్షా, ద్విదుర్నాన్యేతు మాదృశః

అని మల్లినాధుడుకూడా గౌరవించాడు.

సంభాషణలు పెంచుకు రావటంలో కాళిదాసుది అందెవేసిన చెయ్యి. దీర్ఘమైన వాక్యాలు ఒక్కొక్కటే ఘంటానాదంలా చెవుల్లో మారుమోగు తాయి. ఆకృతిసౌష్టవం

"అహో! మధురమాసాం దర్శనం"

ఇలాటి వాక్యాలు ఎన్నైనా ఉదాహరణగా యివ్వచ్చు. "ప్రతిపాదింప దలచుకున్న మహార్థం ఒకరత్నం. దానిని ఆధారించుకున్న వస్తువు కుందనం అనుకోండి. ఆ రెండూ కలిసి ఆభరణం అవుతుంది. దాచటానికి తగిన దంతపు భరిణశైలి." అన్నాడో మహాసీయుడు.

కాళిదాసు పద్య రచనలకు గంభీరమైన భావం, అలంకార పుష్టి, అక్షర రమ్యత ప్రత్యేక లక్షణాలు. ఉదాత్తతను విస్మరించి అతడు రాయడు ఉపనిషత్తులను శ్రుతులనీ, మహాభారతాన్ని స్మృతులని వ్యాప కిస్తూ శ్రుతికంటె స్మృతికి ప్రాధాన్యమిచ్చాడు.

కాళిదాసుకి వాల్మీకియందు గొప్ప గౌరవం వుంది. దీనికి సాక్ష్యం

రఘువంశమే. రససిద్ధిలో వాల్మీకికి కాళిదాసుకి గల అపార తారతమ్యం గమనించాలి. శాకుంతలంలో శృంగార రసముంది. దశమ స్కంధాన శృంగార రసముంది. ఇక్కడ శకుంతలా దుష్యంతుల ప్రణయం, అక్కడ రాధాకృష్ణుల ప్రణయం ఒక్కటైనా తారతమ్యం చాలావుంది. మొదటిది భోగమయం, రెండవది త్యాగమయం. అనగా స్వార్థం శూన్యం మొదటిది దేహాభిమాన కలుషితం. రెండవది దేహస్పృహయే లేని ఆత్మైక ప్రణయం. ఆ తారతమ్యం అనుభవైకవేద్యం. వాల్మీకి సత్యం ప్రత్యక్షోప లబ్ధం. వాల్మీకి స్వయంగా పరమాత్మను దర్శించాడు. కాళిదాసు దర్శించినట్లగపడదు. ఇక్కడ శకుంతల మౌనప్రియ. అంటే మితభాషి. ఆ మౌనమే రసోద్బోధకమైంది. పరిహాసాలతోను కుహనా కలహాలతోనూ వృత్తాంత కథనాలతోనూ నిండిన చెలుల మాటకారితనమంతా రసోద్బోధకమే. చెలికత్తెలిద్దరు లేచి "స్వాగత మనిలమ్బినో, మనోరథస్య" అనటం ఎంత రసోద్బోధకంగావుంది. ఇలాటివి శాకుంతలంలో పుంఖానుపుంఖాలు. మూలం భారతంలోదయినా శకుంతలోపాఖ్యానం యొక్క మూలకథకు ఎన్నో మెరుగులు దిద్ది సర్వజన మనోరంజకంగా రూపొందించాడు. సంభాషణ నడపటంలోగాని, వర్ణన చేయటంలోగాని మర్యాదా భంగం ఏమాత్రం కలుగకుండా విషయానికి సితికల్పనకు ఎక్కువస్థానం ఇచ్చాడు.

హస్తినరాజు చంద్రవంశ చక్రవర్తి దుష్యంత మహారాజు వేటకై తన రథంమీద బయలుదేరాడు. ఒక సారంగాన్ని తరుముతూ తన సిబ్బందినుండి చీలి వంటరియై చాలాదూరం పోయాడు.

ఆ కురంగం ఎగుడు దిగుళ్ళలో అతివేగంగా పరిగెడుతూ రాజుకి చిక్కలేదు. అతడు తరుముతూనేవున్నాడు. గుర్రాలు మరింత వేగంగా పరిగెడుతున్నాయి.

ఇంతలో మునికుమారులు సమిధలకోసం అడవికి పోతూ "ఇది

మున్యాశ్రమం కనుక ఇక్కడి జంతువులను వేటాడరాదని చెప్పి, "మాలినీ తీరాన కణ్వమహర్షి ఆశ్రమం వుంది, రాజా! అక్కడికివెళ్ళి ఆతిధ్యం స్వీకరించు" అని చెప్పిపోయారు.

దుష్యంతుడు పుణ్యాశ్రమ దర్శనోత్సాహంతో, ధనుర్బాణాలు రధానవుంచి, సారధికి వప్పగించి, గుర్రాల బడలిక తీర్చమని చెప్పి, కాలినడకన బయలుదేరాడు.

ఆశ్రమం సమీపిస్తుండగా రాజుకు దక్షిణ బాహువు అదిరింది. కొంతదూరంపోగా 'అటుకాదు దారి ఇటు ఇటు' అన్నట్లు లీలామాత్రంగా వినిపించింది.

ఇటువైపు చూడగా మునికన్నెలు పూదీగెల చాటున కనిపించారు. ఆ సమీపంలో తన చెలికత్తెలతో పారిజాతాలు బొగడలు ఏరుతోంది శకుంతల. ఆమె చెలికత్తెలు ప్రియంవద, అనసూయ. ఆ తరువాత మొక్కలకు దొరువులుచేసి నీళ్ళుపోస్తున్నారు.

ఆహా వాళ్ళెంత రూపవతులు? అనుకున్నాడు రాజు. తాను రాణి వాసంలోకూడా అంత అందాన్నిచూసి ఎరుగడు. ఒక చెట్టుచాటున నిల్చి వారి నవ్వులు చతుర సంభాషణలు విని అందులో మెరుపు తీగలాటి మేను కలది, అతి సుకుమారి అయినది శకుంతలగానూ మిగతా ఇద్దరూ చెలికత్తెలుగానూ గుర్తించాడు. అగపడినంతగానే, శకుంతల రాజుమనసు నాకర్షించి మైమరుపు గల్గించింది. కట్టిన నారచీరకే అందంతెచ్చిన శకుంతల రాజుమనసు కలతపెట్టి తమకం రెట్టింపుచేసింది. ఆయన మనసు చెలిపై గాఢంగా నాటుకుంది.

వారి కిలకిలలు, పకపకలు, గుసగుసలూ, ఆయన మనసుకి మరింత గిలిగింతలు పెట్టాయి.

ఇంతలో ఒక గండుతుమ్మెద శకుంతల ముఖంమీదకు వచ్చింది. ఒంటిని ఇటూ అటూ తాకవచ్చింది. అధరంపై వాలింది రాజు తికమక పడ్డాడు.

శకుంతల బెదరి చెలికత్తెలను పిలచింది. దూరానవున్న చెలులు వచ్చేంతలో దుష్యంతుడు వచ్చి ఆ భ్రమరాన్ని తోలి పారేశాడు ఆమె భయం పోగొట్టాడు. చెలులు వచ్చి రాజుచూపిన ధైర్యానికి సహాయానికి అభినందించారు. కృతజ్ఞత తెల్పి ఆశ్రమానికివచ్చి ఆతిధ్యం స్వీకరించ మన్నారు. శకుంతలను చెలులు రాజుకి అర్ఘ్యం యిస్తామన్నారు. రాజు వారించాడు. మీ ప్రియ వచనాలే చాలు అన్నాడు.

శకుంతలకూ, రాజుని చూసింది మొదలు చిత్తంలో ఏదో వికారం కలుగుతోంది. అది తపోవనానికి తగిందికాదని ఆమెకు తెలుసు.

మునికన్యకిట్టి తేజస్సెలావచ్చింది ? అని ఆలోచిస్తున్నాడు రాజు. వివరాలన్నీ చెలికత్తెలనుండి గ్రహించాడు. తననుతాను పరిచయం చేసుకున్నాడు.

"కాశ్యపులవారు ఆశ్రమాన వున్నారా ?" అని అడిగాడు రాజు. పుణ్యతీర్థ సేవనకై వెళ్ళారని అనసూయ, ప్రియంవదలు చెప్పారు.

రాజు కోరికపై చెలులు శకుంతల జనన వృత్తాంతం ఇలా చెప్పారు.

మహారాజా మీరు చెప్పినట్లు కాశ్యపులవారు శాశ్వత బ్రహ్మ చారులే మా సఖి ఆయన కన్నకూతురు కాదు. విశ్వామిత్రుడనే మహా ప్రభావ సంపన్నుడైన రాజర్షి ఆమె కన్నతండ్రి. ఆయన తపస్సును

విఘ్నం చేయవచ్చింది మేనక. ఆమెకు కల్గిన బిడ్డ శకుంతల. బిడ్డను విడిచి తల్లి దేవలోకానికి తరలింది.

కాశ్యపకణ్వుడు ఆజన్మ బ్రహ్మచారి గొప్ప కులపతి అయినప్పటికి శకుంతలని తెచ్చి ప్రేమతో పెంచాడు. తన కన్నకూతురు కాకపోయినా కన్నదానికన్న మిన్నగా పెంచాడు. ఆ పిల్లయందు కూరిమితో ప్రాణ సమానంగా యెంచి విద్యాబుద్ధులు గరపాడు. ధర్మసూత్రాలు నేర్పాడు. పెండ్లి ఈడురాగానే తగిన వరునకీయ సంకల్పించాడు. శకుంతలయందు, సఖులయందు మిక్కిలి వాత్సల్యం, ఆశ్రమమందు, తీగలయందు, మృగాలయందు పల్లమాలిన అభిమానం, అంతులేని ప్రీతి, కాశ్యపులందరికి ఆయన "మహర్షి సంజాత, అప్సరోద్భవ కనుకనే ఆ సౌందర్య గరిమ" అనుకున్నాడు రాజు. స్తన విస్తారిత, యౌవనశాలి, కాశ్యపలాలిత, ఆశ్రమవినీత, నవనీతహృదయ, ఆమెకు విరజాజి తీగలే. వనజ్యోత్స్నయే చెల్లెలు, జింకలే గారాల బిడ్డలు. అనసూయ ప్రియంవదలసఖ్య పరాధీనరాజు మనసుని స్వస్థత లేకుండా అవస్థ పెట్టేస్తోంది. ఈ అప్సరస్సంభవ మిన్నుదిగివచ్చిన మెరుపుతీగ దుష్యంతమహారాజును తిననీకుండా, నిద్రపోనివ్వకుండా నిల్చున్నచోట నిల్చోనియ్యకుండా వేగిరపెట్టేస్తోంది. "ఈమెకు నేను తగుదునా?" అని కూడా ఆయన ఈమె తండ్రి రాజర్షి. అంటే ఈవిడ క్షత్రియకన్య కనుకనే తన మనస్సును కదల్చి మత్తెక్కిస్తోంది.

"అసలు ఈమె తనను వలస్తుందా? ఒల్లదా? తనకోరిక తీరుతుందా తీర్చదా? ఈమె మనసెరగటం ఎలా?" అని రాజు పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. లతలకో లతగా, పూలలో పూవుగా పెరిగిన శకుంతల కూడా నా చెలులు నా గుట్టు రాజుకు చెపుతున్నారు. ఈయన నన్ను పెళ్ళి చేసుకుంటాడా? ఈ చెలులను వారించటం ఎలాగ అని చివ్వున లేచింది. "అఆ, గొప్పవారు మాట్లాడుతుంటే అలా మధ్యలోపోవచ్చునా?"

అని అనసూయ అడ్డగించింది. ఆమె మాటవినక శకుంతల బైలుదేరింది. పోకుండా పట్టుకొని శకుంతలను ఆపాలని రాజుకు అనిపించింది. అయినా సంబాళించుకున్నాడు. కొంతసేపటికి చెలులు తమ నెలవులకు శకుంతలను తీసుకువెళ్ళిపోయారు.

ఋషులువచ్చి తమక్రతువును కాపాడమని ప్రార్థించి రాజుని అతిథి మర్యాదలతో యజ్ఞవాటికకి తోడ్కొని పోయి అనేక విధాల గౌరవించారు.

ఇక్కడ శకుంతల మరురాకకు మిక్కిలి సొక్కివుంది. అపరిమితమైన విరహబాధ అనుభవిస్తోంది, రాజుని మళ్లీ మళ్లీ చూడాలనిపిస్తోంది. ఆయనతో ఇంకా ఇంకా మాట్లాడలనిపిస్తోంది. ఆయన్ని మళ్లీ చూస్తానా? అని ఉగులుపడుతోంది. మామూలుగానే చంద్రుడు చిక్కని బాధలు పెడుతున్నాడు. వెన్నెల వేడెత్తోస్తుంది. మంచి గంధం చెలులు పూస్తుంటే మంటలు పెడుతోంది. మలయమారుతం మరుని శరాలై హింసిస్తుంది. చిగురుటాకులూ పూరేకులూ శయ్యగా అమర్చారు చెలులు. దానిపై శయనించటం బహుదుర్భరమైపోతోంది. రాజు తప్పక వస్తాడు, ఆయనకూడా నీ ఎడబాటు సహించలేకపోతాడు, త్వరలో వస్తాడు, నిన్ను తప్పక పరిగ్రహిస్తాడు అని ఓదారుస్తున్నారు శకుంతలయొక్క ఇముడ్చుకోలేని శృంగార లజ్జా చేష్టలు చూశారు.

అటు యజ్ఞసమాప్తి కాగానే తనొక్కడే బయలుదేరివచ్చాడు దుష్యంత మహారాజు. ఆమె మనసెరిగి శకుంతలచేతికి తన రాజముద్రిక వుంచి గాంధర్వ విధిని వివాహమాడాడు, సూర్యచంద్రుల సాక్షిగా శుక్ల పక్ష శశాంక రోచులీనింది శకుంతలా ముఖకల్హారం.

రాంచ దృష్ట్వా వరోహం శ్రీమతీం చారుహాసినీం
విభ్రాజమానాం వపుషా, తపసాచ దమేన చ॥

తపస్సువల్ల, దమమువల్ల, సిద్ధించిన తేజస్సు గుర్తించేందుకు దానివల్ల ఆకర్షింపబడేందుకు ఒక విశిష్టమైన మనస్తత్వం కావల్సి వుంటుంది. తపోధనంలో వున్న మహిమను వెంటనే దుష్యంతుడు కాబట్టి గ్రహింపగల్గాడు. గ్రహించటమే కాకుండా వెంటనే గాఢంగా వరించాడు. కణ్వుడు వచ్చేంతవరకు వేచివుండలేకపోయాడు.

ఆయనవచ్చి అంతావిని ఔనంటాడో కాదంటాడో ఆమెను పెళ్ళి యాడి తీరాలిగాని కాదనిపించుకోవడం ఇష్టం లేకపోయింది. అందుచేత ఘట్టంలో దుష్యంతుడిదోషం కనబడుతోంది. వేగిరపాటు కనబడుతోంది. రహస్యంగా అక్కడక్కడ శకుంతలతో విహరించాడు కొద్దిరోజులు శకుంతలను ఆనందాబ్ధిలోముంచితేల్చి తన రాజధానికి పయనమయాడు. బేలచూపులు చూస్తున్న శకుంతల చిన్నబోయిన మొహంజూస్తే జాలే సింది. కొద్ది రోజుల్లో రాజలాంఛనాలతో నిన్ను నగరుకు నావద్దకు చేర్చుకుంటానని చెప్పాడు. ఆ ఒయ్యారపు నడకల చెలిని అపూర్వ స్త్రీ రత్నాన్ని, కొత్త పూవు, కొత్త చిగురు, కొత్త తేనె, కొత్త ముత్తెము విడువలేకపోయాడు. మళ్ళీ ఎన్నిరోజులకు రావడం? అని అడిగిన శకుంతలకు 'ఈ అంగుళీయంలో ఎన్ని అక్షరాలుంటాయో' అన్ని రోజులకని చెప్పాడు. నీ నామాక్షరాలా? నా నామక్షరాలా? అని లెక్కిస్తే రెండూ సమంగానే వున్నాయి.

శకుంతలకు వీడ్కోలు చెప్పి రాజు తన పరివారాన్ని చేరు కున్నాడు.

ఫలహారో గతరాజన్ పితామే ఇత ఆశ్రమాత్
తంముహూర్తం ప్రతీక్షస్య సమాల తుభ్యం ప్రదాశ్యతి.

ప్రస్తుతము రాజపత్ని మున్ముందు రాజమాత కావల్సినయామెను యాధార్థ్యంగా పురానికి దోడ్కొని పోతానని సమ్మించి వెళ్లాడు.

నాల్గు దినాలైంది రాజు హస్తినచేరి. శకుంతల రోజులు లెక్కించు

కుంటూ ఎదురుచూస్తుంది. శూన్యహృదయంతో విరహంతో కాలంగడుపు తోంది. చెక్కిట చేయిచేర్చుకుని శూన్యంలోకి చూస్తూ చెట్టుమొదలు కానుకొని కూర్చున్న శకుంతల దగ్గరికి దూర్వాస మహర్షి వచ్చాడు. ఆవిడకి ఋషి వచ్చింది కాని వెళ్ళింది కాని ఏమీ తెలియలేదు.

ఎంత అహంభావి? అనుకున్నాడు దుర్వాసుడు. నాకు నమస్కరించాలని అయినా ఈ శకుంతలకి తోచలేదా? అనుకున్నాడు.

"నీవు ఎవరిపై ధ్యానంతో నన్ను నిర్లక్ష్యం చేశావు? వారు నిన్ను పూర్తిగా మర్చిపోతారు పో" అని శపించి వెనుదిరిగాడు. శకుంతల సౌభాగ్యదేవతను పూజించే నిమిత్తము పూలుకోయటానికి వెళ్లారు సఖులు. ఆ సమయంలో వాళ్లు వుండివుంటే ఇంత అనర్ధం జరిగేది కాదు. ఇక పూలు చాలనుకుని వాళ్ళు తిరిగివస్తుంటే తీక్షణంగా దూర్వాసుని పలుకులు వినిపించాయి. అతిథి పరాభవి అని వెంటనే పరిస్థితి అర్థం చేసుకుని దూర్వాసుని పాదాలపై బడ్డారా సఖులిద్దరు.

శకుంతలను తప్పుపట్టవద్దని, ఆమె భర్తృ విరహదావానలంతో దగ్ధమౌతుందని, ఆమె హృదయ శూన్య, అని మొరపెట్టారు. కొంత సేపటికి మౌని శాంతించి "అంగుళీయం కనిపించగానే అంతా గుర్తు వస్తుంది రాజుకి" అని శాప విమోచనం చెప్పి వెళ్ళిపోయాడు.

అసలే చింతాక్రాంత అయివుంది కనుక శకుంతలకి ఈ సంగతు లేవీ సఖులు చెప్పలేదు. ముద్దుటుంగరం అప్పటికి శకుంతల వేలిసే వుండటం సఖులిద్దరికి సంతోషం చేకూర్చింది.

రాజు ఊరుచేరి నాల్గునెలలైంది. కాశ్యపులవారు ఆశ్రమం వదలి నాల్గు నెలలైంది. ఆ వేకువ జామునవారు ఆశ్రమానికి వచ్చారు. అన సూయకు ఆగులు అధికమైంది

రెండు అంశాలూ నాయనగారికి తప్పక కోపం కల్గించేవే. అనసూయ ప్రియంవదలు కూడా "రాజు మరచాడేమో? దుర్వాసుని శాపం తగిలి మరిచిపోయాడేమో" అని అనుమానించారు.

మనసా చింతయన్ ప్రాయో, త్వాం సన్యసం ప్రతిపార్థివః
భగవాన్ స్తపసాయుక్తః, కృత్వాకిన్ను కరిష్యతి॥

ఎందుచేతంటే దుష్యంతుడిలా ప్రవర్తించే పాత్రలు ఎన్నో కనిపిస్తాయి, మనకీలోకంలో.

ఏమెట్టుకామెట్టు ఆ పాత్రలోని స్వాభావికతను నిరూపింపచాలిన సమాధానం, కవి, తన కావ్యంలో నిక్షేపిస్తూ వచ్చినప్పుడు, ఇక ఈ పాత్రీకరణాన్నిగూర్చి తప్పుపట్టేందుకు అవకాశమేది?

దుష్యంతుడు ధీరోదాత్తుడే, ఉత్తమ నాయకుడే మహా పరాక్రమ వంతుడే, ప్రజాపాలన సామర్థ్యం గలవాడే ఇక్కడ శాకుంతలానికి బీజం మొదలుకొని కావ్యావసానంవరకు భరతావతరణమే పరమలక్ష్యమైంది. భరతునివంటి జాతీయ చక్రవర్తికి జన్మనిచ్చి, చరితార్థులయిన దంపతులు ఎంతటి పవిత్ర చరిత్రులో నిరూపించటమే దీని పరమార్థం.

శకుంతల అలంకారం, సౌందర్యం ప్రకృతిసిద్ధం, అసహజమేమీ లేదు. కృత్రిమం అంతకన్నా లేదు. ప్రకృతికూడా బాగా అనుకూలించింది ఆ సమయంలో. శకుంతలయితే మాటలేరాని ముద్దరాలు, చతురోక్తులూ, చమత్కారాలూ, చెలులు చెప్పారు. కాని ఆమెచూపులు వట్టి అమాయకపు చూపులు. కాని అవే వాడివాడి తూపులై రారాజు హృదయాన్ని గాఢంగా నాటుకుని కథని ముందుకు నడిపించాయి.

నాయనగారు జరిగినదంతా ఆయన దివ్యదృష్టివలన తెలుసుకున్నారు.

కాశ్యపులు శకుంతలను భర్తవద్దకు పంపదలచుకున్నట్టు చెప్పింది

కొండంత బరువు దింపుకున్నట్టయింది.

"బిడ్డా! నిన్ను తగినవాడే చేకొన్నాడు, నా అభీష్టం నెరవేరింది" అని శకుంతలను శిరస్సున చెయ్యివుంచి దీవించాడు. అప్పుడు అందరి మనసులు స్థిమితపడ్డాయి. మంచిముహూర్తంచూసి గౌతమిని, శారంఙ్గ రవుని, తోడిచ్చి రాజుదగ్గరికి శకుంతలను పంపేందుకు ఏర్పాట్లు చేస్తు న్నారు మహర్షి.

శకుంతలకి చెలి రహస్యంగా చెప్పింది నాయనగారికి అగ్ని కార్యంలో వుండగా అశరీరవాణి చెప్పిందట.

"దుష్యంతుని వలన శకుంతల గర్భిణి"యని అదివిని లజ్జావదన అయిన శకుంతలను కౌగలించుకుని ఎంతలో వచ్చింది మనకు ఎడబాటు? అని వగచింది. రాజు గర్భిణి అయిన శకుంతలనుచూసి ఎంత గౌర విస్తారో అంటూ అనేక విధాల తలపోశారు ఇష్టసఖులు. అందుకు తగ్గ ఏర్పాట్లు చేశారు.

వృద్ధమాత గౌతమి శారంగరవుడూ శకుంతలను హస్తినకు తోడ్కొని పోవలసినవారు. సూర్యోదయాన శకుంతలకు అభ్యంగన స్నానం చేయించారు. పూలు కోసుకువచ్చారు. ఆశ్చర్యంగా ఆవనస్పతులు తమ చెలి శకుంతలకు తెల్లని పట్టుచీరలు, రత్నాభరణాలు, సుగంధ ద్రవ్యాలు ఇచ్చాయి. ఒక లత కాళ్ళకు పూసేందుకు లత్తుకనిచ్చింది. అనసూయ దాచివుంచిన బొగడ దండలతో ప్రస్థానపు శింగారం ముగి సింది.

ఇంతలో నాయనగారు వచ్చారు. శకుంతలని అప్పుడే పంపే స్తున్నామే అని ఆయనకు యిమడని దుఃఖం. నాయనగారు శకుంతల నాశీర్వదించి, సద్యోహుత వైతానికాగ్నులకు ప్రదక్షిణ నమస్కారాలు

చేయించి, ఆశ్రమవృక్షాలకు తపోవన దేవతలకు, వీడ్కోలు, కోయిల కూతచేత శుభశకునాలు ఇప్పించి తరలించారు శకుంతలని. శకుంతల వనజ్యోత్స్నను కౌగిలించుకుని శలవు తీసుకుంది. కన్నీళ్లుకార్చి మరీ తరలింది.

పాలచెట్టు నీడలో నిల్చి శారంగ రవాదులకు దుష్యంతుని సన్నిధిలో ఎలా మాట్లాడాలో చెప్పవలసిన మాటలు ఆనతిచ్చి శకుంతలకు మంచి ఇల్లాలుగా నడుచుకునే మంచిబుద్ధులు చెప్పి, ఆపై కడపటి నమస్కారం అంగీకరించి తరలాడు కణ్వమహర్షి.

శకుంతల

శుశ్రూష స్వగురూన్, కురుప్రియసఖీ, వృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి, రోషణ తయా, మాస్మ, ప్రతాపంగమః
భూయిష్టంభవ, దక్షిణా పరిజనే, భాగ్యేష్వనుత్సేకినీ
యాన్త్యైవం, గృహిణీపదం, యువతయోః వామాఃకుస్యాధయః

శకుంతలతో అనసూయ ప్రియంవదలుకూడా ఆలింగితలైనారు. శారంగరవుడు 'పొద్దెక్కుతోంది పదపద' అన్నాడు. అంతలో నాయన తపోనుష్ఠానమునకు అభ్యంతరమవుతోంది అన్నాడు. ఇంకమరేమీ అనలేక ఆయనను కౌగలించుకుని "యీాయన కృశించిన శరీరము నామీది బెంగతో ఇంకా కృశిస్తుంది కాబోలు" అనుకుంది. అనసూయతో ముందుకు సాగిపోయింది.

కాశ్యపుల దుఃఖిత చిత్తం అనుకుంది. శకుంతల భర్తున్యాసమే కదా అని అప్పగించివేశాను. 'అహో' అనుకున్నాడు

హస్తినలో దుష్యంతుడు శకుంతలను అట్లు కణ్వాశ్రమాన గాంధర్వ విధిని పెండ్లాడివచ్చి, అయిదునెలలు దాటింది. దూర్వాసమహిమ ఎటువంటిది కదా ? అతనికి ఆ సంగతి జ్ఞప్తిలోలేదు.

అప్పుడు మధ్యాహ్నమైంది. ధర్మాసనంమీదనుండి పౌరకార్యాలు విచారిస్తున్నాడు రాజు. కంచుకి రాజును చేరి చెప్పాడు

"వీరు తాపసులు. కాశ్యపులవారినుంచి సందేశం తెచ్చారు. స్త్రీ సమేతంగా వచ్చారు" అని.

"ఏంపనిమీద ఋషులువచ్చారు ? ఇది ఏం విపత్కారం ?" అని ఆలోచించాడు.

ఇంతలో వారూ పురోహిత సహితులై వచ్చారు. శకుంతలకి కుడి కన్నదిరి అపశకునమనిపించింది.

మహారాజెదురు చూస్తున్నాడు. రాజుకి వారి నడుమ పండుటాకులలో చిగురులా, ఋరఖాలో తళతళలాడు శరీరఛాయతో ఈ లతాంగి ఎవరా అని ? అయినా పరభార్య అని చూపు తిప్పుకున్నాడు.

శకుంతల హృదయం ఎందుకో తల్లడంగా దుడుకుగా కీడును శంకిస్తోంది.

ఇంతలో వారు రాజుని సమీపించారు. రాజు నమస్కరించాడు. వారు ఆశీర్వదించారు. మర్యాదలైన తరువాత శారంగరవుడు సందేశం ఇలా చెప్పాడు.

"ఏకాంతంలో ఒప్పించి నాకుమాత్రెను వివాహం చేసుకున్నావు. నా బిడ్డయందున్న అనురాగంచేత నేను అంగీకరించాను. ఈ బాల ఇపుడు గర్భిణీ, నీవు సహధర్మచారణంకోసం గ్రహించు"మని మా కాశ్యపుల వారు చెప్పమన్నారు. రాజు ఏం చెపుతాడో అని శకుంతలకు ఆతృతగా వుంది".

"ఎవిటి ఈమెను నేను పెండ్లాడానా ?" అన్నాడు ఆశ్చర్యంగా అదే అపశకునఫలం అనుకుంది. ఈమెకు ఏడ్పు, కోపం ఒక్కసారే తోసుకువచ్చాయి.

వారు చెప్పినవన్నీ విన్నాడు రాజు.

ముని కన్యయట నేనట
వనమున గాంధర్వమున, వివాహంబట
సూనుని గనునట, మరిచితినట
వినగూడునెయిట్టి భంగి విపరీతోక్తుల్.

అని సభాముఖాన శకుంతలని గూర్చి అన్నాడు.

పిల్లలమర్రి పినవీరభద్రుడు అన్నాడు.

చదువనే మున్ను, ధర్మశాస్త్రంబులన్య
కామినీరతి, కలుషంబుగా నెరుంగనే
యన్యసతిమాత్రమే, కాన్యపాత్మజాత
యరయ నంగార, కల్పితమైన ప్రతిమ

దుష్యంత మహారాజన్న ఒక్కొక్క మాట ఒక్కొక్క ఈటెలాగ గుచ్చుకుంటోంది శకుంతల హృదయాన.

ఎంత తలపోసినా నాకు జ్ఞప్తికి రావటంలేదు. ఈమెను నేను పరిణయమాడిన సంగతి. ఇప్పుడు ఈమె గర్భిణీగా కూడా ఉంది, అని వూరుకున్నాడు. శారంగరవుడికి కూడాకోపం వచ్చింది, రాజు మాటలకి.

ఇప్పుడు ఈమెను పరిగ్రహించాలా మానాలా అనే సందిగ్ధంలో పడిపోయాడు రాజు.

'ఆశ్రమంలో అనాడు చేసివచ్చిన పని ఈనాడు ఇష్టం లేక పోయిందా? ఇంత ఐశ్వర్యమదమా' అని దూషించాడు శారంగరవుడు.

అవ్వ గౌతమి శకుంతల మేలిముసుగు తొలగించింది. రాజు ఆమెను ఆనవాలుపట్టాడని.

'ఆహా! ఏం అదృశ సౌందర్యం? అనుకున్నాడు దుష్యంతుడు.

'మా గురువు లేనప్పుడు ఆయన కూతుర్ని దొంగలాగమైల పర్చావు. దానికి ఆయన కోపం తెచ్చుకోక, గొప్ప మనసుతో నీదగ్గరికి పంపాడు. అటువంటి మహాత్ముణ్ణి అవమానిస్తున్నావా' అన్నాడు శారంగరవుడు. 'కాశ్యపులంతటివారు నిన్ను అధర్మాచరణకి పురిగొల్పుతారా?'

ఈ రహస్య సమాగమంకు తార్కాణము ఏమైనా చెప్పమన్నారు శకుంతలని.

ఆనాడు అలా నమ్మించి, వంచించి ఇప్పుడిలా అనటం ధర్మం కాదంటూ ఆనవాలు చూపదల్చుకుంది. ఆనాడు రాజు తనవేలికి వుంచిన రాజముద్రిక. కాని వుంగరం అగుపడలేదు. ఆనాటి వృత్తాంతం చెప్పింది శకుంతల.

వుంగరం అగుపడక పోవడం రాజు మాటలకి బలాన్నిచ్చింది. రాజు తనమాట ధృడపడినందుకు

'ఆడువారు వట్టి అసత్యవాదు'లన్నాడు.

శకుంతలకి ఎక్కడలేని కోపం వచ్చింది.

రాజు వట్టి ధర్మదంభము, అనార్యుడా! అంది. కళ్లు కెంపులే అయాయి. బొమలు ముడిబడ్డాయి

రాజుకి ఆమె కోపం నిజంలాగే తోచింది. తెచ్చికోలు కాదనుకున్నాడు. కాని రాజు ఆమెను పరిగ్రహించటానికి అంగీకరించలేదు.

శారంగరవుడు రాజుతో "ఎందుకయ్యా ఇకనీతో మాటలు మా గురువు ఆజ్ఞ మేం నిర్వర్తించాం. ఈమె నీభార్య నీవేమైనా చేసుకోమని బైలుదేరారు. వృద్ధమాత గౌతమికూడా చాలానచ్చచెప్పి చూసింది, రాజుకి. రాజు మనసు కరగలేదు

క్షత్రవరుడైన విశ్వామిత్రునకు
పవిత్రమైన మేనకకున్
సత్పుత్రినయి, బొంకుపలుకగ
ధాత్రీ తలనాథ, యంత ధర్మేతరనే.

అని అడిగింది శకుంతల. శ్రమపడి నన్ను వెదకుతూ వచ్చిన సౌందర్య శాలిని, లావణ్యరాశిని చేసుకొనటమా, మానటమా" ఇది నిశ్చయించుకో లేకపోతున్నాడు రాజు.

శారంగరవుడు "తన కూతుర్ని తన అనుమతిలేకుండా గాంధర్వ విధిని పరిణయమాడావు ఎవరికీతెలియకుండా! అయినా ఆయన సహృదయంతో గొప్ప మనసుతో ఆమెను నీ కప్పగించమని నీవద్దకు పంపాడు. తన ధనాన్ని దొంగిలించిన దొంగలే 'పోనీ పాపమని' నీవే తీసుకో అని మళ్ళీ ఆ ధనాన్ని ఇచ్చి పంపినట్లు నీ కడకు పంపాడు. మునిసాధు స్వభావంచేత అపరాధం క్షమించిన క్షాంతిశాలి అలాటివాని నెదిరించి, ఎదురు తిరిగేలా చేయకు.

శ్రమ ప్రధానేషు, తపోధనేషు
గూఢం హిదా, హ్యాత్మక మస్తితేజః

అన్న తేజస్సుని వెళ్ళగక్కితే అప్పుడు నీవేమవుతావో, ఆయనని అవమానిస్తావా? ఛీ ఛీ.

శకుంతల లోతులేని మనసుగలది. ముందు ప్రతిజ్ఞలు చేసి వంచించావు సందేహపడి. దూరంగా ఆలోచించి, నిశ్చయించుకొనే స్వభావం గలది కాదు ఆమె" అన్నాడు.

"నీ కులాన్ని నలుపుచేసుకుని నా కులానికి కూడా అపకీర్తి తేవాలని చూడకు. స్త్రీజాతికి ఎవ్వరూ నేర్పనిదీ, స్వభావ సిద్ధమైనదీ, కార్యసాధనశక్తి" అన్నాడు రాజు.

వాడై, రహస్యంగా జరిగిన ఆ ప్రణయ వృత్తాంతాన్ని ఒప్పుకొనక అబద్ధం అనగానే, కన్నులు కెంపెక్కి ఈసుతో కనుబొమలు ముడుచుకున్నాయి ఎలాగంటే, మన్మధుని వింటిని విరిచి పారవేసినట్లు. ఇతనికి ఆయుధం ఎందుకు ఇంకా? ఎవర్ని మోసగించేందుకు.

"స్మరస్య శరాసనం, భగ్నమివ"

లోకంలో ప్రేమానురాగం నిజంకాదు. 'వలపువలపని అనటమే అబద్ధం. కామునికి ఇక శరాసనం ఎందుకు? ఇక ఉండకూడదు" అనుకుంది శకుంతల.

ఆమె నీ భార్య, వుంచుకో, విడచుకో, భార్యయందు మగనికి అధికారముంది అన్నాడు శారంగరవుడు.

కళ్ళు తెరుచుకున్నా ఇతరులకి కనబడనివి.

కళ్ళు మూసుకున్నా కాళిదాసుకి కనబడితీరుతాయి. నాయనగారు పంపిన శారంగరవుడికి కూడా కాస్త వ్యవహార జ్ఞానంవుంటే, రాజుకి మంచి చెడ్డా తెలియచెప్పితే కథ మరోమాదిరిగా నడిచేదేమో?

కాని ఆ శారంగరవుడు కూడా ముక్కోపిలాగ రాజుని నాలుగు మాటలూ. శకుంతలని నాలుగుమాటలూ దులిపి "నీవిక్కడే పడివుండు" [illegible] శకుంతలకి చెప్పి వెను తిరిగాడు గౌతమితోగూడ శకుంతల మళ్ళీ [illegible] వుతూంటే "మంచయినా చెడ్డయినా నీ భర్తయిల్లే [illegible] యనగారు నిన్ను భర్తయింట దిగవిడిచి ముక్కుకు సూటిగాపోయే ఆ బాపడు.

"మళ్ళీ నేను తిరిగి రావటం ఎప్పుడు [illegible] ఎవరి కాలాన వార్థక్యాన వానప్రస్థాశ్రమం తీసుకున్నప్పుడు అని చెప్పారాయన శకుంతలకి.

అది బాగా దృష్టిలో ఉంచుకున్న శకుంతల చివరికికూడా అంటే మంచిరోజులు వచ్చాక అందరూ కలుసుకున్నాక కూడా కణ్వులవారికి తమ క్షేమం చెప్పిపంపిందే కాని తాను ఇక వెళ్ళలేదు పుట్టింటికి.

సాధారణంగా అత్తింటికి వెళ్ళేప్పుడు పిల్లల్ని సముదాయించి పంపుతారు, బెంగపెట్టుకోకుండా వుండేందుకు ఏమని? మళ్ళీసంక్రాంతికి నిన్ను తీసుకువస్తాంలే, ఉగాదికి వద్దుగాని అని చెప్పి పంపుతారు. ఇక ఆ పిల్ల ఎప్పుడు సంక్రాంతి వస్తుంది? ఎప్పుడు ఉగాదివస్తుంది? ఎప్పుడు అమ్మవారి పండుగ వస్తుంది అని ఎదురుచూస్తూ రోజులు లెక్కపెట్టుకుంటూ గడుపుతుంది. పుట్టింటికి వచ్చేందుకు, పుట్టిపెరిగినచోటు కదా? ఆ మమకారం వుండటం అతి సహజం. తనతోగూడి ఆటలాడి పాట పాడిన నేస్తాలు జ్ఞాపకం వస్తూనే వుంటారు మరి.............. శకుంతల అందరిలాగ అత్తవారింటికి పోక "తన బ్రతుకిలా నవ్వులపాలు ఎందుకై పోయిందా"? అని లోలోపల మదన పడిపోతోంది.

తనని ప్రాణాధికంగా ప్రేమించి, తీపి గురుతులు తీపి మాటలు చూపిన దుష్యంత మహారాజు తన్ను మోసకత్తె క్రింద చిత్రించాడా? ఇది భరించరానిదై పోయింది.

మొదటినుండి కూడా రాజు మనసు రెండు తలలపాములాగ వెనక్కీ-ముందుకి నడుస్తోంది. మిక్కిలి కష్టదశలో ఉన్నవారికి ఇటువంటి మనస్థితి సహజం. తను శకుంతలను నిరాకరిస్తున్నాడు మనసున ఏదో ఒకమూల ఆమె చెప్పేది నిజమేనేమో అనే సంశయం ఈ పట్టున దుష్యంతుని మనఃప్రవృత్తి చక్కగ పరిశీలిస్తే, ఒకవైపున ధర్మపత్నిని అన్యాయంగా నిరాకరిస్తున్నానే అనీ, పశ్చాత్తాపంలో నిమగ్నమైవుంది. 'సిరిరా మోకాలొడ్డినట్లు' పైకి అలా నిరాకరిస్తున్నాడు. ఇందులో ఒక రాజకీయ కారణముంది.

మునుపటి మహారాజులు ప్రజాభిప్రాయానికి ప్రాధాన్యత నిచ్చే

వారు. శకుంతల నిర్దోషిత్వము నిరూపించి "అవశ్యం నీవు స్వీకరింప తగిన"అనే ప్రజావాక్యంకోసం ఆశించాడు. అలా కొంతదూరంపోయాడు, రాజు దీర్ఘదర్శి కనుక. ఆ ప్రజావాక్యబలంతో ఆమెను స్వీకరిస్తే సుస్థిరంగా వుంటుందనుకున్నాడు. అందుకే ఆమెఎవరో తెలియనట్టునటించాడు కొంతదూరంపోయి ఆగటానికి వీలిచ్చిందికాదు. ఆమెని అనరాని మాటలు కూడ అనవలసివచ్చింది. మిక్కిలి పరుషంగానే దూషించాడు.

దుష్యంతునివంటి ఉత్తమపురుషుడు అలా అంటాడని కలలో కూడా అనుకోలేదు శకుంతల. ముహూర్తకాలం నిర్విణ్యఅయిపోయింది. ధైర్యం తెచ్చుకుంది. ఇంతలో ఆత్మవిశ్వాసం ముంచుకొచ్చింది.

ఆ సందర్భంలో ధర్మోపన్యాసం వేదంతో తుల్యమైంది. ఋషులకి గౌరవం సంపాదించి పెట్టగలది. ఆత్మగౌరవం ప్రత్యక్షపర్చునా.

స్వయం ప్రాప్తేవ మామేవం, మావయం స్థాః పతివ్రతాం
అర్ఘ్యార్హాం నాశ్చయసి మాం స్వయం భార్యాముపస్థితా.

*   *   *

దుఃఖాన్ని తనవారితో పంచుకున్నప్పుడు కదా సహింప శక్యమౌతుంది. మహానది రత్నాకరాన్ని గాక మరెక్కడకి చేరుతుంది? శరత్కాలపు వెన్నెలని బట్టచాటున పెట్టి ఎవడు దాచగలడు? కళ్ళలో పొగగమ్మినా సోమయాజి చేతిలోని యాహుతి అగ్నిహోత్రంలోనే పడుతుంది కదా?

చెప్పడానికి యిష్టమయిన దాన్ని చెప్పకుండా ఉండటం పరితాపాన్ని పుట్టించదా?

రాజు ఎంత అబద్ధమాడాడు? "నీవెవరో నాకు తెలియదన్నాడు" ఆ మాటశకుంతల హృదయాన్ని ముక్కలుచేసింది.

జానాన్నపి మహారాజ, కస్మాదేవం ప్రభాషనే

[illegible]
న్నావేమో? నిన్ను నువ్వే వంచించుకుంటున్నావు.

స్వయం ప్రాప్తేతి మామేవం, మావమంస్థాః పతివ్రతాం
అర్ఘ్యార్హాం నార్చయసి మాం, స్వయం భార్యాముపస్థితాం.

దుష్యంతు డామెను నీచంగా నిందించాడు. కాని అంతమాత్రం చేత ఆమె వెనుకంజవేయలేదు. అతని నీచోక్తులను వడ్డీతో సహా తీర్చివెయ్యటమే కాకుండా తనకే బాకీపడేట్టు చేసుకుంది.

నిదర్శనార్థం సర్వేషాం, తచ్ఛ్రుత్వా క్షయమర్హసి

అని ఉదాత్తతని కాపాడుకుంది. చేసిన బాసలన్నీ మరచి నేనెవరో తెలియదన్నావు. ఈ మహాసభలో నన్ను ఒక మోసకత్తెగా, నీ రాజభోగాల కాసించి

"కల్పనాపటిమతో తమ కార్య సాఫల్యం తవించుకుంటున్నావు.

"ఓ తరుణీ నీవెవ్వరు? అన్నావు నన్నెరగనట్టు నా మనసు అగ్నిలా దహించుకుపోతోంది "నిన్ను వివాహమాడినట్లు గుర్తులేదే" అన్నావు. నువ్వుచేసిన పనికి, ఒకా నొకనాడు పశ్చాత్తాపాగ్నిచేత దగ్ధమవకమానదు నీ మనసు. ఇది తప్పదు సుమీ" అంది శకుంతల.

రాజు చిత్తం మాత్రం సంశయంలోనే వుంది.

నాది మరపో, ఆమెది అబద్ధమో, నేను భార్యాత్యాగినో పరభార్యా గ్రహీతనే, అగుదునో అని రాజు లోలోపల విచారిస్తూనేవున్నాడు. శకుంతల అనుకుంది.

తడయక పుట్టినాడె తల్లిచే దండ్రిచే, విడువ
బడితి నిప్పుడు పతిచేతను, విడువబడియెదనొక్కొ
నుడువుము వేయునింకేల, యిప్పాటి నోముల దొల్లి
కడగి నోచితినిగాకేమి, యనుచును గుందెడెందమున.

శకుంతల క్షోభిత హృదయంతో దుష్యంత మహారాజుతో అంది. "నన్నెరగనని ఎంత అసత్యమాడేవు. అసత్యం పలుకటం ఎంత మహా పాపమో తెలుసా?

విపరీత ప్రతిభాష లేమిటికి ఉర్వీనాధ

నుత జలపూరితంబులగు, నూతులు నూరిటికంటె సూనృత
వ్రత యొకబావిమేలు, మరి బావులు నూరిటికంటె నొక్కస
త్క్రతు వదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండుమేలు,
తత్సుత శతంబుకంటె ఒక సూనృతవాక్యము మేలు చూడగన్

ఇంకా విను.

వెలయంగ నశ్వమేధంబులు
వేయును ఒక సత్త్వమును నిరుగడలం
దులనిడి తూపగ, సత్యము వలన
నములు సూపు గౌరవంబున పేర్మి
సర్వతీర్థాభిగమనంబు, సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావు
ఎరుగుమెల్ల, ధర్మంబులందు బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు

అప్పుడు పురోహితుడు ప్రసవపర్యంతం తన ఇంటవుంచమన్నాడు శకుంతలని. ఆ సభనుండి పురోహితుడు, ఆయన వెనుక శకుంతల సభా భవనంవీడి బయటకొచ్చారు.

అప్పటివరకు బలవంతాన బిగపట్టివుంచిన దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకుని వుప్పెనలాగవచ్చిపడింది శకుంతలకి. ఆవిడ మన సంతా మరిగిపోయి ఆవిర్లొస్తోంది. ఆమె గుండెరణభేరి వాయిస్తోంది. ఆమె గుండె వాగుకి గండిపడింది.

శకుంతల బిగ్గరగా చేతులు రెండూ పైకెత్తి "అమ్మా" అని ఆక్రోశించింది.

అమ్మా! అనేమాటలో మాధుర్యం ఎంతవుందో ఆర్తికూడా అంతే వుంది. పసిపాప పెదాలు రెండు కలిపి పలికే మొదటి మాట "అమ్మా" అని.

ఏదైనా శరీరానికి గాని, మనసుకు గాని భరించరాని బాధకల్గితే మొదటగా మననోటివెంట వచ్చేది "అమ్మా" అనేమాట.

అమ్మ అనేమాట అలసటనంతా ఉపశమింపజేస్తుంది.

'అమ్మ' అనేమాట ఒక స్థిమితాన్ని అంటే స్థిరత్వాన్ని చేకూర్చుతుంది.

అలాగే మిన్నువిరిగి మీదపడేంత కష్టంలో, శరీరం స్పృహతప్పే తరుణంలో, జీవితమంతా సమస్యల తోరణంగా కనిపిస్తున్నప్పుడు దేహాభిమానం విడిచి అంతకన్నా ఆదుకునేవాళ్లు ఇక లేరనో, విచారమంతా గళాన్ని చుట్టబెట్టేసినట్లు, ఏదో ఓ శక్తివచ్చి ఇప్పుడు నన్ను ఆదుకుంటే ఎంత బాగుండునని అనుకుంటూన్నప్పుడు, అసంకల్పితంగా "అమ్మా" అనే పిలుపుకాదు, అరుపురాదు. ఆర్తితో కూడిన ఆక్రోశింపు అప్రయత్నంగా నోటివెంట వెలువడింది అప్పుడు.

ఒక అద్భుతం జరిగిపోయింది. కన్నుమూసి తెరిచేలోపున దివి నుండి ఒక వెలుగుదిగివచ్చి శకుంతలను తీసుకుపోయింది. అది ఆమె తల్లి మేనక. కూతురు చాలా క్లిష్ట సమస్యల్లో ఇరుక్కుపోయి 'అమ్మా' అని పిలవగానే ఆ మాతృ హృదయాన్ని సూటిగా తాకిందాపిలుపు. తల్లి హృదయం తల్లడిల్లిపోయింది. పరుగున వచ్చి బిడ్డను కాపాడుకుంది. తిన్నగా హేమకూటానవున్న మరీచాశ్రమానికి తీసుకువెళ్ళింది. అక్కడ దింపి తను కన్నబిడ్డకు సేవలుచేస్తూ అక్కడేవుండి ఓదార్చింది.

ఆ దయామయుడైన మరీచమహర్షి ఆశ్రమాన ఆయన అండన సుఖప్రసవమై మగబిడ్డను కన్నది శకుంతల. ఆ బిడ్డని సర్వదమను డన్నాడు మహర్షి. అపరాజిత అనే ఓషధిని తాయెత్తుగా కట్టాడు చేతికి.

మరీచ మహర్షికి వేయిమంది శిష్యులువున్నారు. ఆశ్రమాన సుఖ శాంతులకుకొరతలేదు. జంతుజాలమంతా అత్యంతప్రీతితో ఐకమత్యంతో మనగలుగుతోంది. క్రూరజంతువులు తమ కౌర్యాన్ని మర్చిపోయి, ఆవులతో, దూడలతో, లేళ్లతో ఆడుకుంటున్నాయి. మానవులు, జంతువులు కలిసి స్నేహంగా తిరుగుతున్నాయి. ఆశ్రమం అంతా సుభిక్షంగావుంది.

* * *

ఇలా నాల్గు సంవత్సరాలు గడిచాయి. ఓ రోజున రాజముద్రిక అంగడిలో అమ్మజూపిన ఒక జాలరినిపట్టి రాజభటులు సభాభవనానికి తీసుకొచ్చి రాజుఎదుట నిలబెట్టారు. తాను పట్టిన ఒక చేప కడుపులో ఆ ముద్రిక దొరికిందని చెప్పాడు జాలరి.

అప్పుడు దుష్యంత మహారాజుకి ఉంగరం చూడగానే శకుంతలా వృత్తాంతమంతా జ్ఞప్తికొచ్చింది. కన్నులనుంచి అశ్రువులు ఒలికాయి. ఉంగరం తీసుకుని జాలరికి పారితోషికమిచ్చి పంపివేశాడు రాజు.

తాను చూపిన క్రౌర్యం అంతా జ్ఞప్తికి వచ్చింది. శకుంతలపై జాలి, దుఃఖం కల్గింది. రాజు ఎప్పటివలె ధర్మాసనానికి వెళ్ళలేదు. ఏ పండగ కూడా చెవిని పడనీడు. అప్పుడు వసంతోత్సవాలు వచ్చాయి. అవేమీ జరపవద్దని కట్టడిచేశాడు. ఔరౌరా! ఇంత మతిమరుపు ఎందుకు కల్గింది ఇతనికి? అక్కడకి ఎంతో తెలియచెప్పింది. అయినా తను పెడచెవిని పెట్టాడు. ఎంతలేనిమాటలన్నాడు? నిండు గర్భిణి, ఎక్కడ కెళ్ళిందో? ఎన్ని ఇడుములు పడిందో, అందునా అభిమానవతి, సుకుమారి మళ్ళీ తపోవనానికి కణ్వుడివద్దకు మాత్రం వెళ్ళివుండదు. అసలు ఇంత పరా భవం పొంది ఇంకా ప్రాణాలతో వుంటుందనే ఆశిస్తున్నాడా తను?

మనోరథాయ నాశంశే, కింబాహోస్పందసే వృథా
పూర్వావధీరితం శ్రేయో, దుఃఖంహి పరివర్తతే

నిరాకరించిన పత్ని 'పూర్వావధూరితం శ్రేయో' మళ్ళీ లభిస్తే దుష్యంత మహారాజు కనిపించటానికి నిదర్శనం దుఃఖింహి పరివర్తతే గాఢమైన ఆలోచనలో నిమగ్నుడైనవాడికి మనోరథం నెరవేరటం అసంభవమనే నిస్పృహ ఉంది.

కవి ప్రతిభకు నిదర్శనం, మొదటినుండి ముందుకి వెనక్కి వూగడం అపరిమిత పశ్చాత్తప్తుడైన దుష్యంతమహారాజునిచూసి అక్కడి వృత్తాంతం తెలుసుకోవాలని శకుంతలకోసం మేనక తన చెలికత్తె అయిన సానుమతిని కోరింది.

సానుమతి హస్తినకు ఆకాశమార్గానపోయి రాజున్న ప్రమద వనానికిపోయి కంచుకివల్లరాజు అంగుళీయాన్నిచూసి పూర్వ వృత్తాంతం జ్ఞప్తికిరాగా, పశ్చాత్తప్తుడై శకుంతలా విరహంతోపడి పరితపించటంవిని, అంతా కళ్ళారాచూసి సంతసించింది.

ఇంతలో చేటి చతురిక చిత్రపటం తీసుకొచ్చింది. దానిని రాజు స్వయంగా తన వినోదం కొరకు రాశాడు. ఇప్పుడు ఇంకా రాయగోరి ఓ చేటిని రంగులు, కుంచెలు తెమ్మని పంపాడు.

అందు చెలులతో కూడా మొక్కలకు నీరుపోస్తున్న శకుంతల తుమ్మెదపై కొన్నదే ఆ చిత్రం చిత్రించబడింది.

తరువాత శృంగార విహారం యధాస్మృతి వ్రాయాలనుకున్నాడు సానుమతి చిత్రంచూసి శకుంతలే ఎదుటనిలచినట్లున్నదని మెచ్చుకుంది. సానుమతి రాజుకగపడదు. రాజుమాత్రం సానుమతికి కనబడుతున్నాడు. ఆయన చేసే చేష్టలు కనబడుతున్నాయి.

'ఇక నాకు ఎలాగ? ప్రేయసిలేదే' అని రాజు విచారిస్తున్నాడు.

ఇదంతా చూసిన సానుమతి అనుకుంది. "నిరాకరణ దుఃఖం యిలాగ సర్వదా రాజుని క్షోభింపచేస్తోంది" అని శకుంతల సంగతి చెప్పి రాజుని ఊరడిద్దామా అనుకుంది. ఇంతలో వద్దు దేవతలే ఈ సమాగమం కూరుస్తారు అన్నారుకదా? అనుకుని ఇక్కడి సంగతులన్నీ చెప్పి శకుంతలని ఓదార్చేందుకు వచ్చిన దారిని ఎగిరిపోయింది.

ఇంతలో మాతలి దుర్జయ సంహారానికి ఇంద్ర సందేశంతో రథాన్ని తీసుకువచ్చి నిలిపాడు.

దుష్యంత మహారాజు రాజకార్యములు మంత్రికి అప్పగించి అప్పుడే స్వర్గానికి పోయాడు.

దుర్జయ సంహారం ఒక్కపూటలోనే జరిగిపోయింది. ఇంద్రుడు మరునాడు సర్వగీర్వాణుల ఎదుట మహారాజుని తన అర్ధ సింహాసనా ఆశీనునిచేసి తన చేత్తో అతనికి గంధం అలది మెడలో మందారమాలవేసి అంపకం చేశాడు. మాతలి తేరు నడుపుతుండగా దారిలో దేవతలు పాడే ప్రస్తుతి వీనులవిందుగా వింటూ మెరపువేగంతో హేమకూటాద్రిచేరాడు. మాతలి కావాలనే ఆ మార్గం పెట్టాడు.

ఈ కొండ ఈ ప్రాంతం ఏమిటని దుష్యంతమహారాజు అడుగగా ఇది హేమకూటం ఇది గొప్ప సిద్ధిక్షేత్రం. మహిమాన్వితమైనది అని చెప్పాడు.

సురాసుర గురువు మరీచమహర్షి ఈ ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్నాడు.

రాజ మహర్షికి ప్రదక్షిణం చేయకోరాడు. మాతలి రథం ఆపారు ఇరువురూ దిగారు. మాతలి రథాన్ని అశోకవృక్ష ఛాయలో ఉంచి, భగవద్దర్శనానికి సమయం తెలుసుకునేందుకు వెళ్లాడు. అక్కడ రాజుకి, శుభ సూచకంగా కుడిభుజం, కుడికన్ను అదిరాయి.

"తనకిక ఏం మేలు! తన మనోరథం శకుంతలా సమాగమం ఇక అదెలా కలుగుతుంది?" అనుకున్నాడు.

వేటకై మొదట కణ్వాశ్రమానికి రథారూఢుడై వెళ్ళినపుడు కూడా కుడిభుజం, కుడికన్ను అదిరాయి, దుష్యంత మహారాజుకి ఇప్పుడు శకుంతల నాకెక్కడిది? శకుంతలలేని శుభం ఎలా కలుగుతుంది అనుకున్నాడు. దుష్యంతుడు లేక శకుంతలా సమాగమం కల్గుతుందా? అనుకుంటూండగా వద్దుసుమా! చాపల్యం అని ఒకే మాట వినపడింది. చందమామలాంటి చిన్నబాలుడొకడు సింగపుపిల్లను జూలుపట్టి తల్లివద్దనుంచి ఆటకై లాగుతున్నాడు. వద్దని తాపసులు వారిస్తున్నారు. వాడుమానడు వాడిని చూడగానే రాజు మనస్సు సొంతబిడ్డను చూచినట్లు ఉప్పొంగింది. చెయ్యిచాచాడు రాజు. ఇదెక్కడితేజస్సు? చక్రవర్తి లక్షణాలు కన్పిస్తున్నాయి బాలుడి ముఖాన. పిల్లవాడు సింహపు పిల్లని బాధిస్తూనేవున్నాడు. ఒక వృద్ధతాపసి 'కాస్త విడిపించవయ్యా' అన్నాడు రాజుని. రాజు "మునికుమారా" అని బుజ్జగించాడు.

ముని కుమారుడు కాదు, అని బదులు చెప్పాడు ఆ తాపసి.

రాజు బాబుని లాలిస్తూ 'మరి నీ వంశమేది?' అంటే పురువంశమన్నాడు. 'తండ్రి ఎవరని'అడిగాడు రాజు వృద్ధతాపసిని. "ఎవరో ఒక ధర్మపత్ని పరిత్యాగి. పేరు చెప్పమన్నాడు. తల్లి అప్సర సంజాత. ఒక మహారాజువలన వీడిని కన్నది" అని చెప్పాడు.

ఇలా ఒకటి వెంట ఒకటి ఆశాజనకంగా రాజు కథనే తడుముతున్నాయి.

ఇంతలో తాపసి "అయ్యో! బిడ్డచేతి రక్షాబంధనం కనబడదే" అని

ఆయన పట్టుకొని ఎత్తాడు బిడ్డ చేతిని ధరింపజేశాడు వాళ్ళంతా ఆశ్చర్య నిమగ్నులయారు కారణం అడిగాడు రాజు.

ఇది 'అపరాజిత' అనే ఓషధి. మరీచభగవాన్లువారు వీడికిచ్చారు. తలిదండ్రులు తప్ప తక్కినవారు తాకితే పామయి కరుస్తుంది. మేము ఎన్నోసార్లు చూశాం అన్నారు. వెంటనే హర్షాతిరేకంతో వీడు నాకొడుకే అని రాజు కౌగలించుకున్నాడు.

తాపసులు ఈ వృత్తాంతం శకుంతలకి చెప్పడానికి వెళ్లారు. వదులు మా అమ్మదగ్గరకు పోవాలన్నాడువాడు.

'నా తండ్రి దుష్యంతుడు? నీవెవరు?' అన్నాడు మళ్ళీ రాజుకి ఇక సందేహం తీరిపోయింది.

ఇంతలో శకుంతల జడలుకట్టిన కుంతలాలతో చిక్కినగమైన మొగంతోవచ్చింది. బాలుడు 'అమ్మా' అని ఆమె చెంతకు చేరాడు.

రాజు గుర్తుతెలియనంత వివర్ణుడయాడు. శకుంతలనుచూసి నన్ను గుర్తు పట్టావా? అన్నాడు.

గొంతు విని ఆర్యపుత్రుడే అనుకుని 'జయం' అనేటంతలో రాజు ఆమె పాదాలపైవాలి "నేను మోహాన నిరాకరించాను అది మనసులో ఉంచుకోకు" అని ఆమె కన్నీటినితుడిచాడు శకుంతలా పక్షపాతి మేనక సఖి సానుమతి. వీరిది చక్కని జంట. వీరిని విడదీసిన విధి ఎప్పుడు కలుపుతుందో? ఎలా కలుపుతుందో తెలియదుకాని ఇద్దరికిద్దరు పరితాప మనస్కులై క్షోభిస్తున్నారు పాపం అనుకుంది.

శకుంతల నాటకం మిక్కిలి ప్రౌఢమైనది.

ముందు బాలహరిణం పరుగెత్తగా వెనుక ఆయన తనసేననంతా వదలి ముందుపోయాడు రథారూఢుడై పరిగెడుతున్న లేడి దానివెనుక పరిగెడుతున్న రథం. అప్పటికి రాజు అనపత్యుడు.

సంతతి పొందాలన్న సంకల్పమే ప్రణయానికి పారిశుద్ధ్యం ఏర్ప రచింది. శకుంతలాదుష్యంతుల పరిణయం అప్రధానం ఇక్కడ భరతో త్పత్తియే ప్రధానలక్ష్యం.

మా శకుంతలని పెండ్లాడి, ఆమెయందు కల్గినబిడ్డకే రాజ్యమిచ్చి చక్రవర్తిని చేయమని వారడుగనూలేదు.

అలాగే చేస్తానని రాజు వాగ్దానం చేయనూలేదు.

రాజు మొదట కణ్వాశ్రమం ప్రవేశించి మానవమాత్రుడైన సూతు నితో సామాన్య రథాన. కారణం ఇష్టిరక్షణకోసం. చక్రవర్తి కాజాలిన పుత్రుని పొందమని ఋషుల ఆశీస్సులంది వెళ్లాడు.

తరువాత ప్రజాపతి మరీచాశ్రమం ప్రవేశించాడు. దేవతలకి సైతం దుర్లభమైన దేవేంద్రుని రథాన ఆయన సారథి మాతలితో కూడా దేవతల కభయప్రదానమయిన అసురవధ గావించి వచ్చాడు. రెండుసార్లు శుభనిమిత్తాలు కన్పించాయి.

నాటకమంతా మెరుపుతీగలతో కట్టినమేడవలె కన్పిస్తుంది మనకి. తక్కిన పరిజనులందర్నీ వదలి వంటరిగా రాజు కణ్వాశ్రమం ప్రవేశి స్తాడు. కనుక శకుంతలా ప్రేమ కలాపం, గాంధర్వ వివాహం మొద లైనవి ఎవ్వరు చూడటానికి అవకాశం లేదుకనుక అపార్థాలకి అవకాశం వచ్చింది. తన పరిజనంలో ఒకరిద్దరూ ఈ శకుంతలా సమాగమం చూసినా ఆనాడు రాజసభలో అంత అవమానం శకుంతలకి జరగకుండా అడ్డుపడేవాళ్లు వివాహం సంగతి జ్ఞాపకం చేసేవారు.

లేదా దుర్వాసుడు శాపమిచ్చిన సంగతి చెలులు రహస్యంగా వుంచేశారు. శకుంతలకి ఆ శాపం సంగతి చెప్పినా అంగుళీయకం జాగ్ర త్తగా కాపాడుకుంటూవుండేది. అలా ఏదీ జరుగలేదు. వీళ్ళకి ఈ ఎడ బాటు కావాలనే కలుగ చేశాడు సానుమతీ ప్రవేశం ఎంతటి మృదువైన

సన్ని వేశం? సానుమతి నావహించి శకుంతల చూస్తున్నట్లుంది. తనకోసం పరితపించిన రాజుని చూడటం ఎంత ప్రయోజనం? ఎంత ముదావహం?

ముద్రిక దొరికిన వైనమంతా చెప్పాడు.

ఉంగరం దొరకగానే అంతా గుర్తు వచ్చిందన్నాడు.

ఇట్లు వారి సమాగమం కాగానే మాతలివచ్చి మరీచులవారి దర్శనానికి ఇదే మంచి సమయమని రాజుకి విన్నవించుకున్నాడు. తనకి అట్టి మరపు ఎందుకు కల్గిందో వూహింప లేకున్నాడు రాజు.

అది దూర్వాస శాపమహిమని, ఉంగరము చూచేదాకానే అని ప్రజాపతి చెప్పాడు. శకుంతలా దుష్యంతులు నిర్మల చిత్తులై మరీచ మహర్షికి దండప్రణామాలు ఆచరించారు.

నీ భర్త దేవేంద్రునికి సమానుడు.

నీ కుమారుడు జయంతునికి సమానుడు.

నీవు కేవలం పౌలోమికి సమానవు కమ్ము.

అనే మహర్షిచే అమోఘాశీస్సులందారు. స్వర్గసుఖాలనుభవించి వచ్చిన రాజన్నాడు. అమృతమడుగులోవలె ప్రవేశించాను. స్వర్గారోహణ కన్నా అమితమైన ఆనందం పొందుతున్నా అన్నాడు.

శకుంతలకోసం వారి సమాగమవృత్తాంతం కణ్వమహర్షికి చెప్ప డానికి వార్తాహరులని పంపారు మరీచులవారు దుష్యంతుడు భార్యా పుత్రులతో ఇంద్రరథంలో నిజరాజధానికి తరలాడు.

దైవసమానులైన అధితి మరీచమహర్షులచేత అమోఘమైన ఆశీస్సులంది దుష్యంతమహారాజు శకుంతలతో సుఖాసీనుడై పురజను లంతా సంతోషాతిరేకంతో జయజయధ్వానాలు చేస్తుండగా, నిజరాజ ధానికి తరలివచ్చాడు.

అనే పేర దిగ్విజయంగా ఏలాను శకుంతల తనయుడు భరతుడు. సుభి క్షంగా సురక్షితంగా పాలించి ఖ్యాతిగాంచాడు.

విశ్వామిత్రుడు రాజర్షి, బ్రహ్మతేజస్సు, క్షాత్ర తేజస్సు సమ పాళ్ళలో వుంది. ఆ రాజర్షియందు ఆయన పుత్రిక శకుంతల ఆయన మనుమడు భరతుడే యుగపురుషుడు కావలసివున్నది కనుక భరత ఖండాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలాడు భరతుడు.

శకుంతల ఒక జాతీయనాటకమనేది పచ్చినిజం.

శకుంతల ముగ్ధ. కొంత అమాయకత్వం వున్నప్పటికి పరిస్థితుల ప్రభావంవల్ల కణ్వమహర్షి పెంపకంలో అన్ని విద్యలు నేర్చినది, తెలుసు కున్నది. కనుక మొదట ఆమె మనసు కుసుమంకన్నా కోమలమైనప్పటికీ భర్త తిరస్కృతి అయే పరిస్థితి వచ్చినప్పటికి వజ్రంకన్న కఠినంగా మార్చుకుంది మనస్సును. పరిస్థితులకు తలఒగ్గి ధైర్యంగా కష్టాల నెదుర్కొంది. మనస్సుని స్థిరం చేసుకుంది. గట్టి పర్చుకుంది.

హేమకూటానగల మరీచాశ్రమంలో బిడ్డనుగని పెంచింది. ఎలాగ? తన బిడ్డను సింగంపిల్లలాగ, గుహలోవున్న సింగపు పిల్లను తన బిడ్డలాగ సాకింది. వాళ్ళిద్దరికి అపరిమితమైన మైత్రి కదా మరి?

'మాతృదేవోభవ' అన్నట్టుగా శస్త్రాస్త్ర విద్యలన్నీ నేర్పి సాటి లేని మేటిగా పెంచింది. భావిభారత చక్రవర్తిగా తీర్చిదిద్దింది. ఆసేతు హిమాలయ పర్యంతం భరతవర్షే, భరతఖండే అనేటట్టు పెంచింది భరతుణ్ణి, ఆమె ఎంత ప్రజ్ఞాశాలో దీనినిబట్టి తెలుస్తోంది. ఈమె పట్టుదల కార్యనిర్వాహకత విదితమౌతుంది.

ఇక దుష్యంత మహారాజు కథా కాలంనాటికి ఇంకా భార్యలువున్న ప్పటికి అనపత్యుడు. పరాక్రమశాలియే కావచ్చు. అంతగొప్ప అరివీర

భయంకరుడు కనుకనే దేవేంద్రుడు తనకు సహాయంగా రమ్మనిపిల్చాడు అది వేరేసంగతి. అదలావుంటే,

శకుంతల విషయంలో మాత్రం చాలామంది పురుషుల్లాగా ఆమెకి అన్యాయంచేశాడని చెప్పక తప్పటంలేదు.

అక్కడికీ కాళిదాసు తన నాయకుడైన దుష్యంతుడికి ఇటువంటి అపవాదునుంచి తప్పించేందుకు శాయశక్తులా ప్రయత్నించాడు. దూర్వాస శాపం అనీ అంగుళీయకం పోగొట్టుకోవటం అని కథల్లి.

శకుంతలా దుష్యంతుల సమాగమానికి ఒక్కరంటే ఒక్కసాక్షి కూడా లేకుండా చేశాడు. తన సేనని తన రథాన్ని ఎంతో దూరాన్ని విడదిచ్చాడు. ఆయన చెలికాడినికూడా కొంతదూరంలో వుంచాడు. వాళ్లల్లో ఒక్కరున్నా రాజసభలో "నిజమేనయ్యా! ఈమెను గాంధర్వ వివాహం చేసుకున్నావు కదా" అని అనేవారేమో. అనసూయా ప్రియం వదలు తెలిసినవాళ్లు వున్నా వాళ్లు రాజసభకు రాలేరు కదా?

ఏది ఏమైన బహు వియోగానంతరం పునః సమాగమం ఆనంద దాయకం, అతి సహజం. కావ్య మర్యాద కనుక అలా జరిగిపోయిందనుకోండి.

శకుంతల పాత్ర చాలా మహత్తరమైనది. ఉదాత్తమైనది. మధురమైనది. మనసుని ఇట్టే ఆకట్టుకుని తిష్టవేసుకుని కూచుంటుంది. ఓ పట్టాన వదిలిపెట్టదు పాఠకుల్ని.

అందుకే

వనితాలోకానికే దీపకళిక. ఓ మచ్చుతునక.

# వరూధిని

వరూధిని అపురూప సౌందర్యవతి. అనుపమాన సౌశీల్యవతి, అనాఘ్రాత పుష్పం మెరుపు తీగలాంటి అద్భుతమైన అందం ఆమెది.

ఆమె మనసంతా ఆక్రమించుకుని మొట్టమొదటగా తిష్ఠవేసుకుని కూర్చున్న హిమగిరిలాంటి మహోన్నత వ్యక్తి ప్రవరాఖ్యుడు.

ఆయన సత్యశౌచ, ధర్మశాలి, సద్విజుడు ఏకపత్నీవ్రతుడు అవటంవల్ల ఆమెను ఉపేక్షించాడు తిరస్కరించాడు.

మనుసంభవానికి చక్కని సుక్షేత్రం ఎన్నుకున్నాడు కవి. బహుభార్యాత్వం నిషేధం కాదు కనుక ఆయన మనసును తనవైపు మళ్ళించుకునేందుకు తన ప్రేమలో అనౌచిత్యం లేదని ఎంతైనా నచ్చ చెప్పేందుకు ప్రయత్నించింది వరూధిని.

ఈ సంగతంతా చూసిన గంధర్వుడు ఆమెపై మరులుగొని, మనసుపడి, ఒకానొక సమయంలో ఆమెచేత తిరస్కరించబడి కూడా అది మంచి అవకాశంగా భావించి, ప్రవరుడి వేషం ధరించి ప్రవరుడి లాగనే సమయోచితంగా మాట్లాడి, రసవత్తరపురాశి రూపెత్తినదా? అన్నట్లున్న వరూధినిని పొందాడు.

ఈ మాయ ఏమీ తెలియని వరూధిని మాత్రం త్రికరణశుద్ధిగా ఆ మాయాగంధర్వుని ప్రవరుడిగానే భావించి తన సర్వస్వం అర్పించుకుంది.

విమర్శకులు కొందరు వరూధిని దేవకన్యఅన్నారు. ఎలాచూసినా ఆమెలో వేశ్యాలక్షణాలు మనకి కనిపించవు రంభ ఊర్వశి, మేనకల వలె ఈమె ఏ మహర్షుల తపోభంగాలకీ కూడ వినియోగించబడలేదు.

మనోవాక్కాయ కర్మలచేత ప్రవరుణ్ణే ఆరాధించి సేవించింది ఏకాగ్రతతో. ఆమె మనసంతా నిండియున్నవాడు ప్రవరుడొక్కడే. ఆమె ఆలోచనల్లో కూడా మరొక పురుషుడు లేనేలేడు.

ఇందులో కొంచెం కూడా అనౌచిత్యం కనిపించదు మనకి.

ఏదిఏమైనా ఆమె ప్రవరుడిపై చూపించిన ఆరాధనా భావం ఆత్మీయత అభిమానం అనుపమానం, అపూర్వం. అందుకే ఆపవిత్ర ప్రేమ అలా ఆచంద్రార్కం చిరస్థాయిగా నిల్చిపోయింది అనేది నిర్వివాదాంశం.

ఇక ప్రవరుడి వంటి నిగ్రహపరులు కూడా పురుషుల్లో మనకి కనిపించటం అరదు. అటువంటి అద్భుత సౌందర్యవతి తనంతట తను చేరవస్తే తిరస్కరించగల చిత్తస్థైర్యం ఆత్మనిగ్రహం నియమనిష్ఠా పరత్వం కల్గిన ద్విజోత్తముడు మనకు అట్టే అగుపించడు. ఆయనకు నిత్యం తనుపాసించే అగ్నిహోత్రుడే మిత్రుడయి ఆయన ఉద్యమానికి తోడ్పడ్డాడు.

అటువంటి నిష్టాగరిష్టుడు కనుకనే ఆ అఖండజ్యోతికి అనంత ఖ్యాతి.

ఇక ఇప్పుడు కవియొక్క వర్ణనానిపుణత అనుపమానమైన దనటానికి అరుణాస్పదపురంలో వున్న ఆ ప్రవరుడనే విప్రోత్తముని సౌందర్య గరిమ ఇలా వర్ణించాడు అంటే ఆయన మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, అజానుబాహుడు ఆలేఖ్యతనూ విలాసుడా ఏమి ఆ కవి వర్ణనాచతురిత ఇటువంటివెన్నో పెద్దనార్యుని ప్రబంధంలో.

మనుచరిత్రను పెద్దనామాత్యులు స్వారోచిషమనుసంభవం అని పేర్కొన్నారు. దీనికృతిభర్త కృష్ణరాయలు.

కృష్ణదేవరాయలీ మనుచరిత్ర కాక ముక్కుతిమ్మన రచించిన పారిజాతాపహరణం, తిమ్మనార్యుడు రచించిన భారతానికి కూడా కృతి పతి అయ్యాడు.

పెద్దన్నగారు నందనవరీక బ్రాహ్మణుడు. ఇంటిపేరు అల్లసాని వారు.

కృష్ణరాయలు కృతిఅందుకున్నప్పుడు ఊరేగించుటకై పెద్దన్నను పల్లకి నెక్కించి తనచేతితో నద్దాని లేవనెత్తి నతని యెడలగల యాదరాతిశయమును వెల్లడించెనట.

కృష్ణరాయని యాస్థానమునగల కవిపండితులలో ఈయనకే గౌరవమెక్కువ.

ఒకప్పుడు కృష్ణరాయలు పసిడపళ్లెరమున కవి గండపెండరమును గొనివచ్చి సభాస్థానమునసిడి, సంస్కృతాంధ్రములయందు సమముగా కవనము చెప్ప నేర్చినవారు నద్దానిగైకొనన నర్హులు.

అనగా సభ్యులు మిన్నకుండిరి. దానిపై కృష్ణరాయలు
ముద్దుగ గండయరమున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరు గోరగలేదు లేరొకో?

ఇలా సగం పద్యం చదవగానే పెద్దనామాత్యులు లేచి

పెద్దనబోలు పండితులు, పృథ్వినిలేరని నీవెరుంగవే
పెద్దన కీదలచినను, బేరిమి నాకిడు క్రిష్ణరాణ్ణృపా॥

అని పూరించాడు. నిజానికి సంస్కృతాంధ్రాలలో సవ్యసాచి పెద్దనార్యుడు. పెద్దనామాత్యుడు 'ఆంధ్రపితామహుడు' అనే బిరుదు పొందినవాడు,

వయసుచేతనూ కవితచేతనూ కూడా తన యాస్థానమున పెద్దవాడగుటచే ఈయనకే బిరుదు ఇచ్చారు.

తన దివ్య కవితావిలాసంచేత కృష్ణరాయల మెప్పించి అతని కత్యంత గౌరవనీయుడై ఈ మనుచరిత్ర ఆయనకే కృతిజేసి అనేక అగ్రహారములు గొని మహాభోగముల ననుభవించి ఐహికేచ్ఛలదనిసి వైష్ణవాగ్రేసరుడై శాశ్వత కీర్తిని గైకొన్నాడు.

ఈ మనుచరిత్ర 'అల్లసానివారి అల్లిక జిగిబిగి' అను పలుకులు ప్రతిపదమునకు సార్థకపఱ్చుకున్నది. ఈ గ్రంథంలో గూర్చిన నేర్పును భావవైచిత్ర్యము కవీశ్వరుని లోకజ్ఞానభాషావైదుష్యం కల్పనాచాతుర్యం వెల్లివిరుస్తోంది.

మేలైన తెల్గుపల్కులు కొన్ని శ్రీనాథుని కవనంనుండి మను చరిత్రకు తేబడినవేమో అనిపించకమానదు. ఈ మనుచరిత్ర యందలి ప్రవరాఖ్యుని సుగుణసంపద, రూపవైభవం, నిగ్రహశక్తి అనుపమానం, ఆనితరదుర్లభం, చాలా అపురూపమైనది, అనన్య సామాన్యమైనదీను.

తన యింటికివచ్చిన అభ్యాగతిని ఏఏ దేశాలు చూశారు మహాను భావా? అని కుతూహలం కొద్దీ అడిగాడు ప్రవరుడు. తను చూసినవన్నీ చెప్పాడా సిద్ధుడు. ఇంత చిన్నవయసులో ఇంత తక్కువకాలంలో ఎలా చూచారివన్నీ అన్నాడు. పాదలేపనంవల్ల. అని తెలుసుకుని అది తనకు కూడా ప్రసాదించమని, తనకు బహుకాలంగా హిమవత్పర్వతప్రాంతాల గొప్ప మహిమాన్విత ప్రదేశాలను జూడమక్కువ కలిగివున్నానని చెప్పాడు.

ఆ సిద్ధుడిచ్చిన పాదలేపనంతో హిమవత్పర్వతం మీదకెళ్ళి ఇచ్ఛ వచ్చినంత సేపు తిరిగాడు. ఎన్నాళ్లుగానో తీరనికోరికగా మిగిలిపోయినవి చూస్తూ తన అభిలాష పూర్తిగా తీర్చుకున్నాడు. చూడవలసిన ప్రదేశాలన్ని చక్కగా చూశాడు.

ఆకాశమునంటు శిఖరాగ్రాలనూ, వాటినుండి ప్రవహించు మంచు వల్ల కలిగిన జలపాతాలను నరనారాయణులను మహర్షులు తపస్సుచేసిన బదరివనాన్ని, అలకనందని హర్షపులకాంకితుడై చూశాడు. భగీరథుడు తపస్సుచేసిన చోటు, ఆకాశగంగ అవతరించిన ప్రదేశం భక్తితో చూసి నమస్కరించాడు.

గిరికన్య (పార్వతి) భర్తను (శివుని) పొందుకొరకు శుశ్రూష చేసిన తపమొనర్చిన ప్రదేశము మన్మథుడు ఫాలనేత్రుని (శివుని) కంటి మంటచే దగ్ధమైనచోటు రతీదేవి భర్తకై విలపించిన చోటుచూసి బహు జాలిపడ్డాడా భూసురోత్తముడు.

దేవతల సేనాధిపతి కుమారస్వామి జన్మించిన తావుగాంచి పులకించాడు.

అనేక రత్నములకు ఓషధులకు నిలయమైన ఎంతో పవిత్ర, ఇంకా ఎంతో మహిమాన్వితము, సౌందర్యశోభితమైన హిమవన్నగం చూస్తూ అందలి విశేషముల కన్నులారపడుతు చూస్తూ ఆనందిస్తున్న సమయాన మధ్యాహ్నకాలమయినందున ఎండవేడిమికి ఆ పసరు అనగా పాదలేపనం కాస్త కాస్తగా కరిగిపోయింది. తిరిగి తన తావుకు వెళ్ళటానికి అశక్తుడు కదా॥

'విధి ఈరీతిని వున్నదా? ఈ ఘోర ప్రదేశాన చిక్కుబడి ఉండవలసివచ్చినదే' అని వగచి తనను తాను నిందించుకున్నాడు. ఏ కాశికో, గయకో, కురుక్షేత్రమోపోక- ఈ హిమవత్పర్వతాలమీద కెందుకు రాబుద్ధి కలిగిందా అని చింతించాడు.

ఒక పచ్చలు తాపిన చక్కని సౌధం ప్రవరాఖ్యుని కళ్ళబడింది. ఆ దివ్య సౌధం దాపుననే నందనోద్యానవనాన్ని బోలినపూదోట నుంచి అమృతోపమానమైన వీణావాద్యం వీనుల్ని పునీతం చేసింది.

ఏమూరాగం, భూపాలమా, సింధూరమా, వసంతమా అనుకున్నాడు. తనను అంత సమ్మోహింప చేసింది మోహనరాగమే అను

ముందుకు కదిలాడు.

ఒక చంద్రకాంత శిలావేదికపై అసమానరూప లావణ్యా తేజో రాసి మెరుపుతీగలాటి అచ్చర మచ్చెకంటి కన్నులవిందు చేసింది. అంతే ఆ సమయాన సురపొన్నలు, బొగడలు, చెంగల్వాల సౌరభం, నాసా పుటాల్ని మత్తెక్కించాయి. కస్తూరి కర్పూరం పరిమళం గుబాళించింది అక్కడ.

ఆ ప్రదేశం జనాన్వితమే అనుకున్నాడు ప్రవరుడు.

శుభలక్షణ సమేత అయిన ఆ దేవకాంతను చూశాడు.

తావుల్ క్రేవలజల్లు చెంగలువ, కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునందైందవ
గ్రావాకల్పిత కాయమానజటిల, ద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుందీవెల నొప్పు నొక్కభవనంబున్, గారుడోత్కీర్ణమున్

ఆ ప్రదేశము మనోహరంగావుంది. ఆ ఎలనాగ ఇంకా సౌందర్య వీచికలు చిమ్ముతోంది. కాని ప్రవరాఖ్యుడి అంతరంగాన కాస్తయిన ఆనంద పారవశ్యం అగుపించలేదు. ఎలా! ఎప్పుడు? తనవూరు చేరుకుంటాడు? అందుకుమార్గం ఎవరు చెపుతారు? ఇదే ఆయన అంతరంగాన గలచింత. ఆ దేవతాస్త్రీలలో మిన్నయగు నా జవరాలు కనురెప్పలల్లార్చి మరీ చూసింది. ఈ మకరాంక, శశాంక మనోజ్ఞమూర్తి ఎవరూ? ఆజాను బాహుడూ, అరవింద దళాయతాక్షుడూ, ఆలేఖ్యతనూవిలాసుడు ఎవరూ? అని అబ్బురపాటుతో చూసింది.

అబ్బురపాటుతో, నయనాంబుజమున్, వికశింపగాంతి పె
ల్లుబ్బి కనీనికల్, వికసితోత్పలపంక్తుల, గుమ్మరింపగా
గుబ్బ మెరుంగుచన్నర గగుర్పొడువన్, మదిలోనగోరికలే
గుబ్బతిలంగజూచె, నలకూబర సన్నిభు, నద్దరామరున్.

ఆ దేవతా స్త్రీ ప్రవరునిజూచి దిగ్భ్రమజెంది వీణ అక్కడవిడచి గల్లు గల్లున అందెలు మ్రోగుతుండగా మెల్లమెల్లగా నడచివచ్చి ఆ తేజోమూర్తి సౌందర్యానికి అబ్బురపడుతు చెంతకుచేరి నిల్చింది. ఆమె మనసులోంచి ఆనందోత్సాహాలు తన్నుకువచ్చి ముందర కురుకుతోన్నట్లు ఆమె కళ్లు చెపుతున్నాయి.

సామాన్య బ్రాహ్మణకులంలో పుట్టినవానికిట్టి యపూర్వ సౌందర్య మెట్లబ్బెనా? అనీ దేవతాంశజులకే చెల్లు ఈ దీప్తి అనీ అనుకుంది.

ఈ మహాపురుషుడు నన్ననుగ్రహించునా అని సందేహిస్తోంది. ఇలాటి మనోవికార మెప్పుడు కలుగలేదాఇంతికి. ఒక్కసారి నాకనుల్లో కనులు కలిపిచూడరాదా ఆ మోహనాకారుడు అనుకుంది. ఒకవేళ నేనే పలకరిస్తే ఏం? అనుకుంది ఆ కోమలి.

సురగరుడోరగ, నరఖే
చరకిన్నెర, సిద్ధ్యచారణవిద్యా
ధర గంధర్వ కుమారుల
నిరతముగను గొనమెచోలనేర్తురె వీనిన్.

అని ఆలోచిస్తూ వరూధిని ఆ భూసురుని అతిలోకలావణ్యాన్ని చూస్తూ కన్నులకు విందు చేసుకుంటోంది. ఎన్నో చెప్పవలసి వచ్చినప్పుడు ఇంకెన్నెన్నో మాట్లాడవలసివున్నప్పుడు మాటలే కరువవుతాయి. ఒక్క మాటకూడా వెగిలిరాదు నోటినుండి. అవి భ్రాంతి, ఆ తడబాటూ, ఆ పారవశ్యం అలాటిది. ఇలాటి పరిస్థితుల్లో ఎవరైనా అంతే. కాని ఆ వరూధిని మాటమాత్రం వేరు. ముందుగా దోవకడ్డు నిల్చింది.

ఎవ్వతెవీవుభీత హరిణేక్షణ, యొంటి జరించెదోటలో
కివ్వనభూమి, భూసురుడనే, బ్రవరాఖ్యుడ ద్రోవదప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్, జనుదెంచిపురముంజేరనిం
కెవ్విధిందెల్పగదవే, తెరువెద్ది, శుభంబునీకగున్.

ఓ యువతీ, నువ్వు ఈ దోటలో ఒంటరిగా వున్నావేమి? తోవదప్పిన నాకు మార్గంజూపి పుణ్యం కట్టుకో. మాది అరుణాస్పదపురం, అది వరుణానదీతీరానవుంది. నా పేరు ప్రవరాఖ్యుడు. అని తననుతాను పరిచయం చేసుకుని మార్గం చూపమని ప్రాధేయపడ్డాడు జాలిగా.

కాని వరూధినికి జాలికలగలేదు సరికదా ఆట పట్టించాలనుకుంది. దారిచెప్పేస్తే ఇకముందు కథేముంది? తన మనసులోని కోర్కె తీరవద్దా? రాని కోపాన్ని నటించి నొసలు చిట్లించింది. కాని పెదాలపై నవ్వుల దొంతర్లు విచ్చుకున్న కాటుంకములు తళతళలాడ కళ్ళల్లోని కోర్కెలు కదులుతున్నాయి.

ఇంతలు కన్నులుండ, తెరువెవ్వరి వేడెదు భూసురేంద్రయే
కాంతము నందున్న, జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక, నీ వెరుగవే? మునువచ్చిన త్రోవ చొప్పునీ
కింతభయంబులేక కదుగ నెల్లిదమైత్రిమె మాటలేటికిన్।

పేరవేసి కష్టపెట్టుకుని దోవ ఎవర్నడుగుతావు అందిగాని జాణతనంగా. నిజానికి 'ఇంతలేసి కళ్ళలో' వలపులపిలుపులూలేవు. కోర్కెల కైపులూ లేవు. ఆశల ఆహ్వానాలూ లేవు. ఇంకా అవికూడా ఆ కళ్ళలోవుంటే ఆమె ఇంకా ఎంత అనిర్వచనీయమైన విరహానికి గురై తట్టుకోలేక దగ్ధ మయ్యేదో?

ఇక ఆ కళ్ళలో వుండేది కేవలం నిశ్చలమైన అర్ష ధర్మతేజస్సే. ఆ తేజస్సుకే ఆకర్షితురాలై, ఆ క్షణంలోనే తన సర్వస్వం ప్రవరుడికి మానసికంగా అర్పించుకుందా అందాల సుందరి వరూధిని.

కంతుడా? జయంతుడా? వసంతుడా? వీరందరికన్నా ఎన్నోరెట్లు చక్కదనం కల్గిన మహీసురుడా? సాధారణంగా బ్రాహ్మణజాతిలోపుట్టిన ఈ భూసురిడికి కింత సౌందర్యమా? ఆహా! ఇటువంటి అందగానిగూడిన జన్మధన్యము కదా? అనికూడా అనుకుంది.

ఇదిగో మణినిర్మితమైన మా గృహం, మా ఆతిథ్యం గైకొని విశ్రమించు నీకు విశ్రమించేందుకు చోటులేదని కాదు సుమా! నీవు ఉత్తముడవు, సహృదయుడవు కనుక మా అతిథిపూజగైకొని మమ్మల్ని మాగృహాన్ని పావనం చేయ"మని మృదుమధురస్వరాన యుక్తియుక్తముగా పలికింది. ఆ మాటలు చెప్పిన తీరుకి ఆ కంఠానవున్న అభ్యర్థనకి మరో పురుషుడైతే ఏమైపోయేవాడో కాని ఈయన, ఈ ప్రవరాఖ్యుడు మాత్రం కాస్త కూడా లొంగలేదు. కరుగదలచుకోలేదు, తన పట్టుమీదే వున్నాడు ఆ అభ్యర్థనకే కరిగిపోతే ఆయన ప్రవరాఖ్యుడెందుకవుతాడు?

వరూధిని మనసంతా ప్రవరుడు మీదవుంటే, ప్రవరుడి మనసంతా తన ఇంటిపై పేవుంది. మెరుపుతీగవంటి మేనుగలదాన్ని తుమ్మెదలవంటి కురులుగలదాన్ని, తామరరేకులవంటి కనులుగలదాన్ని, చంద్రబింబం వంటి మోముగలదాన్ని, చక్రవాకములు వంటి వక్షములు గలదాన్ని, లోతైన బొడ్డు గలదాన్ని, ఆ వేల్పు జవరాలి సౌందర్యం చూచాడేకాని ఆ అద్భుత సౌందర్యం ప్రవరాఖ్యుడు మనసుని కాస్తయినా కదలించలేకపోయింది. తను ఎంత తొందరగా తన స్వస్థలానికి ఎగిరిపోదామా అనే ఆతృత తప్ప ఆ సౌందర్యరేఖకి లొంగిపోలేదు.

అక్కడికి ఆమె తనపేరు వరూధిని అని చెప్పి "నా సఖులు రంభ తిలోత్తమ, హరిణి, హేమా మొదలైనవారు" అని చెప్పి తనను తాను పరిచయం చేసుకుంది.

మీరు అద్భుతమైన మహిమలు గలవారు. మీ వినయాతిశయము మీ భక్తియే చాలు మీ యాతిథ్యం స్వీకరించినట్లే మా అరుణాస్పదపురానికి తోవచూపి పుణ్యంకట్టుకో చిన్నదానా? అని వేడుకున్నాడు.

"ఒకానొక సిద్ధుడిచ్చిన పాదలేపనంతో ఈ హిమవన్నగానికొచ్చి

ఇక్కడి ప్రసిద్ధ స్థలాలు చూసేలోపలే ఈ పాదలేపనం కరిగి పోయింది. ఇక నువు మార్గం చెప్పంపే నేను మా వూరుపోవటం కల్ల. మావృద్ధ జననీజనకులు నాకోసం పరితపిస్తూంటారు. నా భార్య నారాక కోసం ఎదురుచూస్తూంటుంది. కనుక నాకు మార్గంచూపి పుణ్యం కట్టుకో మని ప్రార్థించాడు.

ఆయన ప్రార్థనకి కాస్త కూడా కరుగలేదా కోమలి. జాలి అంత కన్నా చూపలేదు. సమ్మోహనంగా నవ్వింది. మహర్షులను సైతం చిత్తు చేసేలాంటి నవ్వు.

"నందనోద్యానాలవంటి వాటికలు, ఈ దివ్యసౌధాలు, పరిమళ భరితమైన చందన వృక్షాలు ఈ మందాకినీ సైకతాలు ఇంత ఆహ్లాదాన్ని కలిగిస్తుంటే ఈ రమణీయమైన పొదరిండ్లలో చక్కని చిక్కని భోగమును పొందక మా వూరో అని పలకరిస్తావేమయ్యా?" అంది.

ఆఖరికి ఇక దాపరికం లేకుండా దాచకుండా మదనుడు తొందర పెట్టగా మనసులోనిది చెప్పేసిందాలతాంగి.

"నా మనసు నీ వశమైందని నన్ను నీ కౌగిట చేర్చిలాలించ" మంది.

"ఓ యువ్వనీ! అగ్నికార్యానికి దేవతార్చనకి టైమైంది. పార్వతీ పరమేశ్వర్లవంటి తల్లిదండ్రులు నాకై తపించిపోతుంటారు.

కనుక నన్ను కరుణించి ఇల్లుచేర్చు అని బ్రతిమాలి, నేను ఆహితాగ్నిని ఇల్లు చేరకపోతే సమస్త ధర్మాలు చెడిపోతాయి సుమా!" అన్నాడు.

"ఓ భూమిసురోత్తమా!"

"మీరు చేసే యజ్ఞయాగాదులు రంభసంభోగాల కొరకే గదా,

మానినీ మన్మథా! నీ యవ్వనం సార్థకం చేసుకో, కోరివచ్చిన కోమలి కోరిక తీర్చు నిన్ను వలచిన అప్సరకాంతను అనుగ్రహించు యజ్ఞ ఫలం అప్సరస్సమాగమానికే కదా?" అంది అనినమాటే మళ్ళీ అంది. లేబ్రాయాన్ని ఉపవాసాలచే వైదిక కర్మలచే గడిపితే ఇక విషయసుఖ ములు అనుభవించుటెప్పుడని నిలదీసి అడిగింది. ఓర్మిగా జవాబిచ్చాడు ప్రవరుడు. "సత్యశౌచ ధర్మశాలి సద్విజుడు. "ఓ చిన్నదానా! బ్రాహ్మణు డగువానికి ఇంద్రియ నిగ్రహం ముఖ్యం. ఇంద్రియ నిగ్రహం లేనివాడు మోక్షాదులు బొందలేడు" అని "కఠోర దీక్షలతో జీవాత్మను శరీరమును కృశింపజేయుట దగునా? భూసురాగ్రగణ్యా! ఈ వయసులో" అంది వరూధిని.

"ఓ జలజాక్షి! నీవన్న యర్థమెల్ల విషయేచ్ఛ గలవారికి జెల్లును కాని నిష్కాములమై మోక్షము నపేక్షించు మాబోంట్లకు కాదు. ఎరిగి వుంటే వూరికిజేరు మార్గం చూపి పుణ్యం కట్టుకో" అన్నాడు ప్రవరుడు. ఇలా ఈయన ధోరణిలో ఈయన వాదిస్తున్నాడు. విప్రధర్మాలు మోక్షా పేక్షయజ్ఞాదుల గురించి చెపుతూ తనవూరికి వెళ్ళేమార్గం చూపమని.

ఈవిడ ధోరణిలో మదనుడు నిర్దయుడయి తనను క్రూరంగా బాధిస్తున్నాడని 'ఆనందో బ్రహ్మ' అనే వేదవాక్యమున కర్థము యోచించి తడవుచేయక బిగికౌగిట బంధించమని, ఇలా ఇద్దరూ తమ తమ ఇక్కట్లను కొంతసేపు చర్చించుకొన్నారు.

అనుచుదన్నొడ బరచు, నయ్యమరకాంత
తత రము జూచి యాత్మ నతండు తనకు
సిగ్గువెగటును బొడమ, నిస్పృహతదెలుపు
నొక్క చిరునవ్వు నవ్వి యయ్యుద కనియె.

"ఓలలనామణీ! ఇలాటి పాండిత్యం నీకొక్కదానికే చెల్లింది. కామశాస్త్రో పాధ్యాయిన్నీ, వేదప్రతిపాదితమైన ధర్మములు, పాపములు, సంభోగ

సుఖములు పుణ్యకార్యములు అని చెపుతున్నావు. మేలు మేలు తారుమారు చేస్తున్నావే పద్మాలను? అనిత్యములు, అశాశ్వతం అయిన భోగాల యందు అంత మమతవుంచకుమీ" అన్నాడు ఆ సకలభాషా కవిత్వ విశారదుడు ప్రవరుడు.

అనుటయు మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నెరుపేరు తెలిగన్నుల నాతని బుల్కుపుల్కునం
గనుగొని మాటలం బొదువు గద్గది కందలయుంచి యక్కటా
వనిత తనంతదా వలచివచ్చిన జుల్కనగాదె ఏరికిన్.

ఈయన జూస్తే తన మొండిపట్టు విడువడు. ఇంత అందంతోపాటు రాతి గుండె యెందుకిచ్చాడో ఆ బ్రహ్మ అని చింతించింది. ఆయన మాటలకు గుండె ఝల్లు మంటున్నగాని కళ్ళనీరు గమ్ముతున్నా కాని తనంతట తానుగా వలచివచ్చిన కాంతకు ఇంతకన్నా ఎక్కువ విలువవుంటుంది. కనుకనా? అని అనుకుంటూ ఇలాగే మీనమేషాలు లెక్కిస్తూ కూచుంటే ఈ సదవకాశం ఈ జన్మకిక నాకు రాకపోవచ్చు సాహసించాలి తప్ప దనుకుంది.

నాలుగడుగులు ముందుకేసింది. హృదయం ఝల్లుమనగా వేణీ భరం విడి చిందరవందరకాగా, ఒళ్ళు పులకరింపగా, చీరకుచ్చెళ్ళు జార, చీరకుచ్చెళ్ళెందుకు జారాయంటే అడుగులు తొట్రుపడి, పాదాలు కుచ్చెళ్ళలో చిక్కుకుని కిందకు జారిపోయింది. కరకంకణములు ఘల్లు మనగా, పాదమంజీరాలు చిన్న శబ్దం చేస్తుండగా హారాలు చిక్కుబడ పై పాటున పడి ప్రవరాఖ్యుడిని గాఢంగా కౌగలించుకుంది.

ఆ కౌగిలి ఎలావుంది అంటే ప్రవరాఖ్యుడు ఆమెకన్న పొడగరి కనుక ఆయన పెదాలు తన పెదాలతో కలిసే ప్రయత్నంలో పాదాల మునివేళ్ళ మీద నిలబడాల్సి వచ్చింది ఆమెకి

భుజాలకాన్చి, పెదాలపై చక్కని చిక్కని మధురమైన గిలిగింతలు పెట్టి పరవశింప జేయగల్గే తన ఒళ్ళు మరపింప జేయగల్గేట్టు చుంబించింది ఆ అప్సరాంగన వరూధిని.

అయన ఆ మాధుర్యాన్ని ఆ ఆనందాన్ని గ్రోలలేకపోయాడు. ఆకర్ణాభరణాల కాంతికి కళ్ళు మిరుమిట్లుగొల్పగా, ఆ వరూధిని స్పర్శకి గుండె ఝల్లనగా ఏం చేయాలో తెలియని స్థితిలో 'హా శ్రీహరీ' అని ఎలుగెత్తి స్మరించుకున్నాడు.

నీవైనా ఇప్పటికిప్పుడు పతనమైపోతున్న నా ధర్మనిరతిని కాపాడవా? అన్నట్లు ఇప్పుడు ఈ పరీక్షనుంచి నన్నుద్ధరింప గలవాడివి నీ వొక్కడివే కదా! అని ఆ ఆర్తితోగూడిన పిలుపులో వుంది.

వెంటనే అసంకల్పిత చర్యలాగ వరూధిని భుజాలు తన రెండు చేతులతో పట్టి ఆమెను వెనక్కి తోసివేశాడు. ఆ త్రోపుకి వెనక్కి తూలి పడకుండా నిలుదొక్కుకుంది వరూధిని.

ఘనలజ్జాభారంచేత, అవమానభారంచేత శోకావేశంచేత ప్రవరుడిచే వెనక్కి నెట్టివేయబడ్డ వరూధిని పైట జారగా కొప్పు సవరించు నెపాన అవయవములన్నింటిని స్పష్టముగా ఆయన కంటబడునట్లు చేసింది ఆఖరి అస్త్రంగా.

కోపంతో చురచుర చూసించా బ్రాహ్మణునివంక ఆ వరూధిని. అమితమైన కోపంచేత పెదాలు వణికి పదాలు తడబడ్డాయి. "బలే! రశి కుడివిలే" అనుకుంది. నాయంతటి వలపురాణి వయ్యారి భామ నిన్ను కోరుకుంటే నన్ను సత్కరించే విధానం ఇదా అనుకుంది.

అయినా శాంతం తెచ్చుకుంది.

ఓ కృపారహితుడా! చూడు నా భుజములు పట్టి తోసివైచినపుడు అని జిలుగువలువ తొలగించి చూపింది. ఎలా నీ గోరు గీరుకున్నదో చూడు అని స్తనములపై కన్నీరు చిందగా నవ్యక్తమధురధ్వనితో శోకించింది వరూధిని.

స్త్రీలు నీ అంత కఠినతకు, క్రూరతకు తాళగలరా? అంది

జేసితి జన్నముల్, తపము చేసితి, నంటి దయావిహీనతన్
జేసిన పుణ్యముల్, ఫలముబెందునె పుణ్యము లెన్నియేనియున్
జేసినవాని సద్గతియె, చేకురు భూతదయార్ద్ర బుద్ధికో
భూసురవర్యయింత దలపోయవు నీ చదువేల చెప్పుమా!

ఓ బ్రాహ్మణశ్రేష్టా! యజ్ఞాలు చేశాను, తపస్సు చేశాను, ధర్మాలు చేశాను, తల్లిదండ్రులకి సేవలు చేశాను అంటావే? దయాస్వభావం లేని సత్కర్మలెందుకు? ఎన్నో పుణ్యాలుచేసి పొందే సద్గతి ఒక్క భూత దయవలన బొందవచ్చునే, ఇంతమాత్రం ఆలోచింపలేని నీ చదువెందుకు?

పైన నేను మానవజాతివాడిని, నీవు దేవతాంశ సంజాతవు మనిద్దరికి సరిపడదంటావు పదేపదే.

నీ జాతికి నా జాతికి సంబంధాలువున్నట్టు అనేక దృష్టాంతరాలు వున్నాయి చెపుతా విను అంది.

మంచిని గాని, కోపగించి కాని, బెదిరించి గాని, శోకించి గాని, తన అందంతో మోహాంకురిపించికాని, మాటలమాధుర్యంతోగాని చూపుల చాతుర్యంతో గాని ఆ సుందరాకారుణ్ణి వశపర్చుకుని ఆయనవల్ల ఆనందాబ్ధి తేలియాడ నిశ్చయించుకున్న ఆ వరూధిని తమ వలపు, తమ ప్రేమ, తమ కలయిక తప్పుకాదని, దుర్మార్గం అంతకన్నాకాదని నచ్చచెప్పేందుకే తంటాలుపడుతుంది జనపదాన ఎక్కడో అరుణాస్పద పురానవున్నప్రవరుడిని ఈ హిమవన్నగానవున్న వరూధిని యాదృచ్ఛికం

గానే అయినా ఒకరికంట ఒకర్ని పడవేయటం అంటే ఇద్దర్ని ఇక్కడకలిపిన ఆ బ్రహ్మ వుద్దేశంలో ఏదో పరమార్థం వుండి వుంటుంది. అని నీకు అనిపించటంలేదా? అదీకాక ఈ మన కలయికవల్ల గొప్పదైన ఏ సిద్ధి కల్గుతుందో మనకి తెలియకపోవచ్చునంది.

సీ॥ వెలిబెట్టిరే జాడబులు పరాశరు పట్టి
దాసకన్యాకేళి దప్పుజేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము
ననుపుకాడై వేల్పు నాగవాసముగూడి
మహిమ గోల్పడియెనే మాండకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె? సుర లహ
ల్యాజారుడైన జంభాసురారి
వారికంటెను నీ మహత్వంబు ఘనమె?
పవన పర్ణాంబు భక్షులై నవశి. యినుప
కచ్చడాల్ గట్టుకుని మునిముచ్చు లెల్ల
తామరస నేత్రలిండ్ల బందీలు గారె!

అని వివరించింది వరూధిని.

సాధారణంగా నాడు నేడు కూడా తప్పుచేసినవాళ్ళు, లేదా తప్పు చెయ్యబోయేవాళ్ళు ఏమంటారు? తాము చేసేది తప్పుకాదని ఒప్పేనని చెప్పలేరు. గాని దానిని సమర్థించుకునేందుకు శాయశక్తులా ప్రయత్నించి చూస్తారు.

తమలాగున తప్పుచేసినవాళ్ళని చూపిస్తారు. వాళ్ళు ఏఏ సమయాల్లో ఎందుకు తప్పుచేశారో వివరిస్తారు ఆ పనివల్ల వాళ్ళకి ఏయేం ఉపయోగమైందో? ఆ తరువాత జగత్కల్యాణం కోసమే వాళ్ళు అదిచేసి

ప్రపంచంలో అంటే ఆ కాలంలో గొప్ప కీర్తిప్రతిష్టలు స్థాపించారో వివరించి వారి వాచాలతచేత అవునవిపించి తీరుతారు ఎదుటి వాళ్ళచేత.

ఇప్పుడు వరూధిని కూడా ఆ పనే చేసింది.

అనాడు దాసకన్య దాశరాజు కూతురైన మత్స్యగంధిని చేపట్టిన పరాశర మహర్షిని తప్పుపట్టారా?

అలనాడు విశ్వామిత్ర మహర్షి మేనకను అనుగ్రహించలేదా? ఈలాగు మునుపటీనుంచి రివాజుగా వస్తూనేవుంది. సురలకు భూసురులకు ఒంమత్వం కలుస్తూనే వుంది. కనుక నీవు సందేహించవలసినపని లేదు. వారందరు మహనీయులుకారా? వారి మహత్వం ఏమయినా తగ్గిపోయింది కనుకనా?

నువ్వు వారికంటె ఘనుడవా ఏవిటీ? అని అడిగింది. అవునని అనలేదు ప్రవరాఖ్యుడు. కాదని అనలేదు కాని అంతకన్న అర్జంటుపని ఒకటొచ్చిపడిందిప్పుడు.

ఆ మధురక్షణంలో వరూధిని వచ్చి అధాటుగా ఆయనమీద పడినప్పుడు అంటిన సుగంధబంధురమైన ఆమె శరీరానగల జవ్వాదికస్తూరి ఆ విప్రవరునకంటినదట. అందుకై ఆ పరిమళం పోగొట్టుకొనే నిమిత్తం నీటివద్దకువెళ్ళి పూర్తిగా కడిగివైచి ఆచమించి సుచియై గార్హపత్య వహ్నిని మనసున ధ్యానించాడు.

ఓం స్వాహా వధూవల్లభా! దేవతాసమూహాన్ని తృప్తినొందించువాడా! సకలాంతరాత్మవు అయిన ఓ తేజోమూర్తీ! నీయందే భక్తి శ్రద్ధలు గలనన్ను ఈ ఆపదనుండి కాపాడవయ్యా ఓ హవ్యవాహనా!

దాన జపాగ్నిహోత్ర పరతంత్రుడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేని, బరదారధనాదుల గోరనేని, స

న్మానముతోడ నన్ను, సదనంబున నిల్పుమి, మండు పశ్చిమాం
బోనిధిలోన, గ్రుంకయమున్న రయంబున హవ్యవాహనా!

సన్మానముతో అంటే, వరూధినిచే ఏ అవమానము కలుగకుండా నిల్లు జేర్పుమన్నాడు. రయమున అంటే వరూధినివల్ల భయాతిశయముచే అలా అన్నాడు ప్రవరుడు. ఒక ఆడది ఏం చెయ్యగలదు? ఇంత సచ్ఛీలము సత్యసంధుడిని ధర్మనిరతుడిని అంటే ఇలాంటి విషయాల్లో ఆడది అబలకాదు. ఏం చెయ్యలేదు? అని అనుకుంటే బాగుంటుంది మనం. దెబ్బతిన్న తాచు ఏమైనా చెయ్యగలదు. మనకి అనేక ఉదాహరణలు ఉన్నాయి.

ఊర్వసి ప్రేమను త్రోసిపుచ్చిన పార్థుని ఆమె ఘోరంగా శపించలేదా? చాలావున్నాయి యిటువంటిఉదాహరణలు. అందుకే తొందరగా ఇల్లు చేర్చమని తాను నిరంతరం సేవించే అగ్నిదేవుణ్ణి అత్యంత భక్తి శ్రద్ధలతో వేడుకొన్నాడు.

ఆయన భక్తి శ్రద్ధలకు మెచ్చి ఆయన శరీరమందావేశించాడు అగ్ని. అమిత తేజోబలము కలిగించాడు. అంత ప్రవరుడు వరూధిని విరహాన్ని రెట్టింపు చేస్తూ వాయువేగంతో ఇల్లుచేరి, నిత్యకర్మానుష్టానములు నిర్వర్తించుకున్నాడు.

సంపంగి పువ్వును తుమ్మెద ఏమీచేయలేనట్టే. వరూధిని హృదయానురాగ రసమకరందం, నిత్యకృత్య సత్కర్మకలాపాలే జీవిత ధ్యేయం అనుకున్న ఆ విప్రపుంగవుణ్ణి ఏమీ చేయలేకపోయింది. అన్ని పూలమీదవాలి మకరందాన్ని గ్రోలే తుమ్మెద సంపెంగపూవుదరికి చేరనే చేరదట.

కమలాలు వున్నచోటుకు భ్రమరాలురావా? అంటే అది ప్రవరుని వంటి వారియందు వర్తించదుమరి.

ప్రవరుడు అచటనుంచి వెళ్ళిపోయినప్పటికి ఆయన రూపమే కళ్ళ ముందునిల్చి ఆమె మనసంత కళవళ పెట్టి క్షోభ పెట్టి, ఒకచోట నిలువనీయ కుండా చేస్తోంది దుఃఖంచేత పరితపిస్తోంది ఆయనను చూచినది కొద్ది కాలమైనా ప్రవరుడి ఎడబాటు సహించశక్యం అవటంలేదు. తన మనసు తనవశంలో లేదు ఆమెకి. వరూధినికి ఇటువంటి స్థితి భరించరానిదిగా వుంది. అంతకుముందెన్నడు ఎరుగదు. అంటే ఎవరియందు ఆమె మనసు లగ్నం కాలేదు ఇంతవరకు. కేవలం విరహమేకాదు, అవమానంపాలు కూడా. ఆమె బాధలో తక్కువ ఏంలేదు. వేల్పు చెలువని వలచిరాగా మానవుడు త్రోసిపోవటం నేను నోచిన నోము ఫలంగాక ఏమిటి అనుకుంది. చెలులు ఎంతో వూరడించారు.

అంతులేని ఈ విరహ సముద్రాన్ని ఎట్లీదగలను అనుకుంది. తక్కువ నోములునోచిన నేనెక్కడ? వాని కౌగిలిఎక్కడ? అనుకుంది. ఎంతైనా వాని శరీరం పరిమళంగల మేలిమి బంగారమే అనుకుంది. ముఖమా చంద్రబింబం. భుజశిరస్సులు పర్వతాగ్రాలు. వాని కనులు కలువపూరేకులే ఎలా మరువను? అనుకుంది. అటువంటి పురుషుడు అక్కున చేర్చుకుని గారవించిన జన్మయే నారీ జన్మ. లేనివాడు ఆ నారీమణి చక్కదనం, యౌవనం, ప్రాణం కూడ నిష్ప్రయోజనాలు అనుకుంది వరూధిని.

చిన్నారి వయసుది. ఇతరుల నెవ్వారిని ప్రేమింపనిది తన్నువలచి నది యగు వరూధినిని ప్రేమింపక మన్మథావస్థలపాలు చేసిన ప్రవరుడు క్రూరుడు. ఆమెను త్రోసిపోయాడనే కోపానా మొగం ఎర్రపర్చుకుని పశ్చిమానికి వెడుతున్నాడని పెద్దన్నగారు చమత్కరించాడు సూర్యుణ్ణి.

అస్తమించు సూర్యునకు ఎర్రని ఆకృతి అతిసహజమే అయి నప్పటికీ ప్రవరుడికి వరూధినికి కూడా లేని కోపాన్ని సూర్యునికి అంట గట్టాడాయన.

వరూధినికి విరహమే తప్ప కోపం లేనేలేదు ప్రవరుడిపై. సూర్యాస్తమయం అయాక చంద్రోదయంకాకుండా వుంటుందా? చంద్రకాంతికి చంద్రకాంత శిలలు కరుగుతున్నాయి. చకోరాలు సుఖిస్తున్నాయి. చక్రవాకములు తామరతీగతో ముడుచుకున్నాయి.

చంద్రుణ్ణి తిట్టింది. వెన్నెలను తిట్టింది. మన్మథుణ్ణి నిందించింది. మలయ మారుతాన్ని ద్వేషించింది. అందర్ని దూరినా వరూధిని విరహతాపం హెచ్చి మూర్ఛిల్లింది.

చెలులు శైత్యోపచారాలు చేస్తున్నారు. దశవిధములైన విరహబాధలు అనుభవిస్తోంది వరూధిని. ఆఖరిది మరణం లేదా మరణసమానం.

ఇందునిభాస్య వాడనగ, ఇంద్రుడో చంద్రుడోయా యుపేం
ద్రుడో, ఇందులకై వగన్ బొగులనేటికి నేటికి నందుబో
దమా, నందనభూమి భూమి సురనందనుడుండక పోడురమ్మ
నీచందము అందమున్ గనిన జవ్వని ఎవ్వని వెర్రి చేయదే.

అని చెలులు పిలువగా వారివెంట బయలుదేరింది పూవాటికకి వరూధిని. ఆ శృంగారపు తోటలో ఆమె చెలికత్తెలతో చతురసంభాషణ జరుపదుమునుపటిలాగ. స్మృతి లేనిదానిలాగున వారివెంట వెడుతూన్నది కాని ఆవిడ మనసంతా ఆరాటం, ఆవేదన, ఆకాంక్ష, ఆర్తి, తపన.

వరూధిని ప్రవరుల నడుమ జరిగిన ప్రణయ సన్నివేశమంతా పూర్తిగా చూపినవాడు ఒక గంధర్వుడు మాత్రమే. ఆ గంధర్వుడు ఆ సమస్తము అలా చూస్తున్నట్లు ఇతరులెవరికీ తెలియదు.

ఆ గంధర్వుడు వరూధిని సౌందర్య బంధితుడు. వరూధిని హృదయం దోచుకోలేని నిర్భాగ్యుడు. ఆమె ప్రేమకు నోచుకోని అభాగ్యుడు. ఒకానొక సమయంలో ఆవిడచేత తిరస్కరించబడినప్రాణి.

ఆమెయొక్క ప్రేమరాహిత్యాన్ని నిందించుకుంటూ విరక్తుడై నిస్సారము నిస్తేజము అయిపోయి తిరుగుతున్న సమయంలో వరూధిని ప్రవరునితో ప్రణయ సన్నివేశం, ఆయన తిరస్కారం చూశాడా గంధర్వుడు.

హృదయపు అట్టడుగు పొరల్లోంచి గుప్తంగా దాచిన ప్రేమభావం ఘుప్పున పైకి తన్నుకొచ్చింది ఆ గంధర్వుడికి తనని ప్రతిక్షణం వూహల వూయలలు ఊగించి ఊగించి, ఊరించి ఊరించి తన గుండెల్లో గులాబులు పూయించిపూయించి మధురస్వప్నాల్లో ముంచితేల్చిన వరూధిని సోయగం తన గుప్పిటచిక్కినట్టు ఇక మెరుపులాంటి ఆలోచనవచ్చింది ఆ గంధర్వుడికి. ఆ ప్రవరాఖ్యుడినే, నేనైపోతేనేం? అనుకున్నాడు ప్రణయవీణ మీటుతూ వలపుజ్యోతివెలిగిస్తూ తన ప్రియతమ వరూధినికి తన ప్రత్యేకతా, పరిపూర్ణతా చూపించి గుండెలో పొదుపుకోవచ్చు అనుకున్నాడు. ఆమె ప్రేమ సామ్రాజ్యాన్ని నిరాఘాటంగా ఏలుకోవచ్చు అనుకున్నాడు.

అనుకోవటమే తడవుగా ఆమెకన్నముందు వచ్చి ఒకమంచి గంధపుచెట్టు నీడన నిల్చున్నాడు. నీర్కావి ధోవతిగట్టి తెల్లని (జందెం) యజ్ఞోపవీతము కాశీముద్ర తోడి ముద్దుటుంగరము ధరించి, మొగంబు శాంతరసమును గనపరచునట్టి బ్రాహ్మణ తేజస్సు వెలయగా గంధర్వుడు ప్రవరుని రూపం పొందాడు. ఆ వరూధినియు పొన్నల పొగడల నీడన మెల్లమెల్లగా తిరుగాడుతూ విరబూసిన ఆశలతో రమయలోకానికి రాణిలా అణువణువున ప్రణయ మధువు నింపుకు సువాసనలూ, మధురిమలూ నింపుకుని నడచివస్తోంది.

వస్తూనే తలయెత్తి చూసేసరికి తన ఎట్టఎదుట పొదలోంచి తన ప్రియుడు తన జీవనసర్వస్వం అనుకున్న ప్రవరుడు దేవతార్చనకు పూలుకోసుకోవటం కనిపించింది. ఆపుకోలేని ఆనందపు వెల్లువలో కొట్టుకు పోతోంది వరూధిని.

చెక్కిళ్ళపై వ్యాపించు కాంతులుగల రత్నాల కర్ణాభరణాలు సరిగకమ్ముల వుత్తరీయం, రత్నాలు చెక్కిన మొలతాడు, సుందరి తట్టు కుచ్చెళ్ళు, వ్రేలకట్టిన ధోవతి, తెల్లని యజ్ఞోపవీతం బ్రహ్మ తేజస్సు మొగాన ఉట్టిపడేటట్లున్న మాయాప్రవరుణ్ణి చూసింది వరూధిని.

అప్పటికప్పుడు ఆమె మొగాన అనురాగవీచికలు, దరహాస చంద్రికలు వెల్లివిరిశాయి. అరుణాధరాలపై రాగరక్తిమ పొడచూపింది. వేయిదీపాలు వెలిగాయి కళ్ళలో. కోటిరాగాలు పలికాయి గొంతులో. ఆశల్లబతుకు క్షణమే అయినా, అనుభవం మన్వంతరం. ఆ క్షణంలో ఆమెకి పులపులవరదలు ఏరులై పారుతుంటే అనురాగ స్రవంతులుప్పొంగాయి. అదృష్టం, అవకాశం కలిసివచ్చినందుకు పొంగిపోతూ రాగ తరంగాలపై తేలివచ్చే జ్యోత్స్నాభిసారికలా, భీతహరిణేక్షణలా, నవ వధువులా, కొత్త వెన్నెల్లు సింపుకుని తడబడు నడకలతో నడచివస్తోంది.

ఆ కమలాక్షి యింపున, దృగంచల మించుక మూసి హర్షబా
ష్పాకుల కోణరుచుల్ గ్రమునన్ జనజూచు చూపుతే
రైకను పట్టి దమ్మరసమంటు కౌనసన్, వెడలింటివాడు క్రో
ధైకధురీణతన్, గరచి యేసిన సింగిణి కోలయోయనన్.

వరూధిని మనసంతా గందరగోళం అయిపోయింది. ఓ వైపున తన ఆరాధనా మూర్తి, ఆ ప్రేమమూర్తిని మళ్ళీ దర్శించగలనని అనుకోలేదు పాపం. ఆ ప్రియ దర్శనానందం ఒక ప్రక్క తొందరిస్తోంది ముందుకు అడుగేయమని.

ఇదివరలో ఆ మనోహరాకారుడివల్ల పొందిన గాఢమైన తిరస్కృతి ఒకవైపున భయపెట్టి అడుగుముందుకు పడనీయక వెనక్కి లాగుతోంది. మళ్ళీ ఆ చేదు అనుభవమే పొందదుకదాతను అనే పిరికితనం ఒకవైపుకి లాగుతోంది.

ఆ మానినీ మన్మథుడు సుమధుర స్వరాన తనపేరును చేరపిలచి చెక్కిలి నొక్కి అక్కునచేర్చుకుంటే తన జన్మ చరితార్థం కాదా?

లేక మునుపటివలె ధర్మపన్నాలూ శాస్త్రార్థాలు ఏకరువుపెట్టి నెట్టివెయ్యడు కదా? అనుకుంటోంది.

తొలుదొల్త వాని కన్నులగాంచినప్పుడు
పల్లవాధర గుండె ఝల్లుమందిట.

ఆవల రెండుమూడు అడుగులు చనునప్పటికి అడుగులు తడబడ్డాయి. చేరబోయేప్పటికి అధైర్యం ఆక్రమించింది. నన్నింతమోసపుచ్చి బాధించె గదా అనుకునేప్పటికి డగ్గుత్తికపడింది. పైకొంగు పట్టుకోగానే చిరు చెమటలు గ్రమ్మాయి. మాటాడుదామనేప్పటికి కన్నుల నీరుగ్రమ్మింది. అయినా తప్పదు కనుక!

"ఓ భూసురాగ్రణీ! మాపై నీకింత అలుకెందుకు? గడచిన రాత్రంతా కంటిపై కునుకులేదు. మనసంతా నీపైనే యింక ఈ జన్మ చాలురా యన్నంత విరక్తి పాలై చింతించాను. దయలేక నన్ను గౌర వింపని నిన్ను ప్రేమింపమని బలవంతపెట్టి పోరాడుట ఎందుకు? నీవు నీ సదాచారాన్ని చెడగొట్టుకొనక చిరకాలం జీవించు.

ఇంతకీ నా దురదృష్టవశాన నీకిలాటి కఠినబుద్ధి కలిగింది నిన్నే మని లాభం? అంది.

ఆ ప్రవరుని రూపం ధరించిన గంధర్వుడు అచ్చు ప్రవరునివలె వీణాధ్వనివంటి ధ్వనితోజట చెప్పుచు కరుగబోసిన బంగారంవంటి మేనితో దేవతార్చనకు పుష్పములు గోయుట ఆపి.

మధుర మంజీరనాదంతో నడచివచ్చే వరూధినిని చూశాడు. ఆవిడ మృదుమధుర వచనంతో అమృతోపమానములైన ప్రణయపూరితమైన మాటలూవిన్నాడు.

నిజంగా ప్రవరుడు మాదిరి ఉండేందుకై తన లోపలనుంచి తన్నుకువచ్చే మోహరసాన్ని సంతోషతరంగాల్ని పక్కకినెట్టి నర్మ వచనాల్ని నాలుక దాటనీక, తలవంచి సన్ననిగొంతుతో మెల్లగా అన్నాడు.

తల్లిందండ్రియు, నన్నుగానని, మనస్తాపంబునన్, బొక్కగా
నిల్లాలార్తి గృశింపగా, సవనవహ్నిశ్రేణి చల్లారగా నిల్లున్
శూన్యతనొంది, సొంపుచెడగా. నిచ్చోటనేజిక్కియో
పుల్లాంబోరుహనేత్ర యేసుఖమతిన్, భోగించెదన్, చెప్పవే

నీ కౌగిలిలోని సుఖము దేవేంద్రునకైనా దక్కునా? అటువంటి సౌఖ్యాన్ని వదులుకోటానికి నేను సన్యాసినా? వెర్రివాడినా? నీవుకూడా తెలివైన దానివి, నా మనసున తల్లిదండ్రులేమైరో, కులసతి ఏమైనదో అనే చింత అత్యధికంగా కుంగతీస్తుంటే నీతో ప్రణయం నెరపటానికి నా మనసెలా ఒప్పుతుంది చెప్పు. నీవింతగా దైన్యపడి అడుగుతున్నావు గనుక నీ ప్రేమను అంగీకరిస్తున్నాను. శరీరము విడచియైన ఇతరులకు మేలుచేయాలి కనుక నీకోసం నా నియమాన్ని విడచివేస్తున్నాను. కాని మాది ఒక నియమము వరూధినీ! ఆత్రపడక విను. సంభోగసమయాన కన్నులు మూసుకోవాలి. లేనిచో పాపం చేకూరుతుంది. కనుక భామా! ఈ మర్యాదకు నీవు ఒప్పుకోవాలి అన్నాడు. సంభోగ సమయమందు ప్రాణావసాన సమయమందు నిజరూపురాకమానదు కదా మాయారూపం దరించిన వారికి. అందుకొరకై గంధర్వుడు అలా అన్నాడు.

ప్రవరాఖ్యుడి రూపానవున్న గంధర్వుడి మాటలు నిజమే అని నమ్మి ఆనందంగా అంగీకరించింది వరూధిని.

ఇంక నొక్కటి వినుము పూర్ణేందువదన
వ్రతము చెడ సౌఖ్యమైనను వలయుగలుక

వాంఛితము దీర ననునీవు వదలజెల్ల
దేను నిను సమ్మతిలజేసి యేగుదనుక!

అన్నాడు ప్రవరాఖ్యుడు. దానికిని ఆ లేమ అంగీకరించింది. మునుపటి కఠిన భావం విడచినందుకు నా నోములు పండాయి. సుఖసముద్రమున మునిగాను. నా ప్రాయం కృతార్థమైంది అని అపరిమితానందంతో ఆ చకోరాక్షి కుహనాభూసురుని ప్రవరుణ్ణి చేరింది.

అకట నిర్దయబుద్ధివని దూరె గడురంభ
యాహా వివేకికా దనియె హరిణి
చేదుమింగెదవంచు జిలికి నవ్వె ఘృతాచి
మాయలాడని తిట్టె మంజుఘోష

న్యాయ నిష్ఠురముల ప్రార్థించె నూర్వశి
జంకించె రమ్మంచు జంద్రలేఖ
చెలినేచి తని దినంతులు గొట్టె మేనక
విడువు మాయలటంచు నాడివె హేమ

గొంటవనియెన్ తిలోత్తమ గూర్మిగొసరె
ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతి విరుగువారి
గువ్వ కోల్గొంచు తమలోన నవ్వకొంచు!

ఇలా హాస్యోక్తులాడి, చెలులంతా తమలోతాము నవ్వుకుంటూ వెళ్ళారు. వారి సరసాలాపాలను, ప్రసంగాలనువింటూ సంతోష హృదయంతో చెంతనున్న వుద్యానవనం ప్రవేశించాడు. వరూధినీ వదనాన్ని దరహాస చంద్రికలూ, అనురాగవీచికలూ పోటీపడి అలరించాయి. ఆ మణిమయ కాంతులీను రమ్యహర్మ్యములం చేరి, ఆ మాయాప్రవరాఖ్యుడు వరూధిని గూడి రాత్రి, పగలు తేడా తెలియకుండా ఆనందసాగరంలో మునిగి తేలుతున్నాడు.

మునుపు వరూధినివల్ల తిరస్కరింపబడిన మాటపూర్తి
ప్రేమసాగరమున మునిగి తేలుతున్నాడా గంధర్వుడు.

ఇలా కొంతకాలం సర్వం మరచి సుఖిస్తున్న వరూధి
చిహ్నము లంకురించగా నిజం బైటపడునేమో ననుభయంత
వరూధినియందుగల కోరిక పూర్తిగా సిద్ధించింది. కనక ఇంత
చోటు విడచిపోవాలనుకుంటున్నాడు ప్రవరవేషధారి. మోసం
సురకాంతకి శాపశక్తి కలదు కనుక ఏం శపిస్తుందో కనుక చెప
ఏం ప్రాణత్యాగం చేస్తుందో? యుక్తియుక్తమైన మాటలతో
నొప్పించి వెళ్ళాలనుకున్నాడు. ప్రాణప్రియా! మునుపునాకు ప
మిచ్చిన సిద్ధుడు కనిపించాడు, నిన్న విహారానికి వెళ్ళినపుడు
మీదుగా వచ్చాడట మా ఇంటికి పరిస్థితులన్నీ చెప్పాడు ఏమని
నేనింటవుండి అన్ని వ్యవహారములు పరిష్కరించుకునేవాణ్ణి.
తంత్రులు నన్ను విడిచిన బెంగతో దుఃఖించి దుఃఖించి క్రుశిం
రట, అడుగుకూడ కదల్చశక్తి లేనివారై వున్నారట. నువ్వు
ధర్మాధర్మాలు ఎరిగినదానవు, వాళ్ళు జీవించాలి అంటే నేవెళ
కళ్ళబడాలి కదా? నీవు నాకై విచారించకు. నీ వియోగం నేను
లేను. ఎవ్వడు కామకార్యముల మునిగి తన కర్తవ్యం నిర్వ
వానికి అట్టి వివేకశూన్యుడగునో అట్టి మానవపశువు కులమును
మును, కీర్తిని, ధనమును, సర్వమును జెరచుకుని నల్గురిలో
పాలై, నిందలపాలై నరకముగాంచును కదా? అన్నాడు.

ఆ మాటలను వరూధిని భరించలేక మూర్ఛిల్లి నేలవాలి
ఆ ప్రవరరూపధారి వరూధిని దుఃఖంచూసి లేవనెత్తి అక్కున
నిన్ను విడువను నెచ్చెలీ! నమ్ము నామాట. ఆ సిద్ధుడిని ప్రార్థిం
యొద్ద పాదలేపనముతో గోరినచోటుకి బోయే ఆ విద్య పూర్తిగా
కుని వస్తూ పోతూవుంటానని, నమ్మబల్కి ఎన్నో ఇచ్చకష
చెప్పి ఆ గంధర్వ శ్రేష్ఠుడు తనచోటుకిపోయాడు.

వరూధిని మాయాప్రవరునకిచ్చిన మాటచొప్పుననే కాకుండా సహజంగా రతిపారవశ్యంచేతకూడా కళ్ళుమూసుకునే సంభోగించి వ్రతభంగం కాకుండా గడిపింది కనుక ఆ సుకుమారి వరూధినిని అమితంగా ప్రేమించిన ఆ గంధర్వశ్రేష్ఠుడి గుట్టు బయటపడలేదు. దిన దిన ప్రవర్ధమానంగా గొప్ప తేజోమయంగా బెంబొందుతోంది ఆమె గర్భం. నవమాసాలు పూర్తియైన పిమ్మట ఒక పుణ్యదినాన.

తేజంబజ్ఞ భవాండ దేహమునకున్ దీపాంకురచ్ఛాయయై
రాజిల్లన్, గ్రహపంచకంబు, రవి జేరంబోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుగాంచె సుమనోరాజన్య మాన్యున్
జనుల్ జేజేపెట్ట బ్రసూనవర్షమమర శ్రేణుల్ ప్రవర్షింపగన్

శుభగ్రహములతో గూడిన లగ్నమున, దేదీప్యమానుడును, దేవేంద్రునిచే గొనియాడదగినవాడును, మహోత్తర కాంతి సంపన్నుడు అయిన కుమారుని వరూధిని కన్నది. సురలు కుసుమవర్షం కురిపించారు. సూర్యచంద్రులతో సమానమైన కాంతి గలవాడు కనుక అక్కడవున్న ఋషులు 'స్వరోచి' అని పేరు పెట్టారు.

వరూధిని కుమారుడు స్వరోచి దినదిన ప్రవర్ధమానుడై ఉపనయనము గావింపబడి, వివిధాయుధంబులు నేర్చాడు. యుద్ధభూములందు శక్తిగలవాడై, వేదములు వాని యర్థములు తెలిసినవాడై, అన్నిటి యందు నేర్పుగలవాడై సౌందర్య, విలాస, రేఖలలో అత్యధిక బల సంపన్నుడు పరాక్రమశాలి అయాడు స్వరోచి.

స్వరోచి విశ్వకర్మ నిర్మించిన మందరాద్రి చెంత నగరమున సామ్రాజ్యమనుభవిస్తున్నాడు.

ఆ నగరం అతిసుందరమైనది. ఆ పరిసరాలు వైభవోపేతమైనవి హృద్యంగమమైనవి.

ఒకనాడు స్వరోచి ఆ కొండనెక్కి చంద్రకాంతశిలావేదికపై మిత్రులతో కొలువుండి వినోదిస్తుండగా.

అచ్చట శబరు డొకడు తమరేడైన స్వరోచిని, దర్శించేందుకు మంచికస్తూరి, పుట్టతేనె, జీరపప్పు, ప్రశస్తమైన ధనుర్బాణము కానుకగా తెచ్చి నమస్కరించాడు.

ఓ రాజా! ఆ కనబడుతున్న కైలాస పర్వతప్రాంతాన ఘాతుక మృగములు అమితంగా వున్నాయి. అక్కడివారు ఎన్నో బాధలకు లోనవుతున్నారు. మీరు వేటాడి అక్కడి జనుల భయంపోగొట్టేలాగున క్రూరమృగాల గూల్చమని విన్నవించాడు. స్వరోచియు మృగయా వినోదార్థంవేటకు బయలుదేర సమకట్టాడు.

అనిమిషకాంతా కుమారుడివి కనుక, నువ్వు అమానుష శక్తి సంపన్నుడివి అనికూడా ఆ శబరుడన్నాడు. కనుక స్వరోచికి వేటయందా సక్తి ఇనుమడించి వెంటనే బయలుదేరాడు.

ఆటవికుడు దుప్పులు, పందులగూర్చి చెప్పుచు అడవి జంతువు గూర్చిచెప్పుచు స్వరోచిని చాలాదూరము తీసికొనిపోయాడు. వేటయందు గల మక్కువచేత ఎన్నోమృగాలని గూర్చి చాలదూరం పయనించారు. హటాత్తుగా ముందుగా ఏదో రణగొణ ధ్వని, ఆ తరువాత ఒక కోమలి కంఠంతో ఆర్తనాదం వినబడింది.

ఇంతలో దక్షణబుజం అదిరింది స్వరోచికి. "అకటా! ఆడుదానను అబలను, అనాధను, నన్ను రక్షించి పుణ్యం కట్టాకోండి" అనే కేకవిని, స్వరోచి

ధనుర్బాణధారియై అశ్వారూఢుడై నాల్గుదెసల పరికించాడు. ఆడుదాన్ని, అబలని కాపాడటమే సుకృతం. అందాపన్నను, దీనురాలిని

దిక్కులేనిదాన్ని కాపాడటం మరీ సుకృతం. ఈ సుకృతం తనకి లభించింది.

'పాపమెవ్వతయో ఏమిప్రమాదం సంభవించిందో'? అనుకున్నాడు స్వరోచి.

జుట్టువీడి జీరాడుచుండగ, చీరకొంగు జారిపోతుండగ, స్వేదమే నెల్లగ్రమ్ముకొనగా, వడివడిగ అడుగులు వేస్తూ, కన్నీరుధారలు కట్టే రమణివచ్చి ఎదుట నిలిచింది చేతులుజోడించి భయంచేత ఒణికిపోతోంది. చక్కని స్త్రీ స్వరోచితో ఇలా అంది.

ఓ భూపాలరత్నమా! రత్నస్థగితమగు పెద్ద కత్తిని చేతపట్టావు. ధనుర్ధారివి, మేరువువంటి వాడవు, తేజశ్శాలివి, నన్ను రక్షింపుమని కోరింది.

స్వరోచి ఆ కాంత పై దయకల్గి

'నీవు భయపడకు' మని యూరడించి, నీవెవ్వరవు? సంగతేమని అడిగాడు. ఆమె ఇలా చెప్పింది.

రాజేంద్రా! ఒక్క రాక్షసుడు కొవ్వుపొరలు ప్రేవులు, తలకు చుట్టుకుని మసివంటి అసహ్యదేహంతో ఎడమచేత్తో నెత్తుటి పుర్రె మూపులపై త్రిశూలం పెట్టుకుని నిడుదకోరలు, మిడిగ్రుడ్లుకల్గి నన్ను జంపుటకు మూడు నాళ్ళనుంచి వెన్నాడి వస్తున్నాడు.

'రాజేంద్రా! దిక్కులేని దాన్ని, దీనురాల్ని, ఆపదలోవున్న నా మొరవిని నన్నాదుకో, బలంలేనివారికి రాజేబలం. రాజులకు దీనసంరక్షణ యజ్ఞనిర్వహణవంటిది కదా! అంది.

నా తండ్రి ఇందీవరాక్షుడు అను గంధర్వుడు, నా తల్లి మరు

నా చెలులు కళావతి విభావసి నాతోకలిసి హిమవన్నగాన విహరిస్తున్నాం. ఆ చెలులు నా ప్రాణసములు. ఆ వెండికొండపై ముగ్గురం పువ్వులు కోస్తూంటే గడ్డిచే కప్పబడిన ఓ బిల ద్వారం చూశాం. ఆ బిలద్వారాన ఒక ఋషి.

రక్తమాంసాలు హరించిపోయి, నరములన్నీ బయటకు వచ్చి దూదిపింజెలాంటి తెల్లని వెంట్రుకలచే వళ్లంతా నిండి బూచివలె కన్పడిన ఆ ఋషిని చూచి బాల్యచాపల్యంవల్ల నవ్వి ఈ ఋషికి కళ్లు, ముక్కు, నోరు వున్నాయా? అని పట్టుకున్నాం.

ధ్యాన నిష్టలోవున్న ఆ ఋషికి నా చేతివేళ్లు గట్టిగా తగులుటవల్ల ధ్యాన భంగమైంది.

'ఓ దురాత్మురాలా! సమస్తము విడచి తపస్సు చేసుకుంటున్న మమ్ము బాధించిన నీకేం మేలు కల్గింది? నీవు యౌవన గర్వంచేత నన్ను పరిహసించావు. ముసలితనాన అలసియల్లాడుతున్న నన్నుచూసి, పరిహసించి ధ్యానభంగం చేశావుకనుక నీవు రాక్షసునిచేతబడి హింసించబడుదువుగాక' యని శపించాడు.

జననాధ! ఏం చెప్పను? ఆ ముసలి ఋషి నాగబెత్తముచేత పశువుని బాదినట్లు కరుణలేక హింసించినాడు.

ఇంత హింసపడి, దానికన్న ముందు శాపం నొంది విచారిస్తున్న నన్ను చూసి నా చెలులు ఋషితో అన్నారు.

ఓ నిర్దయుడా! కారణంలేనిదే ఈ బిడ్డను కొట్టాటానికి నీ చేతులెలావచ్చాయి? నీవు తపస్సుచేయటం ఇతరులని శాపం ఇయ్యటానికేనా? ఇదివింటే శాంతిపరులైన మునీంద్రులేమంటారో తెలుసా? ముసలితనాన కూడా కోపం విడువకయుండు వాడు మునియా?

'ఇతరులు తన కపకృతినల్పిన కోపింపక, తన్నుబొగడు చుండిన ముదమందక వుండువాడే మునీంద్రుడు. తక్కినవారు కారు.

నువ్వు బ్రాహ్మణుడవగుటచే విడిచిపెట్టాము. మరియొక జాతి వాడైన జంపివేయమా?" అని వారించి విడిచిన ఆ కన్యలపై కోపించి ఆ ముసలి ముని యా యిద్దరిని క్షయరోగులు కమ్మని శపించాడు.

వెంటనే నా సఖులిద్దరూ రోగగ్రస్తులయారు.

మూడు దినములనుండి ఒక రాక్షసుడు నన్ను మింగుటకు తరుముతున్నాడు.

ఓ నరనాథ! అస్త్రహృదయం అనేవిద్యను నీకిస్తాను. విద్యను ఎవరివద్ద నుంచయినా గైకొనవచ్చు. ఆ అస్త్రహృదయం పినాకిపాణివల్ల గ్రహించాను. సకల శత్రునాశనం చేయును.

అని మనోరమ చెప్పగా స్వరోచి సుచియైవచ్చి ఆమె వద్దనుంచి అస్త్ర హృదయం అనే విద్య గ్రహించాడు. ప్రయోగించుట ఉపసంహరించుట తెలుసుకున్నవాడై కొండగుహలన్నీ మారుమ్రోగునట్లు బొబ్బలిడుతు ఆకాశమంతా కారుకమ్మినట్లయివికృత శరీరంతో అగ్నిజ్వాలల బోలునాలుకతో వచ్చు దానవుని దలపడ్డాడు.

ఆ దానవుడు ప్రయోగించిన గదాఘాతాన్ని తప్పించుకుని, త్రిశూలాన్ని తప్పించుకున్నాడు స్వరోచి.

త్రిశూలమంటే సామాన్యమైనదా? వజ్రాయుధాన్ని మించింది. స్వరోచికిని, పారిపోయే ఆటవికులకు ఎన్నో ధైర్యవచనాలు చెప్పి మళ్ళీ పురికొల్పింది యుద్ధానికి మనోరమ.

స్వరోచి స్వతహాగా ధైర్యం కలవాడు కనుక, తనతో తన గుర్రంపైన వున్న మనోరమను తీసుకువెళ్ళి పొదలమాటున నిలబెట్టి

వచ్చి రెట్టించిన పట్టుదలతో రోషంతో ఆగ్నేయాస్త్రం వేశాడు. దాని మంటలు చుట్టబెట్టి, రాక్షసునిదేహం కాలిపోజొచ్చింది. దేవతలు ఆశ్చర్యపోయేట్టు.

రాక్షసుడు ఆగ్నేయబాణంచే నశించి బంగారుఛాయగల మేనుతో తెల్లతామర బోలినకళ్ళతో చిరునవ్వుతో గంధర్వాకారందాల్చి, చక్కని స్త్రీలు వింజామరలువీవ, విమానారూఢుడై కిరీటమణులను, కంఠహారములను, మణులకాంతిచే ప్రకాశింప, ఆకాశమార్గాన కనబడుతున్నాడా క్షణాన. స్వరోచి ఆగ్నేయాస్త్రం ప్రయోగింపగా నాతడు పూర్వరూపం దొలగివెంటనే గంధర్వరూపం గొనినటుల దేవతలు తెలుసుకొని పుష్పవర్షము కురిపించారు.

అప్పుడు రాక్షసత్వము వీడి నిజరూపం ధరించిన గంధర్వరాజు విమానమునుండి భూమిపైకి దిగి, తన్నువీక్షించి అద్భుతముగా అశ్వము దిగిన స్వరోచిని ఆనందంగా కౌగిలించుకుని అన్నాడు.

"నీ పరిపాలనలో జనులందరూ సుఖులేకదా? నేను నీ దర్శనము చేసి కృతార్థుడనయాను. నేను పరాయివాడినిగాను. నీ జననితోబుట్టినవాణ్ణి, ఇందీవరాక్షుడను. ఇది నా కుమార్తె. నీవు నాకు అల్లుడవు. శాపవశాన ఇట్లయాను. నేటితో నా శాపం తీరింది. అనునంతలో మనోరమ వచ్చి తండ్రికి నమస్కరించి, కన్నుల నీరిడుతు నిల్చుంది. కూతురిని అక్కునజేర్చుకుని వూరడించి ప్రేమతో ఆమె శిరస్సు అఘ్రాణించాడు.

స్వరోచి ఇందీవరాక్షునిగని విస్మయమంది ఆ శాపం ఎందుకు వచ్చిందో విన్పించమన్నాడు.

ఆయుర్వేదం అనే మహావిద్య నాకు చెప్పటానికి ఇచ్చగించని ఓ మహర్షివద్ద మాయోపాయంవల్ల ఆ విద్యను గ్రహించి ఆ తరువాత ఆ మహర్షినే హేళన చేశాను. "నీవు చెప్పకపోయినా నీ శిష్యులతోచేరి నేను ఆయుర్వేదం అభ్యసించాను చూడు" అని.

అప్పుడా ఋషికోపించి భయంకరాకారం గల రాక్షసుడవయి మనుష్యమాంసం భుజిస్తూ బ్రతుకమని శాపం ఇచ్చాడు.

ఆ క్షణమే పశ్చాత్తాపంతో ఆ మునివరుని చెంతకుచేరి భక్తితో నమస్కరించి "ఓ ఆయుర్వేద విద్యానిధీ! బుద్ధిహీనతచే నేనొర్చిన అపరాధం మన్నించి నాకు శాపవిముక్తి ప్రసాదించు మునీంద్రా! అని పాదాలపై వాలగా,

నన్ను లేవతీసి నీ తప్పు నీవు తెలుసుకున్నావు కనుక మిగుల స్వల్పకాలంలోనే నీ కుమార్తెను నీవు మ్రింగబోగా ఒక మహాపురుషుడు తన బాణాగ్నిజ్వాలలచే నిన్ను దహిస్తాడు. నీ యసురదేహం దహించుకుపోగా, దివ్యరూపం ధరించి శాపంనుండి విడివడగలవని చెప్పాడు.

అప్పటినుండి పట్టణానగల జనులందర్ని తిన్నాను. స్వల్పకాలం లోనే దేశం సర్వం పాడుపడింది.

ఇట్టి మహోపకారం చేసిన నీకు ప్రత్యుపకారం ఏమీ చేయలేను. కాపున ఓ మహారాజా! నా తనయను నీకిచ్చి పెళ్ళిచేస్తాను. నేను నేర్చిన వైద్యవిద్య అంతా నా తనయతోగూడ నీకిస్తానని చెప్పాడు.

మందరగిరి పర్వతమునవున్న తన సౌధానికి తోడ్కొనిపోయి ఎంతో వైభవోపేతంగా తన బిడ్డ మనోరమని స్వరోచికి ఇచ్చి పెండ్లి చేశాడు ఇందీవరాక్షుడు.

అనేక విధాలయిన కానుకలు దేవతలవల్ల పొందాడు స్వరోచి. ఎక్కడ ఆగమంటే అక్కడ ఆగే అలంకారయుతమైన గొప్ప మహిమ గల విమానమును కూడ అల్లునకు కాన్క ఇచ్చాడు ఇందీవరాక్షుడు. పెళ్ళికి వచ్చిన సిద్ధులకు, చారణులకు, యక్షులకు ఇంకా అందరికి బహు విధాలైన బహుమతులిచ్చాడు ఇందీవరాక్షుడు.

మనోరమకు చెలులు బహువిధాలంకరణలుచేసి సుగంధ ద్రవ్య

ములు పూసి నవరత్నహారాలు ధరింపజేసి, యందెలు ఘల్లుఘల్లనగా మెల్లగా స్వరోచి కడకు దీసుకువచ్చారు.

చెలికత్తెలు కొంతసేపు వేళాకోళంచేసి నవ్వులచేత కొంతపొద్దు జరిపి పనియుందనే నెపంతో నొక్కొక్కరే బయటికి వెళ్ళారు. స్వరోచి హృదయం ఉవ్వెళ్లూరుతోంది.

మనోరమ దరికిచేరి కొంత చతురత సంభాషణ జరిపి ముత్యాల హారములు సరిచేయు నెపాన దరికొచ్చి వక్షము వక్షాన చేర్చాడు.

అప్పుడు మనోరమ మృదువుగా అంది- "నాథా! నాయందు మిక్కిలి ప్రేమకల్గిన నా సఖులు రోగ పీడితలై అడవుల్లో తిరుగు తున్నారు. నీవు ముందు వారిరోగం పోగొట్టు. అప్పుడు నాకు సంతోషం, సౌఖ్యం చేకూరుతాయి అంది.

పరితాప మింక నేటికి
హరిణాక్షి, మదీయ, సంచితాయుర్వేద
స్ఫురణమున, బరిహరించెద
నరుదనగ, భవత్సఖీ, జనామయ, భరమున్.

అని పల్కి స్వరోచి తన భార్య అయిన మనోరమను తీసుకుని వెళ్లాడు, అరణ్యంలోవున్న సఖుల రోగనివారణ కోసం.

మనోరమ చెలికత్తెలా దివ్యౌషధాన్ని సేవించి దాని మహత్యం చేత పరిపూర్ణ ఆరోగ్యవంతులయి, మెరపులా ప్రకాశించే కాంతివంతము లైన శరీరాలతో, పూర్ణచంద్రునివంటి కాంతిగల ముఖాలతో, గర్వోన్న తితో, స్వరోచిని స్తోత్రం చేశారు. ఒక చిన్నది అన్నది "ఓ రాజా! నీవు మాకు మహోపకారం చేశావు, నేను మందారుడను, విద్యాధరుని తనూ జను నాపేరు భావసి. భూమిపైనగల మృగములయొక్కయు, పక్షుల

యొక్కయు, భాష నాకు తెలుసు ఆ విద్య నావలన గ్రహించి నన్ను పరిణయమాడు" అని చెప్పగా. రెండవ చిన్నది ఇలా అంది.

కందమూలాలు తింటూ కఠిన తపస్సుచేసే పారుడను మహర్షి సత్తముడు నా తండ్రి. దేవేంద్రుని పనుపున తపోవిఘ్నం చేయవచ్చిన పుంజికస్థలకు జన్మించాను. చంద్రకిరణాల్లోంచి వచ్చిన అమృతమేతాగి బ్రతికిన నన్ను నాతండ్రి జాలితో ఆశ్రమానికి తీసుకెళ్ళి కళావతి అని పేరిడి నన్ను పెంచాడు. నాకు యవ్వనోదయమైంది. నా సౌందర్యంచూసి గంధర్వులు వచ్చి నన్నియ్యమని నా తండ్రి నడిగారు.

ముదిమివల్ల వచ్చిన కోపంతో మహర్షి ఆ గంధర్వుని తూల నాడితే, ఆ కోపంతో గంధర్వుడు నా తండ్రి కుత్తుకకోశాడు. నాతల్లి నా చిన్నతనానే విడిచిపోయింది. ఇక నా తండ్రియే నాకేలోటు లేకుండా పెంచిపెద్దచేసి, ఇప్పుడు నన్ను విడిచిపోయాడు. ఇక నాకెందుకీ బ్రతుకని ప్రాణత్యాగం చెయ్యబోతుంటే ఆకాశమార్గాన పార్వతీదేవి నా ప్రయత్నాన్ని విరమింపజేసే ప్రయత్నంలో క్రిందకు దిగివచ్చి,

సుందరీమణీ, ఇంతసౌందర్యం బొందటం అరుదు. విచారంతో వివేకంలేకుండా ప్రాణత్యాగానికి సమకడతావా? ఇది చాలా దుస్సాహసం.

నీకు మహారాజగు స్వరోచి భర్త కాగలడు. సకలసౌఖ్యములు పొందగలవు. నామాట తప్పదుసుమా, అనిచెప్పి నీవుకోరిన సౌఖ్యములు చేకూర్చునట్టి 'పద్మిని' అనే విద్య నుపదేశించి వెళ్ళింది అని చెప్పింది.

ఆ కళావతి మాటలువిని ఆమె సౌందర్యాని కబ్బురపడి ఒక శుభ ముహూర్తాన శుచియై, ఆమె విద్యలగ్రైకొని, కళావతిని, విభావసిని శాస్త్రోక్త విధిని పరిణయమాడి స్వరోచి ధన్యుడయాడు.

గగనాన దేవదుందుభులు మ్రోగాయి అప్సరసలు శుభాక్షతలు

ముగ్గురు భార్యలను వెంటబెట్టుకొని 'పద్మిని' విద్యాప్రభావమున [illegible] పొందుచును పక్షిరాజముల [illegible] ఏమీ లోటులేకుండా [illegible] పర్వతాల్లో, [illegible], [illegible] ఫలితమైన తోటల్లో [illegible] వివిధ స్థలములందు సంచరిస్తూ క్రీడించాడు.

స్వారోచి [illegible] 'పద్మిని' విద్యాప్రభావంవల్ల [illegible] భార్యలందరు సమస్తంగా [illegible] ఒకనాడు వేటయందు కోరికకల్గగా ధనుర్బాణాలు తీసుకొని [illegible] మై [illegible] అధిరోహించి వెళ్లాడు. [illegible] ఓ సూకరాన్ని [illegible] చూసి బాణంవిడుస్తుండగా మానవ భాషలో ఒక ఆడులేడి స్వారోచిని చూసి ఇలా అంది.

"రాజా! ఈ సూకరం నీకేం అపకారం చేసింది. ఇప్పుడు దాని కొరకు సంధించిన బాణాన్ని నాపైవిడిచి నన్ను చంపి దానిని విడువుము" మంది.

"సౌఖ్యవంతురాలవగు నిన్నెందుకు వధించాలి? వివరంగా చెప్పు" అన్నాడు స్వారోచి.

"రాజోత్తమా! కోరుకున్న పురుషుని పొందలేని నేను మరణించి నను మేలేకదా" అంది ఆ ఆడులేడి.

"నా చిత్తము నీయందే లగ్నమైయున్నది" అనికూడా అంది. దానికి ఆశ్చర్యముతో

"నీవు మృగాంగనవు. నేను గంధర్వుడను. నీకు నాకు కలయిక ఎట్లు? అని అడిగాడు స్వారోచి.

"రాజా! నువ్వు నన్ను ప్రేమాలింగన సౌఖ్యమిచ్చి ఆదేవాలు"

ఉంది. స్వరోచి దయగలవాడు కనుక ఆ యాడులేడిని కౌగలించు కున్నాడు.

లతలవంటి శరీరంతో లేడికన్నులవంటి కళ్ళతో పుష్ప గుచ్ఛాల వంటి వక్షోజాలతో శంపాలతవలె నారాజుకౌగిట ఒక మానవాంగనలా కన్పింపజూచి స్వరోచి నివ్వెరబోయాడు.

అప్పుడా మానవాంగననుచూచి నీవెవరవు చెప్పుమన్నాడు రాజు. అప్పుడాచిన్నది చక్కని పెదాలు విడువడ చిన్నగా నవ్వుతూ.

"నేను ఈ వనదేవతను, నీవలన నొక 'మనువు'ంగన వలెనని దేవతలుకోరగా నీ దరికివచ్చాను. నన్ను గలసి పుత్రునిగాంచు అతనివల్ల నీకు పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి అని అ చిన్నది చెప్పగా ఆ వనదేవతను స్వరోచి పరిగ్రహించి సౌఖ్యమున దేలుచుండగా ఆమె గర్భం దాల్చింది. ఒక మంచిదినమందు

గాంచెన్ పుత్రు, విశాలనేత్రు, బృధువక్షః పీఠి విభ్రాజితున్
బంచాస్యోద్భట, శౌర్యధుర్య, ఘన శుంభద్బాహు తేజో నిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను, సామ్రాజ్యైక హేతుప్రభూ
తాంచలక్షణలక్షితున్, సుగుణరత్నానీక రత్నాకరున్.

సింహపరాక్రమం కలవాడు, మన్మథుణ్ణి మించినవాడు అయిన కుమారు డుదయించాడు స్వరోచికి.

అప్పుడు ఆ సంతోష సమయాన అప్సరసలు ఆడారు. కిన్న రాంగనలు పాడారు. గంధర్వులు పొగిడారు. దేవ దుందుభులు మ్రోగాయి. ఆ కుమారుడు స్వారోచిషునామాన అంతరింద్రియ నిగ్రహం కలవాడై ప్రేమయందూ, సత్యంయందూ, నిచ్ఛగలవాడై, విషయేచ్ఛ లేనివాడై బహుకాలం తపస్సు చేశాడు.

స్వారోచిషుని తపస్సుకి మెచ్చి

నీలమేఘవర్ణుడు, పద్మాక్షుడు, బంగారు చేలము గట్టినవాడు, కౌస్తుభాలంకారుడు, బ్రహ్మ, రుద్రేంద్ర, యమ, వరుణ, కుబేరాది దేవ బృంద సేవితుడైన ఆదినారాయణుడు స్వారోచిషునకు ప్రసన్నుడయాడు.

ఆ విధంగా ప్రసన్నుడైన హరికి సాగిలపడి సాష్టాంగ దండ ప్రణామంచేసి పులకించిన శరీరంతో ఆనంద బాష్పములతో నిట్లని స్తుతించాడు.

జయ జయ దానవదారణ, కారణ, శార్ఙ్గ, రథాంగ, గదాసిధరా
జయ జయ చంద్ర దినేంద్ర శతాయుతసాంద్ర, శరీర మహఃప్రసారా
జయ జయ తామర, సోదర, సోదర, చారుపదోజ్ఝిత గాంగ ఝ రా
జయ జయ కేశవ కేశినిషూదన, శౌరిహర దురితాపహరా!

ఓ నారాయణమూర్తీ! పరబ్రహ్మవగు నీకు నమస్కరించెదను. అమితమగు భూతదయగలవాడవు! నాల్గు పురుషార్ధములను నెలకొల్పు వాడవు అగు నిన్ను స్తోత్రం చేసెద. సర్వశ్రేష్ఠుడవై, కాలస్వరూపుడవు సర్వనియామకుడవు, సర్వజీవులసృష్టి, స్థితి, లయ, కారకుడవు. కావున సంసారబద్ధుడనై నేమియు ఎరుంగనివాడై, శరణువేడిన నన్ను రక్షింపు మని, ఇంకా దశావతారములను తన్మయతతో కీర్తించాడు. స్వామీ! నిన్ను సేవించుటే నా ధ్యేయంగా, నీ దయకు పాత్రుడుగా అను గ్రహించు. నాకింతకన్న వేరు కోరికలేదు అని ప్రార్థించగా స్వారోచిషు నితో హరి అన్నాడు.

నీవు రెండవ మనువువై, నీతిని ధర్మాన్ని వృద్ధిచేసి చక్కగ భూమిని పాలించు, తరువాత నా సాయుజ్యానికి జేరగలవన్నాడు. ఇట్లని స్వారోచిషుని మనుపదమునకు పట్టాభిషిక్తుం గావించి, సమస్త దేవతలతో హరి అంతర్ధానము కాగా, స్వారోచిషుడు మనుత్వమునూని శాస్త్రపద్ధతిని అనుసరించి, దుష్టులను శిక్షించుచు, శిష్టులను రక్షించుచు

ఆ కాలంలో

వానలు సరళితో వర్షించె సస్యముల్
వేళ్లగొల్చుగ విర్రవీగి పండె
నారోగ్యపుత్ర పౌత్రైశ్వర్యవంతులై
బ్రతికిరి నూరేళ్లు బంచజనులు

పూపుబోడులు పతిదేవత వైరగ్ని
భయ తస్కరవ్యాధి భయము లడగె
ఫలపయః కుసుమాది బహుపదార్థంబులు
రసగంధసామాగ్రి నెనక మెసగె

సీత్యుపద్రవమృత్యు రాహిత్యయుక్తి
ధరప్రజావృద్ధి తామరతంపరయ్యె
న్యాయపథమున స్వారోచిషాఖ్యమనువు
శ్రీలవెంపొంది పాలించుకాలమునను.

ఏ విధమైన ఈతిబాధలు లేకుండా, దేశాన్ని సుభిక్షంగా ప్రజల్ని సుఖ సంతోషాన్వితులుగా, మానవులయందు దయగలవాడై ధర్మబద్ధంగా చిరకాలం మేదినీ వలయాన్ని పరిపాలించాడు స్వారోచిషుడు.

కోరిక నీ స్వారోచిషు
చారిత్రము వినిన వ్రాయ చదివిన ధనధా
న్యారోగ్య పుత్రవంతులు
నై రూఢిగ గంద్రడు పిదప నమరత్వంబున్.

శ్రీనాథ మహాకవి రాసిన శృంగార నైషధం జగత్ప్రసిద్ధం.

శ్రీహర్షుడు సంస్కృతభాషలో రచించిన ఈ గ్రంధరాజాన్ని శ్రీనాధుడు ఆంధ్రీకరించాడు.

ఈ శృంగార నైషధం రాణీసంయుక్త పృధ్వీరాజుల చరిత్ర మనసునందుంచుకుని దీన్ని శ్రీహర్షుడు రచించాడంటారు. శ్రీహర్షుని తండ్రి శ్రీహీర పండితుడు.

శ్రీహర్షుడు రచించిన ఈ కావ్యానికి వున్న ప్రసిద్ధి అప్రతిమాన మైనది. కవితాభావ వర్ణనా ప్రౌఢియందు దానికదే సాటి.

శ్రీనాధుడి జన్మస్థలం అనేకమంది అనేకరకాలుగా చెప్పినందువల్ల ఇది అని నిర్ధారణ కాలేదు.

ఆయన తాత కాల్పట్టణాధీశుడన్నారు. కాని ఆ కాల్పట్టణమేదో అంతుబట్టలేదు.

"చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాడు రచియించితి మరుత్త రాట్చరిత్ర" అని పేర్కొన్నాడాయన. ఆయన ఎన్నో గ్రంధాలు రచించాడు. వాటిలో హరవిలాసం, శివరాత్రి మహత్యం, నందనందన చరితం, ధనుంజయవిజయం ముఖ్యమైనవి. క్రీడాభిరామం కూడా శ్రీనాధుడు రచించాడు.

పాండితీప్రకర్షయే కాకుండా కవితాకౌశలంలోకూడా శ్రీనాధుడు రచించిన గ్రంధాల్లోకల్లా శృంగారనైషధం తలమానిక మనిపించుకుంది. ఆయనకుకూడా అభిమానపాత్రమైనదీ గ్రంధం.

"సంతరించితి నిండుయవ్వనమునందు, హర్షనైషధకావ్యమాంధ్ర భాష" అని ఆయన రాసుకున్నాడు కాబట్టి. ఆయన నిండు యవ్వనాన ఈ కావ్యం రాశాడు కనుకనే అంతటి ప్రౌఢిమను సంతరించుకుంది.

మనము మెచ్చుకోవల్సినది నలునిదూతగా ఒక రాజహంస వచ్చి దమయంతితో ఆయన గుణగణాలని వర్ణించి చెప్పి ఆమె మనసు అటు వైపు మళ్ళించటం.

అలాగే దమయంతి అందచందాలు నలునకు తెల్పి విరహవశుణ్ణి చేసివేయటం. మానవభాషలో ఎంతనైపుణ్యంగా మాట్లాడివుండాలి. ఆ వీరశిరోమణినీ, ఆ సౌందర్యరాసినీ ఎన్ని అవరోధాలు వచ్చినప్పటికి కూడా ఒకటిగా జేసింది. ఇది అపూర్వమైన విషయం.

నిషధ దేశాన్ని నలమహారాజు పరిపాలించాడంటే ఆ రాజ్యోన్న తిని వర్ణించడం ఎవరి తరం?

అలకా నగరాన్ని బోలిన నిషధలో ధర్మం నాలుగు పాదాల వర్ధిల్లేవి. ఆయన కొలువే సుధర్మ.

అంబరాన్ని చుంబించే దివ్యసౌధాలూ ఆ నగరంలోని బ్రాహ్మ ణోత్తములు వేదవేదాంగ పారంగతులు, క్షత్రియులంతా ధైర్యధుర్యులు, వైశ్యులంతా భాగ్యవంతులు. ఇక రాజు సమస్త శాస్త్రపారంగతుడు సుగుణ ఖని. శత్రుంజయుడు, దుర్జనులను శిక్షించటం సజ్జనులను రక్షించటం ఆయనకు ఉచ్ఛ్వాస, నిశ్వాసల్లాంటి సహజమైన చర్యలు.

ఆయన కీర్తి అన్ని లోకాలా వ్యాపించింది.

ఆయన నగరంలో రమ్యమైన వుద్యానవనాలూ, వాటియందుగల రజితకాంతులు, సువర్ణశోభలు, మాణిక్యదీప్తులు, పచ్చికబయళ్ళు, సుగంధభరిత సుమాలూ, చక్కని సరోవరాలూ, పొదరిళ్లూ, కుటీరాలూ, క్రీడాగృహాలూ, వినోదమందిరాలూనూ, కాంచనకాంతులీనే పక్షులుకొన్ని

రజితఖచితాలు కొన్ని స్వర్ణ నిర్మితాలు కొన్ని, సరోవరాలు పద్మసంభరితాలు, పద్మాలు కేసరపూర్ణాలు, పూలు పరాగభరితాలు కల్గి ఇంద్రుని నందనవనాన్ని, కుబేరుని చైత్రరథాన్ని తలదన్నేలా వుంది. ఆ మత్తగజాలూ, ఉత్తమాశ్వాలూ, దివ్యరథాలు చూస్తుంటే ఓహో! అదే లోకమో నిర్ణయించుకోవటం బహుకష్టమట. ఆ నగరంలో నిరంతరం వేదవిదులు చేసే హోమంవల్ల గగనం అంతా నీలివర్ణం దాల్చింది.

అక్కడివారు ఆడినమాట తప్పరు. అనృతమంటే ఎరుగరు. యోధులంతా యుద్ధంలో వెనుదీసి ఎరుగరు. పరస్త్రీని కన్నెత్తిచూడరు.

కొండల్లాటి ఏనుగులు, గాలిలో పరిగెత్తే అశ్వాలు, సింహాల్లా శత్రువులమీదకురికి చెండాడే యోధులు.

ఇక ఆ రాజ్యానికి ఆపదలెలావస్తాయి? అపజయం ఎలా కల్గుతుంది? అందుకే నిషధ, ప్రపంచఖ్యాతీ, విశ్వవిఖ్యాతీ గాంచింది. ఆ నలమహారాజు ప్రేమ అతిపవిత్రమైనదీ పటిష్టమైనదీనూ. అడుగడుగునా ఆటంకాలే. పైగా దేవతలతోనా? అవి అన్నీకూడా నలమహారాజు అవలీలగా దాటి దమయంతిని చేపట్టాడు.

మానవకాంత అయిన దమయంతి సౌందర్య గరిమ ఎంత మహత్తరమైనదీ కాకపోతే దేవతల నాకర్షించగలిగింది. దేవతలతో పోటీ పడటం సామాన్యమైనదికాదు కదా?

పైగా కలి కల్మషనాశనం అంటూ పేరు పడ్డదీచరితం. భారతంలో అరణ్యపర్వమందుగల ఈ కథలో షట్చక్రవర్తుల్లో ఒకడైన నలమహారాజు, కుండిన పురాధీసుడైన భీమరాజు కూతురియందు బద్ధానురాగుడై వున్నాడు. ఎందువల్లనంటే.

నలమహారాజు ఒకప్పుడు తన వుద్యానవనాన విహరిస్తూ ఆ తటాకాన క్రౌంచనపక్షియగు ఒక రాజహంసను పట్టుకున్నాడు. అది ఎంతో విషాదంగా తన తల్లిని భార్యని తలచుకుని విధినిగూర్చి ఇలా అంది. ఆ హంస ఇలా నిద్రిస్తున్నట్టు వుందిట.

అధావలంఖ్య, క్షణమేక పాదుకాం
తరా నిదద్రా పుషపల్వలం ఖగః
సతిర్యగావర్జిత కంధరః శిరః
పిధాయ పక్షేణ రతిక్లమాససః.

ఇలా వున్న హంసని నలుడు పట్టుకున్నాక తనవాళ్ళని తల్చుకొని ఎలా వగచిందంటే మూలమందు హర్షుడు రాసినది.

మదేకపుత్రా, జననీ జరాతురా
నవప్రసూతి ర్వరదా తపస్వినీ
గతిస్తయో రేష జనస్త మర్దయ
న్నహోవిదే త్వాం కరుణా రుణద్ధినో.

నా తల్లికి నేను ఏకపుత్రుడను. నా భార్య కొత్తగా ప్రసవించి దయనీయస్థితి నున్నది. నా ముసలి తల్లీ, నా భార్యా, నన్నేదిక్కని నమ్ముకున్నవారు ఓ విధీ! నన్ను బంధితునిగా జేశావు దయమాలి.

ఈ శ్లోకాలని శ్రీనాధుడు చక్కగా ఆంధ్రీకరించాడు. పాకము నందును ప్రౌఢతయందును అన్నివిధాలా మూలంతో తులతూగేలాగు రాశాడు. శబ్దాన్ననుసరించి అభిప్రాయాన్ని గురించి భావంబుపలక్షించి రసం పోషించి, అలంకారాన్ని భూషించి, ఔచిత్యాన్ని ఆదరించి ...ిత్యాన్ని పరిహరించి మాతృకానుసారంగా హృదయంగమంగా సాగించినట్లుగా తనే చెప్పుకున్నాడు శ్రీనాధుడు.

శ్రీనాధుడు రాజభోగాలనుభవించిన అదృష్టశాలి. గండపెండే రాలూ, కనకాభిషేకాలు పొందిన ధీశాలి.

పోతనకు సమకాలీకు డీయన. అయితే పోతన కవిత, భక్తి పరిపూర్ణమై చక్కని సమాసాలతో చల్లని ఉపమానాలతో అలంకారాలతో శోభాయమానమై వెల్లివిరిసింది.

శ్రీనాధుని కవిత శృంగార భూయిష్టమై, రశికజన మనోభిరామమై విలసిల్లింది. వీరిద్దరూ రెండు పర్వతాలవంటివారు. ఎవరి ప్రత్యేకత వారిది. ఎవరి శైలివారిది. ఒకరిది ఉత్తర ధృవం. మరొకరిది దక్షిణ ధృవం. శ్రీనాధుని చూస్తే మనకు భయం, గౌరవం కల్గుతే, పోతనని చూస్తే భక్తి, ఆత్మీయత కల్గుతాయి. పోతన యోగి, విరాగి, మహాభక్తుడు. గోమాతను, భూమాతను నమ్ముకున్న పూజ్యుడు. శ్రీనాధుడు అతివైభవోపేతంగా మహారాజు మర్యాద లనుభవించిన రాజమాన్య రాజపూజితుడు....నిజానికిది చిత్రమైనచరిత్ర. కష్టాలుపడ్డవాళ్లూ వున్నారు ఎందరో. కాని నలమహారాజు చరిత్రవుందే అడుగడుగునా అగ్నిపరీక్ష ఎదురవుతూంటుంది. వాటి నన్నింటినికూడా అపరిమితమైన శాంతంతోనూ ప్రశాంత చిత్తంతోనూ, వివేకంతోనూ ఎదుర్కొని కృతార్థుడైనాడు?

నిషధాధీశుడైన నలుడు ధర్మం తప్పనివాడు. అతిసౌందర్యవంతుడు. పరాక్రమశాలి. అనేకవిద్యలు ఆయన సొమ్ము. ఆశ్రితజనానికి లేదనడు, కరుణాసముద్రుడు. ఇతరుల కష్టాలు భరించలేనివాడు. ఆ హంస ఆర్తిని వినకుండా ఎలావుంటాడు.

బంగారు తామరతూడులా కన్పించే ఆ రాజహంస వరుణుని వింజామరలాగ కన్పించి పట్టుకున్నాడు నేర్పుగా.

అంతేకాని దాని ఆర్తివిని విడిచిపెట్టేయాలనుకున్నాడు. తనను ఈ రాజు చంపడుకదా అనుకుంది హంస.

నా తల్లి మూడుకాళ్ళ ముసలి. ఆమెకు నేనొక్కడనే కొడుకుని తామరతూడులా ఆకులు అలములుతినే మేం నీకేంఅపకారం చేశామయ్యా రాజా! నాభార్య సాధ్వీమణి. నాపిల్లలు పసిగందులు. వాళ్ళంతా నాపైనే ఆధారపడివున్నారు. కనుక ఓ చంద్రవంశోత్తమా! దయవుంచి నన్ను విడిచిపెట్టి నావారందర్నీ రక్షించు అంటూ మృదుమధురమైన మానవ భాషలో మొరపెట్టి కన్నుల నీరుగార శిరసువంచి నమస్కరించింది.

ఆ పక్షి మనసు నిష్కారణంగా బాధపెట్టినందుకు నలమహారాజు కడునొచ్చుకుని, ఖేదపడ్డాడు. వెంటనేదాన్ని విడిచిపెట్టాడు. ఆ హంస ఆనందానికి అంతులేదు.

రెక్కలు టపటపలాడిస్తూ స్వేచ్ఛా విహారియై సరస్సులోకి దూకి శరీరాన్నంతా దులుపుకుని విచ్చలవిడిగా ఈదులాడి ఆనందంతో నిష దేశ్వరుని చేతిపైవాలి కృతజ్ఞతా పూర్వకంగా ఇలా అంది. "మహారాజా! దయాహృదయంతో నన్ను విడిచిపెట్టినందుకు కృతజ్ఞుణ్ణి. నన్ను చంప కుండా విడిచిపెట్టి నా కుటుంబానికే వుపకారం చేసిన మీకు నేను ఒక వుపకారం చేయదలచాను. ఈ పక్షి నాకు చేయగల ఉపకారమేమిటని అనుకోకండి".

సరిగా నా మనసులో అనుకున్న మాట ఎలా తెల్సుకుందీ హంస అనుకున్నాడు రాజు.

మీకు తెలిసే వుంటుంది. విదర్భదేశాన్ని మహేంద్ర తేజస్సుతో ఏలుతున్నాడు భీమరాజు. అతనికొక ముద్దుల కూతురుంది. ఆ ఇంతి పేరు దమయంతి. ఆమె సుగుణాలను వర్ణించ బ్రహ్మతరం గాదు. ప్రణయలోకాన్ని ఒక్క తృటిలో జయించగల కన్నులు కల్గిన అతిలోక సౌందర్యవతి. యౌవన ప్రాభవంతో విలసిల్లే ఆమె చక్కదనం వర్ణించా లంటే ఆదిశేషునికే వశంకాదంటే నేనెంత. ఆమె అందంచూసి స్త్రీలే మతులు పోగొట్టుకుంటున్నారంటే నమ్మ.

రాదు. ఆమె అందంచూసి దేవకాంతలు సిగ్గుపడుతున్నారు.

ప్రభూ! ఆ దమయంతి నీకు తగినభార్య. అటువంటి సౌందర్యం పొందని నీ సౌందర్య గరిమ, సుగంధంలేని కుసుమం లాగ కోయిలలేని మామిడి తోటతోనూ సమానం.

ఆమెను ఎలాగైనా నీకు పాణిగ్రహణం చేయాలని నా కోర్కె. నన్ను దీవించి పంపండి అంది.

ఆ మాటలు నలమహారాజు చెవులకి మలయమారుత వీచికల్లా శోకాయి. కోయిలారవమాధుర్యంతో [illegible]యాడుతున్నట్టయింది.

ఓ పక్షిరాజా! నీ మనసెంత మాధుర్యమైనదో, నీ మాటలుకూడా అంతే మధువును చిందిస్తున్నాయి. నీ వంటివారు మానవుల్లో కూడా ముమ్మాటికీ లేరులేరు. పరోపకార పరాయణత్వం ఎంతమందికోవుండదు. నిజంగా నీ మాటలకు నా తనువు పులకించింది. నేను ధన్యుణ్ణి. ఆ నవ మోహినితో నన్ను కలిపి నన్ను తరింపజేయి. నీ మేలు ఈ జన్మలో మరువను. నేను నువ్వు తిరిగి వచ్చేవరకు ఈ చంద్రకాంత శిలావేదిక పైన ఇక్కడే వుంటాను సుమా! త్వరగా కార్యసాకల్యం చేసుకునిరా" అని ఆ రాయంచ మేను నిమిరాడు నలుడు.

*　　　　*　　　　*

నలుడు విడిచిపెట్టగానే బంగారురెక్కలు రెపరెపలాడించి రివ్వున పైకెగిరింది కలహంస.

అదిగో దమయంతి భవనం. తెల్లని ప్రాకారాల నడుమ సుందరమైన నందనవనంలాటి ఉద్యానవనంలో మధ్యగా ఓ చక్కని ఎత్తైన తిన్నె ఆ తిన్నెపై చక్కని శిల్పం. ఆ శిల్పంపైన వాలింది కలహంస.

మృదుమధుర మంజీరనాదాలతో చెలులంతా పరిగెత్తి వచ్చారు ఆ శిల్పం దగ్గరికి. అందరికన్న ముందుగా చూసింది అఖండ సౌందర్య వైభవోపేత దమయంతి.

బంగారు లేడికోసం పరుగుచూపిన సీతాదేవిలా దమయంతి ఆ బంగారు రెక్కలుగల రాయంచను చూసి చెలులతో "చూడండి! ఆ పక్షి ఎంత అందంగా వుందో పట్టుకుందాం పదండి" అంది. ఇదివరకంతా కదలకుండా కూర్చున్న హంస దమయంతి తన దరికిరాగానే చివ్వున ఎగిరిపోయింది. దాన్ని వెంబడిస్తూ చాలాదూరం వెళ్ళింది రాజకుమారి. అందుకునేందుకు చెయ్యిచాపిన ఆమెకు చిక్కకుండా మరికొంతదూరం పోయింది హంస.

ఆమె మొహం శ్వేదంతో ముత్యాల్లా శోభిస్తోంది. ఆయాసంవల్ల మాట స్పష్టంగా రావటంలేదు. మెడలోని హారాలు చిక్కులుబడ్డాయి. శిగవిడిపూలు రాలిపోతున్నాయి దోవపొడుగున, బొట్టు కరిగిజారింది శ్వేదంవల్ల. అడుగులు తడబడుతున్నాయి శ్రమవల్ల ఇక పరుగెత్తలేక అక్కడేవున్న ఒక మాధవీలతామండపాన చతికిలబడింది దమయంతి.

అప్పుడు హంస పకపక నవ్వింది.

పక్షేమిటి మనిషిలా నవ్వటమేమిటని విస్తుపోయి చూస్తోంది ఆమె.

"ఆ మహాపురుషుడికి తప్ప మేము మరి ఎవ్వరికీ లొంగం సుమీ"

"ఎవ్వరా మహాపురుషుడు ఆయన గొప్పతనమేమిటో కాస్త చెప్పు" అంది.

"ఆ....ఆమాట అడుగుతావని నాకు తెల్సు. ఆతృతజెందుతున్నావనీ, నాకుతెలుసు. ఆయనని కన్నులారాచూసి మత్తెక్కి మరులుగొన్న దేశకాంతలున్నారు. ఆయన నవమోహనాకారుడే కాదు అమితపరాక్రమశాలి. ఆయన క్షాత్ర తేజస్సుకి లొంగని రాజులేడు. అతని ధర్మగుణం

మించినవాడు లేడు. అర్జులకు లేదనడు. దయాగుణంలో అతనికి సరి ఎవరూ లేరు. కులరూప వయోగుణాల్లో నీకు దీటైనవాడు. రంభ ఆయన మీది వ్యామోహంతో మతిపోగొట్టుకొని ఆయన పొందు ఇక ఎలాగా లభించదని నిస్పృహతో ఆయన నామంలో సగమైన వున్నది కనుక నలకూబరుని గ్రహించి తృప్తిపడింది.

నలుని కీర్తి అమరవాహినియై ఇలాతలంపై, పాతాళంపై, స్వర్గంపై ప్రవహించి పునీతమైంది. పదునాల్గు కళలయందు ఆయన ప్రవీణుడు. అతడే నలుడు. ఆరిదవానలుడు. స్వచ్ఛజలపూర్ణ కలశంలాటి పవిత్ర మూర్తి."

ఆ పక్షిమాటలకు దమయంతి వేడి నిట్టూర్పులు విడుస్తూ.

ఓ హంస రాజమా! అగ్నికి వాయువుతోడైనట్లు ఇదివరకే నిషధేశునిపై మనసు పారేసుకున్న నాకు నీ మాటలవల్ల మదనతాపం నన్నింకా దహించేస్తోంది.

నువ్వు సాధారణమైన పక్షివికావు. నా కోర్కె సిద్ధించుటకు సాక్షాత్కరించిన దేవదూతవు. నా హితైషివి. నీవు తల్చుకుంటే ఏమైనా చెయ్యగలవు. నాకు ఆ మధురమూర్తి దర్శనభాగ్యం కలుగజెయ్యి" అని ప్రతిమాలుకుంది.

ఇంకా ఆమె మనసు వూపి చూడాలనుకుంది హంస.

"నేను నీ పరిస్థితి అంతా నలునికి నివేదిస్తాను ఆయన నిక్కడికి పంపుతానే అనుకో, దమయంతీ! నీవా తలిదండులచాటు బిడ్డవి. తెగించి కన్నతలిదండ్రులతోనే నీ మనసులో మాటను చెప్పలేవేమో? అప్పుడు ఆయన రాక వృధా కదా. నా పరువేం కాను ఆ మహీపతి ముందు?" అంది.

"ఆయనను తప్ప ఇంకెవరినీ పతిగా వరించను. ఇదుగో ఇప్పుడే

ఇక్కడే నీముందు చెపుతున్నాను. నలునితో వివాహానికి నాకు ఏవిధమైన ఆటంకాలూ కలుగవనే అనుకుంటున్నాను. అలా జరిగితే నిషధేశుని తల్చుకుంటూ నా ప్రాణాలు త్యజిస్తాను. మళ్ళీ జన్మెత్తి ఆయనను పతిగా పొందుతాను. ఇక నీవు తొందరగా వెళ్ళి నా పరిస్థితి అంతా నలుడికి తెలియజెప్పు" అంది దమయంతి.

దమయంతి దగ్గర శలవు తీసుకుని గగనమార్గాన చివ్వున ఎగురుతు వెళ్ళిపోయింది హంస. పైపైకి అలా ఎగిరిపోతున్న హంస చిన్నచుక్కలా కనిపిస్తూ అదృశ్యమైంది.

అప్పుడు మెడకిందకి దించింది దమయంతి. బిలబిల్లాడుతూ చెలులంతా వచ్చి చేరారు. వాళ్ళకి తెలియదు. ఇక్కడ జరిగిన పెళ్ళినిశ్చయాల సంగతి,

పాపం ప్రియుడిని గురించిన విరహంతో ఏంతోచక అలా ఆకాశంలోకి చూపు నిల్పిందనుకున్నారు. అనునయవాక్యాలతో ఆమెను మెల్లిగా అంతఃపురం చేర్చారు వాళ్ళు.

* * *

కలహంస ఇక్కడ జరిగిన విశేషాలన్నీ ఒక్కటికూడా వదలకుండా నిషధేశుడికి విన్నవించింది.

"హంస రాజమా! నీ ఋణం ఎలా తీర్చుకోనూ?" అన్నాడు.

"ఆ సమయం రాకపోదులే మహారాజా" అంటూ ఆ నలమహారాజు వద్ద సెలవు తీసుకుని తన నివాసానికి వెళ్ళిపోయింది హంస.

"మానవులు ఈ లోకంలో ఎంతో కృతఘ్నతగా వుంటూ వుంటే పక్షివైన నీకు ఎంతటి వుపకారబుద్ధి?" అనుకున్నాడు నలుడు

సంస్కృత నైషధం నారికేళ పాకాన రచింపబడిన ప్రౌఢ

కావ్యం. దాన్ని అర్థంచేసుకుని ఆనందించటానికి కొంత ప్రయత్నం, పాండిత్యం కూడా కావాలి.

కృతిపతి తన్ను నైషధం ఆంధ్రీకరింపు మన్నప్పుడు శ్రీనాధుడు

పనివడి నారికేళ ఫలపాకమునం జనియైెన భట్ట హ
ర్షుని కవితా నిగుంభములు, సోమరిపోతులు, కొందరయ్య లౌ
నని కొనియాడ నేర రదియట్టిద లేజవరాలు చెక్కుగీ
టిన రసవల్చు బాలకుడు డెందమునన్ గలగంగ నేర్చునే.

యని ఈ పద్యంలో విషయం వ్యక్తం చేశాడు. మూలానికి దగ్గరగా రాశాడు శ్రీనాధుడు. మూడు నాలుగు శ్లోకార్థాన్ని సీసముగా రాశాడు. శ్రీనాధుడు అనువదింపక విడచిన శ్లోకాలున్నాయి. అవి ఎందుకు విడిచి పెట్టాడంటే క్లిష్టమైన శ్లేషలు అని విడిచిపెట్టాడా? 'అనవసరం' అనుకుని విడిచాడా? 'అనౌచిత్యం' అనుకుని విడిచిపెట్టాడో మనకు తెలియదు కాని కధాగమనానికి అవరోధం ఎంతమాత్రం కాలేదు.

తన ప్రియపుత్రిక నానాటికి విరహవేదనతో కృశించి పోవటం భీమరాజు సహించలేకపోతున్నాడు. కుమార్తెకు సాధ్యమైనంత తొందరలో వివాహంచేయ నిశ్చయించాడు. నేల నాలుగు చెరగుల చాటింపు వేయించాడు. ఏరాజధానిలో విన్నప్పటికి దమయంతీస్వయంవర విశేషమే చెప్పుకుంటున్నారు ప్రజలు.

కలహాలు ఎక్కడ వుంటే నారద మహర్షి అక్కడ కదా? ఈ దండోరా కలహబుద్ధికి కారణం అందించి నట్టయింది.

నాకలోకం కన్నుల పండువుగా వుంది. వేయి కన్నులరేడు దేవేంద్రుడు మహదానందంతో వజ్రసింహాసనంపై అధిష్ఠించివున్నాడు. రంభ, మేనక, వూర్వసి, తిలోత్తమ నాట్యానికి ఆయత్తమౌతున్నారు

ముత్యాలు గూర్చిన చీరచెంగులు సవరించుకుంటున్నారు. నిలువుటద్దాల్లో తుదిమెరుగులు దిద్దుకుంటున్నారు.

మేనక వంగి మంజీరాలు సరిజూసుకుంటుంది. సభాసదులంతా ఎంతో ఉత్సుకతో ఎదురుచూస్తున్నారు నాట్యానికి.

ఇంతలో మహతీనాదం దానివెంటనే నారాయణ నామస్మరణకూడా అందరికీ చెవులబడింది.

ఆ సభలోని వారందరులేచి నిలబడి మహర్షికి అభివాదం చేశారు. ఆయన కనుసన్నలంది అందరూ ఆశీనులయారు. దేవేంద్రుడు అననే అన్నాడు. "ఊరకరారు మహాత్ములు శలవీయండి" అని.

"భూలోకంలో ఇంత హడావిడి జరుగుతుంటే నిజంగా నీకు తెలియనే తెలియదా ఇంద్రా? లేక నా నోట వినాలనా?" అన్నాడు.

"నిజంగా నాకు తెలియదు మహర్షీ!" అన్నాడు అమరేంద్రుడు.

విదర్భరాజపుత్రి అయిన దమయంతి అందాలరాసి. ఆమె మనసులో నలుడు తిష్టవేసుకు కూర్చున్నాడు. ఆమె నలునితప్ప వరించనని చెపుతున్నప్పటికి రాజరాజన్యలోకమంతా ఎలాగైనా ఆమెను పొందాలని పోటిపడుతున్నారు.

ఈ భోలోకమంతా చాటింపువిని ఎగబడి వస్తున్నారు. కన్నులున్నందుకు ఆ సౌందర్యదేవతను ఒకసారి చూచినాచాలని బయలుదేరుతున్నారు అన్న నారదమహర్షి మాటలకు చేష్టలు దక్కి అలావుండిపోయాడు కాస్సేపు అమరనాథుడు.

'ఇదేవిటి భూలోకమంతా దద్దరిల్లిపోతున్న దమయంతి స్వయంవరం సంగతే అనుకో. ఆమె సౌందర్యగరిమే ననుకో. ఇంత ఆలస్యంగానా నేనాలకిస్త? అనుకున్నాడు.

ఆ విన్న వాళ్ళంతాకూడా ఒక్కసారి ప్రయాణమై వెళ్ళి ఆమెను చూస్తేనా వస్తే బాగుండుననుకున్నారు.

అంత అద్భుతమైన అందకత్తె భూలోకంలో వుండగా రంభా ఊర్వశి మేనకాదులవైపెవరు చూస్తారిక అన్న నారదమునీంద్రుని మాటలు ఆ స్వర్గవాసులచెవుల్లో రింగ్‌మంటున్నాయి. నారదుని మాటలు విన్న రంభాదులు సిగ్గుపడటం, తలలు వంచుకోవటమే కాదు. నారద మహర్షిని చాతనయినంతగా తిట్టుకున్నారు మనసులో.

ఈ వార్త ఈ ముని ఇప్పుడు మోసుకురాకపోతేనేం, ఏళ్ళు వచ్చాయెందుకు? ఈయన కాళ్ళు తిరగందే ఎలా ఆగవో, నోరుకూడా అంతే. వట్టి దురదనోరు అనుకున్నారు అక్కసుగా.

భూలోకమంతా కన్నులవైకుంఠంలా వుందా? దమయంతిది అంత మెరుపు తీగలాంటి అందమా? దేవకాంతలను మించిన అంద కత్తెయా? నలునితప్ప వేరెవన్నివరించదా? ఇంతకీ ఆ నలుని గొప్పతన మేమిటి?

ఏమైనాసరే. ఒక్కసారి భూలోకం వెళ్ళి చూసితీరాలి. అటువంటి రత్నాన్ని పొందని జీవితమెందుకు? అనుకున్నాడు. మతిపోగొట్టుకున్న అమరవిభుడు సింహాసనం దిగాడు.

తనని కాదని దమయంతి స్వయంవరానికి వెడుతున్న ఇంద్రుణ్ణి చూస్తే రంభకి ఒళ్ళు మండింది. మూతి మూడువంకర్లు తిప్పింది.

శచీదేవి సౌందర్యం దమయంతి అందంముందు దిగదుడుపులా కనిపించింది ఇంద్రుడికి ఊర్వశి రుసరుసలాడింది. మేనక పెద్దపెద్ద అంగలేసుకుంటూ ఉగ్రంగా సభనుంచి వెళ్ళిపోయింది. తమరాక ముందుగా తెలిపేందుకై భూలోకంలో దొరకని వస్తువులను అతివిలువైన

వస్తువులను దమయంతికి కానుకగాపంపి, తను వెళ్ళేందుకై నిశ్చయించి అలంకరించుకోవటం మొదలెట్టాడు ఆ శచీజాని.

సర్వాంగ సుందరంగా తయారయి దేవేంద్రుడు దిక్పాలురు తన వెంటరాగా దివ్యవిమానం ఎక్కి భూలోకానికి ప్రయాణమయ్యాడు.

* * *

ఆ విమానం కన్న మిన్నగా రథధ్వని విని మేఘంలాంటి గర్జన విని ఈ రథం ఎవరిదీ, ఏమిటి దీని వేగం? అని ఆశ్చర్యపోయారు దేవేంద్రాదులు.

ఇంతవేగంగా భూలోకంలో రథం నడుపగలవాడూ ఎవరూఅన్న వెరగపాటుతో చూచేప్పటికి ఇంకెవరు నలుడు. ఎదుట రథంమీద పగ్గాలు చేతపట్టుకుని ఆ రాజచంద్రుణ్ణి చూసేందుకు సురపతికి వేయికళ్ళు చాల్లేదు.

నిర్మలమైన తేజోరూప గుణసంపదలు, శౌర్యసాహసాలు మూర్తీభవించినట్టు నిషధేశ్వరుని ముఖమండలంపైన దివ్యకాంతులు విరజిమ్ముతుండగా ఈయనే నలమహారాజై వుంటాడని నిశ్చయించుకున్నారు దేవతలంతా.

యౌవనం తొణికిసలాడుతున్న నలమహారాజు రథందిగి దేవతలకు నమస్కరించాడు వినయంగా.

అప్పుడే నలుని మోసం చెయ్యాలనే వూహ సురపతికి ఉత్పన్నమైంది. నలుడు మంచి అందగాడు. అటువంటి నలుడేకనుక స్వయంవర మంటపాన కనిపిస్తే ఆ దమయంతి నలునే కాక ఇతరుల నెందుకు వరిస్తుంది.

కనుక ఏదో కపట నాటకం ఆడాలనుకున్నాడు. దేవతలు తల్చు

కుంటే ఏం చెయ్యలేరు కనుక. శాపాలూ వరాలూకూడా వాళ్ళచేతుల్లోనే వున్నాయి కదా?

"నీవు ఎవరయ్యా? నా మిత్రుడు వీరసేనుని పోలికలు నీతో కన్పిస్తున్నాయి. ఆయన పుత్రుడివి కావుకదా? నేను దేవేంద్రుడిని. ఇదిగో ఈయన యముడు, ఈయన వరుణుడు, అగ్నిదేవుడు అతను నీసహాయం కోరి భూలోకానికి బయలుదేరాం మేము అన్నాడు ఎంతో ఆదర పూర్వకంగా.

నలుడు క్షణంపాటు నివ్వెరపడి ఆలోచించాడు. ఇందులో ఏదో మెలికవుందనుకున్నాడు. లేకపోతే స్వర్గంనుంచి దేవతలు తన సహాయం కోరి దిగివచ్చారా? మానవమాత్రుడైన నావల్ల గావలసిన సహాయం ఏముంటుంది. వాళ్ళకూ చాతకాని పని తను చెయ్యగలడా?

కాని ఏం జరుగుతే అదే జరుగుతుంది. వారికి ఎటువంటి పనైనా ఎంత దుస్సాధ్యమైనా చివరికి తన ప్రాణమైన సరే ఇచ్చేస్తాడు. కాని వెనక తియ్యబోరాదని దృఢంగా నిశ్చయించుకున్నాడు. వారి చెయ్యి కింద నాచెయి పైన అవటం కేవలం నా అదృష్టం కాదా అనుకున్నాడు.

"ప్రభూ! మహేంద్రా మీరన్నట్లు వీరసేనుని పుత్రుడనే నలుణ్ణి. నేను చేయగల కార్యమేదో ఆదేశించండి సంశయించవద్దు" అని ఎంతో వినయంగా దోసిలి ఒగ్గి నిల్చున్నాడు.

ఇంద్రుడికి ఆనందమయింది. ఆయన కుటిలాలోచననెరవేరినట్టే. నాకు తెలుసు నలమహారాజా! నువ్వు ఆడినమాట తప్పవు. మేము దమయంతిని వరించాము. ఆమెకోసం స్వర్గంనుండి భువికి దిగివచ్చాం. నీవు మాటకారివి. పలుకుబడిగలవాడివి, దయాహృదయం గలవాడివి, అసత్యమాడని వాడివి. ఈపని నీ వల్లనే జరగాలి. అది ఏమంటే దయమంతి మాయందనురక్తఅయి, మాలో ఒకరిని పరిణయమాడేట్టు ఆమె మనసు

మాప్రైమళ్ళించాలి నువ్వు అన్నారు. మొదట వాళ్ళకి శక్యంకాని పన్లేమిటి వాళ్ళు పరీక్షించటం లేదు కదా! అనుకున్నాడు.

లేకపోతేఏమిటి? నీ సహాయంకోరి అనే మాటలోనేవుంది చిక్కంతా. కల్పవృక్షం, కామధేనుపు మొదలైన మహిమాన్వితమైన వస్తువులు వాళ్ల దగ్గరవుండగా మానవమాత్రుడనైన నా సహాయమా? అనుకున్నాడు. కాని సురలు అడిగేవాళ్ళు. తను సామాన్యుడు ఏమడిగినా ఇచ్చి వేసేందుకు సన్నద్ధుడైవున్నాడు నలుడు. ఎంతకైనా తగును ఇంద్రుడు. కుటిలమంతా ఈయన సొమ్ము. ఎంత అసమంజసమైనపని వప్ప చెప్పాడు. తను ప్రాణప్రదంగా ప్రేమించాడు దమయంతిని, అంతేకాదు కలహంస పుణ్యాన ఆ దమయంతిచేత ప్రేమింపబడ్డాడు కూడా. ఇప్పుడు నన్నుకాదు దమయంతీ ఆ స్వర్గాధిపతి మహేంద్రుడున్నాడే అయనను ప్రేమించు అని ఎలాగ చెప్పటం? చెప్పేడే అనుకున్నా ఆవిడ మనసు మార్చుకుని సరే అంటుందా? వెర్రివాడికేసి లాగునచూడదా? అని ఎంతగానో ఆలోచించాడు. ప్రపంచం తలక్రిందయినా ఇచ్చినమాట తప్ప కూడదనుకున్నాడు. తన స్వార్థం పక్కనపెట్టాడు. అందుకే నలమహారాజు షట్చక్రవర్తులలో ఒకడైనాడు.

"మహారాజా! నారీజనంవుండే అంతఃపురంలో ఎలా ప్రవేశించటం అని ఆలోచిస్తున్నావా? 'తిరస్కరిణి' విద్య ప్రసాదిస్తాం నువ్వెవరికంటా పడకుండా యదేచ్ఛగా అంతఃపురం ప్రవేశించవచ్చు అన్నాడు సురపతి. ఆ మాటలు విని కథ చాలాదూరం వచ్చింది. అప్పుడే అనుకున్నాడు నలుడు.

"సురపతీ! నేనూ ఆ లలనామణికోసమే కదా ఇంతదూరం నుంచి వస్తున్నాను. ఆ అంగనతో ఏ ముఖం పెట్టుకుని మిమ్మల్ని ప్రేమించి పరిణయమాడమని చెప్పను? మీకిది న్యాయంగా వుందా? అదితప్ప మరేదైనా చెప్పండని ప్రతిమాలాడు కాని ఫలించలేదు.

నదులు గిరులు వున్నంత కాలం నీ కీర్తికి కళంకమంటదు. నీవు సత్యవ్రతుడవు. నీ మాట నువ్వు నిలబెట్టుకోమన్నాడు సురరాజు. సరే వాళ్ళు చెప్పినట్టే బయలుదేరాడు. తోవపొడుగునా తన దురదృష్టాన్ని నిందించుకుంటూనే వున్నాడు నలుడు.

వారు ప్రసాదించిన 'తిరస్కారిణీ' విద్యవల్ల నలుడు ఎవరికీ కనుపించకుండా అంతఃపురం చేరాడు. అంతమంది చెలికత్తెలను తప్పించుకుంటూవెళ్ళి దమయంతిని గుర్తించాడు.

కలహంస చెప్పినకన్నా ఎన్నోరెట్లు సౌందర్యంతో వెల్గిపోతున్న దమయంతిని చూశాడు. రెండుకళ్ళు చాలటంలేదు. దేవకాంతలకన్న మించిపోయింది కనుకనే దేవరాజు మతిపోగొట్టుకున్నాడు అనుకున్నాడు నలుడు.

'తిరస్కారిణీ' విద్యవలన ఎవరికీ కనుపించకుండా నలుడు చంద్రశాలచేరి, చెలికత్తెలచే అలంకరించబడుతున్న దమయంతినిచూసి 'పురుషస్యభాగం'. అని అంటారే అలాగుంది. ఈ ఇంతి అనుకున్నాడు చెలికత్తెలు నలునిచుట్టూ ఒక దివ్యకాంతి అలుముకున్నది వాళ్ళంతా పక్కకి తొలిగిపోయారు. దమయంతి ఒంటరిగావుంది. ఇదిమంచి అదనుగా తలచాడు తన దూతకార్యం నెరపటానికి.

ఇంతలో దేవేంద్రుడు పంపిన అమూల్యకానుకలు దూతలద్వారా చెలికత్తెలు అందుకుని దమయంతి కాసంగతి తెలియపర్చారు.

"ఓ చంచలాక్షీ! సురపతి నందనవనంలోని బంగారు మొగలి పూరేకుమీద దేవభాషలో ప్రణయలేఖ రాసిపంపాడు. చిత్తగించమని ఒక దూతిక అంటే.

"ఓ కురంగ నయనా! ఈ పారిజాత సుమమాల సమస్తమైన

అని ఒక సఖియ ఇంద్రుని మాటగా విన్నవించారు.

అనర్ఘ్యరత్నవాసులు దమయంతి కర్పించారు. ఇంద్రుని బహుమతిగా దమయంతి అవేవీ అందుకోలేదు.

అన్నీ వింటూనే వున్నాడు, అన్నీ చూస్తూనే వున్నాడు నలుడు. దమయంతికీ పెద్దలు, సఖులు నచ్చ చెపుతున్నారు. ఆమె అదృష్టాన్ని వేనోళ్ళ కొనియాడుతున్నారు కాదుమరి. కేవలం స్వర్గాధిపతి ఆమె ప్రేమ అర్థిస్తున్నాడు కదా!

నలుడికి మతిపోతోంది. దమయంతి ఇందరి బలాత్కారంవల్ల లొంగిపోదు కదా? అనుకుంటున్నాడు.

లొంగిపోతే దేవతలకు తనుచేసిన వాగ్దానం ఫలించి, కీర్తికిరీటం తనకు దక్కుతుంది.

లొంగకపోతే తననువలచి వలపించుకున్న నారీరత్నం దమయంతి తనకు దక్కుతుంది.

ఇలా ఆలోచనా తరంగాలు నలుడిని ముంచెత్తుతున్నాయి. హస్త కంకణాలు ఘల్లుమనేలాగ చెయ్యెత్తి చెలులను వారించి "చాలు చాలు. ఇంద్రుని స్తుతి చాలు. చాలా గొప్పవాడే, సురేంద్రుని వేలాది నిధులుగల ఆయన మహానుభావుత్వం నాకెప్పుడూ శిరోధార్యం. ఆయన అంశగల నలమహారాజుకి నేనెప్పుడో మనసిచ్చాను. త్రికరణశుద్ధిగా ఆయనే నా భర్త" అని తన మనోనిశ్చయాన్ని ఆ దేవదూతలకి వివరించింది దమయంతి.

ఆ మాటలు విన్న నలుడు ఆనందం పట్టలేక వుక్కిరిబిక్కిరి అయాడు. ముందుకన్న ఆమె సౌందర్యగరిమ రెట్టింపుగా కనబడింది నలుడికి.

'తిరస్కరిణీ' నలునినుంచి తప్పుకుంది. తన ఎదుటవున్నవాణ్ణి

చూసి దమయంతికి సిగ్గుకాక మరేమిటి? ఇతడే నలుడని ఆమె మనసు చెపుతోంది. అంతటి విదుషీమణికి నోటమాటరాలేదు.

కొద్ది క్షణాలు ఆమె తనను తనే మరిచిపోయింది. అడుగులు ముందుకు పడలేదు. ఎలా సత్కరించటం? ఏమని పల్కరించటం?

మీరెవరో దివ్యపురుషుల్లా వున్నారు. మీదర్శనంవల్ల మాజన్మ పావనమయింది ఈ హేమ రత్నసింహాసన మధిష్టించండి అన్నారు ఇష్ట సఖులు.

"ఆర్యా! తమది ఏదేశం? ఎచ్చటికి వెడుతున్నారు? ఇందరు సాయుధభటులు సంరక్షిస్తున్న ఈ అంతఃపురంలోకి తమరు సాహసించి ప్రవేశించటానికి కారణం ఏమిటి?" అని అడిగింది ఒక సఖి.

హేమసింహాసన మధిష్టించిన నలుడికి స్వర్ణకలశంతో శుద్ధోదకం తెచ్చి కాళ్లుకడిగి మధుపర్కాలతో పాదాలు వత్తారు.

"మీరు కంతుడా జయంతుడా చంద్రుడా ఇంద్రుడా లేక నిజంగా నలమహారాజా?" అన్న దమయంతి మృదుమధుర వాక్కులు అమృతం లాగ చెవులకు సోకాయి నలుడికి.

కల్యాణి! నీవు అనుకున్నట్టుగా నేను నిషధదేశాధీశుణ్ణి, దేవ దూతనై నేనిక్కడికి వచ్చాను.

"నారదమునీంద్రులు నీ రూపురేఖా విలాసాలు వర్ణించి చెప్పగా దేవేంద్రుడు నీపై మరులుగొని నిన్ను పరిణయమాడాలనే కోరికతో స్వయం వరానికి బయలుదేరి వచ్చాడు.

యముడు, వరుణుడు, అగ్నికూడా అందుకొరకే వచ్చి వేచియు న్నారు. నన్ను ఈ మాటలుచెప్పి నిన్ను వప్పించేందుకై దూతగా నీ వద్దకుపంపారు. "అని వారివారి మహిమలను శక్తిని వేరువేరుగా వర్ణించి

చెప్పి" మానవమాత్రుడనైన నాయందు మనసుంచినందువల్ల నీకేం ఫలితం? నేను చెప్పినవారిలో నీ కిష్టమైన వారిని ఒక్కరిని వరించి సుఖించు, వారంతా మహావృక్షాలు, నేను వట్టి వెదురుబొంగులాటివాడిని అన్నాడు నలుడు.

ముందుగా నలుడిని చూసినందుకు సిగ్గు, అమరుల సంస్కారానికి ఆగ్రహం ఆమెను చుట్టుముట్టాయి.

ఆయన మాటలన్నీ విని దమయంతి.

"అప్సరసలతో విహరించే అమరేంద్రుడికి మనుజకాంత ఎందుకు సకలసంపదలు ఒసగే దేవేంద్రునితో. ఆ వూహ మనసునుంచి ఈ క్షణం నుంచి తొలగించుకోమని చెప్పండి. నేను ప్రేమించి మనసిచ్చింది నిషధ పతికి ఆయనే నా ప్రాణం. ఆయనే నా సర్వస్వం. ఇంకా ఆ స్వర్గవాసు లను గురించి ఒక్క మాటకూడా వినను.

మహావృక్షాల గురించి నాకిక వినాలని లేదు. వెదురు బొంగుని గురించి చెప్పండి ఎంతసేపైనా వింటాను నాకు కావల్సినదదే. "ప్రభూ! నా మనసు అంతా ఆక్రమించుకునివున్న నీవేనా అలా మాట్లాడు తున్నావు?" అనుకుంది దమయంతి.

అవును మరి దేవతల పనుపునవచ్చి వారిమాటలు చెప్పాడు ఆయనతప్పేముంది? అనుకుంది. ఇప్పటికీ తను ఎక్కువగా మాట్లాడింది.

తప్పనిసరిగా అక్కడినుంచి లేచి తెరచాటుకి తప్పుకుంది దమయంతి.

దేవేంద్రాదులు అదృశ్యంగావుండి అన్నీ వింటూనేవున్నారు. తెరచాటున తన ప్రాణప్రియుడికి కోపం కల్గించానేమో అని తొంగిచూసి దుఃఖించింది.

తలవాల్చి నలమహారాజు వెనుదిరిగాడు దేవతలకార్యం నెరవేర్చ లేకపోయానే అని దిగులుతో నిండిందా రాజు మనసు. మహారాజా! అనే పిలుపికి ఎవరు అంటూ తలెత్తాడు. రాజహంస ఇలా ఎందుకొచ్చా? వన్నాడు.

"ఎందుకా? జగద్విఖ్యాతి చెందిన ఒక చక్రవర్తి ఎందుకు విల పిస్తున్నాడా? అని. నీ నిర్మల ఉదారగుణాన్ని దేవేంద్రుడు గమనించ లేదనా? మీ విచారం వదలిపెట్టండి. దమయంతి నిన్నే వరిస్తుంది. మీరిద్దరు ఒకరికోసం ఒకరు జన్మించారు. అన్యథా ఎలా జరుగుతుంది? మీరిద్దరే దంపతులౌతారు. ఇది బ్రహ్మవాక్కు! అని అంబరానికి ఎగిరి పోయింది మరాళం.

ఎంత చల్లని కబురు చెప్పింది అనుకున్నాడు నలుడు.

తెరచాటునుంచి దమయంతి కూడా ఆ మాటలువింది.

ఆ నలదమయంతుల హృదయాలు రెండు కలువరేకుల్లా విక సించాయి వారిద్దరి కనుల్లో ఆనందం వెల్లివిరిసింది.

దేవతల గుణగణాలు నలుడు వర్ణించి చెపుతుంటే దమయంతి కొంచెంకూడా ఇష్టపడలేదు. ఈ సందర్భంలో శ్రీనాథుని పద్యం

అధిక తరులైన గాని ధిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశ కథలయందె
దప్పిగొన్నట్టి వారికా దప్పితీర
సవిలపూరంబు హితవౌయాజ్యంబు హితవా,

ఇది సున్నితమైన ఉపమానం. దమయంతికి నలుని గురించి వినటమే ఇష్టం. కాని దేవతల గురించికాదు. దప్పిగొన్న వానికి ఉదకమేకదా ముఖ్యం. అయినా కాని దేవేంద్రాదులు ఆమె మనసు మామీదకే మళ్ళించ

మని నలునికి ఆదేశించటం ఏం న్యాయం. తనవేలుతో తనకన్నే పొడుచుకోవటం కాదా?

*　　　　*　　　　*

నలుడు తిన్నగా వెళ్ళి తనకోసం ఎదురుచూస్తున్న దిక్పాలురను వెళ్ళి కలుసుకుని జరిగినదంతా చెప్పాడు.

నిజానికి మహారాజు ఏంచెప్పకుండానే వాళ్ళు జరిగిన సంగతంతా విన్నారు. నలుని దమయంతి వద్దకు తమ కార్యం నిర్వహించే దూతగా పంపి ఆయన వెనకేవున్నారు. వారు అదృశ్యరూపులు అందుకే వాళ్ళకి అంతా తెలుసు.

పని అయినా కాకపోయినా నలుని నిజాయితికి మాత్రం ముగ్ధులయారు సురలు. నలుని కొనియాడారు.

కాని స్వర్గవాసులైన తమని తిరస్కరించి నలుని వరించనున్న దమయంతిమీద కోపం. తమకి జరిగిన అవమానానికి అభిమానం ముంచుకొచ్చింది వాళ్ళకి.

మోసగించి అయినాసరే ఆమెను వివాహమాడాలని నిశ్చయించి స్వయంవర మంటపానికి వారునల్గురూకూడా నలమహారాజు రూపం ధరించి వచ్చి సింహాసనాసీనులయారు.

అనేక మహాపట్నాలనుంచి ఎందరో రాజకుమారులు వచ్చి తమ తమ సింహాసనాల నలంకరించారు. ఎవరికివారు దమయంతి తమనే తప్పక వరిస్తుంది అనుకుంటున్నారు.

శ్రీహర్ష మహాకవి వాడిన ఈ సమాసము శ్రీనాధుడికి బాగా నచ్చింది. అందుకే ఈ ప్రౌఢప్రయోగాన్ని తన కాశీఖండంలో కొంచెం మార్చి వాడినట్లు కనబడుతుంది.

"సదసత్సంశయ గోచరోదరి" అనేది

"మృదురీతిన్ ప్రతివాసరంబు, గతుకర్మీభూతనానా నదీ
నదకాంతారపురీ, శిలోచ్చయుడనై, నైకాద్భుత శ్రీజిత
త్రిదివంబైన, విదర్భదేశమున నారీరత్నమున్, గాంచితిన్
సదసత్సంశయ, గోచరోదరి శరత్సంపూర్ణ చంద్రాననన్"

అని ఆనాడు హంస వర్ణించినట్లున్న దమయంతి సభాభవనానికి బయలు దేరుతోంది.

నగరమంతా చక్కగా అలంకరించారు. ఎవరి నోటవిన్నా ఈ సంగతులే. రాజవీధులు జనంతో క్రిక్కిరిసివున్నాయి. మంగళతూర్య నాదాలు భేరీ మృదంగ వాద్యనాదాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. రథచక్రాల సవ్వడికి భూమిఅదిరిపోతోంది. పదునాల్గు భువనాలనూ దమయంతి స్వయంవరవార్త కదిపేసింది. ఎక్కడెక్కడి వాళ్ళో భూమండలం చేరుకుంటున్నారు.

ఇంతకీ ఆ త్రిభువనైక సుందరి ఏ అదృష్టవంతుని వరిస్తుందో అని అంతా ఎదురుచూస్తున్నారు.

వచ్చిన వారందరికి అఖండ మర్యాదలందుతున్నాయి. సభాభవ నానికి మధ్య స్వయంవరమండపం అతివైభవోపేతంగా అలంకరించారు.

దమయంతి తండ్రికి ఒక సందేహం పట్టుకుంది. తన బిడ్డ వట్టి అమాయకురాలు. వర నిర్ణయం సరిగా చెయ్యగలదా? ప్రతి తండ్రీ తన బిడ్డను గురించి అనుకున్నట్టుగానే ఆయనా అనుకున్నాడు అందుకనే స్వయంవరానికి విచ్చేసిన రాజన్యులందరి కులగోత్రాలూ, బలపరాక్ర మాలూ, సుగుణ పరంపరలూ వర్ణించి చెప్పేందుకు ఆ వాగ్దేవికి తప్ప ఎవరికుంది అంతసమర్థత?

అందుకే ఆ భారతినే ప్రార్థించాడు. తన తనయకి చెలికత్తెగా

వంశప్రతిష్ట ఏంగానూ? ఆ బిడ్డ నూరేళ్ళ జీవితం ఏంగాను?

తన కూతురు అంతటి సౌందర్యమూర్తి మూడులోకాల్లోనూలేదు. ఆమెను చూస్తూచూస్తూ గోతిలో పడనిస్తాడా? అందుకే తన పుత్రికకి వారివారి చరిత్రలు చెప్పేందుకు సరస్వతీదేవిని ప్రార్థించాడు.

సరస్వతీదేవి ఆయన ప్రార్థన విన్నది. ఆయనముందు ధవళ కాంతులు విరజిమ్ముతూ తొలకరి మెరుపులా, దివ్యశరీరంతో సాక్షాత్కరించింది.

తన మనవి ఆ శారదకి విన్నవించుకున్నాడు ఆమె ప్రసన్నమై అందుకు అంగీకరించింది.

అమందానంతో భీమరాజు కోటబురుజులపై సిద్ధపర్చిన నగారా మ్రోయించమన్నాడు. బాణాసంచా కాల్పించాడు స్వయంవరం మొదలౌతోంది. కోలాహలం మిన్నుముట్టింది. రాజకుమారులంతా నవమన్మధుల్లా ముస్తాబైవున్నారు. ప్రతిఒక్కరి మదిలో కోటి కోర్కెలు, గంపెడాశలు.

సభాభవన మంతా సందడించింది. కలకల్లాడింది ముత్యాలు రత్నాలుగూర్చి, దివ్యతేజోమయమైన పల్లకి నుంచి దిగివచ్చింది దమయంతి, ఇద్దరు సఖులు వింజామరలు వీస్తున్నారు.

విద్యుల్లతలాగ, చంద్రరేఖవలె, శిరీష సుమపల్లవంమాదిరిగా వున్న దమయంతిని చూసేందుకు రాజన్యులందరు తహతహలాడిపోతున్నారు. అప్సరసల్లాంటి చెలులిద్దరూ ఆమె కిరువైపులా నడుస్తున్నారు. అందరూ ముగ్ధులై చూస్తున్నారు. ఆమె పల్లకి దిగగానే కేలూతనొసగింది సరస్వతీదేవి.

సన్నటి మేల్ముసుగులోనుంచి ప్రతిఒక్క అవయవం సౌందర్య

లావణ్యకాంతులతో మెరిసిపోతుంటే దమయంతి వక్షంపై నవరత్న హారాలూ మౌక్తిక సరాలు దివ్యకాంతులు విరజిమ్ముతుంటే ఆ కాంతిని చూడ శక్యం కాకుండా వుంది అందరికీ.

సరస్వతి దమయంతీ కూడా ఒకే కాంతితో ప్రకాశిస్తున్నారు. ఇందులో ఎవరు సరస్వతి? ఎవరు దమయంతి?

వెనుక వింజామరలు వీరాడుతున్న చేలాంచలాన్ని ఎత్తిపట్టుకుని వస్తున్నారిద్దరు సఖులు. ఆమె ఒకకాంతి పుంజంలావుంది. ఆ కాంతిలో అలవికాని శోభ.

కొందరు "ఆమె వరించినా వరించకపోయినా గాని అటువంటి సౌందర్య లావణ్య తేజోరాసిని కన్నులున్నందుకు చూడగలిగాం అంతే చాలు" అనుకుంటున్నారు.

ఆ చూపులో ఆ రూపులో ఆ నడకలో ఆ కంటివంపులో ఆ వయ్యారంలో నదీ తుషారకాంతులన్నీ చూస్తూ కొందరయితే శిల్పమూర్తులయారు. కాలికిందపడ్డ పూవుకూడా నలగనంత కోమలంగా ఒక్కొక్క అడుగువేస్తూ నడచివస్తోంది దమయంతి.

కేవలం పరిచయం చేసేది సరస్వతి అయితే చెప్పటంలోని చాతుర్యం, మాటలలోని మాధుర్యం ఇక చెప్పాలా?

చెప్పినమాట చెప్పకుండా కనిపించిన ఇతిహాసం వినిపించకుండా వారివారి స్వభావాలను దమయంతి వద్దుసుమా అనిపించేట్టుగాను అవతల వారికి అవి పొగడ్తలుగానూ ధ్వనించేట్టు చెపుతోందా చదువుల తల్లి.

దేవతల నందర్నీ ఎరుకపర్చింది. నాగలోకంనుంచి విచ్చేసిన వాసుకి గొప్పతనాన్ని చెప్పింది. ప్రతిఒక్క రాజకుమారుణ్ణి వివరించి చెప్పింది. వాళ్ళ శౌర్యధైర్యాలూ, వంశప్రతిష్టలు, వారివారి దిగ్విజయ

ప్రాభవాలు చెపుతోంది. దమయంతి అంతర్యం పూర్తిగా అర్థమౌతూనేవుంది. ముందుకి అడుగులు వేస్తోంది.

ముందు ఆశీనులైవున్న రాజలోకం అంతా ఆశ అనే తేజోధైర్యాలతో వెలిగిపోతూంటే వారిని దాటుకుంటూ ముందుకెళ్ళిపోయాక ఆ వెనుకనున్న మహారాజులు ఇక నిరాశ అవహించి నిలువెల్ల చుట్టబెట్టిన అవమానంతో నల్లగా మాడిన ముఖాలతో సభ్యతకోసం అసనాలనంటిపెట్టుకుని కూర్చున్నారు.

అవును మరి. ఇహ తమని వరించదని తేలిపోయాక దమయంతి ఎవర్ని వరిస్తే తమకెందుకు? అనుకున్నారు.

పుష్కర ద్వీపాధిపతి, కాశీమహీపతి, మధురాధిపతి, ఉజ్జయినీపతి ఋతుపర్ణుడు, అయోధ్యాధీశుడు, పాండ్యరాజు, కళింగాధీశుడు, ఉత్కళ సార్వభౌముడు, నేపాళాధీశుడు, అందర్ని చూపి వారిగురించి బహు మనోజ్ఞంగా వర్ణించి చెప్పింది వాగ్దేవి.

ఒకరికి రూపం మాత్రమే వుంది. ఒకరికి పరాక్రమం మరొకరి వంశం గొప్పది. ఒకరు దానధర్మాలలో కీర్తివుంది. ఇంకొకరికి విలువిద్యలో ప్రావీణ్యం వుంది. ఎవరిముందు నిలువక అడుగులేస్తోంది. కొన్నిమాటలు పూర్తిగా వినటమేలేదు. కొందరివైపు చూడటమేలేదు. ఆమె దృష్టి, ఆమెమనసు ఆమె వూహలు ఆమె కళ్లు అన్నికూడా నలుని కోసమే అన్వేషిస్తున్నాయి. తహతహలాడుతున్నాయి. ఆమె హృదయమంతటా నిండివున్నది నలుడేకదా?

ఇంక అయిగురు మిగిలారు. అందరి దృష్టికూడా అయిదుగురిమీదే వుంది.

ఆ అయిదుగురు ఒకలాగునే వున్నారు. దమయంతి అనుకుంది ఇది మాయని తనకి పరీక్షాసమయం అని.

ఇది తప్పకుండా ఇంద్రాదుల మాయాజాలం. వీరిలో అసలైన నలు డెవరని? ఇప్పుడు వరమాల ఎవరి మెడలో వేయటం, అయిదుగురూ నిషధాధీశులే. ఇందులో తన ప్రేమమూర్తిని ఎలా తెలుసుకోటం? ఆమె కాళ్ళు గజగజలాడాయి.

అది గమనించిన వాగ్దేవి దమయంతి చిటికెన వేలుపట్టుకుని ఆదిమింది, భయపడవద్దన్నట్టు.

ముందుగా మొదటి నలుని చూపుతూ వాగ్దేవి అంది "కువలయాక్షి! ఇదిగో ఈయన ఇంద్రుడంతటివాడు. సామాన్యుడు కాడు" "ఇంద్రుడా? ఇంద్రుడంతటివాడా? మళ్ళీ అక్కడ మెలిక.

రెండవ మాయావిని చూపించి చెప్పింది.

"ఇందువదనా! ఇదిగో ఇతడు నలుడు దేదీప్యమైన కాంతి గల వాడు. మంచి సౌందర్యం గలవాడు".

అంటే నలుడా? అనలుడా? మళ్ళీ తికమక.

మూడవ నలుని చూపించి చెపుతోంది వాగ్దేవి.

"ఓ కమలనయనా! పోనీ ఇతణ్ణి చూడు ఎంత అందగాడో దక్షిణ దిక్కునేలే ధర్మరాజీతడు."

ధర్మరాజా? యమధర్మరాజా? మళ్ళీ సంశయం. ఇంకా ముందు కెళ్ళారు ఇంకో నలుని చూపించి చెప్పింది.

"చకోరాక్షి! ఈయన జీమూతవాహనుడు తన చల్లని మేఘాలచే, దయావర్షం కురిపించి, శీతలమొనర్చి నిన్ను సంతోషపరచగలడు".

ఇక నల్గురు దమయంతివైపు రెప్ప వాల్చకుండా చూస్తున్నారు. వారనిమిషులు కదా అనుకుంది ఆమె. వారు పరీక్షిస్తున్నారా లేక సరస్వతియే తనని పరీక్షిస్తున్నదా అనుకుంది. వాగ్దేవి కాళ్ళు పట్టుకుందా మనిపించింది దమయంతికి.

ఈ వ్యూహంనుంచి ఎలా బయటపడటం? అసలైన నిషధదేశా ధీశుడు ఎవరు? తనహృదయం హరించిన నలుడెవరు? ఈ అయిదుగురికి శిరసువంచి వినయవిధేయతతో నమస్కరించింది ఆ ఇంతి. ఇంక ఈ ఇంతిని బాధకు గురిచేయటం న్యాయం కాదనుకున్న భారతి.

"దిక్పాలులారా! మహానుభావులారా! మీరే ఇంద్రాగ్ని యమ వరుణులైతే దమయంతిని కరుణించటం మంచిది. ఆమె ఒక్కతే. మీరు అయిదుగురు వున్నారే? అయిదుగురిని వరించట మెలా? మీలో ఒక్కరే ఆమెను వరించి పుణ్యం కట్టుకోండి" అంది. వీరు నీవనుకున్నట్టుగా దిక్పాలురే. నిజం అని దమయంతికి సూచన ఇచ్చినట్టుగా కూడా స్ఫురించింది.

అప్పుడా దేవతలు నిజరూపుదాల్చారు. దయయంతి మళ్ళీ చేతులెత్తి అత్యంత భక్తితో వారికి నమస్కరించింది. తన చేతనున్న చెంగల్వ పూదండ ఆ చెంతనేవున్న నలుడి గళాన అలంకరించింది. నలమహారాజు ఆమె వైపు ఆనందమిళితమైన చూపులు ప్రసరింపచేశాడు. ఆమె తనువు పులకించింది. నలదమయంతులిద్దరు ఒకరివైపొకరు చూసి తన్మయులు కావటం గాంచి వేల్పులు మిక్కిలి సంతోషించారు. ఆ నల్గురూ దమయంతిని ఆశీర్వదించారు. పుష్పవర్షం కురిసిందప్పుడు. "నిస్వార్థపురుషుడవై, త్యాగశీలుడవై, ప్రతినకు కట్టుబడి ప్రాణాధికమైన దమయంతిని వేల్పులకు కట్టబెట్టదలచిన నిషధాధీశా! నలచక్రవర్తీ! నీ కీర్తి ఈ భువిపై చిరస్థాయిగావుండగలదని" దేవేంద్రుడు దీవించాడు.

వేల్పులు వేరువేరుగా ఆ దంపతులకి వరాలిచ్చి దివికి బయలు దేరారు.

వాగ్దేవి కోటిసూర్యులుదయించినట్లు సరస్వతి ఆ సభామంటపాన నిజరూపుదాల్చింది. చతుర్భుజాలతో ధగద్ధగాయమానంగా వెలిగే కిరీట

కాంతులతో అందర్నీ చకితుల్ని చేసి, వధూవరుల్ని దీవించింది. ఆమె చేతుల్లో వీణా, వేదాలు వున్నాయి.

"నలమహారాజా! నీకు చింతామణీ మంత్రాన్ని ప్రసాదిస్తాను అది సాక్షాత్తూ నా స్వరూపం. నీవు నిష్ఠతో నిత్యం పఠిస్తే నీ కోరిక నెరవేరగలదు" అని చెప్పి అదృశ్యమైంది.

* * *

చెలికత్తెలంతా ఎంతో ఆనందోత్సాహాలతో దమయంతిని అలంకరించి సమస్తమైన అలంకారాలను చేశారు. నవరత్నాల ఆభరణాలన్నీ ధరింపజేశారు. వివాహమంటపం వద్దకు తీసుకువచ్చారు.

అక్కడ విడిదిలో నలమహారాజుని అలంకరిస్తూ ఇంతటి అందగాడు కనుకనే దేవేంద్రాదులను తిరస్కరించి ఈ రాజచంద్రుణ్ణి వరించింది మన దమయంతి. మన అదృష్టం చాలా గొప్పది. కనుక ఈ వీరశిఖామణికి, ఈ రారాజుకి పున్నమిచంద్రుని పరిహసించే అందగానికి సేవచేసే భాగ్యమబ్బింది అనుకున్నారు సఖులు.

ఆ రాజేంద్రుడికి చందనం నలుగుపెట్టి పన్నీరు జలకమార్చారు. జిలుగు పట్టువలువలు సవరించి పచ్చలు నీలాలూ తాపిన మాణిక్యకిరీటం శిరస్సునవుంచి దిష్టితగలకుండా బుగ్గన చుక్కవుంచారు. పునుగు, జవ్వాది, చందనం మొదలైన పరిమళద్రవ్యాలు అలది కస్తూరితిలకం దిద్దారు. దిక్కులు పిక్కటిల్లేలాగున భేరీలు మంగళవాద్యాలూ మారుమ్రోగుతుండగా పండితుల వేద, నాదాల మధ్య వివాహవేదిక ప్రవేశించాడు నలుడు.

భీమమహారాజు అల్లుని చూసుకుని ఆనందపరవశుడయాడు. విలువైన కానుకలు ఎన్నో సమర్పించాడు అల్లునికి. శుభముహూర్తం సమీపించిందని పురోహితులు తొందరపెడుతున్నారు. దమయంతి మంగళ

గళాన్ని మంగళసూత్రం ముడివేశాడు వరుడు. లక్షలమంది ఆశీర్వచనాలు అక్షతలు జల్లారు. ఏకకాలమందున లాజహోమం ముగిసింది. అరుంధతీ దర్శనమైంది.

భూనభోంతరాళాలు మారుమ్రోగేట్టు వివాహం సుఖాంతంగా సమాప్తమైంది. దమయంతిని అత్తవారింటికి పంపేక్షణం సమీపించింది. భీమరాజుకి 'కణ్వుడు' జ్ఞాపకం వచ్చాడు. ఆ మహర్షి ఆనాడు శకుంతలా విశ్లేషాన్ని ఎలా భరించాడో అనుకుని కళ్ళు ఒత్తుకున్నాడు.

తన బిడ్డకి జాగ్రత్తలు, నీతులూ అన్నీ చెప్పాడు. ఆ దమయంతి ఎరుగని నీతులున్నాయా అంటే లేవు. కాని ఆ సమయాన ఆ తండ్రి నోటివెంట అవి రావటం పరిపాటి.

నా ముద్దుల పట్టిని నీ చేతులో పెట్టాను జాగ్రత్తగా చూసుకోమని అల్లునికి కన్నీళ్ళతో అప్పగించాడు.

ఎన్ని కానుక లిచ్చాడు ఆ తండ్రి బిడ్డకి? అనేది రాస్తే ఎంత గ్రంథమైనా అవుతుంది. ఆయన ఇవ్వలేని దేముంది? ఒక్కగా నొక్క బిడ్డ. సర్వం ఆవిడదే కదా? రథం అధిరోహించారు వధూవరులు.

ఇహ అక్కడ నిషధదేశంలో నలచక్రవర్తి వివాహమహోత్సవం విని పురజనులంతా ఆనందోత్సాహాలు ముప్పిరిగొన్న హృదయాలతో పట్నమంతా అలంకరించారు.

వధువుని చూసే వుత్సాహం వారిలో వురకలు వేస్తోంది. వారు తోవంతా పందిళ్ళు వేశారు స్తంభాలకి అరటి గెలలు వేళ్ళాడుతూ స్వాగతం పల్కుతున్నాయి. ఎటుచూసినా పచ్చితాటాకుల పరిమళాలు మామిడాకుల తోరణాలు, కస్తూరికళాపు జల్లి, రంగవల్లులు తీర్చిదిద్దారు. "అడుగో మన నలమహారాజు సతీసమేతంగా వస్తున్నాడ"ని హర్షాతిరేకంతో కేకలు పెట్టారు పురవాసులంతా. దోవపొడుగునా సుగంధభరిత

పెట్టించి హారతులిచ్చారు అఖండస్వాగతం పలికారు. జయజయధ్వానాలు చేశారు. వధూవరులు పెద్దలందరికీ నమస్కరించి ఆశీస్సులందారు. ఇలా వారి సంసారం నవ్వుల నదిలో పూవుల నావలా సాగిపోతుంటే-

*　　　　*　　　　*

కుండిన నగరంనుంచి స్వయంవరం చూసి బైలుదేరిన దేవేంద్రాదులకు కలిపురుషుడు అతివేగంగా నల్లని రథం మీద ఎదురువచ్చాడు.

వారు మోహం చిట్లించుకుని పక్కనుంచి పోతున్నారు. వికృతాకారంతో నల్లని బట్టలతో ముళ్ళపొదలాటి కేశాలతో వచ్చే 'కలి' అంటే అందరికీ అసహ్యమేకదా?

'కలి'కి కోపం వచ్చింది. అది ప్రధానలక్షణమే కదా?

అసూయ, అహంకారం, సాహసం, మూర్ఖత్వం వాడి గుణాలు.

"ఏమయ్యో ఇంద్రా క్షేమమా? ఏవిటి మీరంతా నన్ను చూసికూడా పలకరించకుండా పోతున్నారు. ఎక్కడనుంచి మీరాక?" అని అడిగాడు

"ఓహో! కలిపురుషా! ఎక్కడికి నీ పయనం ఎవరి పాపం పండింది"?

"దమయంతి స్వయంవరానికి" అన్నాడు జవాబుగా.

దిక్పాలురు నల్గురూ ఒక్కసారి పక్కున నవ్వారు.

"ఎందుకు నవ్వుతారు?" అన్నాడు.

"నవ్వుగాక మరేమిటి అజన్మబ్రహ్మచారివి, నీకు దమయంతి కావలిసివచ్చిందా?" అన్నారు.

"భార్యలుండి మీరు స్వయంవరానికి వెళ్ళలేదా ఏం?"

"వెళ్లాం. తిరిగి వట్టి చేతులతో పోతున్నాం. ఆమె నీలాంటి మూర్ఖుల్ని, మాలాటి వేల్పుల్ని వరించదు."

"మరెవర్ని వరించింది?" కళ్ళనుండి నిప్పులు కురుస్తున్నాయి.

"త్రిభువనైకసుందరుడు, జగదేకవీరుడు అయిన నలమహా రాజుని".

"వాడిని సర్వనాశనం చేస్తాను చూడండి. వాడిని అడవులపాల్జేసి ఆ దంపతులను వేరుజేయకపోతే నా పేరు కలికాదు."

దిక్పాలురు నలుని వర్ణించారు, ఆయన సద్వర్తన శ్లాఘించారు. ఇక్కడ శ్రీనాథుడు ఒక చక్కని సీసం రాశాడు.

అర్థ మెవ్వని రూప మంగ సంభవరాజ్య
రుక్మసింహాసనారోహమునకు
గడుపెవ్వని కీర్తి, కార్తికీతిథి నిశా
నాథబింబంబు నెన్నడిమికందు
భవనమెవ్వని ప్రతాప ప్రదీపమునకు
బుండరీక భవాండ మండలంబు
చుట్టమెవ్వని కేలు సురభిచింతారత్న
రోహణాచల వారి వాహములకు.

కలుషమెవ్వాని తలచిన గ్రాగిపోవు
బుణ్యమెవ్వాని కీర్తింప బొడవు వడయు
వాడు నిషధేశ్వరుండు మావరునవాడు
కలిమహారాజ మన్నింతు గాక వాని.

అని నలుని సౌందర్యాన్ని, కీర్తిని, ప్రతాపాన్ని వదాన్యతను కలిపురుష నికి తెలియజెప్పారు. అవేవీ వినిపించుకోలేదు. చెవిటివాడి దగ్గర శంఖం వూదినట్టు నిష్ఫలమయాయి.

"నేను ఆ నలుణ్ణి సర్వనాశనంచేసి వాడి అంతుచూస్తాను" అని వికటాట్టహాసం చేసి బైలుదేరాడు 'కలి'

నిషధదేశంచేరాడే కాని ఆ నగరంలో నిత్యాగ్నిహోత్రధూమం పైకెగసి ఆ దుర్మార్గుడి కళ్ళుకప్పివేస్తోంది ముందు ఏమున్నది తెలియక బోర్లపడి మళ్ళీలేచి కుంటుకుంటూ నడుస్తున్నాడు. ఎలా ప్రవేశించటం? ఎక్కడికి వెళ్ళటం అని తెలియక తికమక పడిపోతున్నాడు.

సూది మోపినంత అధర్మస్థలం కనిపించటం లేదు. దానధర్మాలకు అంతులేదు ఆ నగరంలో.

ఇక ఆ 'కలి' వుండే చోటు అంటే విశ్రమించే చోటు వేశ్యవాటిక స్మశానభూముల్లో రాత్రంతా విశ్రమించటం, పగలల్లా అనువైన స్థలంకోసం వెదకటం, కోడిగుడ్డంతకళ్ళతో ఎంతచూసినా తనకి చోటు దొరకనేలేదు

నలునిలో అధర్మం ప్రవేశించటం అంటే, భూమి కృంగిపోవటం సముద్రమింకిపోవటం వంటిది కదా!

నలదమయంతుల అనురాగం నానాటికి వృద్ధిపొందుతోంది. దినమొక శోభనంగా వారు నవజీవనం సాగిస్తున్నారు.

శ్రీనాధుడు కూడ మూలకర్త లాగున బహుశాస్త్ర నిష్ణాతుడు కనుక నలదమయంతుల విహారం వర్ణించు సందర్భంలో ఒక మాటకి రెండు అర్థములువచ్చే లాగున ఒక చక్కని పద్యం రచించాడు.

"కుతుకమునం, కురంగమద కుంకుమచర్చ వహించిసీలలో
హితరుచులై స్వయంభులై యీహిత సౌఖ్య విధాయులై నయ
య్యతి పయోధరంబులకు నర్థ నిశాసమయంబున స్వమం
చిత నఖకింశుకార్చనము చేసె, మహీపతి భక్తియేర్పడన్".

నీలలోహితరుచులు, స్వయంభులు అను పదాలు కుచములకు శివునికి కూడా అన్వయిస్తున్నాయి కదా?

శ్రీహర్షుడు రాసిన 'నైషధం' నలదమయంతుల పరిణయం వరకే పరిమితమైవుంది అంటారు. "నైషధం శృంగార కావ్యం" అని పేర్కొనబడింది. ఇది పూర్వభాగం.

'కలి' తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి. అంటే నలుడిపై గల 'కచ్చ' తీర్చుకోవాలి. అంటే నలుడు ఇంకా ఇడుమలపడి ఇంకా పరీక్షింపబడి నెగ్గాలి. అప్పుడు కదా ఆయన కీర్తి చంద్రికలు దశదిశలా వ్యాపించేది.

* * *

సౌందర్య స్వరూపుడు నలుడు. తన అలుపు తీర్చుకునేందుకు ప్రాణప్రియ దమయంతి ఒడిలో శిరసునుంచి ఆ వుద్యానవనంలో చంద్రకాంత శిలావేదికపై సేద తేరుతున్నాడు.

అప్పుడు దమయంతి అనుకుంది ఈ అరిదవా నలుని భర్తగా పొందటం నిజంగా భాగ్యవిశేషమే అనుకుంది. తన వంటి అదృష్టవంతులిక వుండరు ఈలోకాన అనుకుంటుండంగా హంస నలుని వర్ణించిన వర్ణన జ్ఞప్తికి వచ్చింది.

రణకండూభర దుస్సహంబయిన, యా రాజన్యదేవేంద్రు
దక్షిణ బాహాగ్రమునన్, జనించిన మహాకీర్తి ప్రవాహంబు
కారణ సంక్రాంత గుణానుషంగముననో, ప్రస్ఫీతదిఙ్మత్త
వారణ గండస్థల కుంభకూలములతో రాయున్ దివారాత్రముల్

నిజంగా నలుని పరాక్రమం, ప్రతాపం, అటువంటివే అనుకుంది. ఆ మోహనమూర్తి వదనం తిలకిస్తూ నలుని దక్షిణ బాహువు యుద్ధానికై తీసుగొని అఖండ విజయ లాభము లార్జిస్తూనే వుంటుందట. ఆ కీర్తి దిగంతాల పర్యంతం వ్యాపించివుందట. ఆ రాజహంస నలుని ముందు తనను గురించి కూడ నఖశిఖపర్యంతం ఇలాగే వర్ణించి చెప్పివుంటుంది

అనుకోగానే ఆమెకెందుకో నవ్వొచ్చింది. రాజహంసమా నీ ప్రతిభ అనన్య సామాన్యమైనది సుమా అనుకుంది.

ప్రాణేశు నొసలి లాక్షాంకమ్ము పొడగాంచి
 ముసిముసి నగవుతో మొగముమలచు
నేలనవ్వితి చెప్పుమిప్పుడంచడిగిన
 నధిపు చేతికి మించుటద్దమిచ్చు.
మరు పెట్టి చనుదోయి మదనాంకములు సూచు
 దను నవ్వ విభుజూపులన యదల్చు
రాజుచే చికురభారము పెజ్జమోవంగ
 మ్రొక్కించుకొను బాదములకు నలిగి
రుద్రమూర్తి జిగీషాను రూపకలన
అతను దేకాదశాకృతి యైన భంగి
జరణనఖ దర్పణములందు ధరణివిభుడు
లీలప్రతి బింబితుండుగా లోలనయన.

ఆ వుద్యానవనంలో చల్లని మలయమారుతము వీస్తుండగా ఇలా నలదమయంతులు శృంగారరసైకమూర్తులయి రమ్యమైన మృదుమధుర సల్లాపాలతో సంతోష సాగరాన తలమునకలయి వుండటం తాడిచెట్టుపై కూర్చుని ఇదంతా గమనిస్తున్న కలిపురుషుడికి కన్నుకుట్టింది. కాని సమయం దొరికితే చాలని నిరీక్షిస్తున్నాడు ఓపిగ్గా. రంధ్రాన్వేషణ సాగిస్తున్నాడు.

ఒకరోజున వైతాళికుల మేలుకొలుపు గీతాలతో మేల్కాంచిన నలుడు కాలకృత్యాలు తీర్చుకొని పాదప్రక్షాళన గావించుకుంటున్నాడు. ఆయన పాదాలవంక తేరిపారజూస్తున్నాడు 'కలి'.

దమయంతీ వదన సందర్శనాపేక్షతో ఆతృతగా పాదాలు కడుక్కుంటున్న నలుడికి ఒక మూలతడియలేదు. ఆ సమయం దొరికిం

దొరుకగానే కలి నలుడిలో ప్రవేశించాడు ఉత్సాహంగా. అంతే నలుడిలో మార్పు రావటం ప్రారంభించింది. రాజకార్యాలమీదికి బుద్ధి పోవటం లేదు. దమయంతి యెడల మునుపటంత మక్కువ చూపటం మానేశాడు అతడి మనసు అతనిది కాదిప్పుడు. పుత్రవాత్సల్యంతో తలిదండ్రులడిగారు నాయనా! నువ్వు ఇదివరకులా లేవేందుకు? ఆరోగ్యం బాగాలేదా?" అని అడిగారు.

ఎంతో ఆందోళనతో దమయంతి అడిగింది. ప్రభూ! నామీద అలిగారా? లేకపోతే మరోలాగ ఎందుకున్నారు?" అని.

మహామంత్రి అడిగాడు. "చక్రవర్తీ! నావల్ల ఏమైనా పొరపాటు జరిగిందా తమరెందుకు ముభావంగా వున్నారని?"

ఎవరికీ సరిగా సమాధానం చెప్పలేదు నలుడు.

కలి ప్రేరణచేత నలుని దాయాది పుష్కరుడు ఎన్నడు లేనిది ఒక లేఖరాశాడు. 'జూదక్రీడకు రమ్మని' ఆహ్వానమది.

దమయంతికి గుండెఝల్లుమంది. వెళ్ళవద్దని బ్రతిమాలింది రాజైనవాడు యుద్ధానికి పిల్చినా, జూదానికి పిల్చినా వెళ్ళాలి అదే రాజ ధర్మం అన్నాడు. నలుడు ప్రయాణమయ్యాడు.

కలిపురుషుడు ఆ అంతఃపురంలో ప్రవేశించి 'అమ్మయ్య' అనుకున్నాడు. "ఇన్నాళ్ళనుంచి ప్రయత్నిస్తుంటే ఇప్పటికి ప్రవేశం దొరికింది" నలునికన్న ముందుగా ప్రవేశించాడు 'కలి' పుష్కరునిమందిరంలోకి పాచికల్లో ప్రవేశించాడు. పెట్టిన పందెమల్లా పుష్కరుడు గెల్చాడు నలుడు ఓడిపోయాడు.

ధనకనక వస్తువాహనాలన్ని ఓడిపోయాడు నలుడు. తన రాజ్యం పణంగా పెట్టి ఓడిపోయాడు. నలుని వదనం విన్నపోయింది. పుష్కరుడూ, కలీ, వికటాట్టహాసం చేశారు. సంతోషపరవశం జెందారు.

ఆ వార్త పిడుగుపాటులా నైషధం చేరింది. అడ్డొచ్చిన ప్రతి అణువుని దహిస్తోంది. ఆ వార్త కోటలో ప్రవేశించగానే హాహాకారాలు చెలరేగాయి.

దమయంతి రేకలూడిన పూవులా త్రుంచివేసిన మొక్క మాదిరి వుండి గిలగిల్లాడింది. చైతన్య హీనఅయి నేలకూలింది. కొంతసేపటికి సేదదీరి తన దురదృష్టానికి వగచింది.

ఈ శర సమానమైన దుర్వార్తను మోసుకొచ్చిన, నలుని రథ సారథి వార్ష్ణేయుడు ధైర్యవచనాలు చెప్పి ఇలా ఓదార్చాడు! "మహారాణీ! కాలం 'కలి' స్వాధిన మౌతోందమ్మా, అయిన దానికి విచారించి లాభం లేదు. గుండె నిబ్బరంతో గడ్డు పరిస్థితి నెదుర్కోవాలి. నీవే బేలవై దుఃఖిస్తే, అనంత భోగాలతో రాజ వైభవాలతో తులతూగి మూడు లోకాల్లోనూ కీర్తి ప్రతిష్టలతో ప్రజ్వరిల్లిన మహారాజు ఏమైపోతాడో ఆలోచించావా?

నీ పసిబిడ్డలేమైపోతారో వూహించావా ? బిడ్డలు పసివాళ్లు నీ కన్నీళ్లతో వాళ్లను బెదర గొట్టటం నీలాంటి సర్వశాస్త్రపారంగతురాలికి తగదు "అన్నాడు".

ఆ మాటలు ఆమె హృదయానికి అమృతపు వాక్కుల్లా శోకాయి. అవును. ఆపద వచ్చిన వేళనే ధైర్యంబూనాలి. ఒళ్లు తెలియని శోకం జ్ఞానాన్ని, తెలివిని శూన్యం చేస్తుంది, అనుకుని తెప్పరిల్లి "నాప్రభు విప్పుడెక్కడున్నారు? ఎలావున్నారు వార్ష్ణేయా?" అని అడిగింది శోక సముద్రంలో మునిగి నగరం పొలిమేరలో వున్నారని వాడన్నాడు. "శరశ్చంద్ర చంద్రికా విలసితము, కోటి సూర్యకాంతిలా దివ్యతేజో వంతమై షోడశ కళాపరిపూర్ణమైన నీ ముఖారవిందం వాడిపోవటమేమిటి ప్రభూ?" అని విలపించింది దమయంతి.

మళ్లీ కాస్సేపటికి తేరుకుని

నా కాంతుడు కాంతి విహీనుడు కారాదు. నా ప్రభువుని, రాహు కర్కశ దంష్ట్రికములకు ఎరకానివ్వను ఆయనను కంట కన్నీరు పెట్ట నీయను. "వార్ష్ణేయా! ఇదుగో నా బిడ్డ లిద్దర్ని తీసుకెళ్లి నా తండ్రి కప్ప గించు ముందుగానే నా తండ్రికి ఈ విషాదవార్త పిడుగుపాటుగా చెప్పకు ఆయన గుండె చిన్నాభిన్నమై పోతుంది.

ఈ కఠోరవార్త విన్నవించాక నాతండ్రి శోక విచలితుడైనప్పుడు చల్లని మాటలతో యుక్తియుక్తంగా వూరడించు అని చెప్పింది. భోరున విలపించింది. మళ్ళీ తెప్పరిల్లింది.

అప్పుడు ఆ మాతలిని మించిన రధసారధి వార్ష్ణేయుడికి కొండంత నిగ్రహం వున్నప్పటికీ, అతని గుండె నిలువునా నీరై పోయింది.

దమయంతి దాసదాసీ జనమంతా భోరున విలపించారు. "వార్ష్ణేయా! ఇంక నీవు వెళ్లవచ్చు నేను నాపతి చెంతకు పోవాలి" అంది తిన్నగా పతి చెంతకు చేరి పాదాలపైబడి పోయి "ప్రభూ" అని శోకించింది. "దేవీ" అని కౌగలించుకున్నాడు నలుడు.

"మీ సుఖాలు అనుభవించిన నాకు మీ కష్టాలు కూడ ప్రసాదించరా?" అంది మాటి మాటికి ఆమె మోము ముద్దాడి విలపించాడు నలుడు. "ప్రియా! అన్నీ తెల్సికూడా ఎందుకీ దుఃఖం? కష్టాలు కలకాలం వుంటాయా? చీకటి పక్షం రోజులేకదా? ఆ తరువాత వెన్నెలరాదా? ఎండిన మోడు వెంటనే చిగురించదా?" అంటూ భర్తని ఓదారుస్తూ, బిడ్డల ఎడబాటు సహిస్తూ, తనకు తను ధైర్యం విడనాడకుండా రోజులు గడుపుతుంటే.

నలుడు "ఎన్నో చెప్పి చూశాడు. నీ పుట్టినింటికి వెళ్లు. ఈ అరణ్యవాసం నువ్వు చెయ్యలేవు. భీకర మృగాల మధ్య భీతావహంగా ఎన్నాళ్లు గడుపుతావు? అంటే వినదీ కోమలి."

అనుకుంటూ ఆకాశం వైపు చూస్తున్నాడు నలుడు.

హంసతూలికా తల్పం మీద పరుండే ఈ కుసుమ కోమలి కటిక నేల పవళించాల్సి వచ్చింది. పంచభక్షాలతో భుజించే యీ ఇంతి కంద మూలాలైన దొరకక అకలితో అలమటించి పోతోందే ఎలాగిప్పుడు? అనుకుంటున్నాడాయన.

పక్షులు ఆసమయాన ఆకాశంనుంచి గుంపులుగా కిందకుదిగాయి. నలమహారాజుకి 'కలి' ప్రభావాన కర్కశమైన కోరిక కల్గింది. తను కట్టుకున్న బట్ట విడిచి వాటిపైన పరచాడు. ఆ పక్షులని ఆహారంగా వూహించాడు కాని.

అవి కిలాకిలా రవాలతో ఆ బట్టని తీసుకు పైకెగిరి పోయాయి. పక్కన నవ్వి ఓ రాజా! మేమెవరం అనుకున్నావు? ఆనాడు నీపాచికల్లో దూరి నిన్ను ఓడించి, నీ ఐశ్వర్య సర్వస్వం అపహరించిన మాయాపాచికలం, నీ పైమీది బట్టనుకూడా పట్టుకు పోయేందుకు వచ్చాం, 'కలి' అనుచరులం అన్నాయి.

కాస్సేపు స్తబ్దుడై చూశాడు. తరువాత అయ్యో! ఆ 'కలి' తన సతిని ఏం తిప్పలు పెడుతున్నాడో అని వెనుదిరిగి దిగంబరుడై వడివడిగా వెడుతున్నాడు.

అయ్యో! ఏనాడు ఈలా వస్త్రహీనుడై ఆమెను దర్శించలేదే అని వాపోయాడు. ఎంతదుర్గతి.

ఇంక ముందుకు పోలేక చెట్టుచాటున దాగిన నలుని చూసి సర్వం తెలుసుకుని "స్వామీ! మీరునాకు అర్ధశరీరమే ఇచ్చారు. మీకు నేను అర్ధ వస్త్రాన్ని ఇయ్యలేనా? అని సగంవస్త్రం చించి తనుధరించి, తక్కిన సగం భర్తకిచ్చింది దమయంతి.

నలుడు విస్మితుడై దేవునికి ప్రణామిల్లాడు. ఇటువంటి పతివ్రతా

తిలకాన్ని తనకి ప్రసాదించి నందుకు. తనని ఎడబాయక తనతో వుండే దమయంతికి 'కలి' ఇంకా ఏం దుర్మార్గం తలపెడతాడో అని విదర్భకు వెళ్లమని చెప్పాడు. తన ప్రాణ పతినికూడా రమ్మంది.

'చెడి స్నేహితుల ఇళ్లకి బంధువుల ఇళ్లకి పోరాదు. నేనురాను' అని కచ్చితంగా చెప్పాడు.

ఒకనాడు మాట వరుసకి నీచే భంగపడిన దిక్పాలురు నిన్ను విడువరు సుమా? అంటేనే ఈ లలన భయభీతయై వెక్కి వెక్కి ఏడ్చింది అని శ్రీనాధుడీ పద్యం ఎంత మనోహరంగా చెప్పాడో చూడండి.

ప్రవిలాక్షి నభోనభ స్యాంబుదములకు
నవవృష్టి ధారలై యవతరిల్లి
యాకర్ణ దీర్ఘ నేత్రాంభోరుహములకు
గమనీయ నాళభావము భజించి
లలిత వక్షోజ కుట్మల చుంబనమ్మున
మధుప దంపతుల సామ్యంబువడసి
కలిత కజ్జలత ముక్తాహార లతలతో
హరి నీల రత్న నాయకతదాల్చి

వేడియశ్రులు నిగడంగ వెక్కివెక్కి
యేడ్వదొడగె లతాంగి పృధ్వీసుత్రోల
మ్మృదుల పరివేదనాక్షరో న్మిశ్రమధుర
కంఠకాకు వికార కాకలిక గదుర.

దమయంతి కాటుక కన్నులు శ్రావణ భాద్రపదము లందలి నీలి మేఘాల్లా వున్నాయట ఆసమయాన.

దమయంతి నోదారుస్తూ, దేవీ మన అదృష్ట లేశం కనుక వుంటే ఏ మహర్షుల ఆశ్రమమైన కనపడక పోదు అంటూ ఆమెను ఆ కర్మారాటవి నుండి మరో ఘోరాటవికి తీసుకు పోయాడు నలుడు.

ఆ కారుచీకట్లమధ్య నుండి క్రూర మృగ గర్జనలకు కంపించి పోతూ దట్టమైన అడవి దాటి, ఆరుబయలు ప్రదేశానికి చేరారు దంపతులు.

అలసి డస్సి నీరసించిన దమయంతిని ఓ వృక్షంచెంతకుచేర్చి అక్కడ పవ్వళింపజేశాడు. కాంతివంతమైన ఆమె ఫాలాన్ని చుంబించాడు. తామరపూలతో తోమేవారట ఆమె మేను చెలికత్తెలు. అయ్యో! ఆ పాదాలు ఎలా కంది పోయాయో? ఛీ! నాదీ ఓ జన్మేనా? కలకంఠి కంటి కన్నీరొలికించిన నాదీ ఒక జన్మేనా? అనుకుని కుమిలిపోయాడు నలుడు. దమయంతి నిద్దురలో తన బిడ్డల పేరు కలవరిస్తోంది. తల్లిని బిడ్డలను వేరుచేసిన తన పాపానికి పరిహారం లేదని వగచాడు. ఆమెను విడువలేక విడిచిపోటానికి లేచాడు. ఆమె మెలకువ జెంది భర్తకోసం విలపిస్తుంది వెదుకుతుంది. ఆయన జాడతెలియక ఆత్మహత్య చేసుకోదు పిల్లలబంధం విదలించరాని బంధం. కనుక విదర్భకు పోతుంది అని నిశ్చయించిన నలుడు ఆమెను విడిచి పోవటానికే నిశ్చయించినాడు.

నలునికి ఈ వూహ కలిపురుషుని ప్రేరణవల్లనే కల్గింది.

దమయంతి కనులు విప్పిచూసింది భర్త కనబడలేదు. ఎలుగెత్తి పిలుస్తూ వేడుతోంది. నల్లతాచు కాళ్లకి చుట్టుకుంది కెవ్వున అరచింది. "ప్రభూ! కాలనాగు నన్ను కాటువేస్తోంది నన్ను రక్షించండి" అంది. నలు డక్కడ లేడు రక్షించేందుకు.

ఒక కోయదొర వచ్చి త్రాచుబారినుంచి ఆమెను రక్షించి 'నీవెవ్వరో సుందరాంగీ' అన్నాడు. దమయంతి అమాయకంగా తన చరిత్రంతా చెప్పింది.

"నీభర్త ఇంకరాడు. వచ్చినా నాధాటికి ఆగలేడు. ఈప్రాంతానికి నేను మకుటంలేని మహారాజుని, నువ్వు నారాణివి" కమ్మనాడు. వాడు మీద మీదకి వస్తున్నాడు తనను కామించి, వీడువదిలేట్లులేడు అనుకుని వాణ్ణి ఏవగించుకుని 'ఛీ' త్కరించి పతిని తలచింది.

"నేను నీపదాబ్జములే నమ్మిన దాన్నయితే, అన్యమెరుగని దాన్న యితే వీడు నిలువునా దగ్ధమై పోవుగాక" అంది.

వెంటనే ఆ కోయదొర భగ్గున మండి భస్మమైపోయాడు. ఇదంతా పరోక్షంగా చూస్తూన్న 'కలి పురుషుడు' ఇహ ఆవిడ దగ్గరకు వెళ్ళ టానికి భయపడ్డాడు.

దమయంతి భర్తకోసం విలపించి, విలపించి, మెల్లిగా అడుగులు వేస్తూ ఋషి వాటిక చేరింది. "నీవెవరు తల్లీ?" అని అడిగారా మహర్షులు. "త్రికాల వేదులైన మీకు నేనెవరో తెలియదా మహర్షులారా" అంది. "నేను విదర్భరాజ పుత్రిని నిషధేశుని పత్నిని" అందిమళ్ళీ. 'చాలమ్మా చాలు ఇక చెప్పకు, నీభర్త కలిప్రభావం వల్ల రాజభోగాలన్నీ కోల్పోయి అడవుల పాలయ్యాడు, కాని త్వరలోనే పూర్వపు వైభవాన్ని పొంద గలడు." ఆమె దీనత్వం చూసి వారి హృదయాలు కరిగిపోయాయి. కాళ్లకు చుట్టుకున్న విద్యుల్లతలాంటి దమయంతిని లేవదీసి అమ్మా వైదర్భీ! ఇక నీ కష్టాలు ఎంతకాలమో వుండవు. ఆరాటపడకు, నిగ్రహం కోల్పోకు అని, వారివారి వాక్కు అసత్యం కాబోదని చెప్పి అంతర్హితులయారు. అక్కడ మునివాటికాలేదు, మునులులేరు.

ఇది కలా? నిజమా? అని నిర్ణయించుకోలేక పోతోంది ఆమె. తనను ఓదార్చేందుకు వచ్చిన వేల్పులైవుంటారు అనుకుని ముందుకు పోతోంది దమయంతి.

అక్కడ ఒక పట్నం కనిపించింది. ఎంతోమంది జనులు, సంస్కారంలేని కురులతో, జీర్ణవస్త్రంతో ఆకలి దప్పులకు కృశించిన శరీరంతో వున్న తనను చూసి, పిచ్చిదని కేకలు పెడుతున్న పిల్లల్ని తొలగించి ఆదారిన పోతున్న ఓ వణిక్ప్రముఖుడు, ఆవిడ ఒక మహా సాధ్వీలాగుంది అనుకుని ఆమె వివరాలన్నీ తెలుసుకున్నాడు భర్త

"మీగుంపు చేదిపురానికి పోతుందన్నారు కదా నన్నుకూడా తీసుకు పొండి నాయనా ! అని ప్రతిమాలింది"

'అదెంత భాగ్యమ'ని అంగీకరించారు వాళ్లు.

దమయంతికి పిల్లలపైగల వ్యామోహం, ఆత్మహత్యనుండి మరల్చింది. దారిలో క్రూరమృగాల ప్రమాదం ఆ బిడారునంతా చెల్లా చెదరు చేసివేసింది. కొందరు ఆ మృగాల వాత బడ్డారు. హతశేషులంతా భయభీతులై తలొక దిక్కు పరిగెత్తారు ప్రాణభీతితో.

ఇంతజరిగినా దమయంతి రమణీయ సౌందర్యం, రాచదర్పం అతిశయించిందే కాని, వాసి చెడలేదు.

ఆ పట్టణ రాజసౌధం నీడలో నడచి వెడుతున్న దమయంతిని, పైనుంచి రాజమాత చూసి, దాసినిపిలచి 'ఆమెను నావద్దకు తీసుకు రమ్మని' చెప్పింది.

మలినాంబరంలో వున్నప్పటికి ఉన్నత్త రూపులో వున్నప్పటికి అసాధారణ స్త్రీలాగ కనబడకున్న దమయంతిని చూసి "పిలచిన పేరంటానికి రావటమే తప్పుగా భావిస్తున్న నీవెవరమ్మా" అని అడిగింది రాజమాత.

క్షణం తటపటాయించి, రాజమాతకు తన కథ యావత్తూ వినిపించింది. అక్కడ కుండిన నగరంలో భీమరాజు పుత్రికా వియోగంతో పసిపిల్లలైన మనుమల దీనారవాలతో తల్లడిల్లి పోతున్నాడు. తన చిట్టి తల్లికి ఏం తక్కువని అన్ని ఇడుములు పడుతోంది అనుకున్నాడు. గుండె పగిలేలాగ విలపించాడు.

మంత్రులను పిల్చాడు. తన ముద్దులపట్టి దమయంతి ఎక్కడ వున్నది వెదకి తెమ్మని చెప్పాడు. వెతకటానికి వెళ్లినవారు ఉద్దండులు

దమయంతిని వెదకటానికి వెళ్లిన సుదేవుడు భీమరాజుకి అత్యంత
ఆప్తుడు, తిరిగి తిరిగి చేదిపురాన చేరుకున్న సుదేవుడు "ఒక రాచబిడ్డ
చక్కదనాల చుక్క ఎవరో తెలియదుకాని తన భర్తను వెదకుతూ వచ్చిన
సాధ్విని రాజమాత ఆదరించి తన అంతఃపురాన ఏలోటూ లేకుండా
ఆదరిస్తోంది." అనేవార్త పురజనులు చెప్పుకుంటుండగా, సుదేవుడు
విన్నాడు.

అంతఃపురంలో ప్రవేశం దొరకటానికి చాలా శ్రమపడ్డాడు
సుదేవుడు. ఎలాగో దమయంతిని చూశాడు.

"అమ్మా! దమయంతీ, నన్నింకా గుర్తించలేదా తల్లీ, నువ్వు నీ
భర్తకోసం ఎంత పరితపిస్తున్నావో, నీతల్లి దండ్రులు నీకోసం నిద్రా
హారాలు మాని అంతా విలపిస్తున్నారు. నీబిడ్డ లిద్దరూ నీకోసం బెంగటిల్లి
పోతున్నారు. నీ భర్తని మేము వెదకి తెస్తాం. పద తల్లీ విదర్భకు,
ఇక జాగుచేయు" వద్దన్నాడు.

మందు తటపటాయించింది. కాని పిల్లల మీద బెంగతో ప్రయా
ణానికి సన్నద్ధ అయింది. ఇన్నాళ్ళు తన పినతల్లివద్దనే తనున్నట్లు
తెలుసుకుని వెరగుపడింది, సుదేడు రాజమాతను వప్పించి దమయంతిని
తీసుకొని విదర్భకు బైలుదేరాడు.

* * *

అలా దమయంతిని నట్టడవిలో వదలివస్తున్న నలుడికి ఎదురుగా
పెద్ద మంటలు ఆ మంటలో నుంచి "రక్షించండి" అనే ఆర్తనాదం
వినిపించింది. అది వాసుకి ఆర్తనాదం, తను రక్షించిన వాసుకి తన
మీద కాటేసింది. 'అమ్మా!' అని కాలుపట్టుకొని కూలిపోయాడు నలుడు.

"నలమహారాజా! నీకు శుభం జరుగుతుంది, నేను వాసుకిని. నా
కాటువల్ల నీకు మరణభయంలేదు. నీకే ప్రమాదంజరుగదు, నీరూపు
మారిపోతుంది. అయినా నువ్వు భయపడకు. నువ్వు తిన్నగా అయోధ్యా

ధీశుడైన ఋతుపర్ణుడి దగ్గరకు వెళ్లు. ఆయన ఒక్కడే నువ్వు కొల్వ తగిన మహీపతి. నావిషంతో మారిపోయిన నిన్ను ఎవరూ గుర్తుపట్టరు" "అని మానవ భాషలో చెప్పిందా మహాసర్పం. తన పేరు కర్కోటకుడని చెప్పింది. నలుడు కోల్పోయిన వస్త్రాన్ని తెచ్చిచ్చింది.

నలుడిని కాటువేయగానే కర్కోటకుడికి శాపవిమోచనం అయి పోయి చక్కని రాజకుమారునిలా వున్నాడు.

ఆ మహాపురుషుడికి నమస్కరించి తన వస్త్రం అందుకుని ధరిం చాడు నలుడు.

"ఓ మహారాజా! నీ నల్లనిదేహమే నీ భవిష్యత్తుని బాగుచేస్తుంది. పూర్వపు రాజ్య వైభవాన్ని పొందగలవు, నీ భార్యాబిడ్డల్ని చూస్తావు, నీ సర్వ సంపదలు నీవుపొంది ఖండఖండాంతరాల కీర్తి పొందుతావు ఆ రోజు సమీపిస్తోంది. నీవంశం పునీతమయింది.

నీవద్దవున్న అశ్వసారధ్య విద్య ఆయనకు చెప్పు. అప్పుడు నిన్ను ఋతుపర్ణుడు మిక్కిలి గౌరవించి నిన్ను తన కొలువులో చేర్చుకుంటాడు" అనిచెప్పి అంతర్హితుడౌతాడు.

* * *

కర్కోటకుడు చెప్పినట్టుగానే ఋతుపర్ణుని కొలువులో చేరి రోజులు గడుపుకుంటున్నాడు. రూపుమారి పేరు బాహుకుడుగా మార్చుకుని మొదట అయోధ్యానగరంలో అడుగుపెట్టిన ఆ పొట్టివాని, నల్లనివాణ్ణి, కురుచచేతులవాణ్ణి, వికార రూపువాడిని చూసినవారు అటలుపట్టించారు కాని. నలుని తియ్యని పలుకుల వాక్చాతురుని, వినయవిధేయతల్ని చూచి సభలోనికి అడుగు పెట్టనిచ్చారు.

ఆ సభ దేవేంద్రుని కొలువు కూటాన్ని జ్ఞప్తికి తెచ్చేలావుంది.

మెల్లిగా సభాప్రవేశంచేసి సమయంచూసి తనమాటల మాధుర్యం

వల్ల ఆ ఋతుపర్ణునికి దగ్గర వాడయ్యాడు. కొద్దికాలం వంటలవాడిగా వున్నాడు. అశ్వశాస్త్రం తెలిసినవాడు కదా? అశ్వకుడిగా కొంతకాలం పనిచేశాడు. అనుక్షణం ప్రాణప్రియ అయిన భార్య, బిడ్డల వియోగానికి దుఃఖిస్తూనే వున్నాడు నలుడు.

రూపం వికారం, అతనినోటంట వచ్చేమాటలు మధుర మనోజ్ఞం. ఈ బాహుకుడు మామూలు వ్యక్తికాదు ఎవరో మహానీయుడే అనుకుంటున్నాడు ఋతుపర్ణుడు.

వున్నట్టు వుండి దమయంతికి రెండవ స్వయంవరం అని ఆహ్వాన పత్రిక ఋతుపర్ణునికి చేరింది. అది భీమరాజు తన వునికిని తెల్సుకుని తనని రప్పించేందుకు పన్నిన పన్నాగమని తెలియక ఆ ఆహ్వానం చూసి నలుడు పాతాళానికి కృంగిపోయాడు. ఈసారి అయినా దమయంతిని తన ఇల్లాలిని చేసుకోవచ్చు, అని సంతోషాతిరేకంతో ఋతుపర్ణుడు పొంగిపోతున్నాడు. కాని వ్యవధి ఆట్టేలేదే ఎలావెళ్లటం?

ఆయన సందేహం సమంజస మైనదే. శతయోజనాల దూరం ఒకరోజులో ఎలావెళ్లటం? రేపే స్వయంవరం. అంతవేగంగా ఎవరూ రధం నడుపలేరు. అని చింతా క్రాంతుడయాడు రాజు.

నలుడు తన దురదృష్టానికి చింతిస్తూ కలిమాయకు దుఃఖిస్తూ "ఓ కలిపురుషా, ఇంకా నీ మనసు చల్లపడిందా? నామీద పగతీరిందా?" అనుకున్నాడు. వెంటనే వికటాట్టహాసంచేస్తూ కలి ఎట్టఎదుట నిలచాడు. వాడి రూపురేకలు ఎలావున్నాయంటే.

కరుకులై పెరిగిన కురువెంట్రుకలతోడ
బట్టి యౌదలగాని పాగయమర
నిగెడి పూరేకు బాగుగ కత్తిరించిన
గడ్డంబు గొన రొమ్ము, గమ్మిరింప

నీలి పచ్చడముతోడ మేలవింప
నవరక్తచందన ద్రవకల్పితంబైన
నూత్న త్రిపుండ్రమ్ము నొసలనొప్ప

కోరమీసలు, మిడిగుడ్లు, కురచపొడవు
దొప్పచెవులును, గొగ్గిపండ్లను కలిగి
యున్న మద్రీవుడై వచ్చియున్నవాడు
గలి మహారాజు సాక్షాత్కరించె॥

కలిపురుషుడి ఆకార వికారాదులు బొమ్మగీసినట్టు రాశాడు శ్రీనాధుడు. ఎన్ని అవకరాలు వుండాలో అన్నీవున్నాయి. చూడగానే ఒళ్ళు గగుర్పొడిచేలావుంది అరూపం అని రాశాడు శ్రీనాధుడు. పైగా ఎదుట నిలబడి వున్న కలిపురుషుడికి చాలా వుల్లాసంగా వుంది. తను ప్రేమించి పెండ్లాడిన దమయంతికి రెండవ స్వయంవరం అనగా నలుడు ఎంత క్షోభిత మనస్కుడైనాడు? అతని ముఖం ఎంతమాడిపోయింది? అవును మరి తనబ్రతుకు ఎందుకూ కొరగాకుండాపోయింది. సర్వసంపదలూ తొలగిపోయి, రూపమూవికృతం అయిపోయింది. ఇంక దమయంతి రెండవ స్వయంవరం ఎందుకు చాటించదూ? నాప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాను. అనుకుని ఆనందంగా ఎగిరిపడ్డాడు. అదేతనకు కావల్సింది.

అది పుట్టుటి స్వయంవరమేనని, త్వరలో తనరాజ్యం తనభార్య తనబిడ్డలు తనకు దక్కి మళ్ళీ దివ్యతేజస్సుతో నలచక్రవర్తి దశదిశలు పరిపాలిస్తాడని అప్పుడు అనుకోలేదు కలిపురుషుడుపాపం. ఋతుపర్ణుని ఉత్సుకత చూసి రధసారధి అన్నాడు.

"ప్రభూ! ఇక్కడకి విదర్భ శతయోజనాల దూరముంది. రేపు సూర్యోదయానికి అక్కడికి చేరుటెలా మానవ మాత్రులకు సాధ్యమా?"

అని సందేహం వెలిబుచ్చాడు. అవునుగదూ? ఋతుపర్ణుని మనసు చెదిరి పోయింది.

భూమిలోకి కుంగిపోయినట్లయింది రాజుకి ఉత్సాహమంతా ఊదేసినట్టయింది.

ఇంతలో మెరుపులాటి వూహ తట్టింది. ఋతుపర్ణుని వదనం వికసించింది మళ్ళీ.

తన కొలువులోవున్న బాహుకుడు అశ్వసారధ్య విశారదుడు. ఇక ఆలస్యమెందుకు? బాహుకుడిని పిలిపించి విషయం విశదపర్చాడు. రథమాయత్తం చేయమని ఆజ్ఞఇచ్చి చక్కగా అలంకరించుకోటానికి ప్రారంభించాడు.

హతవిధీ! వరుని నేనే తీసుకెళ్ళి అప్పగించాలా? అనుకున్నాడు నలుడు. అయోధ్యాధీశుడు ఇదేమీ గమనించడు.

"రేపు శుభోదయానికల్లా మనం విదర్భలో వుండాలి. సమయం లేదు. సరిగ్గా సమయానికి మనం అక్కడ చేరకపోతే ఆ సౌందర్య ఖని దమయంతిని మొదటి స్వయంవరంలోవలెనే మరో రాజేంద్రుడు తన్నుకుపోవచ్చు. కనుక త్వరపడాలి మనం అన్నాడు.

నలుడు ఉలకడు పలుకడు కదలడు.

ఆయన మనసంతా నారీలోకాన్ని శపిస్తోంది. ఔరా! రాజ్యశ్రీ వున్నంత కాలమే నా సతీత్వం. సంపద వైతొలగ్గానే మరోస్వయం వరమా? కులస్త్రీకి ఇద్దరు బిడ్డల తల్లికి?"అని బాహుకుని మనసు కుతకుత ఉడికిపోతోంది. బాహుకుని మనసు ప్రభువుకేం తెలుసు. ప్రభువు గద్దింపుకి బాహుకుడు చైతన్యం పొందాడు త్వరగా రధానికి గుర్రాలను పూన్చి అనుకున్నాడు. "పోనీ విదర్భకి వెళ్ళి పతనహేతువైన స్వయం

వరాన్ని చూద్దాం" అనుకున్నాడు. "పదండి ప్రభూ" అన్నాడు. గుర్రాలను నిమిరాడు. రథం పరుగందుకుంది. ఆ పరుగు ఇక ఆగదు.

నేలను విడిచింది రథం, రోదసిని దాటింది. ఋతుపర్ణుడికి కళ్ళు తిరిగాయి. "ఇతడు మారువేషంలో వున్న మాతలి కాదు కదా? అనుకున్నాడు. "విదర్భ చేరాం, దిగండి ప్రభూ" అన్నాడు నలుడు.

"నలచక్రవర్తి! నన్ను క్షమించు, నిన్నెన్నో ఇడుములపెట్టాను. నిన్ను నాశనం చేయాలనుకుని నేనే నశించిపోతున్నాను. నిన్ను ఆశ్రయించివున్న నేను కర్కోటకుడి విషాన్ని జీర్ణించుకోలేక అనుభవిస్తున్నా నన్నాడు కలి. నలుడు రుద్రుడైనాడు "ఛీ! నిన్నా క్షమించటం. నా సతిని నాకు దూరం...." "నలమహారాజా! చచ్చిన పాముని ఏం చంపుతావు? నామీద ఆగ్రహించకు. నువ్వు నీ సతీసుతులతో నీ రాజ్యం చేరుకుని మునుపటి భోగాలనుభవిస్తావు, అవివేకిని నన్ను మన్నించు" అని నమస్కరించి ఎదురుగా వున్న తాళవృక్షం వడివడిగా అధిరోహించి మొవ్వలో దాగాడు.

నలుడు కలిని కనికరించాడు. తాళవృక్షం కలి నిలయం.

ఆ రథఘోష విని దమయంతి వికసితవదన అయింది. గుర్రాల సకిలింపు గిట్టుల చప్పుడు, అన్నీ ఆమెకు సుపరిచితాలే. "నా నాధుడు విదర్భకు వచ్చేశాడు. బిడ్డలారా మీతండ్రి అడుగో" అంటూ హడావిడి పడిపోతోంది దమయంతి. పరుగెడుతోంది ఇటూఅటూ, ఆనందబాష్పాలు చెక్కిళ్ళపై రాలుతున్నాయి.

రథం దిగుతున్న అయోధ్యాధీశునకు తన తండ్రి స్వాగతమిస్తున్నాడు. ఋతుపర్ణుడు రథందిగి నాలుగువైపులా పరికించి చూశాడు. స్వయంవరపు సందడి కాస్తయినా కానరాదే? తను తప్ప ఇంకెవరు రాలేదా? ఏమిటీ మోసం? అనుకున్నాడు.

ఆయనకు చక్కని ఆతిథ్యమిచ్చి గౌరవించాడు భీమరాజు. బాహుకుడు వార్ష్ణేయుడు గుర్రాలను సేదదేర్చారు. ఒక రథచక్రానికి జార్లబడి కూర్చున్నాడు బాహుకుడు నిద్రరాలేదు.

ఏమిటీవింత స్వయంవర సన్నాహాలేమీ కనబడటం లేదు. మరో రాజువచ్చినట్టు కనబడదు.

దమయంతి పట్టలేకపోతోంది నలుణ్ణి చూడాలనే ఆవేదన. మంచి చతురికను పంపింది అశ్వశాలకి, ఆయన ఎలా వున్నాడో చూసిరమ్మని. కేశిక వచ్చి "క్షేమమా మహారాజా!" అంది "ఇక్కడ మహారాజెవరు?" అన్నాడు. "మీ క్షేమం తెలుసుకరమ్మంది మా చెలి" అంది మళ్ళీ.

"ఉదార హృదయుడు జాలి మనసు గలవాడు ధర్మసంధాతా అనుకున్నాం నలుణ్ణి. ఆయన కాస్తయినా కనికరం లేకుండా సగం వస్త్రంతో వున్న భార్యను అరణ్యంలో ఆమె ఖర్మకి ఆమెను వదిలేసి పోతాడా? ఆవిడ ఎన్ని ఇక్కట్లు పడిందని, ఆ కుసుమకోమలి క్రూర మృగాల గర్జనకి తల్లడిల్లిపోతూ దాహంతో గొంతెండి ఆకలి నిద్ర మరచి ఒంటి ప్రాణంతో ఇక్కడకు తీసుకురాబడింది దమయంతి. ఇప్పటికీ ఆ లతాంగి కటికనేలనే పవళిస్తోంది. భర్తకోసం పలవరిస్తోంది అని కన్నీరు కార్చింది. దమయంతి పడిన ఇడుములు వింటూ నలుడు కూడా కన్నీరు కార్చాడు. ఆ చెలి అంతఃపురంలోకి పరుగెత్తి నలుడు కన్నీరు కార్చిన సంగతి చెప్పింది. ఆయన వికృతాకారుడమ్మా తన పేరు బాహుకుడని చెపుతున్నాడు అంది.

ఈసారి దమయంతి ఇష్టసఖి పిల్లలనిద్దరిని తీసుకుని బాహుకుని వద్ద కొచ్చింది. వీళ్ళిద్దరు దమయంతి బిడ్డలు అని చెప్పింది. నలుడు వాళ్ళిద్దర్ని ఒడిలో కూర్చుండ బెట్టుకొని వాళ్ళ ముద్దుమాటలు వింటూ వెక్కివెక్కి ఏడ్చాడు. "నలమహారాజు బిడ్డలు వీళ్ళు. నువ్వెందుకయ్యా! కంటతడిపెడతావు?" అని అడిగింది.

"అంత మహారాజు బిడ్డలైవుండి తండ్రి ప్రేమను నోచుకోని చిన్నారులు" అన్నాడు. ఆ మాట దమయంతి కెరిగించింది. మళ్ళీ వచ్చి చాటుగా నిలబడింది సఖి" ఎవరూ లేరనుకున్నాడు నలుడు.

"దమయంతీ! నా దమయంతీ, రేపు నీవు పరాయి సొత్తయిపోతావా?" అంటూ గుండెపగిలేలా ఏడ్చాడు నలుడు.

పరుగున వెళ్ళి దమయంతికి చెప్పింది సఖి. ఆ వికృతాకారుడే తన ప్రాణవల్లభుడని నిశ్చయించుకుంది దమయంతి. తనకష్టాలు నేటితో గట్టెక్కినట్టు భావించింది ఆ మానవతి.

మరునాడు భీమరాజు రాజభవనంలో ఉచితాసనాన వున్నాడు ఆయన పక్కనే మహారాణి కూర్చుంది. ఆ ప్రక్కన తన పుత్రిక దమయంతిని కూర్చుండ పెట్టుకుంది. ఋతుపర్ణుడు అతిథి గృహసత్కార్యాలు పొందుతున్నాడు. బాహుకుడు అక్కడేవున్నాడు. వార్ష్ణేయుడు కూడా వున్నాడు. బాహుకుని కళ్ళనుంచి సంతతధారగా ప్రవహిస్తోంది కన్నీరు.

ఇక ఎంతమాత్రం సహించుకోలేకపోయింది దమయంతి.

"ప్రభూ! మీరేనా ధర్మనిరతులైన నలమహారాజు. నిన్ను నమ్మి నిద్రపోతున్న సాధ్విని కారడవిలో నిర్దయగా వదలిపోతారా? ఇందుకేనా సురలఎదుట మిమ్మల్ని వరించినది? అనృతమాడని మహారాజులుకదా? ఆనాడు ఏమన్నారు? నేనే మీ పంచప్రాణాలు అనలేదా?" అంది డగ్గుత్తికతో. "దేవీ! నన్నావహించిన కలి నన్నొదిలి పారిపోయాడిప్పుడు. నన్ను వాడెన్ని బాధలు పెట్టాడో ఆ బాధల్లో ఏం చేశానో నాకిప్పుడేం తెలియదు అవన్నీ అలావుంచు. కులకాంతవై యుండి, ఇప్పుడు నీవు చేస్తున్నదేవిటి? అన్నాడు నలుడు. దమయంతికి రెండవ స్వయంవరం అనే మాట నలుణ్ణి దహించి వేస్తోంది.

"స్వామి! అదంతా వట్టిది. నా శీలం శంకించకండి. మిమ్మల్ని

అనవాలు పట్టిన సుదేవుడు నా తండ్రి కలసి మిమ్మల్ని ఇక్కడికి రప్పించేందుకే ఈ పన్నగడంతా నన్ను నమ్మరా?" అని భర్త పాదాలపై వాలింది దమయంతి. భార్యని లేవనెత్తాడు కళ్లుతుడిచాడు. సరస్వతి అశరీరవాణిగా పలికింది "నలమహారాజా! దమయంతి సుశీల" అని చెప్పింది. కర్కోటకుని తల్చుకుని నమస్కరించాడు నలుడు.

నలుని స్వరాలంకారశోభితునిగా చక్కని తేజోరూపవంతునిగా చేశాడు కర్కోటకుడు. ఈ జరిగిన కథంతా విన్న ఋతుపర్ణుడు అతిథి గృహంనుంచి హుటాహుటీ వచ్చాడక్కడికి.

ఇంక ఆయన మనసు దమయంతి సౌందర్యంమీద ప్రసరించటం లేదు. తన రాక ఒక మహాకార్య సానుకూల కారణమైంది కదా అని ఆనందపరవశుడైనాడు.

మహాతేజస్వంతుడయిన నలమహారాజు చేతులు రెండూ పట్టుకుని "నీచేత సేవచేయించుకున్నందుకూ నిన్ను భృత్యుడుగా చూసినందుకూ నన్ను క్షమించు మహారాజా, నీచేత నీచకార్యాలన్నీ చేయించాను. మూర్ఖుణ్ణి క్షమించాలను, నీవు లోకపూజ్యుడవు" అని కరాలు జోడించాడు ఋతుపర్ణుడు.

"ఋతుపర్ణా! నువ్వు చింతించకు. ఎంతవారికైనా విధిని దాటశక్యం కాదు. నీ కొలువులో వుండకపోతే ఈ శుభసన్నివేశం అసలు కలుగుతుందా?" అంటూ గౌరవించి అయోధ్యకి సాగనంపాడు.

కొంతకాలంవరకు భీమరాజు కూతుర్ని అల్లుడిని మనుమల్ని తన వద్ద నుంచి కదలనియ్యలేదు.

ఆ తరువాత నలమహారాజు భార్యాబిడ్డలతో బైలుదేరాడు. వారిని అక్కడే వుంచి తనొక్కడే కొందరుయోధుల్ని దివ్యరథాన్ని తీసుకుని పుష్కరుని వద్దకెళ్ళి "పుష్కరా! మళ్ళీ జూదంఆడు నాతో, లేదా యుద్ధం చేసి నన్ను గెలువు" అన్నాడు.

యుద్ధంలో ఎలాగా నలుని గెల్వలేదని తెలుసు. ఇక జూదంలోనే గెలవాలి ఇదివరకు మాదిరిగా అనుకున్నాడు. పాచికల్లో ఇంక 'కలి' వున్నాడని, ఈసారికూడా తనే గెలుపొందుతానని అనుకున్నాడు పుష్కరుడు. పందె మేమిటన్నాడు 'నీ ఇష్టం నువ్వే చెప్పు' అన్నాడు "నేను ఓడిపోతే నా సర్వస్వం నీదే, నీవు ఓడిపోతే నీ దమయంతి నాది" ఇష్టమేనా? అన్నాడు పుష్కరుడు.

"ఓరి మూర్ఖుడా? ఇంకా గెలుపు నీదే అనుకుంటున్నావా?" అని సరే అన్నాడు. దమయంతీ పరిష్వంగం తలుచుకుని మురిసిపోతూ గెలుపు తనదే అనుకుంటూ పాచికల్ని ముద్దుపెట్టుకుని విసరివేశాడు.

తనువూహించినట్టుకాక, పందెం ఎదురుతిరిగింది. పుష్కరుడు అవాక్కయాడు. ఇదివరకు అనుకూలమైన పాచికలు, ఇప్పుడు ప్రతికూలమయాయి. 'కలి' పాచికలనుండి తొలగిపోయాడని కూడా అతనికి తెలియదు పాపం. సకలసామ్రాజ్యాన్ని క్షణంలో ఓడిపోయి పుష్కరుడు వట్టి బికారి అయాడు. నిషధరాజ్యానికి సార్వభౌముడైన నలుడు ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యం పరిపాలించాడు.

భార్యాబిడ్డలను సాదరంగా తెచ్చుకుని సర్వసౌఖ్యాలు ఒనగూర్చి ఆచంద్రతారార్కమైన కీర్తి నార్జించాడు.

ఆనాటినుండి రాజ్యంలో సుఖశాంతులు వెల్లివిరిశాయి. ప్రజలంతా సర్వసంపదలతో తులతూగారు. నలదమయంతులను తలచిన వారికి 'కలి'యొక్క చెడు ప్రభావం తాకదని ఇలా చెప్పారు.

ఇమ్మహాకృతి బఠియించు ఎవ్వడేని
యాతడవగత కలిదోషు డగుచు గాంచు
నాయురారోగ్య విమల విద్యా వివేక
భాగ్యసౌభాగ్య వైభవ ప్రాభవములు.

మనదేశ చరిత్రలో ఎంతోమంది సతీమతల్లులు తమ పట్టినపట్టు ఎన్ని ప్రమాదాలు ఎదురైనప్పటికి, తమ నిర్మల ప్రేమకి ఎన్ని అవంతరాలు వచ్చినప్పటికి అదరక బెదరక దృఢ చిత్తంతో కొనసాగించుకున్నారు. వారిలో దమయంతి దృఢచిత్తాన్ని ఆమూలాగ్రం పరిశీలించిన మీదట 'ఔరా' అని ముక్కుమీద వేలుంచుకోవలసిందే మనమంతా.

లేకపోతే కర్ణాకర్ణిగా విన్న నలమహారాజుయొక్క రూపగుణ శీలాలూ, ధైర్యపరాక్రమాలు దమయంతి విన్నదే అనుకోండి. ఒక రాజహంస వచ్చి ఆ మహారాజు సౌందర్య విశేషాలు ఆమెతో అతి చాతుర్యంగా మనసుకి హత్తుకునేట్టు చెప్పటమేమిటి?

ఆ మాటలకి ఈవిడ నలుని తప్ప మరొకర్ని చేసుకోవల్సివస్తే నా ప్రాణమే త్యజిస్తానని శపధం చేయట మేమిటి? పైగా వేల్పులు దిగి వస్తారా నలునికిపోటీగా. ఆమెసౌందర్యం దేవలోకవాసులకీ అంతముచ్చట గొల్పిందంటే నరుడైన నలుడికి ఎంత మత్తెంక్కించివుండాలి చెప్పండి.

ఇహ ఆది మొదలు ఆ నలదమయంతులకి అడుగడుగునా అగ్ని పరీక్షలే. ఆ దేవేంద్రాదులను సరస్వతి కృపవల్ల గుర్తించి స్వయంవరం నిర్విఘ్నంగా కొనసాగినప్పటికి 'కలి' ప్రభావం నుంచి తప్పించుకోలేక పోయారు. లెక్కలేనన్ని ఇడుములపడి చివరకు తన రాజ్యసర్వస్వం పొంది అఖండ విజయం సాధించింది వారి ప్రేమ.

తెలుగు నింగిలో ఈ నలచరిత్ర ధృవతారకారోచిస్సులు వెల్లివిరియచేసింది. పాండవ వనవాస సందర్భంలో దౌమ్యులవారు నల చరిత్ర చెప్పారు ధర్మరాజుకి నావంటి దురదృష్టవంతులు మరొకరుండరు' అన్న యుధిష్టరుడికి.

"షట్చక్రవర్తులలో వొకడైన నిషదాధిపతి కథ విను కలికల్మష నాశనమయినదీ నువ్వు వినతగ్గదీ" అని చెప్పాడా మహర్షి.

కష్టాల్లో వున్నప్పుడు ప్రతివాళ్లూ అలా అనుకోవటం సహజం. పెద్దలు, ఇంతకన్నా కష్టపడ్డవాళ్ళ చరిత్రలు చెప్పి నీకన్న ఎక్కువ గానే పడ్డాడు కష్టాలు అని చెప్పటం కూడా పరిపాటి.

వారిలాగే నీ బాధలు కూడా విడిపోయి అపరిమిత సౌఖ్యాలను భవించగలవు. అంటే వారు తమకష్టాలను మర్చిపోయి మంచిరోజుల కోసం ఎదురుచూస్తూ గడుపుతారు రోజుల్ని. నలుడి ఒక్కడిలో పాండవులు అయిదుగురి అంశవుంది. ధర్మరాజులా దాయాదులతో జూదమాడి సర్వస్వం కోల్పోయి అరణ్యవాసంచేశాడు నలుడు. అక్కడి పాచికలు శకుని మాయతోకూడినవి. ఇక్కడ పాచికలు 'కలి'మాయతో కూడినవి. భీమునిలా వంటలుచేశాడు ఋతుపర్ణుని కొలువులో నలుడు. అర్జునుడిలా రూపుమారాల్సి వచ్చింది, పేరు మారాల్సి వచ్చింది. నకులుడిలా అశ్వ విద్యలో ఆరితేరినవాడు నలుడు. సహదేవునిలా గోపాలుడు నలుడు. అందుకు పాండవుల ఐదుఅంశలు నలుడిలో వున్నాయి అన్నారు.



# రుద్రాక్ష

ఈ భరతవర్షాన వేదాలు, ఉపనిషత్తులూ, భారత, భాగవత రామాయణేతిహాసాలూ గౌరవించబడుతూ మనుగడ సాగిస్తున్నాయంటే మన అదృష్టమనే చెప్పాలి.

నాదం వేదాత్మకమన్నారు. వేదం పరబ్రహ్మస్వరూపం అన్నారు విజ్ఞులు.

నాదస్వరూపుడు పృథివ్యాది పంచభూతాత్మకుడు ఉపనిషత్ ప్రతిపాద్యుడు అయిన శివుడు స్వయం ప్రకాశుడు.

శివశబ్దం మంగళప్రదం.

శ్రుతులు, స్మృతులు రెండూ భగవంతుని ఆజ్ఞలే. అవి రెండూ శిరోధార్యాలే. వాటినుల్లంఘించినవారు ఈశ్వరునే ద్వేషించినవారై, అధః పతితులౌతారు.

* * *

సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వశక్తి సంపన్నుడు, అభవుడు అయిన పరమేశ్వరుడు, బ్రహ్మని చూసి అసహ్యించుకున్నాడు, నిందించాడు. ఎందుచేతనంటే బ్రహ్మ తన కూతురైన సంధ్యాదేవియందే మరులకొన్నాడు కనుక.

శివుణ్ణి ఎలాగైనా ప్రేమ సముద్రంలో ముంచేయాలని బ్రహ్మ ప్రతిజ్ఞబూనాడు. శక్తిని గురించి తపస్సుచేసి ప్రసన్నం చేసుకున్నాడు

...ినట్టుగా దక్షుని పుత్రికగా జన్మించి శివుణ్ణి వివాహ
బ్రహ్మకు మాటిచ్చింది శక్తి.

న్నారు?

నీవు నా పుత్రికవై హరుని పత్నిగాగలిగితే అది జగత్తుకే హిత కరమైనదన్నాడు.

"నీ కోరిక అంగీకరిస్తున్నాను కాని నీవు నన్ను ఎప్పుడైతే తిరస్కరించి అవమానిస్తావో ఆ తక్షణమే ఈ శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళిపోతానంది శక్తి."

సరే దక్షుని కోరిక ప్రకారం శక్తి జన్మించింది. కాలక్రమాన శివుని వివాహమాడి భర్తతో వెళ్ళిపోయింది.

సౌందర్యం, సౌశీల్యం, తేజస్సు, వినయం మొదలైన ఉత్తమ గుణాలు గల సతీదేవి. తన భర్తే దైవంగా, కైలాసమే తన ఉనికిగా వున్న సతీదేవి తన తండ్రి చేస్తున్న యజ్ఞాన్నిగూర్చి పయనమై వెడు తున్న మహర్షులవల్ల విని, తన భర్తని కూడా ప్రయాణంకమ్మని తొందరచేసింది.

"మననెవరు పిల్చారు సతీ!" అన్నాడు నవ్వుతూ.

మా తండ్రి మర్చిపోయాడేమో ఆ పనుల వత్తిడిలో వెళ్ళక తప్పదని గట్టి పట్టుపట్టింది.

"మీరు రాకపోతేమానె, నన్నైనా వెళ్ళనియ్యరా స్వామీ!" అంది చింతాకంత మోహం చేసుకుని.

ఎంత తెలియ చెప్పినా వినలేదు సతీదేవి. తీరా అక్కడికెళ్ళాక 'బిడ్డా! వచ్చావా?' అని అక్కున చేర్చుకుంటారనుకున్న ఆమె వూహ అబద్ధమైంది. పలకరించినవారే కరువయారు. సతీదేవివస్తే ఎవరూ పలక రించటానికి వీల్లేదని అప్తులందరికి కఠినంగా ఆజ్ఞాపించాడు.

స్త్రీకి భర్తే దైవం. ఈ సమాజంలో భర్త ప్రక్కన లేకపోతే తగిన గౌరవ మర్యాదలు అభిప్రాయపడుకోటం పెద్ద పొరపాటు కదా?

ఇతరులెవరూ కాదు, స్వంత తలిదండ్రులతే కన్నబిడ్డని తేలిక చేసి చూస్తే ఏ ఆడది భరించగలదు? అమ్మా! పరమశివునికొమ్మా! వచ్చావా అమ్మా అని ఒక్కరూ పల్కరించలేదు ఆమెని.

ఎంతో అభిమానానికి నెలవన్న చోట తగనిఅవమానం, అగౌరవం ఎదురైతే ఎలా నిభాయించుకొని నిల్దొక్కుకోగలదు? తండ్రి యజ్ఞం చేస్తున్నాడు. ముక్కోటి దేవతలు వస్తున్నారు అని ఎంత ఆనందంగా, ఎంత ఆతృతగా, ఎంత అభిమానంగా వెళ్ళిందో అంత అవమానంపొంది ఆత్మాహుతి చేసుకుంది. దక్షప్రజాపతి కూతురు దాక్షాయని సర్వేశ్వరుని అర్థాంగి సతీదేవి. ఒళ్ళు మండించుకుంది కోపంతో. ఆ మంటలో దగ్ధమైంది సతీదేవి.

దక్ష ప్రజాపతి యజ్ఞంలో దగ్ధమయాక ఆ దాక్షాయని హిమవంతుని అనుంగుపుత్రిగా పార్వతియై అవతరించింది. ఆ పర్వతరాజు తరించాడు. దినదిన ప్రవర్ధమానంగా పెరిగిపెద్దదై, కళలన్నీ సంతరించుకుంది.

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశిదేవాతాత్మా, హిమాలయోనామ నగాధిరాజః

అనేక రత్నములు ఓషధులచేత ప్రకాశించే గొప్పదైనది ఆ హిమవత్పర్వతం.

ఆ సతీవిశ్లేషాన్ని భరించలేని పరమశివుడు హిమవత్పర్వతం మీదకి తపస్సుకై బైలుదేరాడు. అక్కడకే ఎందుకు వెళ్ళాడంటే? యజ్ఞసాధనకు, మనశ్శాంతికి, తపశ్చర్యకు అనుకూలమైనది. సప్తర్షి మండలానికి దిగువనగలది హిమవద్గిరి, తగినదికనుక. సతీదేవి తన తండ్రి అయిన దక్షప్రజాపతి పరమేశ్వరునిచేసేనిందను భరించలేక

శరీరాన్ని విడిచిందే కాని భర్త ఎడబాటును సహించలేక ఆయనను పొందేందుకై ఆ పర్వతరాజు భార్య అయిన మేనకాదేవిని పొందింది.

చక్కనిసంతానాన్ని ఆశించి, అందుకై అనేక వ్రతాలు, దానాలు చేస్తున్న మేనకా హిమవంతుల తనూజగా జన్మించాలని కోరికగల సతీ దేవి, చక్కని స్థల నిర్ణయం చేసుకుంది.

శ్లో॥ ప్రసన్న దిక్పాంసు, వివిక్త వాతం, శంఖస్వనానన్తర పుష్పవృష్టిః
శరీరిణాం స్థావర జంగమానాం, సుఖాయ తజ్జన్మదినం బభూవ.

ఆమె జన్మించిన రోజు చరాచర ప్రపపంచమునకు అంతాసుఖకరంగా వుంది. చల్లనిగాలివీచింది. చక్కని శంఖధ్వనులుద్భవించాయి. పుష్ప వర్షం కురిసింది.

చంద్రలేఖవలె ఆ బాల దినదినాభివృద్ధి పొందుతూ పర్వతరాజు పుత్రి, కనుక పార్వతి అనే పేరుతో పిలువబడుతోంది.

రాత్రియందు ఓషధులు స్వభావసిద్ధంగానే వెలుగునిచ్చినట్లు క్రిందటి జన్మలో అధ్యయనంచేసిన విద్యలన్నిటిలో పార్వతి ఈజన్మలో తనంతట తానే సుస్థిరత పొందింది.

బాల్యం వీడి మారుని శరంవంటి వయస్సు సంతరించుకుం టోందా బాలిక. కొత్త వయసును దాల్చిన పార్వతి వికసించిన పద్మంలా గొప్ప చిత్రకారుడు తన కుంచెతో తన ప్రావీణ్యతనంతా చూపించి మలచిన చక్కని చిత్తరువులా భాసిస్తోంది.

లేడిపిల్లలు ఆ బెదురు చూపులన్నీ ఆవిడదగ్గరే నేర్చుకున్నాయా? అన్నట్లు అనిపిస్తోంది.

చిలుకలు, గోర్వంకలు, ఆమె దగ్గరే మాటలు నేర్చుకున్నట్టు.

నెమళ్లు ఆమె దగ్గరే నడుకలు నేర్చుకుని నర్తిస్తున్నాయా? అన్నట్లు

హంసలు అడుగులు వేయటమే ఆమె దగ్గర నేర్చుకున్నట్లు అని పిస్తోంది.

ఒకరోజు కామగమనం కలిగిన నారదమహర్షివచ్చి పరమశివుడిని గూర్చి హిమవంతుడికి చెప్పాడు.

పార్వతిదేవియొక్క సౌందర్యాతిశయాన్ని చూసి ముచ్చటపడి ఆమె నమస్కరించగా 'శివుని అర్ధాంగాన్ని పొందు'మని దీవించాడు.

ఇది మనసులో వుంచుకున్న హిమవంతుడు తన పుత్రికి యుక్త వయసువచ్చినా వరుని వెదకటం అనే పని మానుకున్నాడు.

'మంత్రపూతమయిన హోమద్రవ్యం అగ్నిహోత్రుని కొక్కనికే అర్హం' కదా? అలాగే పార్వతిదేవినిగైకొనుటకు ఈశ్వరుని కొక్కనికే గదా అర్హత.

ప్రతి కన్యతండ్రికి వుండే తహతహ అదే కదా? తనబిడ్డకి తగిన వరుడు దొరుకుతాడా! అని.

దక్షయజ్ఞంలో సతీదేవి కోపంతో ఎప్పుడైతే శరీర త్యాగంచేసిందో అప్పటినుంచి ఈశ్వరుడు విషయాభిలాషవిడిచి ఇతర స్త్రీయందు వాంఛ లేక విరక్తుడై వున్నాడని తపోనిమగ్నుడయాడని విన్నాడు కదా? ఈశ్వరుడు అడగకుండానే తన బిడ్డనిస్తానంటే అంగీకరించడేమో? తన ప్రార్థన వ్యర్థమవుతుంది కదా? అని జంకియూరకున్నాడు.

శ్లో॥ తత్రాగ్నిమాధాయసమిత్సమృద్ధం, స్వమేవమూర్త్యన్తరమష్టమూర్తిః
స్వయం విధాతాతపసః ఫలానాం, కేనాపి కామేన తపశ్చచారం॥

ఇలా అష్టమూర్తులను గూర్చి తపస్సు చేస్తున్న ఈశ్వరుని హిమవంతుడు, తాను పూజించి, ఆయన సేవలకై చెలికత్తెల సహితంగా తన పుత్రికను నియమించాడు. అదీ ఆమెకోర్కె తెలుసుకున్నాడు. కనుకనే అలాంటి ఏర్పాటు చేశాడు హిమవంతుడు.

ఏ కారణంచేత తపోభంగమౌతుందో అట్టి పదార్థమున్నప్పుడే కదా దృఢంగా వుండాలి. ఆ పరీక్షకు నిలబడ్డ వాడే కదా ధీరుడు. కనుకనే ప్రతికూలురాలు అయినప్పటికి పార్వతి సేవ కంగీకరించాడు శివుడు.

ఆ పార్వతీదేవి పూజ కుసుమాలని తెస్తూ వేదికను శుభ్రపరుస్తూ అనుష్టానానికి దర్భలు, నీళ్లూ తెస్తూ ప్రతిదినం శివుని సేవిస్తోంది.

తపస్సు చేయవద్దంది, పార్వతీతల్లి మేనకాదేవి.

"ఉ=ఓ చిన్నదానా ! మా=తపస్సువద్దు" అంది కనుక, ఉమ అయింది ఆమె.

ఆ కాలంలోనే తారకాసురుని చేత ఓడిపోయిన దేవతలు ఇంద్రునితో గూడ బ్రహ్మయొద్దకు వెళ్ళి, ఆయనను ప్రార్థించారు.

శ్లో॥ త్వం పితౄణామపి పితా, దేవానామపి దేవతా
పరతోపి పరశ్చాసి, విధాతా వేధసామపి

ఇలా అనేక విధాలుగా ప్రార్థించిన దేవతలతో బ్రహ్మ అన్నాడు. ఏకాదశ రుద్రులూ, తలలు వ్రేల వైచుకుని చంద్రకళలు జారునట్లుగా, తమ హుంకారముమాని దీనులై వున్నారేమి?

బిడ్డలారా నావల్లకోరే సహాయమేదో చెప్పండి, సృష్టి నాచేతిలోనిది

దేవేంద్రుడు నేత్రపద్మాలు కదిలించి చెప్పమనట్లు బృహస్పతికి కనుసైగ చేశాడు. గంభీరవాక్ ప్రౌఢిమగల దేవ గురువు బృహస్పతి బ్రహ్మకు నమస్కరించి చెప్పనారంభించాడు. ఇటువంటి సందర్భాల్లో మాటచాతుర్యం వున్నవాళ్ల ముందుకు తోస్తారు.

ఓ సర్వాంతర్యామి అయిన భగవంతుడా! నీకు తెలియనిదేముంది మా అధికారాన్ని శత్రువు లాక్రమించారు.

నీచేత వరములు పొంది గర్వించిన తారకాసురుడు లోక నాశ

సూర్యుడు తారకుని పట్టణాన తగిన వేడిమి చూపాలి కాని ఎక్కువగాని తక్కువగాని చూపడానికి భయపడుతున్నాడు. చంద్రుడు వృద్ధిక్షయాలు లేకుండా ఆ పట్టణాన ఎప్పుడు కళలన్నిటితో సేవిస్తున్నాడు.

ఉద్యానవనాన మిక్కిలి ఎక్కువకాక, బహు తక్కువ కాకుండా గాలి విసురుతూ ఉండవలసినదే.

సంద్రుడు తనలోని రత్నాలు తెచ్చి ఈయవలసిందే.

దేవేంద్రుడు ఆ తారకాసురునికి కల్పవృక్ష జాతములయిన మణులు మొదలగునవి కానుకలుగా యిచ్చి దయను కోరవలసినదేకదా!'

ఇలా సేవించబడుతూ కూడా ముల్లోకాలను దుఃఖ పెడుతున్నాడు. దుష్టుడుపకారం చేస్తే శాంతించడు. అపకారమే చేయాలి వానికి.

దేవతాస్త్రీల మృదుహస్తాలు సేవలు చేసి చేసి మొద్దు బారిపోయాయి.

ఈ దుష్టుడు దేవతలకొరకై నిర్ణయించబడిన హోమద్రవ్యాల్ని తనే లాక్కుంటున్నాడు.

ఉచ్చైశ్రవం అనే అశ్వాన్ని దొంగిలించాడు. సామాదిగుణాలు వానియందు పనిచేయటంలేదు. హరిచక్రం సాధించగలదను కున్నాం. కాని అదికూడా వృధా అయిపోయింది.

కావున ప్రభువా! దుర్మార్గుడగు తారకుని వధకు సేనానాయకుని మేం కోరుతున్నాం" అన్నాడు బృహస్పతి.

సరైన సేనా నాయకుడుంటే పోయిన సంపద తిరిగి రాబట్టుకోవచ్చునని వారి ఆలోచన.

సంపత్స్యతేవః కామోయాం, కశ్చిత్కాలః ప్రతీక్ష్యతాం
నత్రృస్య సిద్ధౌయాశ్యామి, సర్గవ్యాపార మాత్మనా॥

అని బ్రహ్మ నిశ్చలము నిబ్బరము అయిన స్వరంతో అన్నాడు. మీకోర్కె పరిపూర్ణమౌతుంది కొద్దికాలం నిరీక్షించండి. ఆ రాక్షసుడు నావల్లనే అనేక వరాలుపొంది అభివృద్ధిచెందాడు. నావలననే వాడు నాశనమునకర్హుడుకాడు.

సంయుగే సాంయుగీనం, తముద్యన్తః ప్రసహేతుకః
అంశాదృతే నిషక్తస్య, నీలలోహిత రేతసః

యుద్ధకుశలుడగు తారకాసురుని ఈశ్వర రేతస్సువల్లపుట్టిన వాడు ఓడించవలసిందే కాని ఇతరులు సమర్థులుకారు. తపోనిష్ఠలోవున్న శివుని మనసు, పార్వతీ ఆమె సౌందర్య గరిమచేత మార్చాలి.

ఈశ్వరసుతుడు మీకు సర్వసేనా నాయకత్వాన్నిపొంది, తన మహాపరాక్రమంచేత తారకుని చంపి చెరలోవున్న సురాంగనలను, విడిపింపగలడు. మీకష్టాలు తీరగలవు. చింతించకండి.

అని చెప్పి బ్రహ్మ అంతర్హితుడయాడు. చేయవగు పనులకై దేవతలు స్వర్గానికి పయనమయారు.

ఇంద్రుడు హరుని మనసు తపోనిష్ఠనుంచి మర్లించేందుకు కృతనిశ్చయుడయి తత్సహాయార్థం తొందరపాటుతో తన మనసులో మన్మథుని తలుచుకున్నాడు.

ఇంద్రుడు తలపగానే స్త్రీల కనుబొమ్మలవలె వంగిన చెరకువిల్లును బుజాన తగిలించుకుని మిత్రుడగు వసంతుని చేతియందుగల మావి మొగ్గను బాణంగా తీసుకొని ఇంద్రుని కలసుకొని చేతులు రెండు మోడ్చి నమస్కరించాడు మారుడు.

నాయకు నిత్వ సుమన
స్నాయకు నరిగద్దెమీద సౌహార్ధ్రమునన్.

అనన్య సామాన్య సౌందర్యవతీ, అదృష్టశాలీ అయిన మన్మథ పత్ని రతీదేవి భర్తరాగానే ఎదురేగి "అమరపతి ఎందుకు పిల్చాడ"ని అడిగింది.

"పెద్ద విశేషమేమిలేదు. మహేశ్వరుని తపోభంగం చెయ్యమన్నాడు సరేనని వచ్చా" నన్నాడు.

ఆ మాటలకు అదరిపడి గుండె గుభిల్లుమనగా కొంతసేపు ప్రమాన్పడి త్రిలోకారాధ్యుడు, యముని పీచమడించిన మృత్యుంజయుడి మీదిక నిన్ను పురికొల్పటం నువ్వు సరేననటం గొప్ప పనికాదా? నువ్వెలా వొప్పుకున్నావీపనికి? అది తల్చుకుంటేనే ముచ్చెమటలు పట్టి నాలిక ఎండిపోతోందే నాకు? నీకు అంతతేలిగ్గా కనబడుతోందా నువ్వు చేపట్టినపని? అంది రొప్పుతూ.

మొదటి నుంచి కూడా రాక్షస సంహారానికి నాందిగా ఏ రాక్షసత్వం లేని మారుని ఉపయోగించుకుంటూనే వచ్చారు దేవతలు.

అసలు ఇంద్రుని పిలుపందుకుని తనభర్త అమరావతికి పయనమై వెడుతుంటేనే అదేదో అసాధ్య కార్యమే అయివుంటుందని అనుకుంది రతీదేవి. సాధారణమైన పనికి మన్మథుని పిలువరుగా దేవతలు. దానికి తోడు దుర్నిమిత్తాలు కూడా కనిపించాయి. ఇక అటువంటప్పుడు ఆమె మనసెలా వుంటుంది? ఇంటికిఎలావస్తాడో అనిఆమె అనుకుంటుండగానే మకరకేతనం అంబరాన ఎగురుతుండగా ఆమె స్వామి రథం దిగి ఆమె చెంతకువచ్చి చెప్పినదిదా?

"నా రాకకోసం ఎదురు చూస్తున్నావా భయపడకు పిచ్చిదానా! దేవేంద్రుడు నాకోసం ఎంత ఆత్రంగా ఎదురు చూస్తున్నాడో తెలుసా? నన్నెంత గౌరవించాడో తెలుసా? నన్ను తన సింహాసనంమీద తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు." అని చెప్పుకు పోతున్నాడు. తన మనసుకు కూడా బెదురుపుట్టిందేమో? ఆ బెదురు పోగొట్టుకునేందుకే కావల్సినవి, అక్కర్లేనివి, అడిగినవి, అడగనివి, అన్నీ చెప్పేస్తున్నాడు తన ప్రాణప్రియ సమక్షంలో.

ఇంద్రుడికి మదనుడు లేనిదే ఎప్పుడు ఏకార్యం నెరవేరింది? ఈ మర్యాదలకేంటే, అసలు జరిగిన దేమిటని రతీదేవి నిలదీసి అడిగితే మళ్ళీ చెప్పాడు. శివ తపోభంగానికని.

రతీదేవి మనసు తల్లడిల్లి పోయింది.

ఈశుని గురించి భయంకల్గించేట్టుగానూ, భక్తి కల్గించేట్టుగాను కూడా తన వాక్చాతుర్యం ఉపయోగించి చెప్పి చూసింది.

అయినప్పటికి అతని ప్రయాణాన్నించి, ప్రయత్నాల నుంచి విరమింప చెయ్యలేక పోయింది పతిని.

ఇదంతా దేవేంద్రుడు పన్నిన పన్నాగం. దేవతలందర్లో తన భర్తవంటి అందగాడు లేనేలేడు. అందుచేత దేవకాంతలంతా మన్మధుడినే ఆరాధిస్తూ ఇంద్రుణ్ణి ఉపేక్షించారు. ఈయన పీడవదుల్చుకునేందుకు ఈ ఎత్తు ఎత్తాడు. ఈ కిటుకు ఈయన గ్రహించుకోలేక పోతున్నాడు, అనుకుంది రతి.

ఆమాటే భర్తతో అంది. ఆమాట కాస్త నచ్చినట్టేవుంది. అవును నిజమేనేమో అనిపించింది కాని. అతని భ్రూవిలాసం, వెనుక తాత ఎరుగని పట్టుదలని సూచిస్తోంది.

"ఈ సంగతి తెలిసే నీ తలిదండ్రులు కూడా ఎంతమాత్రం

అంగీకరించరిపనికి" అంది. తల్లితండ్రులమాటైనా సరకు చెయ్యడా? అని.

అన్నీ విని ఆమె చుబుకం తన మునివేళ్ళతో పైకెత్తి ఆమె కళ్ళలోకి చూస్తూ.

"సుకుమారీ! నామీద ప్రేమతో అలా అంటున్నావుగాని నేను తలపెట్టిన కార్యం విఫలమై పోవటం ఎప్పుడైనా వుందా? ఎంతమంది మహర్షుల తపస్సుతోపాటు మనస్థైర్యం కూడా దూదిపింజలా ఎగరకొట్టలేదు? ఒక్కపూబాణానికి? అవన్నీ నీకు తెలియవా?" అన్నాడు దానితో ఆమెకి అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఆ! ఓటమి ఎరక్కపోవట మేమిటీ? మర్చిపోయావంతే. నీ శరాలు వమ్మయిన సందర్భాలూ, నీ పరాక్రమం నీరయిన ఉదంతాలూ కూడా వున్నాయి. చెప్పమంటావా నాథా? అంది రతి.

చిగురాకులవంటి తన చేతులతో పూరేకుల వంటి ఆమె పెదాలు మూసి ఆమెను మాట్లాడ నియ్యలేదు. అవన్నీ ఇకతను వినలేనట్లు.

"సఖీ! నీకోపం నేను చూడలే" నన్నాడు ప్రియంగా. అబలనైన నా కోపమే చూడలేని వాడివి, ఉగ్రుడైన రుద్రుని ఆగ్రహాన్ని భరించ గలవా? అంది. మళ్ళీ అనునయంగా చెప్పింది. ప్రియా! నీ ప్రయత్నం విరమించుకో. శివునిపైనా నీవు దండెత్తటం? ఆయన అస్త్రం పాశుపతం. నీది చెరకు. ఆయన ఆయుధం త్రిశూలం అయితే, నీది పూలు. ఆయన పరివారం వీరభద్రుడు ప్రమధగణాలయితే, నీపరివారం తుమ్మెదలు, చిలుకలు, కోయిలలూ, పూలు.

నెలతల తలవెంట్రుకల వేడికే వాడపోయే పుష్పాలు నీ అమ్ములు వాటిని నమ్ముకునా నీ పరుగు?

"ఇంతకీ కరణేషు మంత్రీ అన్నారు విజ్ఞులు. కనుక చెప్పాను.. నువ్వు ఆలోచించుకో" అంది రతి.

స్వశక్తిపైగల ప్రగాఢ సమ్మకం.

ఒకటే సమాధానం ఇచ్చాడు పత్నికి.

"బలపరాక్రమాది ధైర్య శౌర్య మంత్ర, తంత్రధ్యాన ధారణై శ్వర్యములు ఎన్ని వున్నప్పటికీ, చంద్రకాంత శిలలు, చంద్రకాంతికి కరుగునట్లు, కాముని శక్తికి అన్నీ తలవంచక తప్పదు. ఇక సంశయం వదలిరమ్మన్నాడు.

ఆమె ఇంత చెప్పినప్పటికి, బ్రహ్మ తనకిచ్చిన వరంపై ఆయన కున్న విశ్వాసం ముందర ఆమె మాటలు ఎందుకూ కొరగాకుండా పోయాయి. ఇక ఏమిచేయలేని రతీదేవి, మన్మధుడు తమ పరివారాన్ని తీసుకుని పయనమైనాడు. అత్యంతాప్తుడైన వసంతుడు, సమీరుడు కూడా వారి ననుసరించి హిమగిరి చేరారు.

"ప్రభూ! దేవేంద్రా: నీకిష్టంలేకుండా ఎవడైనా మోక్షంకోరి తపస్సు చేస్తున్నాడా చెప్పు. వానినిప్పుడే సుందరాంగనల కడగంటి చూపుకి ఆజన్మాంతం కట్టుబడేట్టు చేసి తపస్సునందు విరక్తి పుట్టిస్తాను.

తవప్రసాదాత్, కుసుమాయు ధోపి
సహాయమేకం, మధుమేవలబ్ధ్వా
కుర్యాంహరస్యాపి, పినాకపాణేః
ధైర్యచ్యుతింకే, మమధన్వినోన్యే॥

నేను హరుని నిబ్బరమును త్రెంచగలవాడనని ఇంద్రునితో చెప్పిన మదనుడు భార్యని పరివారాన్ని వెంటబెట్టుకుని, హిమగిరిచేరి, నిష్ఠాగరిష్ఠుడు, తపోనిమగ్నుడు అయిన ఈశుని చేరేందుకు ఆయన ఏకాగ్రత చెడగొట్టేందుకు సమాయత్తమౌతున్నాడు. ఇది దేవతాకార్యమని

[illegible]
మరీ చెప్పాడే.

మిత్రుడా! నాకున్నవి రెండే అస్త్రాలు రెండే రెండు. ఒకటి వజ్రాయుధం రెండు నీవు. ఇలాటి విషయాలల్లో వజ్రాయుధమేమి పని చేయదు. ఇక నీవనే అస్త్రమే అడ్డులేనిది. కార్యసాధనయుతమైనది." అని తనయందు గొప్ప నమ్మిక పెట్టుకున్నాడే. ఆయన నమ్మిక చెడ గొట్టకూడదు. నా ప్రాణమర్పించయినా సరే ఆయనచెప్పిన పని సాను కూలంచెయ్యాలి. దేవకార్యం నెరవేర్చాలి. ఆ అసురుడిని చంపజాలిన పుత్రోత్పత్తికే ఈశుని తపోనిష్ట చెడగొట్టి పార్వతియందు అనురక్తి కలిగేట్టుచేయాలి. అని మారుడు దృఢసంకల్పముతో ముందడుగు వేశాడు.

ఆహా! ఈ మహత్కార్యంలో తనప్రాణం పణంగాపెట్టాడంటే ఎంత సహనం చేస్తునాడు. తన ప్రాణ ప్రియ చెప్పిన హితవు పెడ చెవినపెట్టి, దేవేంద్రుడు కోరిన కోరికకి మిక్కుటమైన గౌరవం, విలువ, ఇచ్చి ప్రాణాపాయాన్ని కూడా లెక్కచెయ్యకుండా కళ్లు మూసుకుని రంగంలోకి దూకాడంటే. ఎంతకర్తవ్య పరాయత్వం? ఎంత కార్యదీక్ష? ఆ మారునిది.

అప్పటికప్పుడు వచ్చిన నవ్య వసంతాన్ని జూసి అబ్బురపడింది పార్వతీదేవి. కళ్ళుమూసుకుని తపస్సు చేసుకుంటున్న శివుడికిదేమీ తెలియదు కదా? రతీమన్మధులకిది ముందే తెలుసు. తమవెనకే వసంతు డొస్తున్నాడని, అందుకు వారాశ్చర్యపడలేదు. వసంతా గమనానికి ఆనందించారు. సమీరుడు వచ్చేసినట్టేకదా ఎల్లరి మనసుకి ఉల్లాసంగా. అసలు అనందించనివారుంటారా వసంతాగమనానికి. అప్పటికప్పుడు మోడులన్నీ చిగురించాయి.

లగ్నద్విరేఫాఞ్జన భక్తిచిత్రం, ముఖేమధుశ్రీస్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణకోమలేన, చూతప్రవాళోష్ఠమలంచకార.

వసంతాగమనానికి నాందిగా మామిడి చిగురించింది. ఆ లేచిగుళ్లు తినితిని మత్తెక్కిన గొంతులతో శ్రావ్యంగా మత్తుగా గమ్మత్తుగా మధురాతిమధురంగా కుహూ కుహూ నాదాలు చేశాయి కోయిలలు.

ఋతువులలో కెల్ల వసంతరుతువు గొప్పదంటారు. అంటే వసంతుడి గొప్పదనం ఒప్పుకోక తప్పదన్నమాట. అసలాయన ఏం చేస్తూవుంటాడు? అంటే చెప్పటం కన్నా ఏం చెయ్యలేడు? అనే ప్రశ్నే జవాబు. ఆయన అన్నీ చెయ్యగలడు. ముఖ్యంగా అన్నీ విడచి అన్నీ మరచి ఏకాగ్రతను కోరుకునే వారికిముందు కోరుకున్నది కరువుచేస్తాడు. అది అందనీకుండా చేస్తాడు. మహాకవులెందరో ఎన్నో విధాల వసంతుణ్ణి గురించి రాశారు. మహాగాయకులెందరో మంచి మంచి గీతాలు వసంతుణ్ణి గురించి శ్రావ్యంగా సమ్మోహనంగాపాడారు. అయినప్పటికి ఎప్పటి కప్పుడు చెప్పవలసింది ఎంతోకొంత మిగిలిపోతూనేవుంది. ఈనాటివరకు ఈయన మన్మథుడికి ఎంతో ఆప్తుడు. అరవప్రాణం అని అందరికి తెలుసు.

ఈ వసంతుడు తన ఆప్త స్నేహితుడికి ఎప్పటికప్పుడు యథాశక్తి తోడ్పడుతూనే వున్నాడు. ఈయన పచ్చపచ్చగా వున్నాడు అంటే కవులూ గాయకులు ఈయన చుట్టూచేరటం సహజమే. ఎందరి జడదారులవెంట తిరిగి వాళ్ళ మనసును అదుపు తప్పించాడు? ఎందరి ఋషుల ఏకాగ్రత సడలించాడు? ఎందరు తపోధనుల నిష్ఠచెడగొట్టాడు? అందుకే మరుని కుడిభుజమై ఆ రసమయలోకానికి అలవాటుపడి ఆ మధురక్షణాల అనుభూతివదల్లేక అన్నిటికి ముందు ఈయన తయారౌతాడు. ఎక్కడ ప్రణయఘట్టం తయారయేసూచనలు కాస్త కనిపిస్తాయో అక్కడ ముందుగా ఈయన ప్రవేశం తప్పదుమరి.

అట్టి వసంత సమయాన అచ్చరలు పాడినాకూడా శివుడు పరమాత్మ ధ్యాన విముఖుడు కాలేదు. చిత్తశుద్ధిని పరిక్షించేటప్పుడు నిగ్రహం అత్యవసరం కదా!

వేలుంచుకొని సవ్వడి చేయవద్దని గణాలను శాసిస్తున్నాడు.

మరణం సమీపించిన మన్మధుడు దేవదారుచెట్టు మొదలు పులితోలు పరచివుండగా దానిపై సమాధిలో వున్న ఈశ్వరుని చూశాడు.

పాములతో జడలనెత్తి కట్టి మెడయందు జపమాల నీలిమకంఠాన కాంతులీనగా అలలు లేని మడుగులా, గాలిలేని తావునగల జ్యోతివలె వెలుగుతున్న హరుని, మరుడు దగ్గరగా చూసి భయభ్రాంతుడయాడు. తనచేతనున్న బాణం అతనకి తెలియకుండానే జారిపోయింది.

కెంపులు, ముత్యాలు, బంగారు నగలు ధరించి బాలసూర్యరక్తిమనుపోలిన చీరను ధరించి సౌందర్య దేవతను పోలి చెలికత్తెలతో వస్తున్న పార్వతీదేవినిచూశాడు మరుడు. జారిపోతున్న తన అస్త్రాన్ని తిరిగిచేత ధరించినట్లైంది.

నంది శివుడికి నమస్కరించి ఆయన సేవచేసేందుకై పార్వతీదేవి వచ్చిన సంగతిచెప్పాడు. సంజ్ఞామాత్రంచే శివుని అనుమతిపొంది ఆమెను లోపలకు ప్రవేశపెట్టాడు.

చిగుళ్ళతో మిశ్రమమైన పుష్పాలు ఈశ్వరుని పదములవద్ద తన హస్తాలతో జల్లింది పార్వతి.

ఉమాపి నీలాలక మధ్యశోభి, విస్రంసయన్తీ నవకర్ణికారం
చకార కర్ణచ్యుతపల్లవేన, మూర్ధ్నా ప్రణామం వృషభధ్వజాయ.

అలాగ నమస్కరించిన ఉమను 'కల్యాణమస్తు' అని ఆశీర్వదించాడు. న్యాయమే కదా!

ఇదే సమయమనుకున్న మన్మధుడు తనచేయి బాణంమీదవుంచి దాన్ని పదిలంగా ఒడుపుగా పట్టుకుని సన్నద్ధుడై వున్నాడు.

పార్వతీదేవి మేలైన తామరపూసల తావళం తనచేతిలో శివుని కందించింది.

ఆశ్రితపక్షపాతి అయిన శంకరుడా తావళం తీసుకొనుట కంగీకరించాడు. మారుడుసార్థకనాముడగుట సమ్మోహనాస్త్రాన్ని సంధించాడు.

శివుడు ధైర్యం కొంచెం సడలినవాడై పార్వతి అరుణాధరాల వైపు అభిలాషగా చూశాడు.

పార్వతి సర్వాంగాలు పులకరించాయి. శృంగార భావంవల్ల శైలరాణ్ణందన పంగె జెంగుప అనంగునిచాపము వంగె అనే వాక్యం ఎంత సమ్మోహనంగా వుంది?

పక్కనిద్రుశ్యం కళ్ళయందు కనిపించింది. నేత్రాలు చలించాయి. లజ్జాభావంచేత చూపుతిప్పుకుంది.

హరుడు జితేంద్రియుడు గనుక తన ఇంద్రియవికారాలను అణచుకుని, తన మనశ్చాంచల్యానికి కారణమేమిటని నలుదిక్కులా తేరిపార చూచాడు.

గొజ్జంగి పూలరెమ్మల చాటునుంచి బాణం సంధించి విడిచేందుకు ఉద్యుక్తుడౌతున్న మదనుణ్ణి చూశాడు హరుడు.

తపస్సుచేత పెరిగిన కోపంవల్ల బొమముడితో చూడనలవికాని శివుని మూడవకంటినుండి జ్వాలలతో అగ్ని బయటకువచ్చింది.

ప్రభూ! శాంతించుమని దేవతలు వేడుతుండగానే హరనేత్రజాత అయిన అగ్ని, మారుని బూడిదచేసివేసింది.

అలవికాని దుఃఖంవల్ల రతీదేవి మూర్ఛబోయినంతనే తపశ్శాలి అయిన ఈశ్వరుడు తపోవిఘ్న కారణమైన కాముని చంపి, తద్విఘ్న కారకులగు స్త్రీ సాన్నిధ్యమును తొలగించుకొనుటకై తన ప్రమధగణాలతో అంతర్థా మయాడు.

గొప్పవాడు, అభవుడు అయిన ఈశ్వరునకిచ్చి వివాహం చేయ వలెనన్న తన తండ్రి ఆశయము దివ్యమయినది. అనుపమానమైనది. అయిన తన సౌందర్యగరిమ, వ్యర్థమైపోయాయి అనే అవమానంతో, చెలికత్తెల యెదుట జరిగిన పరాభవాన్ని భరించలేనిదై పార్వతి నిరుత్సాహంతో నిర్వేదంతో తండ్రి చెంతకు బయలుదేరింది.

త్రినేత్రుని కంటిమంటకి భీతురాలయి చిన్నబోయిన వదనంతోను కళతగ్గిన మోముతోనూ వచ్చిన తనూజను రెండు బాహువులతో ఆహ్వానించి ఆదరంగా అక్కున జేర్చుకుని ఓదార్చాడు హిమవంతుడు.

* * *

కొంత సేపటికి తెలివివొచ్చిన రతీదేవి జరిగిపోయినవన్నీ ఒక టొకటిగా జ్ఞాపకం తెచ్చుకుంది. తనఎదుట రాసిగా పడివున్న బూడిద చూసింది. తన భర్త ఎడబాటు తల్చుకుంది. ఇక తన ప్రియుడు, తన ప్రాణం, తన నాధుడు లేకుండా ఇలా ఒంటరిగానే జీవితం గడపాలి. అనేది వూహించగానే మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది.

దేవతలంతా కలిసిచేసిన పని ఇది. తన అమాయకపు స్వామిని వ్యర్థమైన పొగడ్తలతో ముందుకు తోశారు. ఆ జిత్తులు ఏవీ తెల్సుకోలేని మారుడు ఇచ్చకపు మాటలకు లొంగిపోయి ముందుగా బలైపోయాడు. వెనుక ఎంతమంది వున్నా ముందున్నవాడేకదా ముందు దెబ్బతినేవాడు. తను కట్టుకున్న ప్రేమమందిరమంతా పునాదుల్లోకి కదిలిపోయి కూలిపోయింది. తన ఆశలు, కోరికలు కుదుళ్లలోకిపడి నాశనమై పోయాయి. ఇక ఇప్పుడెవరేం చెయ్యగలరు? ఏవో ఓదార్పుమాటలు చెప్పటమేగా?

"అయ్యో! ప్రాణపతీ నన్నువదిలి ఒంటరిగా ఎలా వెళ్ళిపోయావ్? నీవు స్వర్గం చేరుకోగానే అప్సరాంగనలు నిన్ను చుట్టుముడతారు. నీవు ఎవరి వశం కాకుండానే నేనూవచ్చి నిన్ను దక్కించుకుంటాను నమ్ము.

అయితే నీవులేనిదే ఈ జగత్తులో సృష్టెలా సాగుతుంది. స్త్రీ పురుషుల పరస్పరాకర్షణకి మూలం నీవే కదా? నీవు లేనిదే సృష్టేలేదే? ఈ సంగతి ఆ విధాత గ్రహించలేడా? అదంతా నాకెందుకు? నాకు నువ్వు లేవిప్పుడు. పద్మాలకి నీరెలా జీవనాధారమో, నువ్వు నాకలా జీవనాధారం. నన్ను దిక్కుమాలిన దాన్నిచేసి, నువ్వు వెళ్ళిపోయావ్? అంతటి మనమైత్రి ఎలా త్రెంపివేశావ్?

శిరసాప్రణి ప్రత్యయాచతా, న్యుపగూఢాని సవేపధూనిచ.
సురతానిచ తానితే రహస్స్మర, సంస్కృత నశాన్తిరస్తిమ్.

అయ్యో! నా ప్రాణాధికా! నీ చెలికాడు వసంతుడగపడడేం? ముక్కోపి యగు ముక్కంటి కోపానికి నీవలే వసంతుడు కూడా బలికాలేదు కదా?

అని అంతులేని దుఃఖం అనుభవిస్తున్న రతీదేవి వద్దకు ఆమెను ఓదార్చేందుకై వసంతుడు వచ్చాడు.

రతి వసంతుని చూడగానే రొమ్ము బాదుకుని దుఃఖించింది.

ఆప్తుల్ని చూడగానే అణచివుంచిన దుఃఖం, తలుపుతెరుచుకు వచ్చినట్టు ఒక్కుమ్మడివచ్చి పైనపడుతుంది కదా!

వసంతుడా! నీ మిత్రుని శరీరం ఎలాగ బూడిద అయిందోచూడు. లోకంలో పురుషులకు స్త్రీయందలి మైత్రి అస్థిరమైనా సాటివారగు మిత్రులయందు నిశ్చలమే కదా?

తీగచెట్టు నాశ్రయించుకున్న నిరుపద్రవమనుకున్నాను. కాని ఏనుగు చెట్టును పెల్లగించగా, లతకూడా పెల్లగించబడింది. నానాథుడగు మారుని నేనాశ్రయించియుండగా, దైవమనే గజం నన్ను వృక్షంతో బాటుగా పెళ్ళగించింది.

వసంతుడా! నువ్వు మాకు పూరేకులతోనూ, లేచిగుళ్ళతోను పాన్పమర్చావు. మర్చిపోలేను. ఇప్పుడు కడపటి సారిగా నిన్ను కోరు

తున్నాను. నాకు నీచేతులతో చితిని పేర్చు. ఆ చితిపై దగ్ధమై నా పతిని శీఘ్రంగా చేరుకుంటాను. ఈ ఆఖరి బంధుకృత్యం నెరవేర్చు అని మన్మథుని ఎడబాటు సహించలేని రతీదేవి హృదయవిదారకంగా విలపించింది.

చంద్రునితో వెన్నెల మేఘంతో మెరుపు నశించినట్లు పతితో భార్య భర్తృమార్గం అవలంబిస్తుంది కదా!

ఆ తరువాత ఆమె ఇలా అంది.

ఓ వసంతుడా! నా కగ్ని ఇచ్చాక మాకిద్దరికి ఒకే జలాంజలి సమర్పించు అని ఆ రతి శరీరం విడిచేందుకు ఉద్యుక్తురాలయినంతలో ఆకాశవాణి రతినుద్దేశించి ఇలా అంది.

"ఓ రతీదేవి! దుఃఖించకు. నీకు శుభం జరుగుతుంది. ఆ పలుకు రతీదేవికి ప్రాణత్యాగమందున్న తొందరను సన్నగింపజేసింది.

*　　　　*　　　　*

తదా సమక్షం దహతా మనో, భవం
పినాకినా భగ్నమనోరథా సతీ,
నినిన్ద రూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్య ఫలాహిచారుతీ.

తన కట్టెదుట శివునికంటిమంటికి భస్మమైపోయిన మారుని చూసి భయపడినప్పటికి ద్విగుణీకృతమైన పట్టుదలతో కఠినమైన తపోనియమానికి సమకట్టింది పార్వతి.

లేనిచో సగం శరీరమిచ్చే అంతటి అనురాగంకల మృత్యుంజయుడు పతిగా దొరకుతాడా?

ఒక ప్రయత్నం విఫలమైనప్పుడు ఆ మహత్కార్యం యడలగల

ఆసక్తి పట్టుదల మూడురెట్లవుతుంది. ఎంతకష్టమైనా కాని సాధించితీరా లన్న తపన అధికమౌతుంది. అది సహజమే.

కుమారీ ! నీ సుకుమార శరీరం ఈ కఠిన తపోనియమాలకి తట్టుకోలేదు. కనుక ఆ సంకల్పంమానుకో, అని మేనకాదేవి తన బిడ్డకు ఎంత బోధించినప్పటికి పార్వతీదేవి తన దృఢ సంకల్పం మార్చుకో లేదు.

ఆమె తలపుతెలిసిన హిమవంతుడు ఆమె పట్టుదలకు సంతోషంతో అంగీకరించాడు. ఇప్పుడు "గౌరీశంకర" శిఖరంపై తపోనిష్ఠకై వెళ్ళింది.

మెడనున్న మూడు పేటల ముత్యాలహారం తీసివేసింది. బాల సూర్యుని కాంతిగల నారచీర ధరించింది. వేచిగుళ్ళవంటి ఆమె చేతులు ఇప్పుడు దర్భలు కోయటానికి, జపమాల తిప్పటానికి అలవాటుపడ్డాయి.

వయోధికులైనప్పటికి, పార్వతి తపస్సుచూసే కుతూహలంతో స్నానం, హోమం, నారవస్త్రధారణచేత రుద్రాక్షమాలికగల ఆ సుకుమారి గౌరినిచూసి నివ్వెరపోయారు మహర్షులు.

గౌరి తానుచేసే తపస్సుకు కోరిన ఫలం లభ్యంకాదేమోననితోచి తన శరీరమార్దవాన్ని లెక్కింపక కఠినతపస్సు చేయసాగింది.

గ్రీష్మకాలంలో ఎండవేడిమి ఎక్కువగాఉన్న సమయంలో పంచాగ్ని మధ్యంలో ఆశీనయయి తపస్సు చేసింది. నాలుగువైపుల నాల్గు అగ్నులు. అయిదవ అగ్ని సూర్యభగవానుడు. ఆయనయందే దృష్టిని నిల్పి మోముపైకెత్తి, నిశ్చలదృష్టితో చూస్తూ సూర్యతేజం ఓర్చుకుం టోంది.

పార్వతి ఆ తరువాత తెరిపిలేకుండా ఈదురుగాలి, ఎడతెగని

వాన రోకళ్లధారలుగా పడుతుండగా, ఆరుబయట బండలమీద కూర్చుని, తపసు చేసింది.

ఆ తరువాత మంచుకాలంలో గడ్డకట్టుకుపోయే చలిలో కంఠం లోతునీళ్ళలో నిలచి తపస్సు చేసింది. చలితో గడ గడ వణకుతూ నదిలో మోముమాత్రమే కనిపించి మిగిలిన శరీరమంతా నీటిలో మునిగి వున్నప్పుడు ఆమె ముఖకమలాన్ని కమలమే అనుకుని తుమ్మెదలు వాలాయని కాళిదాసు చమత్కరించాడు.

ఋషులు ఎండిరాలిన ఆకులు మాత్రమే భుజించి తపస్సుచేస్తున్నారు. పార్వతి ఆ పర్ణాలుకూడా భుజించకయే తపస్సు చేసి అపర్ణ అయింది.

లేడి చర్మము, పాలాశదండము ధరించి ప్రౌఢమయిన మాటలాడుతూ బ్రహ్మతేజస్సు ఒలుకుతుండగా ఒక బైరాగి బ్రహ్మచర్యాశ్రమమే ఈ రూపానవస్తోందా? అన్నట్లు పార్వతి ఆశ్రమంలోకి ప్రవేశించాడు.

వచ్చిన బైరాగిని చక్కగా గౌరవించి పూజించి నమస్కరించిన గౌరిని ఇలా దీవించాడు.

సరిలేని మగని బడయుము
తరుణీ యని పల్కె శివుడు తధ్యము ఇది
ఈశ్వర భాషితమునకున్ ధర
తరముల యందైన, అన్యధాత్వంగలదే.

ఓ బాలా! నీ అనుష్టానాలకు ఏకొరతాలేదు కదా? నీ సుకుమారశరీరాన్ని కృశింపజేసుకుంటున్నావు. 'శరీరమాద్యం ఖలు ధర్మశాసనం' అన్నారుకదా? అన్నిటికీ మూలమైన శరీరాన్ని ఇంత కష్టపెట్టి దేనికై నీవు తపస్సుచేస్తున్నావు? చూడబోతే నీకేమీలోటున్నట్టు కనబడదు. చెప్పదగినదైతే చెప్పు, అన్నాడు ఆ కపట బ్రహ్మచారి.

పార్వతి మౌనంగా వింటోంది ఆయన చెప్పేవన్నీ, సుందరీ ! ఈ వయసులో నీవు స్వర్గవాంఛతోను మోక్షంకోసము తపస్సుచేస్తున్నా వని నేననుకోను. వరునిగూర్చి తపస్సుచేస్తున్నావా అంటే అదీ అసంభవమే. మాణిక్యం "నన్ను ఎవరు ధరిస్తారు" అని పోయి అడుగదు గదా ? ధరించువారే మణి ఎక్కడుంది అని వెదుకుతారు" అన్నాడు.

అద్యైమి సౌభాగ్య, మదేనవంచితం
తవప్రియం యశ్చ, తురావలోకినః
కరోతి లక్ష్యం, చిరమస్య చక్షుషో
నవక్త్రి మాత్మీయ మరాలపక్ష్మణః"

ఇంత కష్టపడి తపస్సు ఏంచేస్తావుకాని, బ్రహ్మ చర్యాశ్రమంలో నేను తపస్సుచేత సంపాదించిన ఫలితం సగం ఇస్తాను తీసుకో. ఇంతకీ నీవు కోరినవరుడెవరు చెప్పు సందేహించక అన్నాడు.

అయన ఇలా అడుగుతుంటే పార్వతి చెప్పలేక లజ్జాభారంతో, ప్రక్కనున్న చెలిని మిగిలిన విషయాలు ఈ బ్రహ్మచారికి నువ్వు చెప్పు అన్నట్టు కళ్లతోనే సైగచేసింది.

పార్వతి చెలికత్తె ఇలా చెప్పింది.

"ఓ సాధూ! నీకు వినాలని కోరికుంటే మాచెలి తపస్సుకి కారణం విను. ఎవరికీ జయింపశక్యం కానటువంటి పినాకపాణిని పతిగా బడయ గోరి మా గౌరి ఈ కఠినతపస్సు సల్పుతోంది. మారుడీశ్వరునిపైప్రయోగించిన బాణం హరుని హుంకారంచేత అయనకు తగలక తిరిగివచ్చినా దగ్ధదేహం కలవాడైనా, అయన ప్రయోగించిన బాణం ఈమె యెదలో గుచ్చుకుంది" అని చెప్పింది.

అహా! ఎంత చాతుర్యంగా చెప్పింది. "మా చెలి హరునిపై మరులుకొంది" అనే మాట చక్కగా మలచి, గడుసుగా చెప్పింది.

ఇలాటి చతురికలు రాకుమారిచెంత ఎందుకు వుంటారంటే వాళ్లు చెప్పదలచిన మాటలూ, చెప్పలేని మాటలూ, చెప్పకూడని మాటలూ కూడా వీళ్లే చెప్పేసి వాళ్లని మౌనతారలుగానే మిగల్చటం, నాయకికి విలువపెంచటమే అవుతుంది కదా ?

పార్వతీదేవి తను ప్రేమించిన శివునికై ఎలా ఆరాటపడుతోంది, ఎలా కలలుకంటోంది, మెలకువలో కలలోకూడా హరునిధ్యానం తప్ప అన్యం రుచించటంలేదనీ, ప్రాణమైనా బహుసులభంగా త్యజించగలదు కాని, పరమేశ్వరుని తప్ప అన్యుని పరిణయమాడదని చెలులు ఆ బ్రహ్మచారికి చాలా ఖచ్చితంగా చెప్పారు.

ఆ పార్వతీ హృదయజ్ఞురాలగు చెలిమాటలన్నీ విని సంతోషాతిరేకం, లోలోపలే అణచుకుంటూ.

"నీ చెలి చెప్పినమాటలు నిజమేనా పార్వతీ" అని అడిగాడు బ్రహ్మచారి.

"యథాశ్రుతం వేద వేదాంవర త్వయా
జనోయముచ్చైః పదలఙ్ఘ నోత్సుకః
తపః కి వేదం త దవాప్తిసాధనం
మనోరథానా మగతిర్న విద్యతే."

నా సఖివల్ల నీవు విన్నదంతా నిజమే. ఆమె అబద్ధం ఎందుకుచెప్పాలి ? అన్న పార్వతిని ఆపాదమస్తకం ఒక్కసారి చూసి వెద్దనవ్వునవ్వాడాయన.

ఆ నవ్వు తన మనసులో ఉన్న పట్టరాని ఆనందంవలన కావచ్చు. లేక ఆమె తనవలెనే దృఢనిశ్చయం చేసుకునివుండటంవల్ల కావచ్చు. తనవలె వల్లమాలిన విరహంవల్ల కలలుకంటూ నిద్రసరిగారాక ఆహారం రుచించక, మనసు నిశ్చలంగా వుండక, ప్రియాసమాగమం కోసం తహతహలాడిపోతోందని కావచ్చు.

కాని ఆ అర్థం పైకిరానీక నొక్కిపట్టి, అమాయకురాలా! నేను చెప్పేవి వింటే శివుని ఎన్నటికి ప్రేమించవుసుమా! అని, నీకు దొరక్క దొరక్క శివుడే దొరికాడా ప్రేమించటానికి ? అనీ, తను శివుణ్ణిగురించి పనికిమాలినవాడిగా, లేదా ఆమెకు తగనివానిగా, చిత్రించి చెప్పేముందు ఆయననుగురించి నిరసనగా నవ్వినట్లు ధ్వనించాలని ఆ కపటబ్రహ్మచారి అభిప్రాయం. ఓ సుకుమారీ! హరునినేనెరుగుదును. నా మాటల యందు విశ్వాసముంచి చక్కగా విను. హరుడు నీపాణిని గ్రహించే సుముహూర్తాన. అదివరకే ఆయన జబ్బలకి చుట్టుకునివున్న పన్నగాలు నిన్ను 'బుస్స్' మని భయపెట్టవా ?

హంసలు చెక్కిన బంగారు పట్టుచీరచెంగుకి, నెత్తురుతో తడిసి భయంకరంగావున్న తోలుకి ముడివేయటం ఎలా ?

మంచి దివ్యసౌధాల్లోనూ, చక్కని వుద్యానవనాల్లోనే తిరుగాడే నీవు వల్లకాటిలో ఆ శివునితో కాపురమెలా చేస్తావు ? పరుండటానికి చక్కని తల్పమైనాలేని ఆ అల్పునా నీవు కోరుకునేది ?

పెళ్ళికిముందు వూరేగివచ్చేప్పుడు ప్రజలందరూ చూస్తుండగా వరుడు బొల్లిఎద్దుపై ఎక్కి వూరేగుతుంటే, మహాజనులంతా నవ్వరా ?

వృత్తి చూడపోతే తిరిపెము. ఇట్టి దరిద్రుడినా ఇంత తపస్సు ధారపోసి మెప్పించడం ? అన్నాడు ఆ బ్రహ్మచారి.

అప్పటికే ఆమె మోమంతా కోపంచేత ఎర్రబడి, ఆవేశంతో పెదిమలదరగా, ఎల్లపుడూ శాంతం తొణికిసలాడేకళ్ల నిప్పులుకక్కుతుండగా, పార్వతీదేవికి ఇష్టంలేని మాటలు మాట్లాడితే ఏ లక్షణాలుకల్గుతాయో అవన్నీ ఆమెలో కనిపించాయి.

నీవు నిజంగా ఈశ్వరుడిని తెలిసినవాడవు కావు. అవివేకులు, మూర్ఖులు నీవలెనే చెపుతారు. ఆయన దరిద్రులకు సంపదలిస్తాడు.

స్మశానవాసియైనా, ముల్లోకాలకూ ఏలిక. శివుడు ధరించే భస్మం చాలా పవిత్రమైనదీ, విలువైనదీ. ఆయన నాట్యంచేసేటప్పుడు రాలిన భస్మం సర్వులకు శిరోధార్యం. ఆయన గొప్ప మహిమాన్వితుడు. అల్పుడవైన నీకేంతెలుస్తుంది ? అయినా నా ఇష్టానికి నీ అడ్డేమిటి ? చెలీ ! ఈ బ్రహ్మచారి ఇంకాఏమో వదరుతున్నాడు. వానిని ఇక మాటాడనీయకండి. మహాత్ములను నిందించినవారికే కాక, విన్నవారికికూడా మహాపాపాలు చుట్టుకుంటాయి.

ఆయనను పొమ్మనడందేనికి ? నేనే ఆయన ఎదుటనుండి తొలగి పోతానని చెప్పి వెళ్ళబోతున్న పార్వతీదేవి సుకుమారమైన హస్తాన్ని పట్టుకున్నాడు ఆ కపటబ్రహ్మచారి.

మహేశ్వరుని రూపందాల్చి నవ్వుతూ తన హస్తం పట్టుకున్న వానిచూసి లజ్జిత అయింది.

తం వీక్ష్యతే పదుమతీ, సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పదముద్ధృత ముద్వహన్తీ
మార్గచలవ్యతిక రాకులి తేవ సిన్ధుః
శైలాధి రాజతనయా నయయే న తస్థౌ.

అలా ముందుకి వెళ్ళలేక ఇలా ఇక్కడ వుండనూలేక, ఒళ్ళంత స్వేదంతో నిండిపోయి, గగుర్పాటుతో అలాగే మోమువాల్చి నిల్చునివున్న హైమవతితో శివుడు చెప్పాడు.

ఓ విశాలాక్షీ ! శైలరాజతనయా ! నీతపం ఫలవంతమైంది. నీ కఠినమైన తపస్సుచే నన్ను దాసునిగా చేసుకున్నావు.

అని చెప్పగానే ఆమె పడిన క్లేశమంతా అదృశ్యమైపోయింది. "స్వామీ ! తొందరవద్దు, పెద్దల అనుమతితోనే నా పాణిగ్రహణం చేయండి" అని ఆమె భావం. "స్వామీ ! నా తండ్రియగు హిమవంతుడు

కన్యాదాత యగునట్లనుగ్రహించండి అంది శైలజ. ఆయన కళ్ళతోనే అంగీకారం తెలిపి అతికష్టంమీద ఆమెను విడిచి, మనస్సులో సప్తఋషు లను తలచాడు.

తే ప్రభామండలై ర్వ్యోమ, ద్యోతయన్తస్తపోధనాః
సారున్ధతీకా స్సపది, ప్రాదురాసన్ పురః ప్రభోః.

హరుని సంకల్పంచేతనే సప్తమహర్షులు అరుంధతీ సమేతంగా వచ్చి ఎదుట నిల్చారు.

ఆ మహర్షులెలావున్నారంటే ముత్యాల జంధ్యాలూ, బంగారునార బట్టలు, రత్నాల జపమాలలూ చేతబూని వానప్రస్థాశ్రమం దాల్చిన కల్పవృక్షాలవలె శోభిస్తున్నారట.

శివుడా మునులనూ అరుంధతినీ సగౌరవంగా ఆహ్వానించాడు.

పరమేశ్వరునకు అరుంధతిని చూడగానే తనకు భార్యగా పార్వతి ఎప్పుడువస్తుందా అనే కాంక్ష అధికమైనంది. మన్మధునికి ఓదార్పు కూడా కలిగింది.

మునులు నీలకంఠుని గాంచిన పారవశ్యంతో అన్నారు.

మా తపస్సు, హోమాలు నేడు ఫలించాయి. సూర్యచంద్రుల కన్న ఉన్నతస్థానంలోవున్న మేము. ఇప్పుడు ఇంకా మునుపటికన్నా ఉన్నతుల మనటానికి సందేహంలేదు.

నీవు మమ్ము తలచగానే వచ్చిన సంతోషాతిరేకాన్ని మేము చెప్పలేం మాటలతో. సర్వాంతర్యామివగు మహేశ్వరా నీవే తెలుసుకో. మావలన కావలసినపని ఆజ్ఞాపించు" అన్నారు.

మునులారా ! నాకొరకే కాదని తెలుసు. స్వార్ధరహితుడను. లోకకల్యాణం కోసం, దేవతలచే ప్రార్థించబడ్డాను.

దేవతా ప్రార్థనవలన పార్వతీదేవిని పరిగ్రహించి, దేవతల కష్టం తీర్చగల పుత్రుని కనాలి అని కోరుతున్నాను.

నాకొరకు హిమవంతుని అడగండి తన పుత్రిక నీయమని. గొప్పవాడు స్థిరత్వం కలవాడు. భూభారవాహకుడు అగు హిమవంతునితో సంబంధం శ్రేష్ఠంగాదా ?

ఇటువంటి విషయాల్లో స్త్రీలకు మిక్కిలి నేర్పుంటుంది కాబట్టి పూజ్యురాలయిన అరుంధతి ఈ కార్యంలో సాయంచేస్తుందనుకుంటాను.

సప్త మహర్షులు మంచిదని చెప్పి శంకరునకు నమస్కరించి ఆకాశమార్గాన వెళ్ళారు.

మనోవేగం కల ఆ మహాఋషులు వెళ్లని ఆకాశమార్గాన వెళ్ళి ఓషధిప్రస్థం చేరారు. అలకాపట్టణంవలెవున్న ఓషధిప్రస్థంలో దిగారు. మేఘమండలం పర్యంతం వ్యాపించిన సౌధరాజాలతో, నందనవనం వంటి పూదోటలతో అలరారింది ఆ పురం. దాని ప్రత్యేకత ఏవిటంటే పేరే ఔషధిప్రస్థం కదా ? గొప్పవైన ఓషదుల ప్రభావం ఇంతింతని చెప్పశక్యం కాదు. ఓషదులు రోగాలను నయం చెయ్యటమే కాకుండా, అనేక రంగుల కాంతులతో రాత్రులు ప్రకాశిస్తున్నాయి. హిమవత్పర్వత మంతా నానావిధ రత్నాలకి ఉనికిపట్టని కాళిదాసు చెపుతున్నాడుగా, 'అనన్తరత్నప్రభవశ్య' అని వేరే దివిటీలు దీపాలు అనవసరం. వాటి కాంతే చాలు కోటి దీపాలపెట్టు. ఆకుపచ్చనివికొన్ని, ఎర్రనివికొన్ని, ఇంద్రనీలమణులవంటివి, పసుపురంగువికొన్ని, తెల్లనివి, ఎన్నోబారులు దీర్చినట్లు దీపాల, తోరణాలలాగ భాసిస్తోందా ఓషధీప్రస్థం. ఆ పురం లోని ప్రజలు సమస్త సౌఖ్యాలతో తులతూగుతున్నారు. కొరత కొంచెం కూడా లేదు.

ఆ ఋషులు ఆకాశంనుండి దిగుతూఉంటే ద్వారపాలురుచూశారు. ద్వారపాలకులవల్ల ఆ మహాత్ములరాక ఎరిగిన హిమవంతుడు వచ్చి

అర్ఘ్య పాద్యాధి విధులచే పూజించి సుఖాసీనులనుచేసి, చేతులు కట్టుకుని వారి ఎదుట నిల్చాడు. వినయంగా అన్నాడు. మీదర్శనంవల్ల నాజన్మ చరితార్థమైంది. మహాత్ములు ఊరకేరారు. తేజోరూపులగు మీ దర్శనం వల్ల నా చిత్తంలోని తమస్సు నశించింది. మీకు కోర్కెలు లేకపోయి నప్పటకి నాకోసమైనా ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞే అనుగ్రహం కదా!

ఇదిగో నేను, నాభార్య, నా వంశానికి ప్రాణంవంటి నా కూతురు నా పరివారం ఏ కార్యం ఎవ్వరివలన అవుతుందో చెప్పండి. పైన బంగారం రాసులకొద్ది ఉంది అని చెప్పిన హిమవంతుని పల్కులు ఆ గుహలలో ప్రతిధ్వనించాయి. అది చూస్తుంటే చెప్పినమాటే మళ్ళీ చెప్పినట్టుంది.

చెప్పినమాట మళ్ళీ చెప్పటమెందుకంటే మాటయొక్క పటిష్టత కోసం, దార్ఢ్యత కోసం.

కథా ప్రసంగంలో నేర్పరిఅయిన అంగీరసుడు తక్కిన మునులచే ప్రేరేపించబడి హిమవంతునితో ఇలా చెప్పాడు.

ఓ హిమవంతా! నీవు కోరినది యిస్తావనడానికి సందేహం లేదు. ఎంత గొప్పదైనా యిస్తావు. నీ శిఖరాలవలె నీ మనసు కూడా ఉన్నత మైంది. ఉత్తమమైంది. అందుచేత నామాట విను.

మారాకకు కారణమడిగావు "తత్వవేత్తలు దేహములయందు ఎవ్వరికోసం వెదకుతారో విద్వాంసులు ఎవ్వనిస్థానం జన్మరహితంగా చెప్తారో, అణిమాదిగుణాలతో కూడుకున్నవాడై ఇతరుల కెవ్వరికిపొంద రాని ఈశ్వరశబ్దమునకు అర్హుడో పృథివ్యాది అష్టమూర్తులతో ప్రపంచాన్ని దాల్చినవాడో సురవరులంతా ఎవరికృపకై వేచివుండి వరాలు పొందుతారో ఆ చంద్రశేఖరుడు, ఆ సర్వేశ్వరుడు, నీ కొమరి తను తనకిమ్మని, నిన్ను కోరుతున్నాడు. నీవు సంశయింపక నీ పుత్రికను

ఆ దేవదేవునకిచ్చి కన్యాదానం చెయ్యి. మంచివరునకిచ్చిన కన్యక విషయంలో తర్వాత విచారముండదు. శివుడు జంగమస్థావరాత్మక ప్రపంచమునకు తండ్రి గావున నీ కొమరిత తల్లి యనిపించుకొను భాగ్యం పొందగలదు. దేవతలంతా ఈశ్వరునికి నమస్కరించి ఆయన కళత్రమగుటవల్ల ఈమె పాదాలకు మ్రొక్కెదరు.

పెండ్లి కూతురు పార్వతి. పెండ్లి కొడుకు ఈశ్వరుడు. మధ్యవర్తులుగా అడుగువారు సప్త మహర్షులు. కన్యాదాత హిమవంతుడు నీ కులం నీ వంశం అంతాతరించేందుకు ఇది చాలదుటయ్యా?

"ఒకర్ని ప్రస్తుతి చేయకుండానే స్తుతించబడి, ఒకరికి నమస్కరించకుండానే నమస్కారం పొందుతూ జగత్తునకు తండ్రి యగు శివునకు కూతుర్నిచ్చి, గారవింపదగిన వాళ్ళలో మొదటివాడవు అగు"అని అంగిరసుడు చెప్పిన మాటలను తండ్రి ప్రక్కన కూర్చుండి తలవాల్చి అమృతపుశోనలుగా వింటూ విలాస పద్మానికి రేకులు లెక్కిస్తోంది పార్వతి.

హిమవంతుడికి సంపూర్ణంగా శివునకు ఉమను యివ్వడానికి ఇష్టం ఉన్నప్పటికి మేనకాదేవి వైపు చూశాడు.

సాధారణంగా కన్యల వివాహవిషయంలో గృహస్థులు భార్యలను సంప్రదించనిదే స్థిరపర్చడం ఆచారం కాదు కదా? అందుకై ఆమె అభీష్టం కూడా తెలుసుకొనే నిమిత్తమై ఆమె వైపు చూశాడు.

మేనకాదేవి కూడా తన భర్తకు ఇష్టమైన కార్యం తనకూ సమ్మతమే అంది. పతివ్రతలయిన స్త్రీలు పెనిమిటి కిష్టమగుదానికి అడ్డు తగలరు.

అంగీరసుని మాటలకు చివరికి జవాబుగా-శుభంగా అలంకరించు

క్మనే, వత్సా బిక్షాని పరికల్పితా
యః ప్రాప్తం, గృహంమేది ఫలం మయా.

రుని కీయదలచాను. మునులు అడిగేందుకు వచ్చారు.
ం సిద్ధించింది. ఇలా కుమార్తెకు చెప్పి సప్తమహర్షు
షులారా! ఇదే శివపత్ని మీకు నమస్కరిస్తోంది.

గాటలు చెప్పేందుకు సిద్ధంగా లేడు పర్వతరాజు.
తోషాతిరేకంతో తబ్బిబ్బయి పోతున్నాడు. తన
్యమయినదా? ఆమె పట్టినపట్టు తేలికయినదా? అది
రం కాదా? అట్టి అసాధ్యమైన కార్యం సఫలీకృత
యకం కాదా? ఆ సమయంలో అంతకన్నా ఎక్కువ
కి అశక్తుడయాడు. ఆ ఋషులుకూడా తామువచ్చిన
ందుకు హిమవంతుడి మాటలకు సంతుష్టులై పార్వతీ
లించే ఆశీర్వచనం యిచ్చారు.

మాటలు జరుగుతున్నప్పుడు సిగ్గులమొగ్గ అయిన
రు జిలుగుపైట జారుతుండగా అరుంధతీ దేవికి వంగి

మైన అనురాగంతో, సౌందర్యశాలి సద్గుణవతి అయిన
ంస్కరించగా ఆశీర్వదించి ఆమెను తన తొడపై
ంంది అరుంధతీదేవి.

కుమార్తె యందుండే ప్రేమవల్ల ఇక వివాహమయి
డ్డ అత్తింటికి వెళ్ళిపోతుంది అనే ఆవేదనతో కంట

ందుకమ్మా నీ విచారం! నీ బిడ్డ సవతిలేని కాపురం

నిర్విచారంగా కొనసాగిస్తుంది. నీ అల్లుడా మృత్యుంజయుడు అయిన పరమేశ్వరుడు విచారించకు అని ఓదార్చింది అరుంధతి.

నా భాగ్యదేవతలారా ! సుముహూర్తం ఎప్పుడో శలవీయండని వినమ్రుడై అడిగాడు హిమవంతుడు.

నేటికి నాల్గుదినములుందని చెప్పి ఋషులు ఆకాశమార్గాన వెళ్ళిపోయారు.

హిమవంతుని వద్ద సెలవు తీసుకుని తమ రాకకై ఎదురు చూస్తున్న పరమశివుని చేరి కార్యసిద్ధిని గురించి చెప్పి, ముహూర్తం నాల్గురోజులుందని చెప్పి ఆయనవద్ద సెలవు తీసుకుని తన నివాసానికి ఎగిరిపోయారు.

పశుపతి రపి తాన్య హాని కృచ్ఛ్రా
దగమయదద్రి సుతా, సమాగమోత్కః
కమపరమవశం, నవిప్రకుర్యు
ర్విభుమపితం యదమీస్పృశన్తి.

అద్రి సుతమీద ప్రేమచేత ఆ మూడు రోజులూ శంకరునికి అతికష్టం మీద కాని గడవలేదు.

సర్వసంగ పరిత్యాగియై ముక్కుమూసుకుని తపస్సు చేసుకునే పరమశివునే ఇంత బాధించి తొందర చేస్తున్న ఈ ప్రేమ ఇక సామాన్యుల విషయంలో చెప్పాలా? అంటాడు కాళిదాసు.

రతీదేవి మనసులో కూడా ఆశాకిరణం తళుక్కునమెరిసింది. దేవతల విషయంలో ఆనందాతిరేకానికి హద్దేలేదు. తమ కష్టాలు గట్టెక్కటానికి ఎంతో దూరంలేదు కదా? అని తారకాసురుని చేత బాధింపబడే మునులంతా ఆ రక్కసి వినాశనానికి ఎదురుచూస్తున్నారు.

* * *

దేవతాగణం అంతా ప్రయాణమైంది. దేవేంద్రుడు శచీదేవి ఐరావతం అధిరోహించారు. ధనాధిపతి కుబేరుడు లేనిదే ముందు పన్లెలా జరుగుతాయి? అప్సరోజనులు రాందే సందడే లేదుకదా? నారదుడు, తుంబురుడు మొదలైన దేవర్షులు, గంధర్వులు, కిన్నెరులు, కింపురుషులు బ్రహ్మ, సరస్వతి, హంసవాహనారూఢుడయాడు. శివునితో ప్రమధ గణాలు బైలుదేరాయి.

దేవదుందుభులు మ్రోగాయి. మంగళప్రదంగా ఘనభోంతరాలు పిక్కటిల్లాయి. పుష్పవృష్టి కురిసింది కన్నులపండువగా.

గంధర్వులు గానం చేస్తున్నారు కర్ణపేయంగా.

మెరుపుతీగలవంటి అచ్చరలు నాట్యాలు చేస్తున్నారు నయనానందంగా.

నవరత్నరాసులతో బంగారు ఆభరణాలు రాసులుపోశారు. ఆకాశన్నంటే సౌధాలపై నిలబడి ఆ పట్టణాన గల కాంతలంతా ఊరేగి వస్తున్న పరమశివుణ్ణి చూచి 'భళి భళీ' అన్నారు. ఇంత అందగాడు కనుకనే మన పార్వతి ఆయననే వరించేందుకై అంత ఘోరతపమాచరించింది. 'భేష్' అనుకుంటూ పరిమళభరితమైన పుష్పాలను జల్లారు.



# గిరిక

శ్రీకృష్ణ దేవరాయల కాలంలో కవితలకు పైన పందిళ్ళువేయించి కింద కస్తూరి కళ్ళాపు జల్లించి రంగవల్లులు తీర్చిదిద్దిన స్వర్ణయుగకాలం నాటి మాట ఇది.

శ్రీకృష్ణ దేవరాయల భువనవిజయ మహాసభనలంకరించిన అష్టదిగ్గజాల్లో రామరాజభూషణుడొకరు.

ఈ వసుచరిత్ర రచించి రాయలకి అంకితమిచ్చి చరితార్థుడయ్యాడు.

పదప్రయోగం, వ్యంగ్య వైభవం, భావగాంభీర్యం ప్రౌఢతా సౌందర్యాలతో ఈ కావ్యరాజం విలసిల్లింది.

సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక అని ఈయన అవతారికలో వ్రాసుకున్నాడు.

ఇక వసుచరిత్రలోని వర్ణనాచాతుర్యం అసమానం. సంస్కృత భాషా కవితా నిర్వాహక సాహిత్య రసపోషకుడు రామరాజభూషణుడు.

ఈ చరిత్రలో చెప్పదలచుకున్న కథాగమనానికి అంతపట్టులేక పోయినప్పటికి చెప్పటంలోని మనోజ్ఞత బహుశ్లాఘనీయమైనది, పటుతరమైనదీ.

'అపూర్వ మహాకావ్యరత్న మీ వసుచరిత్ర' అని కవిపండితవరులంతా కొనియాడారు.

ఇక్కడ మనం ముఖ్యంగా గమనించవలసినది ఒక్క విషయం వుంది. మహాపండితులందరూ గాయకులు కారు వారంతా సంగీత

శాస్త్రాన్ని మథించలేదు. తమ ప్రబంధాన్ని సర్వాంగ సుందరంగా సృష్టించి చదివారు అంతే.

రామరాజభూషణుడు తన ప్రబంధాన్ని చక్కగా మలచి హృద్యంగా గానం చేశారు. ఇలాటివారు సాహిత్య ప్రపంచాన అరుదుగా వున్నారు.

తన గ్రంధ రాజాన్ని చక్కగా సృష్టించి గానమనే చక్కెరఅద్ది శుద్ధమైన శృతిలో రాగయుక్తంగా అన్యస్వరాలూ అపస్వరాలూ కలియ నీయకుండా మనోరంజకంగా పద్యం చదవకల్గిన కవి ఈయన ఒక్కడే అనిపించకమానదు. గానంలో అపశృతి ఎంత వర్జనీయమో! రచనల్లో అసభ్యత అంత వర్జనీయం కదా!

రామరాజభూషణుడు సంగీతశాస్త్రాన్ని చక్కగామథించి సాధన చేసినట్టు మనం ఒప్పుకోక తప్పదు.

ఈ వసుచరిత్రలోని అపూర్వ సన్నివేశం ఏమిటంటే, ఒక గిరి ఒక ఝరిని ప్రేమించటం.

మనం ఎన్నో మహత్తరమైనటువంటి చరిత్రలు చదివాం, విన్నాం. మహర్షులు అప్సరోజనం వెంటబడటం, అనిమిషులైన దేవతలు మానవకాంతలయందు మరులు గొనటం ఎరుగుదుము. ఋషిపుంగవులు రాజపుత్రికలను పరిణయమాడటం విన్నాం, నాగకన్యలు-రాజకుమారుణ్ణి వలచి వశం చేసుకోటం తెల్సు. రాక్షసులు—మానవుల్ని ప్రేమించటం కూడా చదివాం. కాని ఇదేవిటి?

ఒక గిరిరాజు-ఒక ఝరీదేవిని ప్రేమించటం? చాలా విశేషముంది విపరీతముంది ప్రేమించి పొందాడు కూడా. తన ప్రేమకి సార్ధకత కని పించిదంటే ఆశ్చర్యం లేదు. ప్రేమించాక పొందకుండా వుంటాడా? ఆ

నిశ్చలుడు, పొందాక ప్రకృతి తన ధర్మం నెరవేర్చకుండా వుంటుంది కనుకనా?

ఇది నిజమేనని సంభవమేనని నిరూపించినట్టు ఆ నదీదేవి త్రిజగన్మోహినివంటి పుత్రికను కనటమేమిటి?

ఈలాటి వింత వెనుకటి చరిత్రలో ఎక్కడైన విన్నామా? లేక ఇది కవియొక్క చాతుర్యమా? అంటే.

అబ్బే! నిజంగా అదే జరిగిందిప్పుడు మరి. ఇది ఆ మహాకవి కవితాధార సంగీత సుధాధార. సాహిత్యం ఆలోచనామృతం అందుకే అది కళామోదం. కళాభిజ్ఞులకు మాత్రమే ఆనందం కల్గించేది.

కేవలం కల్పనా కథలు, కృత్రిమ రత్నము
లాద్య సత్కథల్ వావిరిపుట్టు రత్నము,
లవారిత, సత్కవి, కల్పనావిభూషావహ పూర్వవృత్తములు
సానలదీరిన జాతి రత్నముల్.

ఈ మహాకావ్యంలోని ప్రౌఢి, ధ్వని, చమత్కారశ్లేష, మరో కావ్యంలో మృగ్యం. ఈయన ఒక నదీమతల్లికి సంపూర్ణ నారీత్వం ప్రసాదించాడు. అచేతనములను తీసుకున్నాడు. వాటిని చేతనమ్ముల రీతి తీర్చిదిద్దాడు. ఈ మహాకవి. పర్వతరాజైన హిమవంతుని కుమారుడు కోలాహలుడు. ఆ కోలాహల పర్వతం తలవంచుకుని తనదారిన తను పోతున్న శుక్తిమతీనదితో అన్నాడు.

"ఓ శుక్తిమతీ నువ్వు ప్రతిరోజూ బ్రహ్మలోకంనుంచి అలావస్తూ నన్ను ఒరుసుకుంటూ ఇలా వెళ్ళిపోతున్నావు. నేను నిశ్చలంగా నిలబడి చూస్తూనేవున్నాను. నీ సౌందర్యాన్ని వయ్యారాలొలికే నీ నడకనీ. నేను పిచ్చివాడినై పోతున్నాను.

ఒక్కరోజైనా కన్నెత్తి చూశావా నావంక? ఒకసారైనా పన్నెత్తి పల్కరించావా? బహుదినాలు ఇలా జరిగిపోతూనే వున్నాయి నాపై నీ

అనుగ్రహం ఎప్పుడొస్తుంది దేవీ?" అన్నాడు. మొదట ఆ మాట వింటూనే తత్తరపడి తబ్బిబ్బైంది శుక్తిమతి. ఆ తరువాత నిలదొక్కు-కుంది.

"ఓ పర్వత రాజకుమారా! ప్రతిరోజూ బ్రహ్మలోకం నుంచి అజుణ్ణి సేవించుకుని ఈ మార్గాన వస్తున్నమాట నిజమే. కాని నిజంగా నిన్ను చూడనేలేదు. చూసినాకాని ఆ దృష్టితో అసలే చూడలేదు. అయినా నేను నిన్ను ప్రేమించటమేమిటి? నీవా మహోన్నతుడివి, నీ వంశం గొప్పది. నేనా నీ పాదాలదగ్గర క్రిందకే ఇంక క్రిందకే ప్రవహించే స్వభావం కలదాన్ని. నా తత్వమే అంత కదా? నీకు పాదోదకం ఇచ్చానంటావు. ఎంతమంది నదీమ తల్లులు నీకు పాదోదకం ఇయ్యలేదూ?

ఎన్నో నదులు నీలో వుద్భవించాయి. నీవు ధైర్యంగా నిలకడగా నిలచియే వుంటావు గంభీరంగా నేను బహునీచంగా కిందకే పరుగులిడుతుంటాను. నేను కుటిల ప్రవర్తన గలదాన్ని. నీవు ఘనశీలుడవు. వియ్యానికి నెయ్యానికి సమవుజ్జీలు కావాలంటారే. నీవు అచలేంద్రుడవు. నేను జడవాహినిని. మనకి స్నేహం సరిపడే విషయంకాదు. నీవల్లనాకు అనురాగం కల్గటం కష్టం. అసాధ్యం కూడా" అంది.

జడములైన నదీపర్వతములయందు నాయకీనాయకత్వం ఆరోపించిన తీరు అద్వితీయమైన కవియొక్క- పనితనానికి నిదర్శనం.

"నదీ శిరోమణీ! నేను నిజమే చెప్తున్నాను. నేను నీ కాంతి అనే ధారాప్రవాహంలో మునిగిపోయాను. నా అంతట నేనిక పైకి రాలేను. నీవే దిక్కు- నన్ను సుడిగుండాల్లో ముంచినా, ఒడ్డుచేర్చినా నీదే భారం" అన్నాడు. అప్పుడు శుక్తిమతి ఆ కోలాహల పర్వతుడితో.

"ఓ నగరాజా! నీపై అనేక ఓషధులు కాంతుల నీనుతున్నాయి. మన్మధ వికారం కల్గి ఇలా అంటున్నావు నీగొప్ప నీకు తెలియక ఇలా మాట్లాడుతున్నావు నువ్వు నన్ను చేపడితే నీవారితో నీవు తేలికైపోతావు"

అని ఎన్నో విధాల నచ్చచెప్పజూచిన ఆమె మాటలు పెడచెవిన పెట్టి శుక్తిమతిని లొంగతీసుకునేందుకై ప్రయత్నం చేయటం మొదలెట్టాడు.

శుక్తిమతి అసహాయురాలై వసురాజును ప్రార్థించింది. కోలాహల పర్వతరాజు తన దరికి వచ్చినప్పుడు శుక్తిమతి ఇలాగు అంది.

అతుల శైవల సతీశతము లీనెడు మీకు
నాఇచ్చు విమలార్ఘ్యతోయమెంత?
ప్రాలేయ నిలయ సంభవము గాంచిన మీకు
బస్నేట నొనరించు పాద్యమెంత?
సరస మందార, మంజరుల రంజిల్లు మీకు
పెనచి పూదండ లర్పించుటెంత?
గోరత్న సందోహ గురు లక్ష్మిగల మీకు
సుపదగా, మణివర్గ మొసగుటెంత?
యనఘ యవ్వారలైన కొండంత వారి
కవని కొండంత పూజసేయంగ గలరె?
భక్తినేనిచ్చు నీ పుష్పపత్ర తోయ
మాత్రములు గైకొనుటెగాక గోత్ర తిలక.

తాను చేయు సేవ యల్పమైనదని శుక్తిమతి చెప్పింది. దీనికి అంతరార్థం పరిశీలిస్తే కాస్త హేళనకూడా కనిపిస్తోంది. ఆయన యందుండే నదులు శైవలీతులు నాచుతోకూడిన తటాకాలు, తానిచ్చు తోయము విమల తోయము. ఈ విధంగానే అన్ని పాదములయందును ఆమె ఇచ్చు సపర్య అధిక్యత కనిపిస్తుంది. ప్రజలకేదైనా ఆపదవాటిల్లినపుడు తమ ఏలికతో చెప్పుకోవటం పరిపాటి కనుక తన రాజైన వసురాజుతో మొరపెట్టుకుంది.

అధిష్ఠాన నగరాధీశుడు వసుమహారాజు. ఆయన సర్వధర్మాలూ ఎరిగినవాడు సాటిలేని పరాక్రమశాలి. సమస్త శాస్త్ర పారంగతుడు. ప్రజల్ని కన్నబిడ్డల్లా పరిపాలిస్తాడు.

ఆ పట్నం సమస్త కళలకు ఆటపట్టై, ఎన్నో శోభలతో వైభవాలతో అలరారుతోంది. కల్యాణదీవులన్నిటిలో ఇది మొదటిది. ఆ నగరాన సౌందర్యవతులయిన స్త్రీలు వేదాలన్నీ అధ్యయనంచేసిన విప్రోత్తములు అనేకులున్నారు.

మనసుని పరవశింపజేసే పూదోటలెన్నోవున్నాయి. కుబేరుని యాచింపనక్కరలేనంత ధనరాశులున్నాయక్కడ. అతిథులకు అభ్యాగతులకు ఆదరణ పుష్కలంగా లభిస్తుందక్కడ. ధాన్యరాసులు చంద్రమండలంవరకు వ్యాపించివుంటాయక్కడ. చంద్రకాంతమణులతో నిర్మించిన ఆ సౌధరాజాల్లో నర్తకీ మణులెప్పుడూ నాట్యాభ్యాసంలో మునిగివుంటారు.

ఈ వైభవం చూడటానికి దేవలోకంనుంచి కొందరు సుందరీమణులు వస్తూంటారిక్కడికి.

ఉద్యానవనాల తావి స్వర్గం వరకు గుబాళిస్తూనే వుంటుంది. ఈ నగరం మీదుగా శుక్తిమతీనది ప్రవహిస్తూపోతుంది. కనుకనే ప్రతి సంవత్సరం మూడు పంటలు పండుతుంది. ఆ పంటలవల్ల యజ్ఞయాగాది క్రతువులుచేస్తారు. ఆ క్రతువుల్లో తమకు సమర్పించే కానుకలు దేవతలు స్వయంగా వచ్చి తీసుకుంటారు. అందుచేత శుక్తిమతి నది సాక్షాత్తు ఆకాశగంగగానే వెలుగుతూంటుంది.

శుక్తిమతీ నదిలో స్త్రీలు విరివిగా జలక్రీడలు చేయటంవల్ల వారి మేనికి అలదిన పునుగు జవ్వాదిమొదలైన పరిమళద్రవ్యాలు ఆ నదంతా వ్యాపించి పరిమళము లీనుతూంటుంది.

ఎనలేని పరాక్రమవంతుడు కీర్తి సంపద నార్జించినవాడు అయిన వసుమహారాజు సుభిక్షంగా సధర్మంగా రాజ్యం చేస్తున్నాడు.

శుక్తిమతి పిలుపు ఆలస్యంగా చేరినందువల్ల జరగవలసిన అనర్థం

ఆపలేకపోయాడు. ఆ కోలాహల పర్వతం శుక్తిమతి నదీప్రవాహానికి అమాంతంగా వచ్చి అడ్డుపడింది. ప్రవాహం ఆగిపోయింది. రెండు పాయలుగా చీలి ఇటు అటుగా ప్రవహించసాగింది.

అప్పుడే శుక్తిమతి పిలుపందివచ్చిన వసురాజు ఆగ్రహంతో కోలాహల పర్వతాన్ని తన కాలిగోటితో ప్రక్కకి నెట్టివేశాడు. అన్ని లోకాలవారు కూడా ఆశ్చర్యపోయారు. ఆయన పరాక్రమానికి. ఇంద్రుడు పర్వతాల రెక్కలన్నీ వజ్రాయుధంతో తెగనరికాడు. ఈ రాజు తన కాలిగోటితోనే పర్వతాన్ని నెట్టివేశాడంటే, సామంతరాజులంతా పాదాక్రాంతులయారు.

మహేంద్రుడు వసురాజుతో సఖ్యం చేసుకునే నిమిత్తం ఎదురు చూస్తున్నాడు.

కోలాహల పర్వతం వసురాజుచేత పరాభవింపబడి ఆయనపాదాల చెంతనే పడివుంది కొంతకాలం వరకు. ఆ తరువాత ఆయన ఆ పర్వతానికి స్వేచ్ఛ ప్రసాదించాడు.

ఆ పర్వతం శరణుకోరడంవల్ల వసుమహారాజు అప్పుడప్పుడు ఆ కోలాహల పర్వతం పైకి విహారానికి వెడుతుంటాడు. వసంతఋతువు వచ్చింది. గొప్ప శోభను తెచ్చింది వనానికి. వసంతరుతువు రాగానే కోయిలలు విజృంభించాయి. పవనుడు అల్లరిచేస్తున్నాడు. చిగురుటాకులు వికసించివిడివడేట్లు చేస్తున్నాడు యీయన. చిలుకలు కొరికిపడేస్తున్నాయి మధురఫలాలను.

ఒకరోజు వనపాలకులంతావచ్చి వసురాజుతో చెప్పారు. "ప్రభూ! మీరు వచ్చి వసంతశోభను తిలకించండి ఒక్కసారి" అన్నాడు. ఇంకా ఇలా అన్నారు.

"పుప్పొడి గుట్టలుగుట్టలుగా ఏర్పడుతోంది. పుష్పరసం కాలువలు

నాగ్యంగావుంది.

చెట్లు దట్టంగా పెరిగి చీకటిని సృష్టిస్తున్నాయి. వుద్యాన వనం ని కొమ్మల తీరు, పల్లవుల పై ఖరీచూస్తుంటే ముద్దొస్తోంది. పూవుల రటం గమనిస్తుంటే ప్రతివృక్షం ఒక చైత్రరధంలా భాసిస్తోంది భూ" అన్నాడు.

వనపాలకుల మాటలు వినగానే వసురాజుకి ఉద్యానవనం అంతా కసారి విహరించి రావాలనే ఉబలాటం కలిగింది. వనపాలకులకు నుకలిచ్చి పంపాడు.

మనోవేగానికి సమంగాపోయే గుర్రాలతో రధం ఆయత్తపరచాడు రధం ధనాధిపతియైన కుబేరుడు తయారుచేసి పంపాడా అన్నట్లుంది. ని వైభవం రత్నాల స్తంభాలు మరకత మణిమయగోపురాలు కల్గి ఖత్యాలపరుపులు పరిచి, బహుమనోహరంగా వుంది.

సర్వాభరణ భూషితుడైన వసురాజు రధారోహణం చేసి రాజ మార్గాన పోతుంటే ఆ నగరి ప్రజలు గవాక్షాల్లోంచి, పరదాల వెనక ంచి పోటీపడి ఒకర్నొకరు తోసుకుంటూ వీక్షిస్తున్నారు. మణులకాంతి థచక్రాలు ఎర్రని కాంతు లీనుతున్నాయి.

రధం వుద్యానవనందగ్గర ఆగింది. ప్రభువుయొక్క అంతరంగిక మిత్రుడు అక్కడ ఆయన కోసం వేచివున్నాడు. రధంచుట్టూ చేశే నాన్ని వెండిబెత్తంతో అదరిస్తున్నారు సేవకులు. అయినా లెఖ్ఖచేయటం లేదు, రాజదర్శన కాంక్షతో వచ్చిన ప్రజలు.

మహారాజు వస్తున్నాడని ప్రధాని ద్వారంవద్ద దోరగా పండిన అరటి గెలలు చెట్లతో సహితంగా బిగియకట్టారు. రాజుకు శిరసువంచి

కిరువైపులనుంచి వంగిరాజుకి వినతి చేస్తున్నాయి.

శుకపంక్తులు తోరణాలు కట్టాయి. ఎర్రని కింశుక వృక్షాలపై రాజు చేయివేయగానే జలజలా పూలురాలి వసురాజు కిరీటంపై కొన్ని, పాదాలపై కొన్ని పడిపోయాయి. రాజు పులకించిపోయాడు. మలయ మారుతుడు చేతులు చూపి ఆహ్వానించాడు.

తన మిత్రుడితో ఆ వుద్యానవనం ప్రవేశించి నలుమూలలా దృష్టి సారించి చూశాడు. కోలాహల పర్వతం కనిపించింది వెనుకటి కథఅంతా గుర్తుకొచ్చింది రాజుకి.

శుక్తిమతిని ఆ పర్వతుడు ప్రేమించిన ఉదంతమంతా కదిలింది. అయన మనసులో నవ్వుకున్నాడు. కోలాహల పర్వతం మీదకు అలా ఆ చల్లని గాలిలో పయనించాడు.

ఆ వసురాజు అలా నడచి కోలాహల పర్వతం సమీపిస్తూండగా కుడిభుజ మదిరి ఇంకా ఎన్నో శుభసూచనలు కన్పడ్డాయి.

అలా వెడుతున్నవాడు ఆగిపోయి నిల్చున్నాడు అన్యమనస్కంగా. కారణం, ఒక సుమధుర మంజులగానం గాలిలో తేలితేలివచ్చి ఆ రాజు మనసు పొరల్లో అలా అలా చొచ్చుకుపోయి అయన మనసంతా ఆక్ర మించుకుని పరవశుణ్ణి చేస్తోంది. ఎక్కడనుంచి ఆ గానం చంద్రలోకం నుంచా? ఈ గొజ్జంగి పొదలచాటునుంచా? సురపొన్నల ఆ సమూహం వుందే అక్కడ ఆ వెనుకనుంచా? అసలు దివినుంచా భువినుంచా అని సందేహంతో తొందరపాటుగా ముందుకెళ్ళి చూశాడు.

ఒక మణిమయస్థపిత దివ్యసౌధంనుండి ఆ దేవగానం వినవస్తోంది. తన నర్మసఖుడిని ప్రశ్నించాడు. నీకూ వినబడుతుందా? అకర్ణపేయ మైన సఖుడా? అని రాజు తనకే వినబడుతుంటే భ్రమ అనుకోవచ్చునని

వసంతరాగాలాపన రాజు మనసు దోచుకుంటోంది. తన మిత్రుడి మనసు గ్రహించాడు తానూ పరవశిస్తున్నాడు. ఆ రాగమాధురికి. ప్రభూ! ఆ అమృతగానం నాకూ వినబడుతోంది కర్ణపేయంగా. అదుగో ఆ ఎదురుగా కనబడే దివ్యసౌధం నుండే. ఆ సౌధంనుంచే ఆ గానం మనకు వినబడు తోంది. నాలుగు అడుగులు ముందుకేసి చూద్దాం పదమన్నాడు నర్మ సఖుడు.

మహారాజా! మీరిక్కడే ఈ పొదలమాటునే వుండండి. నేను ఆ సౌధంలో ప్రవేశించి ఆ అమృతమూర్తి వివరాలన్నీ క్షణంలో సేక రించుకు వస్తానని చెప్పి బయలుదేరాడు.

బుద్ధిమంతులు ముందురానగు అపాయాలను ఎదుర్కొనే ఆలోచన చేయకుండా కొత్తచోటుకు ప్రవేశించరు కదా? అందులో వయసుకత్తెలు కన్యలు వున్నచోటుకి ప్రవేశించరు కదా? వయసుకత్తెలు కన్యలువున్న చోటుకి ఋషులకి ఏ విధమైన అభ్యంతరమువుండదని ఎరిగిన వాడగుటవల్ల సర్వసంగ పరిత్యాగివలె యతివేషధారియై వారున్నచోటికి బయలుదేరాడు. నేనొచ్చేవరకు ఈ చాటున ఇక్కడేవుండమని రాజుకి నచ్చచెప్పి తను ముందుకుపోయాడు. ఈ మాయా సన్యాసి వెళ్ళేసరికి అక్కడి కాంతాజనం ఎలావున్నారంటే.

ఆ లావణ్య సతీమణుల్ కొలువగా
నాలేమ యా కోనలో
నా లీలా భవనమ్ములోననఘ
కంఠాలాప్తి సౌభాగ్యముల్
వ్యాలోలాంగుళి సంజ్ఞచే గరపు
తేవన్ వీణ బల్కించునా
యాలాపంబె గిరిందరీ ముఖరమై
యూరింపగానయ్యేడిన్॥

అప్సరసలకన్న మిన్నఅయిన ఒక నెల జవ్వనిని చూశాడు. ఆ నర్మ సఖుడు. సౌందర్యమంతా పోగుచేసినట్లున్నది ఆ ఇంతి. బంగారం కరిగించి పోతపోసినట్లున్నది ఆ లతాంగి తను కాంతి. తుమ్మెదరెక్కల్లా వుండి దీర్ఘములైన ఆమె కుంతలు కాళిందీ జలాలవలె నిర్మలమై నిగ నిగలాడుతున్నాయట. ఆమె సౌందర్యానికి అచ్చెరువందాడు. అక్కడి కన్యలంతా లేచి నిలబడి ఆ మాయా సన్యాసికి నమస్కరించిరి.

"కళ్యాణీ! నీకు శుభమగుగాక. నువ్వు ఒంటరిగా ఇక్కడ ఎందుకువున్నావు, నీ తల్లిదండ్రు లెవరు. నీ కభ్యంతరం లేకపోతే నాకెరిగించ" మన్నాడు.

ఈ అశాశ్వతమైన శరీరంమీది మమకారం విడిచి హిమాలయాలలో తపోనియమాన కాలం గడుపుతున్న విరాగిని నేను. తీర్థయాత్రలు సల్పుతూ ఇటువచ్చానని తననిగురించి తను చెప్పుకున్నాడు ఆ మాయా ముని.

మునిమాటలకు నివ్వెరజెందారా సుందరీమణులు. అర్ఘ్యపాద్యాది విధులచేత ఆ మౌని నలరించి ఉచితాసనంపై కూర్చుండపెట్టి మంజు వాణి అనే చెలికత్తె ఇలా చెప్ప మొదలుపెట్టింది.

'మహాత్మా! మీ పాదాలకు నమస్కరించినందువల్ల మా శిరస్సులు సార్ధకమైనాయి. మీరు మా చెలిగానం విని అపూర్వం అని మెచ్చు కున్నారు. మీరు స్వర్గాన్నుంచి మా చెలిగానాన్ని వినటానికై దిగివచ్చిన నారదమునీంద్రులు కాదు కదా?" అంది మాటలాడుటలో మహానేర్పరి అయిన మంజుభాషిణి ఆ పల్కులు విని "ఈ లతాంగి కులగోత్రము ఎరిగించు బాలా" అన్నాడు. మునిమాటలకి ఆ సఖీజనం ముగ్ధులయారు.

"మీరు వాత్సల్యంతో అడిగిన మా చెలి వంశమర్యాద, కుల గోత్రాలు మీకు తప్పక విన్నవించుకుంటాను మహర్షీ!

సమానమైన పవిత్ర శుక్తిమతి అనే నదీదేవిని ప్రేమించాడు. ఆ ప్రేమ మనసులో వుంచుకుని విరహాగ్నికి తపిస్తూ దురవస్థలకు కుంగిపోతూ మన్మధుని పరీక్షలకు గురి అవుతున్నాడు. శుక్తిమతిని కలసి తనమదన తాపాన్ని ఉపశమింప జేసుకోవాలనుకున్నాడు.

సమస్త భూషణాలతో అలంకరించుకుని శుక్తిమతిని చేరుకున్నాడు ఆలా వచ్చిన రాజకుమారుని శుక్తిమతి అతనికి ఎదురేగి స్వాగతం చెప్పింది.

రాజీవ రత్నపాత్రలతో తరంగాలతో అర్ఘ్యపాద్యాలు ఇచ్చింది. ఇలా విన్నవించింది.

ఎన్నో వందల నదులు మీనుంచి ఉద్భవిస్తున్నాయి. కొండంత దేవరను కొండంతపత్రితో పూజించలేముకదా? మీకు ఏవస్తువుకావల్సినా ఏ దేవకాంతలైన మీకిట్టే సమకూర్చగలరు. పైగా అనేకమణులు రత్నాలు మీ పైన నివాసమున్నాయి కదా? ఈ మూడులోకాల్లోను మీక్కావల్సిన వస్తువులేమున్నాయి? ఈ మూడులోకాల్లోను మీక్కావల్సిన వస్తువులు అన్ని మీయందే నిలయమై వున్నాయి. మీరిచటికి రావటం నామీద అనురాగం వల్లనే కదా?" అంది.

ఆ మాటలన్నీ తీరిగ్గా విని ఆ కోలాహలుడు అవును నీవు చెప్పిన మాటలన్నీ నిజమే నీకు హృదయపు లోతులన్నీ బాగా తెలుసు. నీ సంపూర్ణత్వాన్ని నేనిదివరకే గమనించేను. బ్రహ్మదేవుని సభకు వెళ్ళి వస్తున్న నిన్ను రోజూ చూస్తూనే వున్నాను.

నీ సౌందర్యాతిశయం నీ వినయసంపద చూసి నిన్ను నా దాన్ని చేసుకోవాలనుకున్నాను. రోజురోజుకి నీయందు మోహం నన్ను పిచ్చి వాణ్ణి చేస్తోంది. నువ్వేమో తప్పుకు తప్పుకుని నాపక్కనుంచే పోతు న్నావు. నీ వాగమృతాన్ని వినటం ఎలాగో అని పరితపించిపోతున్నాను.

నన్ను కరుణించు దేవీ అని అనేకవిధాలుగా తన ప్రేమ నదీదేవికి ఎరింగించాడు కోలాహలుడు. నీకు నాకు ఈ ప్రేమ ఎలా పొసగుతుంది. నీవు మహోన్నతుడివి, నేను నీచను కిందుకు ప్రవహించేదాన్ని, కనుక నన్ను మన్నించు, నా జోలికిరాకు అని అనేకరీతుల ప్రతిమాలింది. తెలియజెప్పింది వేడుకుంది శుక్తిమతి.

సామదానంగా చెప్పిచూశాడు లొంగలేదు. ఇక దండోపాయంవల్ల తనపని నెరవేర్చుకోవాలనుకున్నాడు కోలాహలుడు. ఒకరోజున బల ప్రయోగంవల్ల శుక్తిమతిని లోబర్చుకున్నాడు.

అప్పుడు శుక్తిమతి వసురాజుని ప్రార్థించింది. నదీఘోష వసు మహారాజుని చేరలేదు. కోలాహం ధ్వని మాత్రం ప్రపంచమంతా వ్యాపిస్తోంది. అడ్డుగానిలచాడు నదీజలాలకి. ఆ ప్రవాహానికి అడ్డురావటంతో అల్లకల్లోలంగా ఘోషగా ప్రవహించసాగింది. పాయలుపాయలుగా పోతోంది. భూమండలంలో సంచలనం కల్గింది. ప్రవాహం తీవ్రతరమైంది. జనం ఈ విపత్తుకి తట్టుకోలేక వసురాజుతో మొరపెట్టుకున్నారు.

వసురాజు కోలాహలుని ఉద్ధృతం విని కోపించాడు. ప్రజలకి అభయం ఇచ్చి పంపేశాడు. ఆత్రత్రాణ పరాయణుడైన నారాయణునిలా ప్రజల బాధలు నివారించటానికి హుటాహుటిన వెళ్ళాడు.

వసురాజు కోలాహలుని మదమణిచేందుకు చతురంగబలాలతో బయలుదేరాడు. ఈ కలకలానికీ ఆర్భాటానికి పర్వతాలన్నీ కూడా కుంగిపోసాగాయి. తమకు ఎంతటివిపత్తు వస్తుందోనని భయపడసాగాయి.

వసురాజు తన కాలిగోటితో కోలాహల పర్వతాన్ని విసరివేశాడు. ప్రజలంతా సంతోషించారు. వసురాజు పాదగ్రహణం కోలాహల పర్వతుడు ఎగిరిపోవటంవల్ల శుక్తిమతి నదీజలాలు పూర్వపు మాదిరిగా ప్రవహించసాగాయి.

లోకాలన్నీ సంతోషించాయి. ప్రజలంతా నిర్భయులయారు దేవేంద్రుడు వసురాజుకు అభివాదం చేశాడు.

మేము ఎందరి రాజన్యులనో చూశాం. ఒక్కకాలిగోటితోనే పర్వతాన్ని ఎగరకొట్టిన నీ పరాక్రమం అనుపమానం నీ శౌర్యాతిశయం. పరాక్రమం కొనియాడతగినది అన్నాడు.

అది మొదలు ఆ మహారాజుకి శుక్తిమతీనది క్రీడాసరోవరం కోలాహల పర్వతం క్రీడాపర్వతం. జలప్రవాహానికి అడ్డుగా నిలచిన ఆ కోలాహలపర్వత రాజు సంఘర్షణవల్ల శుక్తిమతీనది గర్భం దాల్చింది. ఇలా కొన్నాళ్ళు గర్భాన్ని మోసి ఒక శుభముహూర్తాన ఈ శిశువును గన్నది. ఈ శిశువు జన్మించిన తరుణాన, నక్షత్రాలు అనుకూలస్థానాన వున్నాయి. చంద్రుడు సుముఖుడై వున్నాడు. శిశువునకు యోగ్యము శుభదాయకము అయిన జీవితాన్ని సూచనగా చెపుతున్నాయి.

ఆ సమయంలో కోలాహలుడు శుక్తిమతితో తనకలయిక స్మృతికి తెచ్చుకుని గర్విస్తూ నా వంశం పవిత్రమైంది. నేను చరితార్థుడనయాను అని సంతోషిస్తున్నాడు. వసురాజువలన పొందిన అవమానం కూడా ఆ తరుణంలో విస్మరించాడు.

శుక్తిమతి బ్రాహ్మణాశీర్వచనాలు పొంది తన పుత్రికకు గిరిక అనే నామకరణం చేసింది.

శుక్తిమతిపుత్రి హంసనడకలు నడిచింది. ముద్దుమాటలు నేర్చింది నాట్యం నేర్చింది. లక్ష్మీదేవివలె దినదినాభివృద్ధి చెందుతూ సమస్త కళలు నేర్చుకుని చక్కనిరూపం సంతరించుకుంది. కోలాహల పర్వతం మీద ఆటలాడుకుంటూ అనేక పూవుల పుప్పొడి పోగుచేసుకుని ఆడుకుంటూ బొమ్మరిళ్లు కట్టింది.

ఆమెతండ్రి తన కూతురు వీణసాధనకి అనువుగా వుండేందుకని.

నాట్యానికి వీలుగా వుండేందుకు ఈ మణిమయ గృహాన్ని నిర్మించి ఇచ్చాడు. ఈ నదులు కోనలు గిరికాదేవి, విహారరంగాలు ఈ లతాని కుంజాలు ఆమెకెంతో ప్రీతయినవి. నేను గిరికాదేవి ఇష్టసఖిని నా పేరు మంజుభాషిణి" అని గిరికా జన్మవృత్తాంతమంతా సవిస్తరంగా ఆ మాయా మౌనికి విన్నవించింది మంజువాణి.

మొదలమాటునుంచి ఒక్క అక్షరం కూడా పొల్లుపోకుండా అంతా విన్నాడు ఆ వసురాజు. మాయామౌని తలవూపి అన్నాడు. నేను అంతరదృష్టితో అంతాపరికించి చూశాను మా గిరికాదేవి వసు రాజేంద్రుని వివాహమాడుతుంది ఎంతో కాలయాపన కూడా లేదు.

"మహాత్మా! గొప్పదైన వసుమహారాజు చరితం వినటం ఆయన ధైర్యసాహసాలూ అద్భుత పరాక్రమం వినటమేగాని, ఈ వనితాలలామ రాజుని చూడటం కూడా ఒనగూడలేదే. ఆ రాజైనను ఇదివరలో గిరికా దేవిని కళ్ళారచూసిందిలేదు. వీరినెల్లా కలుపగలడు? ఆ అజుడైనాగాని" అంది మంజువాణి.

మంజువాణీ! అటువంటి కాంతారత్నాలను సృష్టించిన బ్రహ్మ దేవుడు ఈమెను వసురాజుకే కలుపకపోతే అతడి సృజనాత్మక శక్తికే లోపం. మధురిమలతో కూడిన ఆయన ప్రతిభకే లోపం.

లోకంలోని స్త్రీలోకంలో కెల్లా ఈ కన్య ఉత్తమురాలు. వసు రాజుకి తగినజోడు. అతడా పురుషులందరిలో ఉత్తముడు పూవుకు తావి చేరినట్టు ఈమె వసురాజుని చేరటం ధర్మం. అతి సమీపంలోనే వుంది ఈ కలయిక అన్నాడు.

సందేహమనస్క అయిన మంజువాణి. 'ఈ పర్వత ప్రాంతాలకు వసురాజు ఎప్పుడు వస్తున్నాడు? వచ్చినా కాని ఈ మారుమూలలకు ఎలా వస్తాడు? వచ్చిన సందర్భంలో ఈ కన్యకామణిని చూడటం ఘటిస్తించాలి కదా? ఇదంతా సానుకూలం అయేపనేనా? అంది.

"మంజువాణీ! ఆ మహారాజు ఇప్పుడే వస్తాడు. మీ చెలిని చూసి

మనసిచ్చేందుకై. నేను ఒక మంత్రప్రయోగం చేస్తాను చూడు. వసు రాజునిక్కడకు రప్పిస్తాను అంటూ మంత్రప్రయోగం చేస్తూన్నట్టు నటించి నాలుగుదిక్కులూ చూస్తూ ఒక్కసారి 'హే రాజన్' అని కేక పెట్టాడు.

అదే సరైన అదను అనుకున్నాడు సమయం కోసం ఎదురు చూస్తున్న వసురాజు.

ఆ పొదలచాటునుంచి చిరునవ్వు మొగంతో బయటకు వచ్చాడు. ఇక్కడ చమత్కార మేమిటంటే రాజు ఆంతర్యం నర్మసచివుడికి బాగా తెలుసు. ఎప్పుడు ఆ యౌవనాంగి దర్శన సామీప్యమౌతుందా అని తహతహలాడిపోతున్నాడని. ఇంకా జాగుచేస్తే రాజు భరించలేడని తెలుసు. అందుకని సాధ్యమైనంత తొందరగా తన ఏలిక ఆతురతని ఎగర కొట్టే వుద్దేశంతోనే మంత్రోచ్చారణ చేస్తానని అన్యాపదేశంగా రాజుకి చెప్పాడు. ఇంక బైటకి రావయ్యా నేనంతా సుగమం చేశాను ముందుదారి. నీవు తెరగునుంచి బైటపడె తరుణమాసన్నమైంది. అని ఎరుగ చెప్పటమే ఆ మంత్రోచ్చారణతతంగం. ఆ సంకేతం అందుకుని రాజు బైటకు రానే వచ్చాడు. ఇక్కడ కవి ఒక్క పద్యం చెప్పాడు. వసురాజు 'పురాతన పుణ్యశ్లోక మహర్షి' అన్నాడు. గిరికాదేవి త్రిజగతి సుదతీరూప విజయకీర్తి' అన్నాడు. వసురాజు అమానుషమహాసత్వాఢ్యుడు ఆ భూనాథాగ్రణి' గిరికాదేవి 'పుడమికానుపు పద్మిని' రత్నమునకు వసు రాజుతో చేర్చి శిల్పదృష్టిని ప్రదర్శించి ఈ భావాన్ని అఖిల భువనకావ్య ప్రపంచానికి తెలియజెప్పాడు.

రాజు తన ఎట్టఎదుట బాలచంద్రుని కాంతులీనేటటువంటి మోముతో ఆమె యౌవన మన్మథరాజ్యం వలె విస్తరించి వుండటం చూశాడు. లక్ష్మీపార్వతులంశ ఆమెయందు వున్నట్టుగా కచ్చితంగా కనిపించింది. ఆమె మెడశంఖంలాగ వున్నప్పటికీ ఆమె కంఠానికివున్న మధురనాదం శంఖానికి లేదుకదా?

కుంటూ పరిపూర్ణ యౌవనంతో విరాజిల్లే ఆ గిరికాదేవిని చూస్తూ ఒక
క్షణం రెప్పవాల్చటం మరిచిపోయి అలా వుండిపోయాడు.

వసురాజుయందు బద్ధానురాగఅయిన గిరికను, గిరిక అసాధార
సౌందర్యంతో సర్వం మర్చిన రాజునుచూసి ఆ సచివుడు అనుకున్నా
'అచలసుత' అయిన పార్వతీదేవిని చూడటానికి వెడుతున్న ఈ రా
మౌళి చంద్రశేఖరుడా అన్నట్టు వున్నాడట రాజు.

ఇలా గిరికను చూసిన వసురాజు బ్రహ్మసృష్టికి అబ్బురప
పోతూ, అద్భుతమైన ఆమె సౌందర్యానికి ముగ్ధుడయి, ఇతర ఆలోచ
ఏవీ స్ఫురింపక సంభ్రమాశ్చర్యాలతో ఆమె లోచనలవైపు చూశాడు.

'మీరు తలచిన శుభకార్యం కొనసాగుతుంది' అన్నాడు స
సచివుడు రాజుని చూసి ఆశీర్వదించే నెపాన.

అనుపమ కాంతివైభవ సమన్వితుడైన వసురాజును చూసి వి
తనమైన అనురాగ సంపదతో నిండిపోయింది ఆమె హృది, అనుమాన
సంకోచం, భయంకూడా కలిగాయి. ఆ క్షణాన ఆమెకి కాని అ
చంచలత్వము ఆ చకోరాక్షిని ఉత్సాహపరుస్తున్నాయి.

త్రిజగతీ సుదతీ, రూపవిజయకీర్తి
కలుగునని ఇంతి, ఫాలమున వ్రాసి
నలువ ఈ శుభ, వాచకములకు శ్రీల
మొదలతుది నివ్వె, ననగర్ణములు దనర్చు।

ఇలా ఆమె సౌందర్యానికి మ్రాన్పడి వుండగా మంజువాణి,

'ఓరాజ చూడామణీ ! పుణ్యవతియైన శుక్తిమతికినే ఏలుబ
వున్న కోలాహల పర్వతరాజుకు జనించిన ఈ గిరికాదేవి నీయం
విష్ణువుయందు లక్ష్మివలె ఉజ్జ్వలమైన అనురాగంతోవుంది. సకల స

కు ఆలవాలమైన ఓరాజా! మేమంతా నీవారమే, కాని పరులంకా
ఇక్కడ వేంచేయటం పండుగలా అనుకుని ఆనందిస్తున్నాం! అ

ఈమాటలువిని లజ్జాకుపితఅయి లోపలకు వెళ్లిపోయింది గి
ని ప్రభావంవల్ల ఈ ప్రేమికులు ఈనాడిలా కలుసుకున్నారు,
టున్నవారి మాటలకు వసురాజు

"లతాంగి! ఈ మునిప్రభావాన్ని కొనియాడటం ఎవరికీ
ు. ఈ ముని నాకు పరమాప్తుడు. అంటే సరిపోతుంది కాని
త్రుడు కాదు. ఈయన ప్రసాదంవల్లనే నేనుమృదు మధుర వాక్కా
మను వినగలిగాను. ఆ అదృష్టంగలిగింది."

ఆ మాటలలో నిశ్లేష గ్రహించి నవ్వుకుంటూ మాయా
ంజువాణి! బ్రహ్మ వినూత్న శోభతో వీరిద్దర్నీ కలిపి మనస్తో ప్ర
ందుతున్నాడు. నాందీ ప్రస్తావన గావించిన నువ్వు ధన్యురాలవు.
ర్యం త్వరలోనే చక్కగా కాగలదు." అని చెప్పి పక్కకివెళ్లి
ని కాస్త వసురాజుకి సచివుడై వచ్చాడు.

అక్కడి వారంతా ఈ మాయ కాస్త్రా కనిపెట్టేశారు. ఆ
క్చాతుర్యానికి మురిసిపోయి కార్యసానుకూలానికై అలాటి పన్ను
నట్లు తెలుసుకుని ముసముసిగా నవ్వుకున్నారు. ఒక చెలి
లులారా! ఈ వసుమహారాజు ఇక్కడకి రావటంవల్ల ఈ కో
వ్వతమెంత మనోహరంగా వుందో చూడండి. గిరికాదేవి వె
త్తకాంతితో ఎంత కళకళలాడుతోంది చూడండి."

ఈ చెలికత్తె వేళాకోళంగా అంది ఆ మాట. అది తెలుసు
లిక ఒక్కక్షణమైనా అక్కడ నిలువక గిరుక్కున వెనుదిరిగిపో
లికను ఇంకా చూడాలని కోరికవున్నప్పటికి చూడలేక పోయాన
త్కంఠ తగ్గలేదు రాజుకి.

తెరమరుగుకు వెళ్ళి మళ్ళీ వస్తూండటమువల్ల మళ్ళీ వెళ్ళి పోవటం ఈ చర్యలవల్ల ఆమె నిగూఢమైన మనసు అందరికి విదితమైంది. తిరిగి వెళ్ళేప్పుడు జడవెనక్కి విసురుగా పడటంవల్ల పూరేకులు ఝల్లున రాలాయి.

"ఓ తరుణీ! ఈ ధరణీపతి కలవీయకుండా వెళ్ళిపోవటం ధర్మంకాదు, ఈ వసురాజు అందరివంటి వాడుకాదు." అనిచెప్పి

"అయ్యా! రాజోత్తమా! మాచెలిపై అభిమానాన్ని విడవకండి. ఆమెపై ప్రేమ మరవకండి" అంటూ ఓచతుర, గిరికని తీసుకుపోయింది. ఆమె గిరికను తీసుకువెడుతుంటే వెనక్కి వెనక్కి తిరిగి వసురాజు వైపే చూస్తు నడిచింది గిరిక.

ఆమె అలా వెళ్ళిపోయాక వసురాజు మనసు చాలా దిగులుపడి పోయింది. ఆమెయందే లగ్నమైంది మనసు. ఆయన కన్నుల్లో నీరు నిలచి చూపును మందగింపజేసింది.

ఇదంతా చూసిన సచివుడు సరసోక్తులతో

భూనాయకా! మీవలెనే మా గిరిక కూడా ఈ ఎడబాటు సహించ లేదు. మీకు అన్యులెవరు? గిరిక జనని శుక్తిమతీదేవి అనాడు ఆర్తితో మిమ్ము శరణువేడిన పవిత్రమూర్తి. జనకుడానాడు మీ పరాక్రమం ఎరిగి మీచెంతనే వుండిపోయిన సిపాదాక్రాంతుడేకదా?

కనుక వారికీ ఉదంతమెరిగించి సత్వరమే ముహూర్తంగావించి మాచెలిని చేపట్టి ధన్యను చేయండి ప్రభూ!" అన్నాడు. ఆ మాట కర్తవ్యం గుర్తుచేసినట్టయింది. రాజు మనసు పూలపల్లకిలా మేఘాల్లో తేలిపోయింది.

* * *

గిరిక వసురాజును తిరిగి ఎప్పుడు చూస్తానా ఆ పరాక్రమశాలితో

ఏమి నాదురదృష్టం. ఈమాయదారి సిగ్గునన్ను తలెత్తిచూడనీకుండా, ముఖమెత్తి మాట్లాడనీకుండా, అయనచెంత క్షణమైన నిలువనీయక తొందరపెట్టి మహత్తరమైన అవకాశాన్ని కాస్త మాయంచేసింది అని విలపించింది. క్షణమొక యుగంలా గడుస్తోందావిడకి. రాత్రి కనురెప్పలు మూయటంలేదు. నిద్ర బద్ధశత్రువయింది. నోటికి ఏమీ రుచించటంలేదు. ఉస్సురనే వేడినిట్టూర్పులు. వెన్నెల వేడిగావుంది. శ్రీగంధం గుబులు పుట్టించి తనువెల్ల శగలూ పొగలూవస్తూంది. మల్లెపూలపాన్పు ముళ్లపాన్పులాపుంది. సూర్యాస్తమయమైనది చంద్రోదయాదులు, నక్షత్రకాంతి, వర్ణిస్తూ రామరాజ భూషణుడు రాసిన ఈ పద్యం ఒక మచ్చుతునక.

"హరిదంభోరుహ లోచనల్ గగన
  రంగా భోగ రంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్యసడ
  లింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటల
  మున్ వక్త్రంబు నుందోచెనాన్
హరిణాంకాకృతి వాల్చె రేకయి
  సగంబై బింబమై తూర్పునన్

రాత్రులందు నిద్రలేమిచే చిక్కిపోయింది. ఆమె వేలి అంగుళీయాలు కంకణములయాయని కవి చమత్కరించా డిక్కడ.

కురులను ముడుచుకోవటం మానేసింది. చిలుకలకు పలుకులు నేర్పటం మానుకుంది. హంసలతో ఆడుకోవటం అనవసరం అనుకుంది. కోయిలకూతలకు బదులివ్వటం వెగటనిపించింది. తుమ్మెదల ఝుంకారాలు విసుగనిపిస్తున్నాయి, తామరతూడులు చూస్తుంటే, సర్పసదృశ్యంగా

వున్నాయి. మలయమారుతం గాడిపోయి మంటలావుంది. మన్మధుడు ఆజన్మశత్రువా ? అనిపిస్తున్నాడు.

అయ్యో ! నేనింత అశక్తురాలనై పోతున్నానేవిటి ? నాతండ్రి కోలాహలుడు ఎంత గాంభీర్య స్వభావుడు ? అయన ఘనత్వంలో కాస్త యినా, రవంతయినా నాకు సంప్రాప్తం అయితే బాగుండునే ? తండ్రి పోలిక వచ్చిన స్త్రీలు అదృష్టవంతు లంటారుకదా ?

నేనేదో కాలక్షేపం కోసం వీణ వాయించుకుంటుంటే ఆ నాదం వింటూనే ముని ఎందుకురావాలి ? పోసీ వచ్చాడయ్యా, రమణీయ మనోహరుడైన వసురాజును గురించి ప్రస్తావన ఎందుకు తీసుకురావాలి? అయన చెపితే చెప్పాడు. నేనా వసురాజును పొందాలనే భ్రాంతిలో ఎందుకు పడ్డాను ?

నా తండ్రి కోలాహలుని హృదయం ఎప్పటికి కరుగుతుంది ?

ఈ విరహ సముద్రందాటేందుకు శక్తి ఎలావస్తుంది నాకు ? ఈ పరిస్థితికి తట్టుకోలేను అనిదురపిల్లుతోంది.

అక్కడా రాజు

ఉస్సురను గన్ను మోడ్చుధల
యూచు దలంచునగున్ జెమర్చు
నల్దెసలు గనుం గొనుం బొరలు
రేచువడంకు జలింపకుండు 'హా'
ప్రసవ సుగంధి యంచు పువు
పొన్పున ప్రాలు నృపాల పుంగవుం
డసమర ప్రవీరనిశి

ఈ దోవనే వెళ్లిందాలతాంగి ఇక్కడ చిగురుటాకుల ఒత్తిడి ఎక్కువగావుంది. ఇదిగో గిరికాదేవి చూపులతో పునీతమైన వనశ్రేణి. ఆమె వేళ్ళతో తాకిన పూలసముదాయం. ఈ పూలగుత్తులు ఆమె స్పర్శ పొందాయి. ఏం పుణ్యం చేసుకున్నాయో! ఇక్కడ గిరికమాట్లాడినట్లు తోస్తోందేమిటి? ఇక్కడ తేనెలు కురుస్తున్నాయి కదా? అందుచేత అలా అనుకోవాల్సి వస్తోంది.

సచివుడా! చూశావా? ఇక్కడే ఆ లతాంగిని చూశాను." అని లతల్ని కౌగిలించుకుంటున్నాడు. ఇదిగో పద్మిని దొరికిందని తామరల్ని ముద్దిడు కుంటున్నాడు.

ఆహా! కనిపించింది, కనిపించిందని

ఇక్కడ ఒక చిత్రమైన పద్యం

మోహోపదేశ తమోముద్రితములైన
కనుదమ్ములు హిమాంబులనుపరాదు
శ్రమబిందు తారకాగమ భిన్నకిచకోక
ములచంద్ర నామంబు తలుపరాదు
శీర్యదాశా వృంత శిథిలి తాసులతాంత
మసియాడ పీవనల్ విసరరాదు
పటుతాప పుటపాక పరిహీన తనుహేమ
మింక పల్లవపు టార్చిదగరాదు.

లలన కానంగ కీల కీలో కలాప
సంతతా పీధ హృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహపూరమ్ము పొంగిపొరల
జల్లని పటీర సవిలమ్ము జల్లరాదు

ఈ పద్యంలోని విచిత్ర మేమిటంటే

విరహతాపం పోగొట్టే శీతలోపచారాలు చెయ్యవద్దంటూనే పైపైకి నిషేధించినట్లు చెప్పటం. కాని అవిచేసి తీరాల్సిన ఉపచారాలు కదా?

పరికించాడు.

"రాజా ! నీ విచారానికి అంతమనేది వుందా అసలు. నీవు రమణీ మన్మధుడివి కదా? నిన్ను కన్నులార కాంచిన మగువ మరునివల్ల గొప్ప చికాకులు అనుభవిస్తూ వుండకమానదు. ఆ లతాంగి తల్లితండ్రులిద్దరు నీకు పాదాక్రాంతులు. ఆ కోమలి నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించిన వైనం గమనిస్తూనేవున్నావు. ఇంకా ఎందుకు నీకీసందేహం ? ఈ సంశయాలతో ఎందుకు బాధపడతావు ? మనం త్వరగా రాజధానికిచేరి పురోహితులతో సంప్రదించి కల్యాణానికి ముహూర్తం పెట్టిద్దాంపద" అని రాజుని తమ పట్టణంవైపు మరలించాడు.

* * *

అక్కడ చెలులంతా కలిసి గిరిక మన్మధప్రేరితమైన విరహబాధ వుపశమింపటానికి మన్మధపూజ చేస్తున్నారు.

ధ్యానంబు హృదయ వాస్తవ్య కుటుంబికి
నావాహనము జగద్వ్యాపకునకు
సర్వత్ర పాద్యములు నారాయణప్రియసూతి
కభిషేకము అబ్ధి కన్యాంకశాయి
కలిరు దోయిళ్ళ పువ్వుల వింటిదొరకు
గంధము గంధగిరి మరుద్బృందవునకు
ధూపము ప్రతిమ ప్రతాపోష్మ సురభికి
దీపంబు తిమిర భయాపహునకు

మధురస ఫలోపహారంబు మధుపకీర
పరిజన పరాయణున కంచు భక్తినొసగి
మాన మదనాయ మదనాయ మధుసఖాయ
మనసిజాయ నమో నమో యనచు మ్రొక్కినారు

ఓ మన్మథుడా! మా చెలిని ఇంతగా నొప్పించుట, నీకు ధర్మంగా వుందా? ఈ చిన్నదానిపైనా నీ బలప్రయోగం? ఇదేమి ఘనకార్యం? ఆమెను మృత్యుంజయుడనుకున్నావా? గొప్ప తపోధనులైన ఋషీశ్వరులనుకున్నావా? ఈ సుకుమార బాలికను దయచూడు. పూర్ణచంద్రుని బోలిన చిన్నారిని చెన్నాడకు. స్త్రీహత్యకు కారకుడవుకాకు అని ప్రార్థించారు. గిరికకు ధైర్యం చెప్పారు ఇలాగని.

'చిలుకలు' బ్రహ్మచర్యం అవలంబించాయి పండ్లుమాత్రమే తిని. కోకిలలు వానప్రస్థం చేస్తున్నాయి. ఆకులు చిగుళ్ళుమాత్రమే తిని. హంసలు సన్యాసం స్వీకరించాయి అవి మంచినీళ్ళుమాత్రమే తాగి, తుమ్మెదలు భిక్షుకవృత్తి అవలంబించాయి, వాసనచాలు వాటికి. అందుచేత నువ్వు వాటికి భయపడక్కర్లేదు. ఇవన్నీ సాత్వికమైనవే, అని పదే పదే చెప్పారు. ఆమెను ఓదార్చారు.

మేముచేసే ప్రార్థనలు నీకోసమే కదా? మా మనవి విని ఆదైవం నిన్ను వసురాజుకి తప్పక జతగూర్చుతాడు, నిశ్చింతగా వుండమన్నారు. ఆమెను వెంటబెట్టుకుని, కేళీగృహానికి తోడ్కొనివెళ్ళారు ఇష్టసఖులు. నిజంగా ఈ సృష్టిలో ప్రతిఒక్క మానవుడు జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఎందుకో ఒకందుకు, ఏలాగో ఒకలాగ ఒక్కసారైనా ఇటువంటి బాధ అనుభవించి తీరాల్సిందే. ఎటొచ్చి కొందరు పైకిచెప్పుకోగలరు. కొందరభాగ్యులు రెండోకంటివాడికి తెలియకుండా తమలో తామే అనుభవిస్తారు. ఇది కఠిక సత్యం. తప్పదు. కవిపుంగవులు మాటలునేర్చివారు కనుక కమనీయమైన మాటతో కావ్యాలు రాయగలరు అంతే.

* * *

మంజువాణి ఆకాశమార్గాన వస్తుంటే ఆ దిక్కు అరుణిమను దాల్చింది. మంజువాణి వసురాజిచ్చిన పద్మరాగమణితో గూడిన అంగుళీయకం తెస్తోంది. దాని కాంతి ఆ దిక్కునంతా అలముకుంది. ఆమె

ఇక్కడకు చేరుతున్నకొలది అరుణకాంతి అధికమయింది. అక్కడి వృత్తాంతమంతా చెలులకి చెప్పింది పూసగుచ్చినట్టు.

"ఆ వసుమహారాజు ఎలాంటి ఆలోచనలో వున్నాడో తెలుసుకు రమ్మని నన్ను పంపారుకదా? నేను వడివడిగా ఆకాశమార్గాన ప్రయాణ మైపోయాను. అధిష్టానపురం గుర్తించాను. ఆ పురవైభవాన్ని కళ్ళారా చూశాను. ఆ పట్టణం అంతా నిద్రావస్థలోవుంది. మనుష్యలోకంలోని ఆ భవనంలో దేవకాంతలు సేవలుచేయటం నాకు వింతనిపించింది. దేవేంద్రుడు వసురాజుకు కానుకగా ఇచ్చిన దివ్యవిమానం అక్కడ కనిపించింది నాకు.

అందువల్ల గుర్తుపట్టగలిగాను రాజసౌధం. అన్నికూడా ఉన్నత సౌధాలే ఆ నగరంలో. సౌధాంతరం ప్రవేశించాను. వసుమహారాజు విరహతాపంతో స్రుక్కివున్నాడు. నిద్రతో విరోధం పెట్టుకున్నాడు. ఉస్సురంటూ మాటిమాటికి వేడి నిట్టూర్పులు విడుస్తున్నాడు. నీపట్ల నేను చేసిన అపరాధమేమిటి? ఒక్క చిరునవ్వుచూ సేందుకు నోచుకోలేదానేను? నాయందు ఇంత కఠినమానీకు? అనీ ఇంకా ఏమేమో అంటూ దురపిల్లుతున్నాడు. ముందు సరసోక్తులు తరువాత నిష్ఠురోక్తులు ఆడుతున్నాడు, రాజు. ఆహారపానీయాలు మానివేశాడని తెలుసుకోవటానికి నాకు ఎంతోసేపు పట్టలేదు. ఆ విషయం పరిచారికలు మాట్లాడుకుంటున్నారు. వారి మాటల్నిపట్టి కొంత గ్రహించాను, నేనప్పుడు చెప్పాను.

ఓ వసురాజా! నీ హృదయానగల తాపాన్ని గమనిస్తున్నాను. నేను గిరికాదేవి ఇష్టసఖిని మంజువాణిని. నీవలె మా చెలికూడా దుర్భరమైన మన్మథ బాధననుభవిస్తోంది. చిక్కి సగమైంది. నీ ఎడబాటు సహించలేక ప్రాణత్యాగానికైనా వెనుదీయటంలేదు. గిరికాదేవి ఆనవాలుగా నీకీయమన్న ఈ కంఠహారం స్వీకరించు అని ఇచ్చాను.

ఆ రాజు ఎంతో ఆప్యాయంగా ఆ కంఠహారాన్ని అందుకుని

పలుమారు ముద్దిడుకుని కన్నులకద్దుకొని హృదయాన్ని చేర్చుకున్నాడు. మంజువాణీ! నా ప్రాణాలు నిలబెట్టటానికి వచ్చిన అదృష్టదేవతవు. నిన్ను చూడగానే నాకు వూపిరాడినట్టయింది. ఏమన్నావు? నాలాగే మా చెలికూడా విరహబాధ అనుభవిస్తూ కుంగిపోతోందా? ఇప్పుడు నామనసు కాస్త స్థిమితపడి వూరటచెందింది. ఈ కంఠహారం నా హృదయానికి తగులగానే నా తాపం చాలావరకు చల్లారింది. నాపై మమతతో నా పేరే మననం చేస్తోందా నీవు చెప్పినది నిజమేనా? అని నా నోట నీమాట మరీ మరీ అడిగి చెప్పించుకున్నాడు. ఆరాజేంద్ర చంద్రుడు.

ఆ రాజు మనసులో పరిపూర్ణంగావున్న ఆత్మీయతకు, మమకారానికి నా కళ్ళు చెమర్చాయి, ఆశ్చర్యం కల్గింది.

నన్ను ఈ కంఠహారం ఓదార్చినట్లయితే గిరికాదేవి దేహతాపాన్ని ఈ రత్నాంగుళీయకం ఉపశమింపజేయగలదు. నాకుమారుగ ఈ అంగుళీయం మీ చెలికిమ్మని తనచేతి నున్న అంగుళీయం ఇచ్చాడు. నన్ను వేగిరపరచి పంపాడు నీసన్నిధికి.

అపురూపంగా అంగుళీయాన్ని మంజువాణిచేతి నుంచి అందుకుంది గిరికాదేవి. ముద్దిడుకుని వేలికి ధరించింది. గిరిక వదనసరోజం వికసించింది. తాపం హరించింది. ఆ పూలతోటనుంచి కదలి తనసౌధం వైపు చెలులతోపాటుగా వెళ్ళదల్చింది.

* * *

కోలాహలరాజు తన ప్రియపుత్రికని చెంత కూర్చుండ బెట్టుకుని ఇంతగా చిక్కిపోయావేమమ్మా? ఆహారం కాస్తయినా తీసుకోవటం లేదని చెపుతున్నారు నిజమా? కారణం చెప్పుతల్లీ! అని బుజ్జగించి అడుగుతున్నాడు.

ఆ సమయాన ఆకాశమంతా వింత వెలుగుతో నిండింది. అలా చూస్తుండగానే ఆ వెల్గు వాళ్ళ సమీపానికే వస్తోంది అవి విమానపంక్తులుగా గుర్తించాడు.

ఇంద్రుడు మొదలైన దిక్పాలురు వారి వారి దివ్యవిమానాలను దిగి నిలబడ్డారు. ఇంద్రుడు ఐరావతం దిగివచ్చాడు.

కోలాహలుడు ఈ సంరంభం అంతాచూసి కొంతసేపు దిగ్భ్రమ చెంది ఆ తరువాత తెలివితెచ్చుకుని చేతులు జోడించాడు. అతిధిసత్కారాలు చేశాడు. తన వున్నతికి తగినట్లు ఇంద్రుణ్ణి గౌరవించాడు.

"ఈమె నా కులదేవత నా ముద్దు కూతురు గిరిక" అని అందరికి ఎరకపర్చగా గిరిక అందరికి శిరసువంచి నమస్కరించింది.

అందరు గిరికాదేవి సౌందర్యం రెప్పవాల్చకుండా చూశారు. రంభ గిరిక చక్కదనం చూసి తలవంచుకుంది. ఇంద్రుడు తన వేయి కన్నులు సార్థకమయేట్లు చూశాడు.

'నిన్ను గన్నతల్లి భూలోకంలోని నదుల్లో శ్రేష్ఠమైనది.'

నీ తండ్రి ఔన్నత్యం నీవల్ల అతిశయించింది అని ఆకాశగంగ గిరికాదేవిని ఆక్కున జేర్చుకుంది.

రాజులందరిలోను వసురాజు ఉత్తముడు-పరమ పరాక్రమశాలి. అటువంటి రాజుకి ని బిడ్డనిచ్చి నీ జన్మ చరితార్థం చేసుకో. పార్వతి పరమేశ్వరుల్లా వారి దాంపత్యం వాసికెక్కుతుంది. పార్వతి కంటె గిరిక ధన్యురాలు అని దేవతా నది పల్కింది.

ఆ మాటలు కోలాహలుడు అమితవినయం ఉట్టిపడుతూ నమస్కరించి చేతులు కట్టుకుని.

మహేంద్రుడా! నీవు సర్వాధికారివి. నీకు పాదార్ఘ్యం ఇవ్వటం

పరిహాసంగా వుంటుంది. రత్నమాణిక్యాల నివ్వటం అసలే హాస్యాస్పదం. పూలతో అర్చించటానికి కల్పవృక్షం మొదలైన ఘనమైన వృక్ష సముదాయం అంతా నీ వనంలో నివే. కామధేనువు నీ పెరటిలోని జంతువు. నీకు ఏమిచ్చి మెప్పించగలనో తెలియటం లేదు నాకు. వైరివాడికి సహాయం చెయ్యటానికి వేల్పులు దిగివచ్చారన్నది నిజం చేశావు. నా యోగ్యత చాలా అల్పమయింది. ఒకమూల వసురాజు పాదహతిచేత భంగపడి ఓ చోటపడివున్న నన్ను చూసేందుకై మీరంతా వచ్చారంటే. ఇదంతా నా భాగ్యం విశేషమే నా జన్మచరితార్థమైంది మీ ప్రసన్నత వల్ల నా గౌరవం హెచ్చుతుంది అన్నాడు.

ఆ మాటలకి దేవేంద్రుడు ఎందుకు ఇలాటి బేలమాటలు మాట్లాడుతావు. నీ తండ్రి ఎంత గొప్పవాడు? నీ తండ్రి సంతానంలో నీవే శ్రేష్టుడవు. మేనకకు ముత్యము వంటివాడవు.

వసురాజు చేసిన పరాభవాన్ని దుఃఖాన్ని తొలగించటానికే ఈమె జన్మించింది. పార్వతినిగన్న హిమవంతునికన్న నీవే మిన్న. ఈ కన్యని అర్హుడైన వసురాజు కిచ్చి కన్యాదానం చేయటమే ఉత్తమోత్తమమైనది.

నీవు పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుకున్నావు. శుభప్రదమైన ఈ కార్యం జరిపించు మూడులోకాలకీర్తించబడుతాయి పూర్వం నిన్ను కాలితో తన్నినవాడు ఇప్పుడు నీ కాళ్ళకు మొక్కుతాడు. నీ కన్నా బలవంతుడు నీకు వినమ్రుడై వుండటం నీ పుణ్యం అన్నాడు ఇంద్రుడి మాటలు విని కోలాహలుడు ఇంద్రుడికి ప్రదక్షిణం చేశాడు. 'నా పరాభవ సముద్రంలో ఓడలాగ జన్మించిన గిరికను వసురాజుకిచ్చి నీవు చెప్పినట్లే చేస్తాను. నీవు నా శ్రేయోభిలాషివి అని కొనియాడాడు.

ఎదురులేని గొప్ప పరాక్రమశాలికి తను పిల్లనిస్తున్నాడు. అడిగినవాడు సాక్షాత్తూ సురేంద్రుడు. ఒక దేవత ప్రత్యక్షమైతేనే అఖిల

సంపదలూ, శుభాలు ఒన గూరుతాయే! ఇంతమంది దేవతలు ప్రత్యక్షమై యారంటే ఇంక ఏమని చెప్పాలి?

ఇంతమంది దేవతలకి ప్రీతివొసగే కార్యం శుక్తిమతిని పిల్చి చెప్పాలి. ఆ పవిత్ర చరిత్రకూడా బ్రహ్మానందభరిత అయిపోతుంది. అనుకున్నాడు కోలాహల పర్వతరాజు.

ఈ మాటలన్నీ వింటూ తండ్రి ప్రక్కనే ఒదిగి నిలబడివున్న లతాంగి లజ్జాభారంచే వంచిన తల ఎత్తలేకపోతోంది. చేతిలో లీలాపద్మం రేకులు చిదుముతోంది గిరిక. ఇంతకు ముందే చెలికత్తెల వలన దేవతాగమన వార్త విని వేగంగా పరుగులిడుతూ వస్తోంది శుక్తిమతీదేవి. ఆవిడ ఒంటరిగా రాలేదు తనకు ఆప్తులైన స్నేహితులు దగ్గర బంధువులు వారాహి, నర్మద, కావేరి, యమున, గంగ, బాహుద, వేత్రవతి, సరస్వతి మొదలైన నదులు ఆమె కూడా వచ్చాయి.

ఈ సంగతి విని దీర్ఘ శృంగాలు ఎత్తైన పర్వతాలు ఇంద్రుణ్ణి గౌరవించేందుకు వచ్చాయి.

చాలా కాలంనుంచి సముద్రమధ్యాన దాగివున్న మైనాకుడు తన సోదరుని కుమార్తె వివాహానికి పైకివచ్చి తిలకించాలని ఉబలాటపడుతున్నాడు. వీరంతా కోలాహలుని బంధువులు.

మేరు మందర పర్వత శ్రేష్ఠులు కూడా వచ్చారు. ద్రోణాచల శ్రేష్ఠం కూడా బయలుదేరింది. సింధుకాంతవైన నదులన్నీ వచ్చాయి. వారందర్నీ గౌరవించాడు. ఇంద్రుడు పర్వతాల నన్నిటిని మన్నన చేశాడు. వీరందరికి మర్యాద చేయాలంటే గొప్ప సౌధ రాజాలతో విలసిల్లే మహాపట్టణం కావలసివచ్చింది. మహేంద్రుడు సంకల్పమాత్రంచేత అన్ని హంగులతో గూడిన మహాపట్టణం నిర్మించాడా కోలాహల పర్వతం మీద.

మొదటగా కోలాహలుడు ఇంద్రునితో "పిల్లని వసురాజున కిమ్మని అడగటానికి నేను వేరు మనిషినా? నీ వాడినే కదా? నా సొమ్ములన్నీ నీవే కదా? శుక్తిమతి బంధువులని నాబంధువులని, నీకు ముఖ్యులని తోచిన వారినందర్నీ పిలిపించు, సగౌరవంగా వసురాజుని పిలిపించు. గిరికాదేవితో పాణిగ్రహణం గావించు. అన్నీ నీవే చెయ్యి" అన్నాడు. కదా?

ఆ మాట గుర్తించుకున్న మహేంద్రుడు ఆ పెళ్ళి బాధ్యతంతా తనే వహించాడు. దేవతలంతా హిమవంతుని కులవర్ణన చేస్తుండగా ఆయన మేనకాదేవి చేయిపట్టుకొని విలాసంగా వస్తున్నాడు. తన దౌహిత్రి వివాహం ఆనందదాయకమే కదా?

ఇక్కడ చెలికత్తెలు సుగంధ ద్రవ్యాలతో జలకమాడించి గిరికని చక్కగా శృంగారిస్తున్నారు. ఇంద్రుడు తల్చుకుంటే చెయ్యలేని దేముంది? ఎటు చూసినా ఆ పట్టణం సుగంధాలతో గుభాళిస్తుంది. వినోదాలతో నాట్యాలతో గానాలతో నినదిస్తోంది. సూర్యకాంతి మణులు మొదలైన మణులతో రత్నాలతో దేదీప్యమానంగా విరాజిల్లుతోంది ఆ పట్టణం.

సింధువు తన పుత్రికకు మేలైన ముత్యము లెన్నో కాన్కగా ఇచ్చాడు. హిమవంతుడు అనర్ఘ్యరత్నాలెన్నో బహూకరించారు వధువుకి. కిన్నెరకాంతలు వనదేవతలు శ్రావ్యంగా మంగళహారతులు పాడుతున్నారు.

ఆ పర్వతానగల లతలన్నీ కన్యలుగా మారాయి. శాఖలన్నీ వీరులుగా మారాయి. బంగారుఆకుల పై శుభలేఖలురాసి సమస్త రాజన్యులకు పంపారు. నేడు కదా మన జన్మసఫలమైందని తలచి గొప్పగొప్ప కానుకలతో అంతా వచ్చి చేరారు.

ఎప్పటికప్పుడు ఇక్కడ సంగతులన్నీ వసుమహారాజుకి అందు

తూనే వున్నాయి. అయినప్పటికి తన దర్మం అనుకుని ఇంద్రుడు స్వయంగా వరునితో తోడ్కొని వచ్చేందుకు వెళ్ళాడు.

ఇంద్రుని చూడగానే వసురాజు ఎదురొచ్చి కౌగలించుకున్నాడు ఇంద్రుణ్ణి.

"రాజా! మొన్నటి సభకు నువ్వు రాలేదు ఎందుకు రాలేదా అని విచారిస్తే తెలిసింది నువ్వు గిరికామోహపాశ బద్దుడవై విరహంలో చిక్కి వున్నావని, అన్న పానీయాలు రాజ కార్యాలు విసర్జించి నిన్ను నీవే మరిచివున్నావని తెలిసి కోలాహలుడితో విషయమంతా సవిస్తరంగాచెప్పి పెళ్ళి ఏర్పాట్లు అన్ని గావించి వచ్చాను. ముఖ్యులందరికి ఆహ్వానాలు వెళ్ళిపోయాయి. ఈపాటికి అంతా వచ్చేవుంటారు. నువ్వింక ఆలస్యం చెయ్యక ముహూర్తం సమీపిస్తుందని చెప్పాడు.

'మిత్రమా! నువ్వు నాకోసం అపరిమితంగా శ్రమపడుతున్నావు. నీకెలా ఎరిగించాలి నా హృదయం? ఏది తోచటం లేదన్నాడు.

అవన్నీ తరువాత తీరిగ్గా చెప్పుకునే మాటలవి. ముందులేచి మంగళాస్నానం కానీయమని ఇంద్రుడు తొందర చేశాడు.

ఆ అంతఃపురాంగనలు తమ ప్రభువుకు చందనం నలుగులు పెట్టి పన్నీట జలకమార్చాడు. చీనిచీనాంబరాలు కట్టనిచ్చారు. అనేక మణి హారాలు రత్నాంగుళీయాలు ధరింపజేశారు. పచ్చలు, నీలాలూ, తాపీన కిరీటం శిరసున వుంచారు.

వందిమాగదులు స్తోత్రాలు చేస్తుండగా, బ్రాహ్మణాశీర్వచనాలు చదివి సేసలు జల్లుతుండగా, మంగళవాద్యాలతో భూనభోంతరాలు మారుమ్రోగుతుండగా, దివ్యవిమానారూఢుడై వేంచేస్తున్నాడు. ఆ దివ్య రథం కోలాహలుని కొనగోటితో పైకి ఎగనెట్టిన సందర్భాన వసురాజుకి కానుకగా ఇచ్చాడు ఇంద్రుడు.

'భూనాయకా ! నీ పరాక్రమానికి చాలా సంతోషించాను. విశ్వకర్మ నిర్మితము అనేక రత్నస్థాపితము, మణిప్రతిష్ఠితమైన దీనిని అధిరోహించి లక్ష్మి సహితుడైన విష్ణువు, సూర్యమండలమంతా ప్రకాశించేట్టు పర్యటన చేసివచ్చాడు. నేను ఈ విమానాన్ని ఎడతెరిపి లేకుండా చూస్తుండటం కనిపెట్టి నాపేరాశ కనుగొని ఆయనకు నాయందుండే వాత్సల్యంతో నాకు కానుకగా ఇచ్చాడు. ఇది నీకు బహుమతిగా ఇస్తున్నానని చెప్పి బహూకరించాడు.

ఇది నిజంగా గొప్ప మహిమాన్వితమైనదే. ఈ ఆకాశమునందు విమానంలా ఎగురగలదు. భూమిపై రథంలా నడువగలదు. ఆ సౌందర్యవంతము తేజోవంతము అయిన ఆ రథం రోజూ ఎంతో సువర్ణరాసులు కురిపిస్తుంది. అన్ని లోకాలసౌఖ్యాలు కల్గిస్తుంది. రోగభయం లేదు. అంధకార భయంలేదు. మానసికరుగ్మతలు, శత్రుభయంలేదు. అసలేమీ బాధలు అంటవు. కామగమన మైనది.

దీని మహత్తు చెప్పాలంటే బ్రహ్మకైనా తరంకాదు. వేయిపుష్పక విమానాలైనా దీనికి సరిరావు. శిశిరఋతువులో వెచ్చగా వుంటుంది. పద్మరాగమణులున్నాయి కనుక. వేసవిలో మౌక్తికాల కాంతి ధారలతో నిండిన ఈ విమానం చల్లని ఉల్లాసంకల్గిస్తుంది. నృత్యగీతాలు వినిస్తాయి మనసుకి హాయిగొల్పుతూ ఇక్కడవున్న చిత్తరువులు ప్రాణంపోసుకుని నర్తిస్తాయి. ఇది అధిష్టించేందుకు అర్హుడవు, నీవు. సర్వసద్గుణశీలుడవు. కనుక నీకు ఇస్తున్నాను ఈ విమానాన్ని అని చెప్పి అనాడు ఇంద్రుడిచ్చాడు.

ఇప్పుడు ఈ విమానంలోనే వివాహవేదికకు బయలుదేరాడు వసురాజు. లగ్నం సమీపిస్తోందని ఆంగీరసుడు, బృహస్పతి తొందరచేశారు, ఆ భూమండలాధీశుడు వసురాజు. ఆ మంచుకొండమీద సాక్షాత్తూ సాంబశివుడిలా భాసిస్తున్నాడు. సంతోషాతిశయంతో ఆ దేవకాంతలు అంతా భూమిపైన నడవటం మానేశారు.

బేరి మృదంగాలధ్వని మిన్నుముట్టింది. బ్రాహ్మణాశీర్వచనాలు కమనీయంగా శ్రవణాలకి విందుచేస్తున్నాయి. పుణ్యస్త్రీలు హారతి ఇస్తున్నారు. ఆ వధూవరులకు వైజయంతీమాల ధరించి వెలుగొందుతున్న వసురాజుకి తన తనయని కన్యాదానం చేశాడు, పర్వతరాజు. ఆమె మంగళ గళానికి మంగళసూత్రధారణ చేశాడు వసురాజు. ఆచంద్రార్కం వెలుగొందుతుంది ఈ మంగళసూత్రం అని బృహస్పతి ఆశీర్వదించాడు.

సప్తఋషులూ వారి భార్యలు, అజుడు వాగ్దేవి. ఇంద్రుడు ఇంకా సమస్తమైన దేవతలు బంధువులు అంతా దీవించి ఆ వధూవరులపై దివ్యసుమాలు అక్షతలూ చల్లి వారు తెచ్చిన కానుకలర్పించారు.

వచ్చినవారి నందర్ని యధాశక్తి సత్కరించాడు కన్యాదాత. కాంతివంతమైన ముక్తామణులను ఎన్నో అల్లునకు కానుకగా ఇచ్చింది శుక్తిమతి.

దేవతలంతా సంతుష్టులై వధూవరులకెన్నో వరాలిచ్చారు.

"అమ్మా! అత్తమామలకు ఎన్నడు ఎదురాడకు. పరిజనాన్ని స్వజనంగా చూడు నీ పతికి అనుగుణంగా నడచుకో, పతివ్రతలలో శ్రేష్ఠమైనదానవుగా విరాజిల్లు" అని శుక్తిమతి తన కూతురికి చెప్పింది. అందరూ కోలాహలుని అదృష్టాన్ని కొనియాడారు.

ఒకరోజున ఆ రాజు తన అంతఃపురానికి వెళ్ళాడు. చక్కగా అలంకరించివుంది. గోడలపై శృంగారయుతమైన చిత్తరువులు, వింత వింత పరిమళాలు మత్తెక్కిస్తున్నాయి. మధురపదార్థాలతో కూడ అలంకరించబడి వుంది. ఎంతవెదకినా తనప్రేయసి కనుపించలేదు వసురాజుకి. పట్టు తెరలచాటున చంద్రకాంత శిలాస్తంభాన్ని ఆసరాగా చేసుకుని ఆతుక్కునిపోయి నిలబడివుంది గిరికాదేవి.

అక్కడ కొంతసేపు నిలబడిన దేవిదర్శనం కాలేదు. కనుక మెల్లిగా వెనుదిరిగాడు రాజు. అప్పుడు తమలపాకువంటి గిరికా దేవి మృదువైన చేయి ఆయన భుజంమీద పడింది. ఒక్క క్షణం ఆయన చంద్రకాంత శిలాస్తంభమే అయాడు. మళ్ళీ తెలివొంది గిరికాదేవిని దగ్గరకి లాక్కున్నాడు. ఆవిడ నవ్వుతూ పారిపోయింది. వెనుకనే వసురాజు వెళ్ళాడు. ఇలా ఆ స్తంభంచుట్టూ తిరిగి ఆ శయ్యాగృహమంతా తిరిగి ఆయనను తిప్పించి చివరకు వసురాజు వశమైంది.

* * *

ఈ విరహాంత సమాగమం అందరికి ముదం చేకూర్చింది. మహిత లావణ్యా మన్మథ మన్మథుడైన వసురాజును మొదటిచూపులోనే వలచి తన హృదయం సర్వస్వం అర్పించింది గిరిక.

ఆ వసురాజు కూడా నవనవోన్మేష తారుణ్య ప్రభాశాలిని ఆ సౌందర్యరాశిని తన హృదయఫలకంమీద చిత్రించుకున్నాడు.

ఈ కథావిధానంతో చదువరలకు ఉత్కంఠకల్గించి ముక్త కంఠంతో గానంచేసి అజరామరుడైన అదృష్టశాలి రామరాజభూషణ మహాకవి.

శుక్తిమతి తన ప్రియపుత్రికకి శంఖములహారం మెడనువేసింది ముద్దుగా. "నదులయందు సాగరములయందు అవి విరివిగా దొరికేవి. అనగా ఆమెకు అందుబాటున వున్నవి" అని మనం గమనించాలి.

ఆమె మెడే శంఖముకదా వేరేశంఖములెందుకు అని కోలాహల పర్వతరాజు (తనయందు విరివిగా లభించేవి రత్నాలే కనుక) ఆ శంఖ హారం తీసివైచి తన పుత్రి గళాన రత్నహారం వేశాడట. ఈ మాట ఎంత ఇంపుగావుంది, కవి హృదయాన్ని ఎంత సొంపుగా చెపుతోందా మాట.

శుభముహూర్తం నిర్ణయించమని అడిగిన ఇంద్రుడితో బృహస్పతి అంటాడు.

ఈ వివాహాన్ని నువ్వు దగ్గరుండి జరుపుతున్నావు. సూర్యాది గ్రహాలన్నీ ఇక్కడే వున్నాయి. అశ్విని ఆదినక్షత్రాలన్నీ ఇక్కడే వున్నాయి. సుముహూర్త కాలంలో సంకల్పం చెప్పుకునే పుణ్యనదులన్నీ ఇక్కడే వున్నాయి. నేను ఆధ్వర్యం వహిస్తున్నాను. ఇక వధూవరుల శుభానికేంలోటు? అయినా అడిగావు కనుక మిదునలగ్నం చాలాబాగుంది, అనుకూలంగా వుంది. అన్నమాట ఎంత యుక్తియుక్తంగా వుంది.

"మనమున నత్కవి కావ్యము
నదరగ విలుకాని పట్టినమ్మును ఒరర
హృద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మరియు ఒట్టినదియు శరమే."

అని నన్నెచోడుడు చెప్పినట్టు, నిపుణుడైన విలుకాని శరంలా. సూటిగా వెళ్ళి హృదయాన్నిచొచ్చి తలయూపింపగల, కావ్యరాజం తలమానికం వసుచరిత్ర.

పర్వతాన్ని పురుషుడుగా నదిని స్త్రీగా ఇంత కావ్యం నడిపిన సాహిత్యరసపోషకుడు, గాన విద్యావిశారదుడు కథాశిల్ప వేతృత్వమూ, మూర్తీభవించిన కవితామూర్తి భట్టుమూర్తి. అందుకే ఆ అమరమూర్తికి అక్షయకీర్తి! ఇతని అనుపమానమైన సాహితీశక్తులు అనంతాలు. వసుచరిత్రవంటి అపూర్వచమత్కార కథాసంవిధాన విలక్షణ ప్రబంధం ఆంధ్ర సారస్వతంలో మరొకటి లేదు.

# కైకేయి

శ్రీమద్రామాయణ మహాభారతాలు మానవజాతికి శాంతిని ఆత్మ జ్ఞానాన్ని అందిస్తాయి. ఆనందామృత ఝురులు అన్నారు. అందరికి అవశ్యపఠనీయ గ్రంథాలు అన్నారు. ఆర్షసాంప్రదాయమైన రామాయణ గ్రంథాన్ని ఉగ్గుపాలతో అనేక రకాలుగా మనకందించారు మన పెద్దలు. జోలపాటలతో పాడి జోకొట్టారు పసితనాన. భారతదేశంలో సాంస్కృతిక జగత్తులో, సాహిత్యరంగంలో ఆధ్యాత్మిక ప్రవచనంలో ఈ గ్రంథానికున్న విశిష్టత చెప్పనలవికాదు. యుగ యుగాంతరాలుగా యిలాంటి ఉద్గ్రంథాలు అశేషప్రజానీకానికి మార్గదర్శనం అని పునరు ద్ఘాటించవలసిన పనిలేదు. రామాయణగ్రంథం ఆర్షవిజ్ఞాన సర్వస్వం. శ్రీమద్రామాయణం

ఆధ్యాత్మిక తత్వవేత్తల వూహాలో వేదాంతనిధి
సత్కవీశ్వరుల మనసులో అనంత సాహితీ భాండారం
లాక్షణికుల తర్కంలో - సకల లక్ష్యసంగ్రహం
పౌరాణికుల దృష్టిలో - బహు పురాణ సముచ్చయం
నీతికోవిదుల మాటల్లో - నీతిసారం
ధర్మవేత్తల పలుకుల్లో - మహాధర్మశాస్త్రం

అపార తపస్సంపన్నుడైన వాల్మీకి ఏనాడైతే రామాయణం ఆవిష్కరించాడో ఆనాటినుంచి అవిరామంగా శాఖోప శాఖలతో అనేక నామాలతో ఈ మహాకల్పవృక్షం భారతదేశాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా, జ్ఞానభూమిగాచేసి, దిగంతాలకు పాకింది.

వేదానికి వేదమే ప్రమాణంలా, వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణం

ఈ రామాయణ కల్పవృక్షం నీడన పండితపామర భేదంలేకుండా, ఎందరో శ్రమతీర్చుకుని, శాంతిని పొందుతున్నారు అనటంలో అతిశయోక్తి లేదు. మన దేశంలోనే కాకుండా, ఇతరదేశాల్లోకూడా రామాయణాన్ని నృత్యనాటికల్లో, నాటకాల్లో ప్రదర్శించి జేజేలు కొడుతున్నారు.

ధర్మాధర్మాలను, సత్యాసత్యాలను, నిత్యానిత్యాలను, కృత్యాకృత్యాలను వాటి నిజస్వరూపాలను వెల్లడిచేసే పవిత్ర రామాయణ గ్రంథంలో ఏ పాత్ర కా పాత్రే అపురూపమైనది, అద్వితీయమైనది, అనుపమానమైనది, అఖండమైనది, అజరామరమైనది. వాల్మీకి రామాయణాన్ని ఎందరో కవులు, వచన కావ్యాలుగా పద్యకావ్యాలుగా, గేయాలుగా, గీతాలుగా, నృత్యనాటికలుగా, పురాణేతిహాసాలుగా, రచించి గానం చేస్తూ పఠిస్తున్నారు.

ఎన్నిసార్లు చదువుకున్నా, ఎన్నిసార్లువిన్నా, వినిపించినా, ఆలోచించినా, తనివితీరని రామాయణం ఎప్పటికప్పుడే నవ్యనూతనం, రామాయణ మహాకావ్యంలోని ముఖ్యోద్దేశం ధర్మసంస్థాపన అని మనం ఒప్పుకోక తప్పదు.

అసత్యమాడలేక, ఇచ్చిన మాట తప్పలేకనే కదా దశరథుడు కైకేయి కోరికపై రాముని అరణ్యవాసానికి పంపటం. ఆ మాట నిలబెట్టుకోవటమన్న ప్రక్రియలో తనప్రాణం పోగొట్టుకున్నాసరే మాట నిలబెట్టుకున్నాడు దశరథమహారాజు. వేదములయందలి ధర్మనిగూఢమైన నీతి తత్వములందరికి సుబోధకమైనట్లు తెలుపాలనీ, అప్పుడు ప్రచారమందున్న లౌకిక సంస్కృతభాషలో, సర్వజన సుబోధకముగా రమ్యమైన కథతో రమణీయంగ రచించబడిన, మొదటికావ్యం, ఆదికావ్యమనే సార్థక నామధేయం పొందింది.

వాల్మీకాత్ ఉత్థిత: = పుట్టనుండి బయల్వెడలినవాడు అని అర్థం

అని అర్థం

> వేదవేద్యే పరేపుంసి, జాతే దశరథాత్మజే
> వేదః ప్రాచేద సాదాసీత్, సాక్షాద్రామాయణాత్మనా॥

వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథమహారాజునకు, కుమారుడై జన్మింపగా వేదము ప్రచేతసుని ముఖమునుండి రామాయణమను పేరుతో అవతరించింది.

పరమాత్మని గుణగణాలు వర్ణించుటే దీనిలోని ప్రధాన ప్రయోజనం. ఆ ప్రచేతసుడే వాల్మీకి అయిఉండవచ్చు.

> "మానిషాద ప్రతిష్ఠాం త్వ, మగమః శాశ్వతీస్సమాః
> యత్క్రౌంచ మిధునాదేక, మవధీః, కామమోహితాః"

"ఓ నిషాదుడా! నీ క్రౌంచమిధునము జంటనుండి కామమోహితమైన మగపక్షిని చంపితివి. అందుచే నీవు పెక్కు సంవత్సరములు అప్రతిష్ఠను పొందుము" అని అర్థము. దీనికి మరియొక యర్థము కూడావుంది

"మా + నిషాద = లక్ష్మికి నివాసమైన ఓవిష్ణూ! నీవు దంపతుల నుండి కామ మోహితుడై సీత నపహరించిన, రావణుని చంపి, లోకమునకును, ఋషులకును, మేలుచేసితివి. కావున పెక్కు సంవత్సరములు కీర్తితో విరాజిల్లుము" అనునది రామాయణమునకు సంబంధించినది.

'ఈ మానిషాద' అనే శ్లోకము మాత్రము వాల్మీకి నోటినుండి ప్రప్రథమముగా వెలువడింది. ఆ తరువాతనే రామాయణార్థము సూచింపబడిందని పండితులు చెపుతారు. ధర్మానుష్ఠానం ఆయన తత్వం.

రామాయణం లోకంలో విశేష ఆదరణ పొందుటకు పెక్కు కారణాలు ఉన్నాయి. ధర్మబోధ రాముడి వుద్దేశంకాదు.

రసపాత్ర పోషణతోనూ, గంభీర భావాలతోనూ, మృదుమధుర భాషతోనూ, కథా కథనంతోనూ, పాత్ర చిత్రణంలోనూ సన్నివేశ కల్పనలోనూ, నీతి ధర్మోపదేశంలోనూ, వాల్మీకి ప్రదర్శించిన నేర్పు అనుపమానమైనది. సంస్కృత భాషాభిజ్ఞులు ఎన్నిఎన్ని జన్మలకైనా, వాల్మీకికి ఋణస్థులై వున్నారు.

ఇంకా రామాయణాన్ని ఎందరైతే ఎన్నిరూపాల్లో మలిచారో వారంతా ఆదికవి వాల్మీకికి కృతజ్ఞత లర్పించాలి.

కీర్తి, ధనం, లోకజ్ఞత, అమంగళ పరిహారము, రసానంద ప్రధానం కావ్యం యొక్క ముఖ్యప్రయోజనాలు. సరళము శక్తివంత మైనదీ వాడిన భాష.

అనవసరముగా సమాసాలు వాడక, అలతి అలతి పదాలతో గంభీరార్థాల్ని వ్యక్తపరిచాడు. సంస్కృతాన స్వల్ప పాండిత్యం గల వారైనప్పటికి ఈ రామాయణ కావ్యం చదివి, రసానుభూతి పొందగలరు.

ఇంపు సొంపుగల ఈ గ్రంథంలో
ఇహపరాలు రెండూవున్నాయి.

భారతీయ గృహిణీ జీవితాన్ని కూడా సమగ్ర సుందరముగా ఈ గ్రంథంలో పొందుపరచాడు వాల్మీకి.

ఏ పాత్రకదే, కథా సౌధానికి ముఖ్యమైన మూలస్తంభం రామాయణంలో మనకు, మంథర, శూర్పణఖలాటి పాత్రలు, అప్రధాన పాత్రలలో కనిపిస్తాయికాని, అదే ముఖ్యమైన మూలస్తంభాలు.

మంథర లేనిదే రామ వనవాసమే లేదు.

శూర్పణఖ లేనిదే సీతాపహరణ, రామ రావణయుద్ధమే లేదు. పాత్రలను, మలచడంలో ఎంతో జాగరూకత వహించాడు వాల్మీకి.

వరుపుంది. కైక మొదటినుండి కూడా రాముని యందు అత్యంత ప్రీతి గలదయ్యీ మందర దుర్బోధకులోనై ఆ క్షణమందు ఆ రెండు వరాలు కోరిందేకాని, ఆమె కోరికేం తీరింది.

రామ వనవాసానికి కారణమైంది ఆమె.
లోకదూషణకు నాడూ నేడూ గురి అవుతూనేవుంది.

అంతులేని భర్తృప్రేమకు దూరమై, భర్తచేత దూషణ తిరస్కారాలు కర్ణకఠోరంగా పొందింది. భర్తమరణానికి కారణభూతురాలయింది. పైగా తప్పుచేసినవాళ్లు తము చేసినది తప్పుకాదని ఒప్పేనని సమర్థించుకుంటారు. లేదా ఇంకా తమలాంటి వాళ్లు ఎంతోమంది వున్నారని వాదిస్తారు. అలాటిదేమీ ఆవిడ చెయ్యలేదు సరికదా ? అవమానంతో పశ్చాత్తాపంతో, సిగ్గుతో తలవంచుకుంది కాని ఒక్క మాటకూడా మాట్లాడలేదిక. పైగా రాముని అయోధ్యకు తెచ్చేందుకు బయలుదేరే వారిలో ముందీవిదేవుంది. వాల్మీకి ప్రతిభ లోకోత్తరము. ఆయనశక్తి అనంతము. యుక్తి అపరిమితము, భక్తి వర్ణనాతీతము, ఉపజ్ఞ ఊహాతీతం. అందలి విశిష్టత, విషయప్రదర్శన, వివేకము, అమృతమయ వాక్ప్రవాహము, సలలిత మృదు మధురధ్వని, సకలశాస్త్రపారంగతత్వము, దివ్యదృష్టి, దివ్యాతిదివ్యదృష్టి, మనకు ప్రబలతుష్టి, నిత్యపుష్టి, రామాయణామృత దివ్యకావ్య మొకటిచాలు. ఆర్య సంస్కృతి ఆర్ష సంస్కృతి విశ్వరూపాల వెలయింప చేయటానికి, అది అలాగ వెలయింప జేసి, సనాతన ధర్మ జయపతాక నిల్పింది.

తత్పతాకచ్ఛాయన నిల్చుని మన ధన్యత కానందాశ్రువులు రాల్చటమే మనపని!

పఠనమాత్ర తాపత్రయ నివారణం
స్మరణమాత్ర ఐహికాముష్మికప్రదం.

ఒకరికోసంబైన, వాంఛనైన, రామ అంటే ఆయాఫలితాలు వద్దన్నా కలుగక మానవు. ఏటిలో తనంతపడినా, వెనుకనుంచి మరొకరు నదిలోకితోసినా, పొరపాటున కాలుజారిపడ్డా తడిసిపోవటం ఎంత తథ్యమో అలాగ రామాయణం ఆదికావ్యమన్నారు. అంతకుముందు లిఖించటం అనే ప్రక్రియలేదు. వేదాలుశృతులు మరొక ఋషి అధ్యయన పూర్వకంగా ఇచ్చినవే.

రామాయణంలోని అయోధ్యకాండలో జరిగిన కథంతా మనుషుల మధ్యన జరిగింది ఇందు అరణ్యంకాని రాక్షసులు వానరులుకాని లేరు.

ఈ కథలో ఒకరాజు ఆయనకు ముగ్గురు భార్యలు, నల్గురు కొడుకులు. పెద్దకొడుక్కి యువరాజ్యాభిషేకం చేసే సమయానికి సవతితల్లి పడనిచ్చింది కాదు. దాసి పుట్టింటి నుంచి వచ్చినది కనుక ఆ సవతితల్లి క్షేమంకోరి ఓ తికమక లాటి తిక్క ఆమె మనస్సుకి నచ్చేట్టు ఎక్కించింది.

దానితో అంతా తారుమారయి పోయింది. రాజుకి చిన్న రాణికి ఘర్షణ మొదలైంది. రాజు ఒత్తిడికి లొంగిపోయాడు. కొడుకు అరణ్యవాసానికి వెళ్లటం తప్పనిసరైంది. కథలో కావల్సినన్ని ఘర్షణలొచ్చాయి.

ముఖ్యంగా కైక మంథరవల్ల ప్రేరేపించబడి ఈ గొడవలో కీలకస్థానం ఆక్రమించుకుంది.

ఆమెది దురాశా హృదయం కాకపోతే ఆమెకి మామూలుగా సవతి తల్లి కుండే అసూయ లేకపోతే, రామాయణ కథే లేదు.

ఈ మలుపు యావత్తు ఆమె కఠినత్వం మీద ఆధారపడివుంది. కథ ఆ పాత్రమీద ఆధారపడివుండగా ఆమెను మంచిగా ఎందుకు వుండనిస్తారు కవులు? ఆమెను మంచిగా వూహించుకుంటే కథకి పట్టేలేదు.

కథానాయకుడైన రాముడు మంచివాడు దశరథ మహారాజు మంచివాడు. భరతుడు రామభక్తుడే. ఇంతమంది మంచివాళ్ల సందున కథ ఏంవుంటుంది? మంచివాళ్ళకు మంచి వాళ్లకుమధ్య స్పర్థ ఎలావుడు తుంది? అందుకని దుష్టపాత్రగా కైకని చూపెట్టివుంటాడు. అదీ మంథర దుర్బోధవల్ల, బిగిసడలని కథకోసం. దుష్టపాత్రవుండి తీరాలికదా!

ఈ కథకి కేంద్రం రాముడు. ఆయన చుట్టూ ఈమూడు పాత్రలు తిరుగుతూ వుంటాయి. నిజానికి కైక రాముని తల్లికన్న దొడ్డ గుణం కలది. దశరథుని మదిలో గొప్పవేదన. ఆయన రాముని ఎడ బాటు ఎంతమాత్రం సహించలేదు. రాముడాయనకి ప్రాణంలోప్రాణం "ఓసీ కైకా రాక్షసీ! నన్నుతిని శాంతించు" అని ఆక్రోశించాడు. "అయోధ్యని పాడెట్టి అందరం అరణ్యానికిపోదాం రామునితో" అని తన క్షోభ వెల్లడించుకున్నాడు దశరథ మహారాజు. "నాయనా రామా! నువ్వే నన్నుశిక్షించి రాజ్యం తీసుకో." అని కొడుకుతో మొరపెట్టుకుని ఏడుస్తాడు. అంతేకాని "ఓసికైకా! నీకా వరాలని ఇవ్వను." అనలేదు ఎందు కని? అలా అనలేక పోవటమే ఆయన గుణం. అందులోనే ఆయన ధర్మ బుద్ధి వున్నది. చాలా ఆరాటంలో పడిపోయాడు. స్వచ్ఛమైన పుత్ర ప్రేమకి సత్యవాక్పరిపాలనకు లోబడిపోయి వాటిరెంటి మధ్య నలిగి పోయాడు దశరథ మహారాజు.

నిజానికి కైకకి కల్గిన మనఃక్లేశం మరీ దారుణమైనది. రాముడిని విడిచి తనూ వుండలేదు. ఈ సంగతి ఎవరైనా నమ్మతారా? అసలు.

రాముడు తన బిడ్డ, దేవతలకష్ట పరంపరలు తీర్చేందుకు తనబిడ్డ అరణ్యాలట్టుకు పోవాలా? నిజంగా అలాగ తను అనకలదా- అంటే లోకం తనని ఎంత ఆడిపోసుకుంటుంది. అయినా తప్పేట్టులేదు. తరువాత భరతుడు వచ్చి తననే తిడతాడు అని అనుకుంది. దుఃఖించింది. ఆమెకు దుఃఖంకల్గిందన్నా నమ్మేరెవరూ?

అందుకే ఆమె మనసు బండబారిపోయింది. ఆమె నాలుక మొద్దు బారి పోయింది. ఆమె ఏమంటోందో ఆమెకితెలియకుండా అయిపోయింది. విధి చాలా బలీయమైనది కనుక ఆమెచేత అలాచేయించింది. అలుక, వరాలు అనేకారణాలు కల్పించింది. కైకచేత అలా చేయించింది. ఆ మాయపొర ఆ తరువాత విడిపోయింది. నేనే అంతంత మాటలని. ఆ పని ఏలా చేయగల్గాను అని ఆమె విస్తుపోయింది.

ఆ తరువాత ఎంతమంది ఎన్ని విధాల దూషించి నప్పటి పెదవి కదల్చనేలేదు కైక.

సద్గుణనిధి అయిన శ్రీరామచంద్రుని పట్టాభిషేకం ప్రజలందరికీ ఆమోదయోగ్యమైనా మందర చేసిన దుర్బోధనవలన కైకేయి తన భర్తయైన దశరధ మహారాజుకి ప్రాణప్రియమైన దయినా అప్రియమైన వార్త ఆయనకు అందించేందుకుగాను అలుక సాగించింది.

అక్కడ పట్టాభిషేక సన్నాహాలన్నీ వైభవోపేతంగా జరిగి పోతూనే వున్నాయి. నవరత్నాలు స్థాపించిన సింహాసనంపై కూర్చుండ బెట్టుకుని దశరధ మహారాజు అన్నాడు.

అద్యప్రకృతయ స్సర్వా । స్త్వామిచ్ఛన్తి నరాధిపమ్
అతస్త్వాం యువరాజాన, మభిషేక్ష్యామిపుత్రక ॥

కావున నిన్ను యువరాజ్యము నందభిషేకింపవలె అన్నాడు. కాని విధి మరొకలావుంది కదా అలాఎందుకు జరుగుతుంది ? రేపు అభిషేకము జరుగుతుందనగా, అక్కడ కైకేయి మనసును మందర తన కుటిలమంతా వినియోగించి ఆవసింది. రాజనీతి, స్వార్థదృష్టితో ఆవసీయంది బాగా విషపూరితం చేసింది. ఇష్టుడైన రాముడికి పట్టాభిషేకం సంతోషదాయకమే అయినా, మంధర వాక్చాతుర్యంవల్ల కైకేయికి కంటక ప్రాయంగా విషాద హేతువుగా మార్చివేసి ఆమె మనసంతా కూడా విషతుల్యం చేసింది.

తన పుట్టింటినుంచి తనతో కూడావచ్చి ఎల్లప్పుడు తన క్షేమమే కాంక్షించే మందర మాటలు ఎంతో అనురక్తిని కల్గించాయి ఆమెకు.

భర్త యుద్ధసమయంలో తనకు ఇస్తానన్న రెండు వరాలసంగతి కూడా జ్ఞాపకంచేసి ఆ వరాలను పొందే సమయం ఆసన్నమైనదని కూడా చెప్పింది మందర.

అందరి భార్యల్లోకి ప్రియాతిప్రియమైన కైకేయి కోపాన్ని దశరథ మహారాజుకి నిస్తేజాన్ని నిర్లిప్తతని కల్గజేశాయి. ఎంతో అనునయంగా అడిగాడు అలకకి హేతువు.

"ఆత్మీయులేకాక అశేషప్రజానీకం కూడా శ్రీరామ పట్టాభిషేక వార్తవిని ఆనందాబ్ధి నోలలాడుతూంటే నీకుప్రియమైన వార్తచెప్పాలని వచ్చిన నాతో ఎందుకు మాట్లాడవు ? ఈ చీకటిగదిలో నేలపై నిరాభరణవై నిరాహారివై పడుకోడానికి కారణం నాతోచెప్పు ప్రాణప్రియా" అన్నాడు.

యదాహి కుర్యాత్సర్పోవా, శత్రుర్వా ప్రత్యుపేక్షితః
రాజ్ఞా దశరధే నాద్య, సపుత్రాత్వం తథాకృతా।

అని మందర చెప్పినమాటలు మదిలో ఉంచుకుని కోపాన్ని విడువదలచుకోలేదు. మొదట మందరవలన రామాభిషేక వార్తవిని అత్యంత ఆనందకరమైన వార్త తెచ్చినందుకు బహుమతి నీయదలచిన కైక మందర చెప్పిన మాటల్లో పడి అదిచెప్పిన కుటిలనీతి బాగా తలకెక్కినదై మనసు మార్చుకుంది.

ఇంకా ఆ దాసి మాటలు వినివిని 'అదికూడా నిజమేసుమీ' అనుకుని ఆ దాసి చెప్పే పర్వతం తనకావరాలమాటే గుర్తురానందుకు తననుతాను తిట్టుకుని మందర మాటలు మెచ్చుకుని అలుక సాగించింది భర్తపై కైక.

ఇక్కడ మనం గుర్తించవలసిన విషయం ఒకటుంది. దశరథ మహారాజు మొదట కైకేయిని వివాహం చేసుకునేముందు కైకేయ మహారాజుకి తన దౌహిత్రుని సామ్రాజ్యం ఇస్తానని మాటిచ్చాడు. ఇదివరకే కౌసల్యకు సుమిత్రకు బిడ్డలులేని కారణంచేత ఆయన అప్పుడలా అనటంకూడా సమంజసమే.

కైక సౌందర్యానికి అబ్బురపడి అయితేనేమి, పుత్రులు లేనందు వల్ల నైతేనేమి కైకను వివాహమాడాడు దశరథుడు.

ఆ తరువాత పుత్రకామేష్టియాగం చేయటం నల్గురు పుత్రులను పొందటం జరిగింది. ఇప్పుడు పెద్ద కొడుక్కి రాజ్యమివ్వటం ధర్మం కదా ? కైకేయి పుత్రుడయిన భరతునకు రాజ్యమివ్వటానికై ముందే మాటిచ్చాడు కదా? ఈ ధర్మసంకటములో ఇరుక్కున్న దశరథ మహారాజు మేనమామ వెంట భరతుని పంపటానికి వెంటనే అంగీకరించాడు. ఆతరువాత పట్టాభిషేక సంరంభం ప్రారంభించాడు. ఈమాటలే మందర కైకేయికి గట్టిగా పట్టుదలగా బోధించింది. తన పెద్దకొడుకు పట్టాభిషేకానికి ఏవిధమైన ఆటంకమైన, భరతుడు కలిగించవచ్చనే భయంతోనేకదా మాతామహుల యింటికి భరతుడిని పంపివేశాడు రాజు ?" అనికూడా బాగా ఎక్కించింది. నిజమేసుమీ ! అనుకుని కోపంతో బుసలు కొట్టింది రాజుమీద కైక.

ఇహ ఇప్పుడు తనుచేయవలసి పనేమిటి ? తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకానికి ఏమాత్రమైనా ఆటంకం కలించవచ్చు రాముడు. కనుక రాముని ముందుగానే పదునాలుగేండ్లు అరణ్యవాసం పంపించివేస్తే, పట్టాభిషిక్తుడైన తన పుత్రుడు ఈ పదునాలుగేండ్లలోనూ రాజు కార్యాలయందు బాగానిష్ణాతుడై, ప్రజానురాగాన్ని పొందగలడనే ప్రలోభానికి లోనై ఆ రెండు వరాలూ దశరథమహారాజుని కోరేందుకై కైకేయికిస్తానని చెప్పిన వరాలు, నేనెంతమాత్రం ఇయ్యలేదు, అని చెప్తావా ?

సుదీర్ఘమైన ఆలక సాగించింది. కైక కోప గృహంలో పరుండటం గురించి యిలా అన్నాడు వాల్మీకి

విదర్శితా యదాదేవీ, కుబ్జయా పాపయా భృశం
తథాశేతేస్మసా భూయౌ, దిగ్ధ విద్ధేన కిన్నరీ.

నానా విధంబులైన పుష్పమాలికలన్ని విసర్జించి గొప్పదైన తలకట్టు విరియబోసుకుంది. శ్రేష్టములైన ఆభరణాలన్నీ నేలపై జారవిడిచింది. ఆ మణిమయ సువర్ణాభరణాలన్నీ ఆకాశంపై నక్షత్రాలవలె నేలను ప్రకాశింపజేశాయట.

మలినవస్త్రాలు ధరించి కోపగృహానపడివున్న కైక మృతినొంది యున్న కిన్నరకాంతలా ప్రకాశించింది.

ద్వారపాలకులవలన, చెలికత్తెలవలన, కైకేయి కోపగృహంలో వుందని తెలుసుకున్న దశరథమహారాజు తిన్నగా అక్కడికే వెళ్ళి

ఓ మంగళస్వరూపిణివగు కైకేయీ! నీవెందుకు కోపగించావు నాపై? నేనుగాని నా పరివారం ఎవరైనాగాని నీకు కోపంతెప్పించే పనులేమైనా చేశామా? చెప్పు.

నీకు ఎవ్వనిపైన కోపంవుందో చెప్పు. చంపదగనివాడైనను వెంటనే వధిస్తాను. నీవెవ్వరికి మేలుచేయదలచావో చెప్పు. వధింపదగిన వాడైనా వాడిని రక్షించే మేలుచేస్తాను.

నీ ఇష్టానికి వ్యతిరేకి ఎవడు చెప్పు? వాణ్ణి దారుణంగా దండిస్తాను. నీకిష్టమయినవాడెవ్వడు చెప్పు గొప్ప బహుమతులిచ్చి గౌరవిస్తాను.

నేనూ, నావారూ మేమందరము నీ ఆజ్ఞ మీరేవారముకాము, కనుక నీ కోరికేమో సందేహించక తెల్పు.

సూర్యుని కాంతి ఎంతవరకూ పడుతుందో ఆ భూమి అంతా నాదే.

ప్రాచీనా స్సిన్ధు సౌవీరా సౌరాష్ట్రి దక్షిణాపథాః
వంగాంగ మగథామత్స్యాః సమృద్ధాః కాశీ కోసలాః

ఆయా దేశాలు ధన కనక వస్తు వాహన సమృద్ధి కలిగివున్నాయి. అందులో నీవేది కావాలన్నా ఇవ్వడానికి సంసిద్ధుణ్ణి. ఓ మంగళ స్వరూపిణీ! ఇలా నేలమీదపరుండి నీ సుకుమార సుందరదేహాన్ని ఎందుకు శ్రమపెడతావు? దానివల్ల ప్రయోజనమేమిటి? అని అనేక విధాల బ్రతిమాలి ఇలా అన్నాడు దశరథమహారాజు.

నా ప్రాణంబులకన్న మిన్నయగు రామునిసాక్షిగా
నీకోరిక తీరుస్తాను, అని ప్రతిజ్ఞ చేశాడు.

నీయందు నాకెక్కువ ప్రేమయున్నదని నీకు తెలుసు. కనుక తామర రేకులవంటి కండ్లుగల కైకేయీ! నీవు నాయందు సందేహముంచక మనసునగల కోర్కె తెల్పుమన్నాడు.

తేన వాక్యేన సంహృష్టా, తమభిప్రాయ మాగతమ్
వ్యాజహార, మహాఘోర, మభ్యాగత మివా న్తకమ్

ఓ దశరథమహారాజా! నీవు ప్రియపుత్రుని సాక్షిగా, పుణ్యముసాక్షిగా చెప్పిన ఈ మాటలు, అగ్నిహోత్రుడు ఆదిగాగల ముప్పదిమూడుకోట్ల దేవతలు విందురుగాక.

సూర్యచంద్రులు, ఇతరగ్రహములు, స్వర్గలోకము మొదలగు లోకంబులు, రేయింబవళ్ళు వీటియందుగల సర్వ ప్రాణికోటి కూడా సాక్షులుగా వుందురుగాక.

ఎన్నడు అసత్యమాడని ఈ మహారాజు సర్వధర్మములు తెలిసిన పరాక్రమశాలి, ఇప్పుడు నాకు వరములనిస్తున్నాడు. దీనికి మీరందరు సాక్షులు, అన్నది. విషయం గట్టిపర్చుకునేందుకు ఇదివరలో జరిగిన సంగతి సవివరంగా వెనిమిటి ముందుంచి జ్ఞాపకం చేసింది.

పూర్వం దేవతలకు, అసురులకు జరిగిన యుద్ధంలో శంబరాసురుడు నిన్ను మూర్ఛబోవునట్లు చేసినపుడు ఆ రాత్రంతా నీ ప్రాణం కాపాడాను. అప్పుడు నాకు నీవు రెండు వరాలిచ్చావు. సామాన్యంగా రాజువద్ద ప్రజలు సొమ్ముదాచుకున్నట్టు ఆ వరాలు రెండూ భద్రంగా నీవద్దనే దాచుకున్నాను. నీవు అనృతములాడవని, నాకు భర్తవని నమ్మి ఆ వరాలు రెండూ నీ వద్దనే దాచుకున్నాను. నాకక్కర కల్గినప్పుడు కోరవచ్చునని తలచాను. ఇప్పుడు నా రెండువరాలు నాకియ్యి. కొత్తగా ఏమీ ఇయ్యనక్కరలేదు, అంది.

వాఙ్మాత్రేణ, తథారాజా, కైకేయ్యాస్స్వవశేకృతః
ప్రచస్కన్ద వినాశాయ, పాశం మృగ ఇవాత్మనః.

ఇప్పుడు నీవు ఏ ఏ సంబారాలతో రామునికి పట్టాభిషేకం చేయనున్నావో, వాటితోనే నా కొడుకైన భరతునకు రాజ్యపట్టాభిషేకము చేసి, రాముని పదునాలుగేండ్లు అరణ్యంలో తాపసుడుగా వుండేలాగున చెప్పు. ఇవే నా రెండు కోరికలు. వాటిని ఇప్పుడు సమయం వచ్చినందున కోరాను. రాముడరణ్యమునకు పోతుండగా నే నిప్పుడే చూడాలి. ఆ తరువాత నిష్కంటకంగా నా కొడుకు సుఖంగా యౌవరాజ్యం అందగలడు.

సత్యసంధుడవని కీర్తినొందిన నీవు నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొని నీ కులాచార సంపత్తిని కాపాడుకో. నీ జన్మ సార్థకత చేసుకో అని కైకేయి దశరథుడితో చెప్పింది.

తత్ శ్రుత్వా మహారాజః, కైకేయ్యాదారుణం వచః
చిన్తా మభిసమాపేదో, ముహూర్తం ప్రత తాపచ.

కొంత సేపటికి మూర్ఛనొందిన మహారాజు తెలివొంది నాకు చిత్తవిభ్రాంతి ఏమైనా కలిగిందా? దుస్వప్నం కన్నానా? అనుకున్నాడు. కైక ఎట్ట ఎదుట పెద్దపులిని చూచిన జింకవలె వెల వెల బోతూ వట్టి నేలమీద కూర్చుని, దీర్ఘనిట్టూర్పులు విడుస్తూ, కోపంతో కైకేయిని కాలుస్తాడా

ప్రాణప్రియే! సుకుమారీ! అని, తామరరేకులవంటి కండ్లుగల కైకేయీ! అని ఓ విశాలనయనా! అని, ఓ మంగళస్వరూపిణీ! రాణీ! అని ప్రియ మార పిలచి మధురవచనాలతో ప్రతిమాలే భర్త ఆమె కోరిన రెండు కోరికలు విన్నాక, కాతరస్వరాన, "క్రూరురాలవగు కైకేయీ! అని, దుష్టురాలా! పాపిష్టురాలా, మృత్యువులాటి కైకేయీ! ఓ కుటిల బుద్ధి అని అనేకవిధాలయిన కఠినమైన సంబోధనలతో పిల్చి, మాటి మాటికీ కైకేయి దహింపబడుగాక" అంటూనే వున్నాడు.

ప్రాణప్రియుడైన దశరథమహారాజుయొక్క కరకుటమ్ముల వంటి మాటలన్నీ ఆమె హృదయాన్ని తూట్లుపొడిచినా లెక్కచేయలే దామె. తన కొడుకు రాజవుతే చాలనుకుంది. తను రాజమాతనై తేచాల అనుకుంది.

కాని ఆ పని జరుగలేదు పాపం. నాడూ నేడూ కూడా ప్రజ దూషణకి పరిమితే లేదుకదా? అపనిందలపాలయిందే కాని ఆమె కోరిక ఏం తీరింది?

* * *

దశరథమహారాజు గోలు గోలున ఏడుస్తూ "నీకు నమస్క రిస్తాను. నీ పాదములు పట్టుకుంటాను. రామాభిషేకములో నాకుధర్మవ కలుగునట్లు చెయ్యి. నా దుఃఖము పోగొట్టు" అని పరిపరి విధాల ప్రతి మాలాడు.

ఎంతమాత్రం మెత్తబడ తల్చుకోలేదు కైక. నీవు ధార్మికుడవే పూర్వం కైకేయికి రెండువరాలిచ్చావే ఆవిడ ఏమికోరింది? నీవేమిచ్చావ అని రాజర్షులు మాటల సందర్భంలో అడిగితే నీవేమి జవాబు చెప్తావు

ఎవ్వతి ఆనాడు దేవాసురయుద్ధంలో నాప్రాణం కాపాడిందో ఆ

కైకేయి కిస్తానని చెప్పిన వరాలు నేనెంతమాత్రం ఇయ్యలేదు అని చెప్తావా ?

నీవంశంలో డేగనుండి కాపాడిన పావురానికి అంత మాంసంతూచి తనశరీరాన్నించి కోసిఇచ్చిన చక్రవర్తిని మర్చిపోలేదు కదా నువ్వు ? నీవంశంలోనే. బ్రాహ్మణుడు గుడ్డివాడు కనుక ఏంకావాలో కోరుకో అన్నాడు రాజు. నీ కండ్లను నాకియ్యమని గుడ్డి బ్రాహ్మణుడడిగితే అన్నప్రకారం తన నేత్రాలు పెకలించి బ్రాహ్మణుడికి ఇచ్చివేశాడట. సత్యనిరతుడువన్న పేరు నిలుపుకో. నీవంశగౌరవం దక్కించుకో అని అన్నివిధాల దిగ్బంధన చేసింది కైక.

రాముడిని అరణ్యానికి పంపివేయటంతప్ప నువ్వు ఇక ఏంచేసినా నాకు సంతోషం కలుగదు. నావరాలు రెండూ తిరుగులేనివి అని చాలా ఖచ్చితంగా చెప్పివేసింది ఆమె.

అనేక విధాల విలపిస్తున్న దశరధ మహారాజు, దుఃఖాన్ని పెడ చెవినపెట్టి రామునకు అరణ్యానికి వెళ్లమన్నమాట ఎలా చెప్పాలో నోట రాక బాధపడుతున్న సమయంలో ఆ తర్వాత కార్యక్రమమంతా తనే నిర్వహించింది కైక.

* * *

మరునాడు పట్టాభిషేకానికి ఉపవాస దీక్షబూనిన రాముని, తండ్రి పిలుపుగా తీసుకుని రమ్మని, సుమంత్రుడితో చెప్పింది.

సుమంత్రుడు వచ్చినదెందుకు ? రామాభిషేకానికి సమస్తము సమకూర్చామని చెప్పటానికి తాను చూసిన దేమిటి సమస్తము పోగొట్టు కున్నట్లు ఎంతో జబ్బుపడిన వాడివలె సగము కృశించి హోరున విల పిస్తున్న దశరధ మహారాజుని.

ఆ రాజు తననోటితో చెప్పలేనివన్నీ ఆసమయంలో తనే చెప్ప కల్గింది కైకేయి.

తండ్రి యాజ్ఞ విన్నంతనే రాజ లాంఛనయుక్తంగా వచ్చిన

రాముని చూసి ఏమీ పలుకలేక రాముడా అనిపిలచి కన్నులనీటితో మాటాడ్డానికి అశక్తుడై వున్న దశరథ మహారాజుని చూసి "నీమొదటి కోరిక-భరతుడు రాజుకావాలన్నది మానవసహజం. రెండవకోరికతో నీలో మానవత నశించినట్లు కనిపిస్తుంది కైకేయీ. భరతుని రాజ్యంలో కూడా రాముడు వుండతగడా ? దుర్మార్గులు సహితం రాముని కోరుతుంటే రాముడు ఈరాజ్యంలోనే వుండరాదని శాసిస్తున్నావు. వెయ్యి ఏనుగుల బలంకల్గిన రాక్షసిలా. లక్షమంది దుర్మార్గుల దుష్టబుద్ధినీలో ప్రవేశించిందా ? రాజ్యాన్ని భరతుడికి కావాలన్నా ఇస్తాను కాని రాముణ్ణిమాత్రం యిక్కడే వుండనివ్వు" అని ప్రతిమాలాడు దశరధుడు.

"మహారాజా ! రాముని గుణసంపదయందు సౌశీల్యంయందు నాకునమ్మకముంది. సర్వజనులను, సమ్మోహితులను చేయగలడు. ఈ మీమాటలతో, అభిప్రాయాలతో, ఏకీభవిస్తాను. అయితే ఇంతటి యువరాజ్య పట్టాభిషేక మహోత్సవం భరతుడు చూడతగడా ? వద్దంటావని భయమా ?

ఓరాజా ! కుతంత్రంతో రాముడికి పట్టాభిషేకం జరిపించాలని చూశాడు మీరంతా. నేను కోరేది తంత్రంకాదు. కుతంత్రం అంతకన్నా కాదు. సత్యాని సమర్థించటం. మన వివాహపు రోజులు గుర్తుతెచ్చుకోండి కైకేయికి పుట్టిన బిడ్డకే రాజ్యం ఇస్తానని మాతండ్రికి మాటఇచ్చివేశారు. అమాట మీమనఃపూర్వకంగా అన్నది. అమాట తీసుకునే నన్నిచ్చిపెళ్లి చేశాడు నాతండ్రి. ఆసత్యాన్ని మీరు విస్మరించారు. భరతుడుండే యువరాజ్య పట్టాభిషేకం జరుగదని, భరతుడులేని సమయంలో ఈ కార్యక్రమం జరిపించ బూనుకున్నారు." అంది కోపంతో కైక. ఎటూచెప్పలేని ఇరుకున పడిపోయిన దశరధుడు దీనంగా అన్నాడు. ఓదేవీ ! భరతుడికి రాజ్యం ఇస్తాను. రాముని అడవులకు పంపమని కోరకు. నీ కాళ్లకు మొక్కుతాను చేతులు జోడించి ప్రార్థిస్తాను" అని మళ్లీ వేడుకున్నాడు

ఓరాజా ! కుటిలత్వంవిడిచి సావధానంగా విను. ఏ రాముని క్షణమైనా విడిచివుండలేవో, ఆరాముడిపై ప్రమాణంచేసి నీకోరిక ఏదైనా తీరుస్తానన్నావు. సమస్త దేవతలసాక్షిగా నీవు సత్యసంధుడివి, ఆడి తప్పనివాడివి. ధర్మజ్ఞుడివి రాముడిమీద ప్రమాణం చేసినమాటఇచ్చావని, నువ్వంటే గౌరవము వుంచి నాకోరికలు చెప్పాను. నీవు ఆడితప్పని వాడివయితే, సత్య సంధుడవైతే, సత్యధర్మాలను త్యజించక, రఘు వంశానికి కళంకం కల్గించక, ఇచ్చినమాట నిలబెట్టుకో. మాట తప్పిన మహారాజంటే ఎవ్వరికి గౌరవం వుండదు. దేవతలూ హర్షించరు." అంది, సహనం సంపూర్ణంగా తుడిచిపెట్టుకుపోయింది దశరధుడికి. "ఓకైకా ! నువ్వు ఘాతకురాలివి, వంశనాశినివి, పాపాత్మురాలివి, పాపిష్టురాలివి, స్వార్ధపరురాలివి, నీచురాలివి నీకు రాముడుచేసిన అప కారమేమిటి ? ఆడతాచుతో కాపురం చేశానా ఇన్నాళ్లు. ఏనాటికైనా కాటువేస్తుందని ఎరుగకపోయాను. పరమశాంతుడు సకలవిద్యాపారంగ తుడు. ఎవరికి ఎప్పుడూ అపకారం తలపెట్టని సుగుణాభిరాముణ్ణి, అడవికి పంపమనటం నీకు భావ్యమా?" అన్నాడు. దానికి "రాజోత్తమా! ఇన్ని మాటలెందుకు ? ఆడితప్పిన భర్తను సేవించటం కన్నా మృత్యు వుని ఆహ్వానించటం ఎంతో శ్రేయస్కరం. కనుక నాకు ప్రాణత్యాగమే సరైనమార్గం." అని ప్రాణత్యాగానికి సిద్ధపడింది కైక.

*　　　*　　　*

మనం ఇటువైపునించి ఆలోచించిచూస్తే కైకేయి మాటలు సత్య దూరాలుకావేమో ? అనికూడా అనిపించకమానదు. ఆవిడ మాటలే యధార్థమేమో ?

వజ్ర సమానమైన తనచేతివేలుతో రథంపడిపోకుండా ఆపి, భర్తకి జయంసమకూర్చిపెట్టి రాజువలన వరాలు రెండూ బడసి అవి కోరు కోకుండా దాచుకుని ఈరోజు ఈ సమయానికే ఆవరాలు, రెండూ కోరుకోకపోతే, గూనిది అయిన మందర కైకకి, ఆశలుచూపి. ప్రలోభ

[illegible] దుర్బోధచేసి కైక మనసు కలత పరచకపోతే సరస్వతీదేవి దేవతలచే ప్రేరేపించబడి మంథర నాలుకపైన, కైక నాలుకపైన ఆవహించి వరాలు రెండూ కోరేట్లుచేయకపోతే రామాయణం అంతటితో ఆగి పోయేది కదా? నిర్విఘ్నంగా పట్టాభిషేకం రాముడికి జరిగాక రాముడి ధర్మపరిపాలనలో ప్రజలంతా సౌఖ్యప్రదంగా వర్ధిల్లటం, దండకారణ్యంలో రాక్షసులంతా తమదుండగాలు నిష్కంటకంగా కొనసాగించటం, సాధుహింస మొదలైనవి అలాగే జరుగుతూఉంటే అక్కడితో రామాయణ కథ కంచికి వెళ్లటం జరిగేది. బాలకాండతోనే రామాయణం ముగిసేది.

కాని సరస్వతి దయవల్ల కైక కోరికలవల్ల, మంథర దుర్బోధ వల్ల, రాముడు అరణ్యవాసానికి వెళ్లటం, రాక్షస మాయలు, రాక్షస సంహారం, సీతాపహరణం, కారణంగా రావణవధ, అన్నీ జరిగాయి. రావణుడికి చాలాకాలం క్రితమే తెలుసు రాముడిచేతిలో తను హతుడౌతా నని. ఆకారణంగానే కోపంతో, దిలీప మహారాజుతో, రఘు మహారాజుతో, దశరథమహారాజుతో వైరంపెట్టుకుని యుద్ధంచేశాడు రావణాసురుడు. అయినా రాముడిచేతిల్లో చావు అనివార్యమైందికదా? తన పట్టాషేకం నిలిచిపోయిం దని, దండకారణ్యానికి వెళ్లి పదునాల్గు సంవత్సరాలు గడపాలని తండ్రి మాటగా కైక రాముడికి తెలుపగానే, రామునికళ్లలో ఒక మెరుపు మెరిసిందట. ముఖం వింతతేజస్సుతో వెల్గిందట. అది ఎవరూ గమనించ లేదు. కారణం ఎవరిబాధలో వాళ్లు మునిగిపోయి వున్నారు కూడా. రామపట్టాభిషేక సన్నాహాలన్నీ భారీ ఎత్తున జరుగుతున్నాయి. నగర మంతా అలంకరించారు. మంగళతూర్యనాదాలూ, భేరి మృదంగ వాద్యాలూ మిన్నుముట్టేలా ధ్వనిస్తున్నాయి. వీధులంతా సుగంధ జలాలతో కళ్లపిచల్లారు. అందరిళ్లూ ముత్యాల తోరణాలతో అలంక రించారు. ప్రతి ఇంటిముందు రత్నాల రంగవల్లులు తీర్చిదిద్దారు. బాలురు, స్త్రీలు, పురుషులు, వృద్ధులుఅనే తారతమ్యంలేకుండా అందరి

మొగాలు, ఆనందమయంగా వెల్లివిరుస్తున్నాయి. దేవతలు మాత్రం విచారగ్రస్తులై సరస్వతీదేవిని సమీపించి ముక్తకంఠంతో ఇలా అన్నారు. ఒక్కసారి అయోధ్య వెళ్ళి చూడుతల్లీ! ఎంతవైభవంగా వుందో.

"ఓసరస్వతీదేవీ! మాదేవకార్యంకోసం రామ పట్టాభిషేకం విఘ్నంచెయ్యాలి. పట్టాభిషేకం చక్కగా కొనసాగినట్టయితే రావణ సంహారం మాటేమిటి? నువ్విప్పుడు అయోధ్యవెళ్లి ముందు మందరను ఆతరువాత కైకేయినీ ఆవహించు. ఆ వరాలు రెండూ కోరేట్టుచూడు. పట్టాభిషేకానికి ఆటంకం ఏర్పడి రాముడు అరణ్యావాసం వెడితేకదా రాక్షస సంహారం? దీనివల్లనీకు దోషంరాదు" అనిప్రార్థించారు.

దేవతల ప్రార్థనవిని ఆ వాగ్దేవి ఆలోచించింది ఇలా చెయ్యటం సమంజసమౌనా? కాదా? అని ఒక నిశ్చయానికి కొచ్చిన సరస్వతి దేవి దేవతలతో సరేనంది.

పూర్వజన్మలో మందర విరోచనుడనే రాక్షసుని కుమార్తె. విరోచనుడు సత్యసంధుడు. అతడు దేవతలను జయించాడు. దేవతలు రాజ్యం విడిచిపెట్టి తమగురువైన బృహస్పతి దగ్గరకు వెళ్లారు. బృహస్పతి వారితో.

"మీరు విరోచనుని జయించలేరు. మీరు బ్రాహ్మణవేషధారులై అతని శరీరాన్ని యాచించండి. అతడు సత్యసంధుడు. దానశీలుడు. కనుక మీకోరిక తీరుస్తాడు" అనిచెప్పాడు.

దేవతలు బ్రాహ్మణవేషధారులై వెళ్ళి విరోచనుని యాచించారు. వీరంతా బ్రాహ్మణధారులైన దేవతలని ఎరిగికూడా వారిని పూజించి వారి కోరిక ఏమిటో అడిగాడు.

"ఓ రాక్షస రాజా! నీదేహాన్నిమాకు దానంచెయ్యి. మాయాచన ఇదే" అన్నారు.

సత్యసంధుడు కనుక ఆ రాక్షసరాజు తనదేహాన్ని అందరి సమక్షంలో సమర్పించాడు. విరోచనుడు చనిపోయాడు.

విరోచనుని పుత్రిక మందర రాక్షస కృత్యాల్లో ఆరితేరింది. రాక్షసులతో అన్నది.

"ఈ దేవతలందర్నీ పట్టి చంపండి. మీకు ఏమీ అవకుండా నాదగ్గరవున్న విద్యలతో మిమ్మల్ని రక్షించగలను" అని.

ఆమాటవిన్న రాక్షసులు వుత్సాహంగా దేవతల మీదికి యుద్ధాని కెళ్లారు. ఓడిపోయారు. మందర అంతావిని తన మాయోపాయంవల్ల ఆకాశానికెగిరి, దేవలోకంలో దేవతల్నీ, విమానాల్నీ, వాహనాల్నీ, ఆయుధాల్నీ పాశాలతో బంధించివేసింది.

దేవతలు శ్రీమహా విష్ణువుని వేడుకున్నారు. శ్రీహరి అందరి పాశాల్ని ఛేదించి, దేవేంద్రుణ్ణి ప్రోత్సహించాడు. ఇంద్రుడు మందరను వజ్రాయుధంతో మోదగా తలపగిలి పడిపోయింది. ప్రాణంపోయే సమయంలో ఈవిధంగా ఆలోచించింది.

"మరుజన్మలో ఈశ్రీహరిని అనేక కష్టాలకి గురిచేసి తీరుతాను" అని అంత్యకాలంలో శ్రీహరి నామస్మరణ గావించింది. కనుక కేకయ రాజు ఇంట జన్మించి కైకేయితో కూడా శ్రీరామ జననానికి ముందే ఆ యింట చేరింది.

ఈ అవకాశం వృధాపోనీయకుండా, ఆ రెండువరాల వృత్తాంతం కైకేయికి జ్ఞాపకంచేసి రాజమాతవై పోతావు భరతుడే రాజవుతే ! అని బాగా నూరిపోసింది. ఆ సరస్వతీదేవి ప్రభావంవల్ల కైకేయి కూడా మందర మాటలకి విలువనిచ్చి దశరధుని ఆ వరాలు రెండు ఇమ్మని మొండిపట్టు పట్టింది.

సాధారణంగా తప్పుపని చేసినవాళ్ళు తమతప్పును సమర్థించు

కుంటారు. కాని రామాయణం మొత్తమీద కైకేయి మరి ఇంక మాటాడ లేదు. ఇంకా పశ్చాత్తాప పడిందేకాని. రాముడు వనవాసం వెళ్లిపోయాక కైక ఇక ఒక్కటికూడా మాటాడినట్లు వాల్మీకి రాయలేదు.

దీన్నిబట్టి ఆ క్షణంలో శ్రీరామ యువరాజ్య పట్టాభిషేకం భంగ పరచటానికై సరస్వతీదేవి ప్రేరణవల్ల మందర ఆ ప్రకారం కైకకి బోధించటం, కైక దశరథుణ్ణి కఠినాతి కఠినంగా ఆ వరాలు రెండూ కోరటం, విధినిర్ణయమే అనిపిస్తుంది. సరస్వతీదేవి ప్రభావం తప్పి కున్నాక, యికమిగిలేది పశ్చాత్తాపమేకదా ?

అసలు రాముణ్ణి అందరికన్నా ఎక్కువ ప్రేమించేది కైక. భరతుడికన్న ఎక్కువ ప్రేమించేది రాముణ్ణి. అంతవాత్సల్యం చూపే రాముణ్ణి దండ కారణ్యానికి వెళ్లమని దశరధుడు చెప్పలేక విచారిస్తుంటే, నిర్దయగా, నిర్లజ్జగా తనవరాలసంగతి రాముడికి అమూలాగ్రం వినిపిం చింది. దశరథ మహారాజు చెప్పలేనిమాట కైకేయి నోటంట విని రాముడు చాలా నొచ్చుకున్నాడు.

ఈ చిన్నవిషయానికి మీరంత వ్యధ నొందవద్దు. నన్నుపిలిచి ఈలాగ చేయాలి అని ఆజ్ఞాపిస్తే ఆ పని చేయవలసినవాడిని. తండ్రి ఆజ్ఞ ప్రకారం తప్పక ఈనాడే అరణ్యానికి వెడుతున్నాను. భరతుడే రాజవు తాడు. నాన్నగారికి చెప్పండి. నామాట నమ్మండి. అడవికి పోవటానికి నాకు అనుజ్ఞఇవ్వండి అని తల్లికైకేయిని కోరాడు రాముడు.

తల్లీ మీఆజ్ఞ ప్రకారమే నార చీరలు ధరించి కృష్ణాజినము దాల్చి జడలు ధరించియే వెళ్ళబోతున్నానన్నాడు. నాతండ్రి చెప్పలేక బాధ పడుతున్నాడు.

"ఓరామా ! నువ్వు అరణ్యానికి యిప్పుడేవెళ్లాలి" అని

తల్లీ ! నువ్వు తండ్రి చెప్పలేకపోయిన మాటనుచెప్పినాకూ నా తండ్రికి మహోపకారం చేశావు" అన్నాడు.

నమస్కరించి వెళ్ళిపోతున్న రాముని జూచి, అంతఃపుర స్త్రీలు అంతా ఘొల్లున ఏడ్వసాగారు.

ఎన్నడు కోపగించనివాడు తన తల్లి కౌసల్యకు ఎటువంటి పరిచర్యలు చేసి గౌరవిస్తాడో తమకుకూడా అట్లాగుచేసే రాముడు అరణ్యాలకి వెళ్ళిపోతుంటే తాము ఏమీ చెయ్యలేకపోతున్నామే, ఆపలేకపోతున్నామే అనీ, రాముడు లేనిదే ఈ అంతఃపురంలో ఎలాగ ఉండగలమని బాధతో వారు దుఃఖించసాగారు. పుత్రదుఃఖంవల్ల పరితపించే దశరథ మహారాజుకి, ఈ అంతఃపురస్త్రీల దుఃఖం వింటుంటే, అతిశయించిన శోకాతిశయంతో, ఏమీ చెప్పజాలక, హారామా! హారామా అని విలపించాడు.

రాముడు తన ఆప్తులకు, తన వనవాసకారణం, రాజ్యభ్రంశమూ, విచారకారణాలు కనుక ఆ దుఃఖంతో వాళ్ల ప్రాణాలుపోయినా పోవచ్చునని, తన దుఃఖం తనలోనే ఇముడ్చుకుని బైటకు కన్పరచలేదు.

ఎవరేమన్నా కైకేయి మాట్లాడలేదు. భరతుని పట్టాభిషేకం మినహా ఆవిడ మనస్సులో మరే ఆలోచనలేదు.

సుమంత్రుడు కోపంతో ఆమెతో యిలా అన్నాడు. "కైకేయీ! వేపచెట్టునుండి తేనె స్రవింపదు. నీ పుట్టినింటి గౌరవము లెటువంటివో, ఆ తల్లి గుణాలే నీకు వచ్చాయి. ఈ విషయం నీకూ తెలియనిదికాదు.

పూర్వం నీ తండ్రి ఒక మహర్షినాశ్రయించి సకల జంతుభాషను తెల్సుకున్నాడు. ఆ మహర్షి ఆ శక్తిని ప్రసాదిస్తూ నీ తండ్రికి ఇలా చెప్పాడు.

'ఓ రాజా! నీవు జంతువుల భాషను విని ఇతరులతో చెప్పినట్లయితే, నీ తల వేయివ్రక్కలౌతుంది' అన్న ఆ మహర్షికి ప్రమాణం చేసి, నీ తండ్రి ఆ శక్తిని సంపాదించాడు. ఒక రోజున నీ తల్లితో, నీ

తండ్రి శయనమందిరంలో ఉండగా పక్కయందు సంచరిస్తున్న చీమల సంభాషణ విని నీ తండ్రి నవ్వుతుండగా, నీ తల్లి అనుమానించి నవ్వుకి కారణం అడిగింది.

'ఆ కారణం నీకు చెప్పినందువలన నాకు మరణం వస్తుంది' అన్నాడు నీ తండ్రి.

'నీవు మరణించినా సరే, బ్రతికినా సరే ఆ నవ్వుకి మాత్రం కారణం చెప్పితీరవలసిందే' అని నిర్బంధించింది.

తెలివైనవాడు నీ తండ్రి. మహర్షిని అడిగి, బుద్ధిహీనురాలయిన నీ తల్లిని విసర్జించాడు. కాబట్టి భర్తయొక్క మంచిచెడ్డలనూ ఔన్నత్యాన్ని కోరని నీ తల్లియొక్క గుణాలే నీకు సంప్రాప్తించాయి.

కైకేయి ముఖంలో పశ్చాత్తాపం కాని మార్పు కాని లేదు. ఇక లాభంలేదు. కైకేయి మనసు మారదు అనుకున్నాడు, దశరథమహారాజు.

తనను తిట్టినాగాని స్త్రీ సహిస్తుందిగాని, తన తల్లిని లేక పుట్టింటి వైపువారిని తిడితే ఎంతమాత్రం సహించలేదు. ఆ రోజున మీ అమ్మ నీ తండ్రిని చంపపూనింది. ఈనాడు నువ్వు నన్ను చంపడానికి సమకట్టావన్నాడు దశరథమహారాజు.

అయినా ఆమె సమాధానం చెప్పలేదు. తన భర్త లోకువచేసి నిందిస్తుంటే, రథసారధి, సుమంత్రుడు కూడా కైకని నిందించాడు. భర్త గౌరవిస్తే, ఇతరులూ గౌరవిస్తారు. భర్త ఈసడిస్తే ఇతరులుకూడా లోకువ చెయ్యరా?

రాముడు, తల్లి కౌసల్యాదేవికి, తను అరణ్యవాసం 14 సంవత్సరాలు చెయ్యవల్సి వుందని, ఇప్పుడు అనుకున్నా జరుగబోయే పట్టాభిషేకం, ఆ తరువాత భరతుడికి జరుగుతుందని చెప్పాడు. ఆ అమా

తానికి తట్టుకోలేని కౌసల్య మూర్ఛితురాలయింది. కొంతసేపటికి తెలివొంది,

"రామా! రాజు ఎప్పుడూ కైకేయి యందే అనురక్తుడు. సవతులు చేసే తిరస్కారాలు ఇంక సహించలేను. నేను ముసలిదాన్ని నిన్ను విడిచి బ్రతుకలేను.

అధాపి కిం జీవిత మద్యమే వృధా
త్వయా వినాచన్ద్ర నిభానన ప్రభ
అను ప్రజిష్యామి వనం త్వయైవ గౌ
స్సు దుర్బలావత్సమి వాను కాంక్షయా

అని పట్టజాలని దుఃఖంతో విలపించే కౌసల్యని ఓదార్చి పదునాలుగేళ్ళు ఎంతలో గడిపివస్తానమ్మా ? నువ్వు తండ్రిని చూసుకుంటూ ధైర్యంగా వుండు అని బోధించి.

సీతనికూడా సమాధానపెట్టాలని చూశాడు కాని అది కుదిరింది కాదు. సీత తనుకూడా వస్తానని పట్టుపట్టింది. మార్గమంతా కష్టభూయిష్ట మని ఎంతో నచ్చచెప్పాడు అయినా వినలేదు సీత.

ఆ తరువాత లక్ష్మణుడితో సుమిత్రతో చెప్పాలని వెళ్ళాడు రాముడు.

ఆ మాట వినగానే లక్ష్మణుడి ఆగ్రహానికి మితిలేకపోయింది. "కైక ఎవరు ? దశరథుడెవడు ? నిను అరణ్యానికి వనవాసానికి వెళ్ళ మనటానికి" అని కత్తిదూశాడు.

మెల్లగా యుక్తా యుక్తములు అయిన మాటలతో, తమ్ముడికోపం పోగొట్టగలిగాడే కాని, తమ్ముణ్ణికూడా తనతో తీసుకెళ్ళక తప్పలేదు రాముడికి.

తల్లికి, తమ్ముడికి కూడా చెప్పాడు.

త్వయామయాచ వైదేహ్యా, లక్ష్మణేన సుమిత్రయా
పితుర్నియోగే, స్థాతవ్య, మేషధర్మస్సనాతనః.

రాజజ్ఞను మనమే ధిక్కరిస్తే ప్రజలేం గౌరవిస్తారు, రాజాజ్ఞని తల్లీ దుఃఖాన్ని మనసున నణచుకుని, నాకు వెళ్ళటానికి అనుజ్ఞ ఇయ్యి, అని అన్నాడు.

లక్ష్మణా! లోకంలో ధర్మం ఒక్కటే ఆచరిస్తేచాలు. ధర్మార్ధ కామాలు మూడూ సిద్ధిస్తాయి అన్నాడు తమ్మునితో. "సులక్షణాలుకల లక్ష్మణుడా! ఇదివరకెప్పుడూ కూడా నేను తల్లి, సవతి తల్లి అనేభేదం లేకుండా అందర్నీ సమంగా చూసుకునేవాణ్ణి. కైకేయి కూడా, భరతుణ్ణీ, నన్ను ఒక్కలాగునే ప్రేమతో చూసుకునేది. అలా మా ఇద్దరియందు సమంగా ప్రేమ కల్గివుండే కైకేయికి దైవప్రేరణలేకుండా ఇలాటి బుద్ధి ఎలాపుడుతుంది? కనుక కైకేయి యందు దోషమేమీలేదు ఆమెను నిందించకు." అన్నాడు రాముడు.

కైక రాచకుమార్తె, సద్గుణంబులు గలది. భర్తయందు గల గౌరవం పాటించక రాచమర్యాదల విడచి, నిర్లజ్జగా ఒక క్షుద్ర స్త్రీవలె, లోకమర్యాదను అతిక్రమించి, ఇట్టి దుర్వాక్యాలు చెప్పుతుందా? నిజంగా దైవమే అనుకోండి, విధే అనుకోండి, దానికి ఎదురులేదు. కనుక దైవ కార్యం అనుభవింపవలసిందే. దానికి ప్రతీకారం లేదు. అందుకే రాముడన్నాడు.

ఏ భిరేవ ఘటైః సర్వైః, రభిషేచన సర్భృతైః
మమ లక్ష్మణ తాపస్యే, వ్రత స్నానం భవిష్యతి.

ఇప్పుడు జరుగబోయే పట్టాభిషేకానికి కైకేయి విఘ్నం కల్గించిందను కోకు. విఘ్నం చేసినది దైవమే. "ఇలా తమ్ముని కోపం పోగొట్టి, తల్లిని సముదాయించి, సీతని తీసుకుని నారచీరలు ధరించి, కైకకి నమస్క

కున్నాడు.

సుమంత్రుడు రథం సిద్ధపరచగా సీతా లక్ష్మణులతో రథం అధిరోహించాడు రాముడు. ఉన్న కొలది దుఃఖం ఎక్కువవుతుందే కాని తగ్గదు కదా! కనుక వెంటనే బయలుదేరమని సుమంత్రునికి చెప్పాడు. రథం బయలుదేరింది.

దశరథమహారాజుకు ఎవరికీ ఎప్పుడు రాని కష్టం వచ్చింది. ఇంతింతనరాని ఇబ్బంది వచ్చింది. యజ్ఞాలు చేసి, యాగాలుచేసి వృద్ధాప్యంలో కన్న బిడ్డడు, సద్గుణరాసి, తన జీవనాధారం రాముణ్ణి విడిచి క్షణం బ్రతకలేని పరిస్థితి. ఇస్తానన్న వరాలు ఇయ్యనంటే రాముణ్ణి వనవాసం పంపనంటే, తన రఘువంశానికి తీరనిమచ్చ, ఆడితప్పి ధర్మ చ్యుతుడు కాలేడు. అసహాయ స్థితిలో చప్పున తెలివితెచ్చుకుని దుఃఖాతిశయంతో లేచి, రామా, రామా ఆగు, ఆగు అన్నాడు. రాముడు సుమంత్రునితో పోనీ, పోనీ అన్నాడు రథాన్ని.

"ఎవరిమాట వినాలి నేనిప్పుడు"? అన్నాడు సుమంత్రుడు. రథ చక్రాల సవ్వడిలో ఆగమనేమాట వినబడలేదు. అని నువ్వు అనవచ్చు రాజుతో. ఆయన మాటవిని ఆగినట్లయితే మళ్ళా దుఃఖం రెట్టింపవుతుందే కాని, ఉపశమించదు కదా? అన్నాడు రాముడు.

రథం వెళ్ళిపోతోంది. దూరంగా దశరథమహారాజు చూస్తూనే వున్నాడు. దూరం వెళ్ళిపోతున్నకొలది రథం చిన్నదిగా కనిపించింది. ఆ తరువాత రథానికున్న కోవిదార ధ్వజం మాత్రమే కనిపించింది. ఆ తరువాత అదికూడా కనపడటం మానేసి, రథచక్రాల వేగానికి రేగిన ధూళి మాత్రమే కనిపించింది.

అప్పుడు దశరథమహారాజు ఆశలన్నీ అడుగంటిపోయి దుఃఖాతిశయం, మిన్నుముట్టిన కోపావేశం వివశుణ్ణి చెయ్యగా హా రామా! హా

లేపతీస్తున్నారు. అప్పుడు దశరథుడు కోపంతో బుసకొడుతూ కైకని చూసి ఇలా అన్నాడు.

నీ పాణిగ్రహణం ఆనాడు చేసినందుకు ఇంత క్లేశపడుతున్నాను. ఇక నా చెయ్యి ముట్టకు!

అగృహ్ణాం య చ్ఛృతే పాణి పర్యాణయం చ యత్
అనుజా నామితత్సర్వ మస్మి ల్లో రే పర త్రచ.

నన్ను తాకవద్దు. నీవు నాకు ఏమీకావు. మనకి ఈ రోజుతో ఏ విధమైన బంధుత్వమూ లేదు. "కౌసల్య చేయి ఆసరాచేసుకుని ఆమె భుజం మీద ఆనుకుని అశక్తుడై మెల్లగా ఆచి ఆచి అడుగులువేస్తూ ఆమెతో కూడ ఆవిడ అంతఃపురానికే వెళ్ళాడు.

అంటే ఆగర్భ శత్రువుని చూసినట్లు కైకని చూశాడన్నమాట రాజు;

ఈ అవమానం వుందే! యే ఆడదీ భరించలేనిదీ. భరించరానిది. అదీ ప్రాణప్రదంగా అందరి భార్యల్లో తననే ఎక్కువగా ప్రేమించి అపురూపంగా చూసుకునే భర్తవల్లనా ఇంత అవమానం? ఇది చాలా ఘోరమైన సంగతి. ఇక నీ కోరిక తీరింది కైకేయీ విధవవై రాజ్యమేలు అన్నాడు. ఆ రాత్రంతా కైకని దూషిస్తూ, కౌసల్యాదేవిచే నిష్ఠురోక్తులను పొందుతూ, తన దురదృష్టానికి గుండెపగిలేలా విలపిస్తూ, తన శాప వృత్తాంతం భార్యలకు తెలియచేస్తూ. పరితపించి, పరితపించి కన్ను మూశాడు దశరథమహారాజు.

* * *

అక్కడ రాముడి వనవాసం జరిగిపోతూనేవుంది. రాముడితో

వెళ్ళిన ప్రజల్ని వెనక్కి పంపించేశాడు. గుహుడి సహాయంతో గంగను దాటి, భరద్వాజుడి ఆశ్రమానికి వెళ్ళి ఆయనచేత ఆశీస్సులంది, ముందుకు వెళ్ళిపోయాడు రాముడు.

కాలం ఆగదు కదా? అది అలా గడచిపోతూనే వుంటుంది. అక్కడ మాతామహుల ఇంట్లోవున్న భరత శత్రుఘ్నులకు దుస్వప్నాలు, దుర్నిమిత్తాలు తోచాయి.

అదే సమయంలో అయోధ్యనుంచి వెంటనే బయలుదేరి రమ్మని పిలుపొచ్చింది. మాతామహుల అనుజ్ఞ తీసుకుని బైలుదేరారు భరత శత్రుఘ్నులు.

అయోధ్య చేరేప్పటికి పాపం వాళ్ళకి అనుమానం తోచింది. ఏవిటీ అయోధ్య! మునపటిలా, కనబడదేం? అంతా క్షేమంగావున్నారా? అనే సందేహం, తోవలో ఎవర్నడిగినా సరైన సమాధానం చెప్పారుకారు.

అంతఃపురంలోకి అడుగుపెట్టేప్పటికి అంతా కళావిహీనంగానే కనబడింది వాళ్ళకి. వాళ్ళ శంక నిజమనిపించింది. ఎటుచూసినా చందన ధూప సుగంధాలు విరజిమ్మే పరిమళాలు వీచటం లేదు.

మునుపు ఎడతెగక గంభీరంగా వినవచ్చే, భేరీ మృదంగ వీణా ధ్వనులు వినరావటం లేదు. అశుభ సూచకాలూ, అనిష్ట సూచకాలే కనబడుతున్నాయి ఎటు చూసినా.

భరతుడు దుఃఖితుడు, కలుష హృదయుడు. వ్యాకుల చిత్తంతో, భీతుడై నగరు చేరాడు.

మహారాజులకు నాశనము గల్గునప్పుడు యే చిహ్నాలు కల్గునని విన్నాడో, ఆఆ చిహ్నాలన్నీ ఇక్కడ కనిపించాయి. దుఃఖితుడై తల వాల్చి తండ్రి అంతఃపురానికెళ్ళిన భరతుడిని చూసి ఆనందించి చెంతను కూర్చుండబెట్టుకుని ఏమీ జరగనట్టుగా అతిసాధారణంగా పుట్టినింటి వారి క్షేమం పేరు పేరున కనుక్కుంద ప్రయాణ విశేషాలు అడిగింది కైక.

వాటికి క్లుప్తంగా జవాబు లిచ్చి

"ముందుగా నా మాటకు జవాబియ్యి. నేను నా తండ్రిని వేగంగా చూడాలని వచ్చాను. ఎప్పుడూ నీయింటనే ఉండే నా తండ్రి కనిపించదేం చెప్పమని" తొందరచేశాడు.

సమస్త ప్రాణులు తప్పక యేగతి పొందుతారో ఆ మహాత్ముడు, తేజస్వి ఎన్నో యాగాలుచేసిన దశరథమహారాజు కూడా అట్టి సద్గతి పొందాడని, నిర్భయంగా చెప్పింది కైక.

మహా పరాక్రమశాలి, మహాబాహుడు అయిన భరతుడు-

'అయ్యో! హతుడను అయాను అని స్పృహకోల్పోయి నేలపై బడ్డాడు. నిజంగా దైవ ప్రేరణ కాకపోతే భరతుడికి రాగానే రాజ్యపట్టాభిషేకం ఎందుకు జరగలేదు? పైగా అతడికోసం ప్రేతకర్మ ఎదురు చూస్తోందా?

కొంతవడికి లేచి దుఃఖంతో, వ్యాకులతతో రోదించాడు. "రాజా! భరతుడా! దుఃఖించకు. లే లే, నీవంటి సత్పురుషులు నేలబడి దుఃఖించ కూడదు" అంది తల్లి.

అమ్మా, నన్ను రాజా అని సంబోధిస్తున్నావు. నాకన్న పెద్ద వాడు రాముడు రాజుకాని, నన్నెందుకలా పిలుస్తున్నావన్నాడు.

"ఆయన తండ్రి యాజ్ఞవల్ల వనవాసానికి వెళ్ళాడు, కనుక నీవే రాజు కాదగినవాడవు" అంది.

"అవసాన దశయందు నా తండ్రి ఏమి చెప్పాడమ్మా" అన్నాడు.

రామేతి రాజా విలపన్, హా సీతా లక్ష్మణేచ,
స మహాత్మా పరం లోకం, గతోగతి మతాంపరః.

"అలా జరగటానికి కారణం ఏవిటన్నాడు" భరతుడు.

"నిన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేయమని రాముని వనవాసం పంపమనీ నేనే కోరాను నాయనా! అంది కైకేయి. మళ్ళీ ఆ అమాయకురాలు తన మనస్సున ఏమీ దాచక జరిగింది జరిగినట్టుగా తన వరాల సంగతీ, తను నిర్దయగా సీతా రామలక్ష్మణులను అడవికి నారచీరలు ధరింపజేసి పంపిన వైనమూ, అంతా తన ప్రియమైన కొడుకుతో చెప్పింది. ఇంకా అంది.

"వశిష్ఠాది మహర్షులు చెప్పినట్లుగా తైలంలో దాచివుంచిన నీ తండ్రికి యథావిధిగా దహన సంస్కారాలు గావించి శీఘ్రంగా అయోధ్యకు పట్టాభిషిక్తుడవు కమ్మంది.

భరతుడు తన తండ్రి పరమపదించటం, తండ్రి వంటి రాముడు అరణ్యవాసానికి వెళ్ళటం, తల్లి వలన విని చాలా దుఃఖించాడు. ఈ అనర్థాలన్నీ తన తల్లివల్లే జరగటం, పైగా తనని రాజుచేసేందుకు, ఇవి భరించలేక పోయాడు.

నీవు దశరథమహారాజుని చంపి, రాముని వనవాసానికి పంపి నాకు దుఃఖముపై దుఃఖం కల్గించావు. మా వంశాన్ని నశింపజేయటానికి కాళరాత్రివలె వచ్చిన అగ్నిహోత్రమని తెలియక నా తండ్రి నిన్ను కౌగిలించుకుని సర్వనాశనం పొందాడు.

మా వంశంలో ఎవ్వరికీ కూడా ఎంతమాత్రం సౌఖ్యంలేకుండా చేశావు. నీ వల్లనే కదా నా తండ్రి దివంగతుడయ్యాడు, నీవల్లనే కదా కౌసల్య సుమిత్ర ఎడతెగని పుత్రశోకం అనుభవిస్తున్నారు. వాళ్ళ జీవించటం దుర్లభం.

"ఓ పాపిష్ఠురాలయిన కైకేయీ! లేగదూడలాటి నేను ఈ గొప్పదైన రాజ్యభారాన్ని ఎలా మోయగలను? రామునియందు నాకు గల అకుంఠిత భక్తి నీకు తెలియదు. ఇంత అనర్థం గావించిన, నీ కోర్కెని నే నెంతమాత్రం తీర్చను. నీ పుట్టింటి వైపు రాజులు, ఇటువైపు మా

వంశంతోనూ కూడా జ్యేష్టునకే పట్టాభిషేకం చేయటం, సాంప్రదాయి సిద్ధమైన ఆచారం కాని ఆ సంగతి నీవు తెల్సుకోలేని అల్పజ్ఞురాలవా ? ఇటువంటి పాపపు తలంపు నీ కెందుకొచ్చింది ?

నేనిప్పుడే అడవికిపోయి మహాతేజశ్శాలి అయిన రాముని తోడ్కొని వచ్చి, నారామునకు పట్టాభిషేకం గావించి, నేను రామునకు దాసుడనై సేవలు చేస్తానన్నాడు.

ఓ క్రూరురాలా !

మాతృరూపే ! మమామిత్రే ! నృశంశే : రాజ్యకాముకే
నతేహరుభి బాష్యోస్మి, దుర్వృత్తే, పతిఘాతిని

నువ్వు కావించిన పాపఖర్మంవల్ల సమస్త జనులకు అప్రియుడను అయాను నేను.

ఇంతమందికి దుఃఖం కలుగజేసిన నువ్వు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ కూడా దుఃఖాన్నే తప్పక పొందగలవన్నాడు. ఇట్టి మహాపాతకం చేసిన నువ్వు అగ్నిలోపడి ప్రాణాలు విడువు. నీ కింక వేరేగతి లేదన్నాడు.

తన తల్లిని ఇలా అనేకవిధాల దూషించి శోకావేశంచేత ఇంద్ర ధ్వజంలాగ నేలకూలాడు.

కొంతసేపటికి మళ్ళీ సేదదేరి, చివరగా తల్లితో అన్నాడు. పాతకీ నే నెప్పుడైనా 'నాకు రాజ్యంకావాలి' అని అన్నానా ? ఎందుకు చేశావు ? యింత నీచమైనపని ?

నా కరవాలంతో నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి పార వేయాలని వుందినాకు, కాని మాతృ హంతకుడనని నా అన్న, నా రాముడు నా మొహం చూడడేమో అని ఆ పని చెయ్యకుండా వున్నాన అని చెప్పి

పరమ దుఃఖంతో ఉన్న కౌసల్యని, సుమిత్రని ఊరడించే నిమిత్తం అక్కడికి వెళ్ళాడు భరతుడు.

కొడుకే సర్వస్వం అనుకుని, ఆ కొడుకు రాజవ్వాలని ఉవ్విళ్లూరిన కైకేయి, అతనిచేతే ఇంతలేసి మాటలు పడికూడా ఏమీ సమాధానం చెప్పలేదు. లోపల లోపల మదనపడిందో, పశ్చాత్తాప పడిందో మనకి తెలీదుగాని, మౌనమే శరణ్యమైంది అప్పుడామెకు.

భరతుడు, కౌసల్యా అంతఃపురానికెళ్ళి ఆవిడచేత నిష్ఠురోక్తులు పడ్డాడు. జరిగిన కుట్రలో తనకేం భాగం లేదని, తనకేమీ తెలియదని ఎన్నైనా ఒట్లు పెట్టుకున్నాడు. ఇప్పుడు వెళ్ళి రాముని తీసుకొచ్చి పట్టాభిషేకం చేస్తానని చెప్పాడు. కౌసల్యా నిజం తెలుసుకుని భరతుణ్ణి దగ్గరికి జేర్చుకుని "దైవాధీనం జగత్సర్వం" కాకపోతే, సర్వాధికారి అయివుండి, దశరధుడు తన పెద్దకొడుక్కి రాజ్యం ఎందుకివ్వలేకపోయాడు? ఇంత అపవాదు భరించికూడా తన బిడ్డని మహారాజుగా చేయలేకపోయిందేం కైక? నల్గురు బిడ్డల్ని కన్నప్పటికి అంతిమ ఘడియన తన దగ్గర ఒక్కరూ లేరెందుచేత? దైవమానుషాల్లో, దైవశక్తి గొప్పది. మనం అనుకున్నట్టు ఏది జరగదు అనటానికి నిదర్శనం.

"రాముడు నాకు స్నానమును, రాముడు నాకు జపంబు ధ్యానమున్, రాముడు ఎల్ల నా బ్రతుకు, రాముడునున్ నను గన్నతండ్రి ఈ రాముడు వినా ఏమేషమవురా మనజాల" అన్నాడు దశరధమహారాజు సత్యవాక్పరిపాలనకు, పుత్రవాత్సల్యానికి మధ్య ఘర్షణకు లోనయ్యాడు.

'సాకేతం పాడెట్టి అంతా అడవికిపోదాం' అన్నటువంటి దశరథుడు పోలేకపోయాడు అడవికి, అయోధ్యావాసులంతా వెళ్ళారు అడవికి.

రఘువంశం అనే పేరు రఘుమహారాజు నెరపిన సత్యవాక్యం వల్ల వచ్చింది అటువంటి సత్కీర్తి వదులుకోలేక "కన్నబిడ్డని ఎలా వదలు

కుంటాడు." "కానక కానక కన్న సంతానమయ్యె" చివరకు తనప్రాణమే వదులుకుంటాడు దశరధుడు.

కన్నీరు పెట్టుకుంది. సుమిత్ర కౌసల్యాకూడ తను అన్నమాటలు మనసులో పెట్టుకోవద్దని చెప్పి భరతుణ్ణి ఆశీర్వదించారు. రాముడిని అయోధ్యకు తోడితెచ్చే నిమిత్తం భరతుడు అరణ్యానికి వెడుతుంటే. మేమూ నీవెంట వస్తామన్నారు తల్లులు. ముందుగా తన తండ్రి దశరథమహారాజుకి కులగురువుల ఆజ్ఞప్రకారం అగ్నిసంస్కారం యధావిధిగా కావించి, ఆ తరువాత తన అన్న శ్రీరాముణ్ణి అయోధ్యకు తీసుకువచ్చి, పట్టాభిషిక్తుణ్ణి చేయాల్సిన సన్నాహాలు చేయసాగాడు భరతుడు. వశిష్ఠుడు, జాబాలి, వామదేవుడు మొదలైన మహర్షులుకూడా అరణ్యానికి ప్రయాణమయ్యారు.

ఇలా అరణ్యానికి రామునికొరకై బయలుదేరిన వారిలో మొదట బయలుదేరినది కైకేయి అని చెప్పాడు వాల్మీకి. అప్పటికి ఆవిడని అవహించిన ఆ మైకం వదిలి మామూలు మనిషైందన్నమాట.

ఇలా తల్లుల్ని తీసుకుని బైలుదేరాడు భరతుడు. విప్రులు వేద పఠనంచేస్తూ బైలుదేరారు. నాట్యకత్తెలు మేమూ వస్తామన్నారు. వాళ్ళేమిటి, వీళ్ళేమిటి అయోధ్యావాసులంతా బయలుదేరారు రాముడిని ఎలాగైనా తమతోపాటు అయోధ్యకు తీసుకువచ్చే నిమిత్తం, మంగళవాద్యాలు కూడా వారివెంట బయలుదేరాయి. ఒకవేళ కాదూ కూడదని రాడా ? పోనీ ఒకసారి కళ్ళారా చూసి అయినా రావచ్చు రాముణ్ణి అని వెళ్ళారు.

బహు వయోవృద్ధులు మాత్రం వుండిపోయారు శరీరశ్రమకు తట్టుకోలేరు కనుక.

వేగంగా పయనించే గుర్రాలు, ఏనుగులు, రథాలు బయలుదేరాయి. కొందరు సైనికులు ముందువెళ్ళి మార్గం బాగుచేస్తున్నారు ప్రయాణానికి సుగమంగా

నక్షత్రేషు ప్రశస్తేషు ముహూర్తేషు చ తద్విదః
నివేశాన్ స్థాపయామాసు ర్భరతస్య మహాత్మనః

ఒక సుముహూర్తాన వశిష్టాజ్ఞ చొప్పున వారి వారి గౌరవానికి తగ్గట్టుగా జనులంతా గుర్రాలు, ఏనుగులు అధిరోహించి వస్తూవుంటే మహాధ్వని ఒకటి కలిగింది.

అయోధ్యావాసుల్ని, తన తల్లుల ముగ్గుర్నీ, కుల గురువులను, తీసుకుని బైలుదేరిన భరతుడు తిన్నగా భరద్వాజాశ్రమం చేరాడు.

ఆయన భరతుడికీ, భరతుడితో వున్న పరివారానికి అందరికీ కూడా జన్మలో మరుపలేనటువంటి విందుచేశాడు. పరివారమంతా అనుకున్నారు. "మనం భరతుడితో కూడా ముందుకి వెళ్లవద్దు. వెనక్కి అయోధ్యకి వెళ్లవద్దు, ఇక్కడే మనకి హాయిగావుంది కనుక ఇక్కడే వుండిపోదాం" అనుకున్నారు. భరద్వాజ మహర్షి చేసిన విందులు విశేషాలు అనుభవించిన ఆ పరివారానికి ఇక అక్కడి నుంచి కదలబుద్ధి కాలేదు. ముక్కుమూసుకుని తపసు చేసుకునే జడదారి అంతగొప్ప విందు ఎలా చెయ్యగలిగాడయ్యా అంటే 'కామధేనుమాత కరుణవల్ల.

వెళ్లే సమయాన మహర్షి అడిగారు "నాయనా! నీ తల్లులను నాకు పరిచయం చేయి" అని.

మహర్షీ అడుగో ఆమె దశరథమహారాజు పట్టపురాణి సీతి కోవిదుడు, సత్యసంధుడు, ధర్మబద్ధుడు అయిన రాముని గన్నతల్లి కౌసల్య. అడుగో ఆమె భుజం ఆధారంగాచేసుకుని కొండ గోగుకొమ్మవలె వుందే ఆవిడ పరమపూజ్యమూర్తి వీరాగ్రేశ్వరు, పరాక్రమశాలి అయిన లక్ష్మణుని గన్నతల్లి సుమిత్ర.

ఆవిడ వారి వెనుక నిల్చునివుందే పరమపాపిష్టురాలు అన్నీ తనకే తెలుసుననే గర్విష్టి, భర్తృహంతకి, నీచస్వభావురాలు నాతల్లి కైక:

అని భరతుడు తన తల్లుల్ని ముగ్గుర్ని పరిచయం చేశాడు. కన్న కొడుకు నోట అన్ని మాటలు పడికూడా లోపల ఏం క్షోభ ననుభవించిందో కాని, పైకి ఒక్క మాటకూడ అనలేదు కైక.

"నీవెందుకు రాముని దగ్గరకు వెడుతున్నావు ఇప్పుడు ?" అన్నాడు ముని.

"త్రిలోకజ్ఞులు మీకు తెలియదా మహర్షీ ?" అన్నాడు భరతుడు.

"నాకు తెలుసు, కాని లోకానికి తెలియదు కదా ?"

"అయితే వినండి, రాముని పాదాలపైపడి ప్రార్థించి ఎలాగైనా అయోధ్యకు తీసుకువెళ్ళేందుకే మహర్షీ" అన్నాడు.

"తథాస్తు" అన్నాడు భరద్వాజుడు.

ఇక్కడ వాల్మీకి చమత్కరించాడు.

అయోధ్యా వాసులంతా బయలుదేరి అరణ్యానికి వెడుతూవుంటే, అరణ్యమంతా అయోధ్య అయిందట. అయోధ్య అంతా నిర్మానుష్యంగా, జన సంచారం లేకపోబట్టి, అరణ్యమైపోయిందని.

సరే ఆ తరువాత భరతుడు వచ్చి నా తప్పేమీలేదు జరిగిపోయిన అనర్థం నాకేమీ తెలియదని అనేక ఒట్లు పెట్టుకుంటాడు. అప్పుడు కౌసల్యా మొదలైన వాళ్ళేకాదు అక్కడ రాముడుకూడా నమ్ముతాడు.

భరతుని సోదరప్రేమ నిష్కళంకమైనదిగా గుర్తిస్తాడు. కాని భరతుడు కోరినట్లుగా అయోధ్యకు రావటానికి మాత్రం ఒప్పుకోడు. భరతుడు కోరిక మీద తన పాదుకలు మాత్రం ప్రసాదిస్తాడు రాముడు. అదే మహత్భాగ్యంగా ఎంచి, తీసుకెళ్ళి ఆ పాదుకలకే పట్టాభిషేకం జరిపిస్తాడు.

తన కోరిక ఏమీ తీరలేదు సరికదా నాటినుంచి నేటికి కూడా

..వాదుల పాలు, నానారకాలుగా దుర్భాషలు పొంది, అవమానాలు ..పడి.., అయిన వాళ్ళ అనురాగానికి నోచుకోక, అందరిచేత ఆత్మ.. ..తి.. ..పేక్షణ ని. ద్వేషభావంతో విసర్జించబడిన కైక, అమాయకు.. ..., ...రాలు ఎలా అవుతుంది?

...విచిత్ర ...ప్రాప్తి, అనంత విజ్ఞానం జయించిన, ఈ కాలంలో ...ా ...మాట్లలా చేర్పులు చేస్తున్నప్పటికి, రామాయణం ...ంటి రాజపట్టాభిషేకం విఘ్నం కావటం, అయనకి అరణ్యవాసం తప్ప...టం కైకవల్లనే సంప్రాప్తించాయని, ఆమెని తూలనాడకపోరని! ...కుని విలాపం వింటున్న కొలది, కైకపై మనకి తెలియకుండానే ...ి పెంచుకుంటాం. కాని ఆలోచించిన కొలది ఆవిడది అమాయకతే ...పిస్తుంది.

# సత్యభామ

శ్రీకృష్ణదేవరాయలు సూర్యతుల్య ప్రతాపుడు మహాదాత విష్ణు పూజా పురందరత్వంవల్ల కల్గిన రాజ్యవైభవం కలవాడనీ, దిగంత వ్యాప్త యశస్కుడనీ, ఇంద్రుడికన్నా కంతుడికన్నా చక్కనివాడనీ. ఆయనని చూసి జనులెల్లా మోహం జెందేవారట.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో ప్రతియేట వసంతోత్సవం అతి వైభవంగా జరుపుకునేవారు. ఆ సమయాన కవులు పద్యాలు, ప్రబంధాలు రచించి రాయలకి అంకితమిచ్చి ఆయనచేత అపూర్వసత్కారాలు ఎన్నో పొంది ఆనందించేవారు.

ఒకనాటి వసంతోత్సవ సందర్భాన రాయల ఆస్థానకవులలో ఒకరైన నందితిమ్మన 'పారిజాతాపహరణం' మనే ప్రబంధం రాసి రాయలకు అంకితమిచ్చాడు. రాయలుకే కాక సమస్త సభాసదుల హృదయాల్ని కూడా రాగరంజితం చేసి పులకింప చేసిందా గ్రంథం. ఎందు చేతనంటే

శృంగార రసరాజ్యాధినేత, మాయామానుష విగ్రహుడు లీలా వినోదుడు, ధవళాంబుజ నేత్రుడూ అయిన గోపాలచక్రవర్తి శౌర్యధైర్య పరాక్రమాలూ, ఆయన దేవేరి సద్వంశసంజాత, చక్కదనాల ప్రేమైక మూర్తి అయిన సత్యభామాదేవి యుద్ధనైపుణ్యత, ఇమిడివున్నాయి కనుక.

నంది తిమ్మనగారు అలా ఎందుకు రాశారనే దానికి ఓ పెద్దకథ వుంది. కప్పవిప్పకవి సమర్థుడు కనుక ఆ రోజుల్లో శ్రీకృష్ణదేవరాయలకి ఆయన రాణి తిరుమలదేవికి చిన్న ప్రణయ కలహంవల్ల, మానసిక

ఆస్థానానికి వ్యవాంతరాలు ఏర్పడ్డాయి. రానురాను చినికిచినికి గాలివాన అనుకున్నట్టు అందరికు తెలిసింది.

ఈ కథే ప్రబంధం రాయటానికి ఒక కారణం వుంది కనుక. మనకి ఏం తెలిసింది. రాయలకి భార్యపై గల అలుకను పోగొట్టేందుకు వారిద్దర్ని [illegible]ంటుకొన్నాను మహాభాగవతంలో దశమస్కంధం నుంచి కేవలం మూడు శ్లోకాల్లో వర్ణించిన ఈ కథని మాతృకగా తీసుకుని ఈ మహా కావ్యాన్ని రాశాడు తిమ్మనార్యుడు.

రాణి తిరుమలదేవి వెంటవచ్చిన అరణపు కవి గనుక ఆమె యోగక్షేమాలు చూడవలసిన బాధ్యత ఈయనకున్నందున, సత్యభామా కృష్ణులపై కథ అల్లి చమత్కారంగా రాయలకి పరోక్షంగా ఓ చురక తగిలించి వారిద్దర్ని ఏకంచేసిన ఘనత తిమ్మనార్యునికి దక్కింది.

ఇది చక్కని రసవత్తర కావ్యం అయిపోవటంలో సందేహంలేదు. మందారం, పారిజాతం, సంతానం హరిచందనం అనే కల్పవృక్షాల్లో ఈ పారిజాతం ఒకటి.

పరిమళం విడదు, వాడదు
పసిమి తప్పదు, పరాగ భరితంబై
చిరతము జగదేక మనోహరమగు
ఈ కుసుమ రాజవంబుజ వదనా.

అని చెప్పాడు ఈ పుష్పంయొక్క గొప్పతనాన్ని నారదుడు. అల్లసాని పెద్దనామాత్యుని కవిత్వంకన్నా తిమ్మనార్యుని కవిత్వం బహుచక్కగా వుందని అంటారు.

రాయలు మక్కువపడిఅడిగారు. పెద్దనగారు మక్కువపడి మను చరిత్రరాసి రాయలకంకితం ఇచ్చాడు. వారిద్దరిపై వున్న గౌరవంతో

విన్నవారంతా మక్కువగా విని భేష్ అన్నారు. అందులోని శృంగారం మిక్కిలి సుకుమారమైనది. ఆ శృంగారం రసాభాస అయింది. అందులోని ఉపకథ. స్వారోచి మనోరమలది. అదే రసాభాసగానే మిగిలిపోయింది. రసాభాసలో రసాభాస చేశాడు. అలాకాకుండా తిమ్మనగారు రచించిన ఈ కావ్యం ఒక కార్య సాధనకు ఉపకరించింది. ఒక సంసారాన్ని నిలబెట్టిన ఘనత దక్కించుకుంది అంటారు.

ఆంధ్ర సరస్వతికి రాయలకాలం స్వర్ణయుగమని పేరు. అందులోనూ తిమ్మనగారు పారిజాతాపహరణం రాసిన కాలం రత్నయుగం. తెలుగు సరస్వతికి కొప్పులోకై సేసిన పారిజాత కుసుమరాజం అనుటలో వింతేమి లేదు.

ఇది పంచా ఆశ్వాసాలు, పంచాఅక్షరములు, పంచప్రాణాలు. ఈయన దారలోకంనుంచి సాధారణలోకంలోకి వచ్చారు. తిమ్మనార్యుడు సకల విద్యాచాతుర్యంగల మలయమారుతకవికి మేనల్లుడు.

శ్రీకృష్ణుడు దక్షిణ నాయకుడు. సత్యభామ మానవిప్రలబ్ధ అని మనకితెల్సు. నిజంగా ఈ లక్షణాలు నాగరికంగా వున్నాయో? ఇందులో రసవ్యంజకత ఎంత నిండివుందో మనకేం తెల్సు? ముక్కు తిమన్నగారి కొక్కరికే తెలుసు.

శ్రీకృష్ణుడు సత్యభామని 'అరాళకుంతలా' అని సంబోధించటంలో శబ్దౌచితి, భావౌచితి, సందర్భౌచితి యిమిడివున్నాయి. పారిజాతం గొనితెచ్చి తన పెరట్లో నాటిన ఘనత ఎటువంటిదో ఆమెకు తెలుసు.

ఈ నాటకం కృష్ణుడాడినది కాదు. నారదునిచేత ఆడింపబడినది. నారదుడు పారిజాత కుసుమం తెచ్చి సత్యభామని క్షోభింపజేశాడు. కృష్ణుడు ఈ నాటకం తెలిసికూడా వారించలేదు, సూచనామాత్రం అయినా-

తన భర్త కావించిన అపరాధానికి అలుకవహించిన స్త్రీకి యుక్తా యుక్త వివేక జ్ఞానముండదని కవి సమర్థించాడు. ఆయన అలా చెప్ప టంలో పసదనం వుంది. ముచ్చటగా వుంది.

శ్రీకృష్ణుడు ఆమె ననునయించుచు ఆమె వేసుకున్న మేలిముసుగు తొలగించి చూశాడు. ప్రతిమాలాడు. మ్రొక్కాడు.

ఆమె కృష్ణుని తలను పాదంతో త్రోసివైచింది. ఆ ఘట్టాన్ని బహు రసవత్తరంగా రచించాడు తిమ్మన.

కోపన పదహతి కుహనా
గోపాలుడుగాంచి మెయిగగుర్పొడువగ, సు
ద్దీపితమన్మధరాజ్య
ప్రాపితుడై పలికె గూర్మి బయటపడంగన్.

ఆమె తాపుకి ఆయన నొచ్చుకోలేదు సరికదా! శరీరమంతా గగు ర్పొడిచిందట. ఆ తాపునకు మన్మధరాజ్యం కాదు. ఉద్దీపిత మన్మధ రాజ్యం. కనుకనే కుహనాగోపాలుడన్నారు.

మరింక సత్యభామకోపం పడిపోక ఏమౌతుంది? నీ సుకుమారమై పూరేకునులా, చిగురుటాకును బోలినపాదం ఎర్రనై ఎలాకందినదో చూడు అన్నాడట.

తరువాత కోపంతో దూరిందట. ఒక్కొక్క పద్యం తెలుగు బాషకి ఒక్కొక్క మణిహారం.

మౌనంకన్నా ఈ దూషణే నయం. చూశారూ! మౌనం మరీ బాధిస్తుంది. ఏదో నోటికొచ్చినవి నాలుగు దులిపేస్తే అక్కడకి వాళ్ళ కోపం పోతుంది. మనం తెరిపిన పడిపోతాం. అలా మౌనంగా వుంటే మూతిముడుచుకుని ఎప్పుడు పేలిపోతుందో. బాబూ ఈ అగ్ని పర్వతం? అని అనతే గుండె గుబగుబలాడిపోతూంటుంది.

తరువాత ఆ తరుణి భర్తను దూషించినందుకు ఎంతో పరితపించటం ఆయన ఓదార్చటం ఇదంతా మామూలే అనుకోండి. పైగా ఇదెవరికి తెలియని జాగోతం.

ఇదంతా తిమ్మనగారి కవితా ప్రౌఢి.

తిమ్మన ఉద్దండుడైన కవేకాదు. మహాశివభక్తుడు. సత్యభామ అలాచేయటంలో పతిభక్తి లేదనిగాని గర్వ్యారాలని గాని చెప్పటానికి వీల్లేదు. ఆమెని కవి వెనకేసుకు వచ్చాడా అనిపిస్తుంది. ఇదే కవి ప్రతిభ.

కవి తన దేవేరిని సత్యభామతో పోల్చినందుకు రాయలు సంతసించాడే కాని మరోలా అనుకోలేదు.

కవి ఈ సన్నివేశాలు అన్నీ తనకు అనువుగా మల్చుకున్నాడు. అసలు రసాలన్నిటిలోకి శృంగార రసం బహుసుకుమారమైనది.

తన చాతుర్యమంతా చూపి 'దిట్ట' అనిపించుకున్నాడు. ముక్కు తిమ్మన ముక్కుమీద మంచి పద్యం చెప్పాడట.

నానాసూన వితాన వాసనల
నానందించు సారంగమేలా...............

అంత అందంగా ఆ పద్యం చెప్పాడు కనుక ముక్కుతిమ్మన అని సార్థక నామధేయం పొందాడు.

ఇంతకీ సత్యభామకి గర్వభంగమవటం అది ఆశయం కాదు. 'తులాభారం కథని అలుక త్యజించి, స్వామికి తనయందుగల అత్యంత ప్రేమానురాగాలు చాటి, కోపం పోగొట్టటమే ముఖ్యం. ఈ మహాకవి రాసిన ప్రబంధంలోని శతాంశమయినా మనం గుర్తించగల్గితే ధన్యులం. ఇటువంటి రసవత్తరపుకథా విధానం ఎవరాదరించరు?

ఈ తిమ్మనాచార్యుని కవిత్వంలో ఆలోచించిన కొలది అనేక మహార్థాలు స్ఫురిస్తూంటాయి. చక్కని పదాలు వాడి మంచి ఉపమానాలు తెచ్చాడు.

కోపంలో వున్నా సత్యభామను "వ్రేటుపడ్డయురగాంగని" అన్నాడు 'నేయిపోసిన అగ్నిజ్వాల' అన్నాడు.

'జలదాంత చంద్రలేఖ సదృశాంగి' అన్నాడు. ఆమె ఎట్టి పరిస్థితి లోనూ కూడా సౌందర్యం కోల్పోలేదన్నమాట. ఆమె సౌందర్యం లోకోత్తరం, బుద్ధి పాదరసం. చతురత అసమానం. అసలు ఆమె చెలులే బహుచతురులు. అతిగడసరులు.

శ్రీకృష్ణుని పత్నులందరియందూ కనుపించని శృంగారదీప్తి ఒక సత్యభామకే చెల్లును. దీనిలో ప్రధానపాత్ర నారదునిది. 'నారందతాతీత నారదః' జ్ఞానం బోధించువాడు, పరులకు తెలియని విషయాలు తెలియచెప్పుటయే ఈయన ధ్యేయం, ఆజన్మబ్రహ్మచారి జ్ఞానస్వరూపుడు శ్రీకృష్ణదేవరాయల రాకయే కరువై పోయిందని చింతిస్తోంది తిరుమల దేవి. అంతరంగిక చెలికత్తె చే కబురంపింది నంది తిమ్మన కవిగారికి. ఆయన హుటాహుటిన వచ్చి వాలాడు. అంతఃపురానికి దేవిగారికి అభి వందనం చేశాడు. అంజలి ఘటించాడు. ఆజ్ఞ ఏమని అడిగాడు. జరిగిన సంగతి చెప్పింది తిరుమలదేవి. ఆయన సుదీర్ఘంగా ఆలోచించిన పిమ్మట పారిజాతమనే వృత్తాంతం రచించి, వసంతోత్సవ సందర్భంలో రాయ లకి సభాసదులకి వినిపించాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు రుక్మిణి భవనంలో చంద్రకాంత శిలానిర్మితమగు ఒక తిన్నెపై సుఖాసీనుడై ఉబుసు పోకకై కొందరు సుందరాంగనలు చుట్టూ పరివేష్టించివుండగా జూద మాడుతున్నాడు. ఆ తరుణాన మహతి మీటుతూ ధవళకాంతులీనే మేనుతో నారాయణ నామ స్మరణచేస్తూ కలహప్రియుడగు నారదమహర్షి దివినుండి శ్రీకృష్ణుని చెంతకు ఆకస్మికంగా దిగివచ్చాడు.

సత్కారాలు చేశారు.

సఖీజనం చేత మణిమయ సింహాసనం తెప్పించి నారదుని సుఖాసనాసీనుంచేసి శ్రీకృష్ణుడును ఉచితాసనాసీనుడయాడు. 'మునివరా! మీ రాకచే ధన్యుడనయాను' అన్నాడు. నారదమహర్షి శ్రీకృష్ణుని అనేకవిధాల ప్రస్తుతించి, సొగసైన బంగారువర్ణముగల తామరాకునందు చుట్టిన గొప్ప పరిమళము గలది సమస్త కోర్కెలను ఒసగునట్టిది, అప్పుడే సంపూర్ణముగా వికసించినది అగు పారిజాత సుమాన్ని కృష్ణునకు సమర్పించాడు, ఆ జడధారి. శ్రీకృష్ణునితో "నీ కత్యంత ప్రేమపాత్రులగు వారికి ఈ పారిజాత పుష్పం కానుకగా అందియ్యి" మన్నాడు నారదమహర్షి. నవ్వుతూ మహర్షి కళ్ళలోకి చూశాడు శ్రీకృష్ణుడు. తన పక్కనేవున్న రుక్మిణీదేవి కురులలో ఆ పారిజాతాన్ని తురిమాడు, సంశయంతోనే. ఈ సంగతి సత్యకి తెలియదుకదా ? అనుకున్నాడు. తురిమాడో లేదో సంశయంతోనే, ఈ సంగతి సత్యకి తెలియదులే అనుకున్నాడు మళ్ళీ.

ఎందుకు తెలియదు? ఆ ప్రక్కనే పొంచియున్న సత్యాదేవి చెలికత్తె వెళ్ళి తన రాణికి చెప్పదూ? అలాగే జరిగింది.

ఆ పారిజాత కుసుమం దివ్య ప్రభలీనుతూ రుక్మిణీదేవి ముఖానికీ కుంతలాలకి కూడా, దివ్యమైన కాంతిపుంజాలతో గొప్ప తేజస్సును కల్గించి, వింత సౌందర్యంతో ఆమె ముఖ కమలాన్ని మహాజ్యోతిలా ప్రకాశింపచేస్తోంది.

ఆ దేవర్షి రుక్మిణితో ఆ పారిజాత పుష్పం యొక్క మహిమని వర్ణించి చెప్పాడు.

"అమ్మా! రుక్మిణీ! సుందరతరము, శోభితము, పరిమళ భరితము అయిన ఈ పుష్పం, ఆకలి అన్నవారి ఆకలి దీర్చటమే కాక,

సకల భోగాలు. అష్టైశ్వర్యాలు ఇచ్చి నిత్యయౌవనాన్ని చేకూర్చుతుంది, అని చెప్పాడు.

"సపతులందరు నీ పాదాక్రాంతు లౌతారని" కూడా చెప్పాడు. నారదుడు చెప్పిన మాటలు అక్కడవున్న చెలికత్తెలంతా విన్నారు. ఒక్కొక్కరే పోయి శ్రీకృష్ణుని రాణులకు విన్నవించారు.

"మామందరిలోకెల్ల పెద్దది కనుక పారిజాతపుష్పాన్ని రుక్మిణి కివ్వటం ఉచితమే కదా?" అనుకున్నారు. లక్షణ, కాళింది, భద్ర, జాంబవతి, మిత్రవింద, నాగ్నజితి.

అంతేకాని ఈర్ష్య బూనలేదు వారు.

సత్యభామ వారివాలె అది ఉచితమే అనుకో లేకపోయింది. చెలులు విన్నదే కాకుండా పదింతలువేసి ఆమెకు చెప్పారు. చక్కనిది, ప్రియుని అనురాగ సర్వస్వం, అభిమానవతి, అనురాగవతి, మహనీయ సౌభాగ్యవతి, అయిన సత్యభామ ఇంకో పదింతలుగా వూహించుకుంది.

తక్కిన రాణులవలె వూహించలేదు. వుచితమే అనుకోలేదు. అలా అనుకుంటే ఆమె సత్యాదేవే కాదు.

అందరివలె అనుకుంటే ఆమె సత్యాదేవి ఎలా అవుతుంది?

*　　　*　　　*

శ్రీకృష్ణుడు నరకాసురుని గెల్చి వానిచే బంధితులైన పదాహారు వేల యిద్దరికి జవ్వనుల పెండ్లాడాడట. ఎనమండుగురు పట్టమహిషు లున్నారట ఇంకా. వీరందరికీ ఏ యే వేళల ఎలాటి లీలలు కావాలంటే అలా అన్నిరకాల సౌఖ్యాలూ ఇస్తున్నాడట. రుక్మిణికి సత్యభామకి ఎక్కువ చనువిస్తున్నాడట. అప్పుడు వీరిద్దరిలో స్పర్ధలొచ్చాయి.

కులమును రూపమున్, మగని కూర్మియుం గలదాన నంచునీ
వల నల రుక్మిణీ రమణి వాసి చెలంగగ, సత్యభామయుం

నావల బచరింపగా, రపరవల్వొద మెన్మడి, వారికెంతయున్.

రుక్మిణిదేవియు సత్యభామయు సవతులు కదా? వీరిద్దరికి పొరపొచ్చాలు రాకుండా వుంటాయా? సపత్నులకు సహజమైన మాత్సర్యాలు వుండవా? అనుకుని తిమ్మనగారు, వాళ్ళిద్దరి మధ్య రపరపలు వచ్చాయన్నాడు. కథాబలానికి ఆ రపరపలు మూలస్తంభం నిజంగా తిమ్మనగారి గడసరితనం ఇందులో మనకి బాగా విదితమౌతోంది. పట్టమహిషి గౌరవం రుక్మిణికి ఎప్పుడూ వుంది.

కాబట్టి నారదుడు ముందుగా అక్కడికే వచ్చాడు. అక్కడే కలహబీజం అనుకోండి, కథాబీజం అనుకోండి అక్కడే నాటాడు మొదట. ఆ తరువాత అది చక్కగా విస్తరించి శాఖోపశాఖలు వేసి బాగా వేళ్లూనింది.

అలా కాకుండా శ్రీకృష్ణుడు సత్యభామ సౌధంలో వున్నప్పుడే వస్తే ఇంత కథావిధానానికి ఆస్కారం వుండదు కదా?

సరే నారదుడు రుక్మిణి అంతఃపురానికే వచ్చాడు. పూవు సూటిగా ఆమెకే ఇస్తే ఇంత గొడవుండదు కదా? కృష్ణునిచేత ఇప్పించాడు. తను మౌనియైనా సరే, కులసతికి పుష్పమియ్యరాదు. మర్యాద భంగం అకృత్యం, అందుచే మగనిచేత నిప్పించాడు దాని మహిమ.

పరిమళము చెడదు వాడదు
పరువము తప్పదు, పరాగభర భరితంబై
నిరతము జగదేక మనో
హరమగు నీ కుసుమరాజ మంబుజవదనా. అన్నాడు.

* * * *

ఇక ఇక్కడ సత్యభామను గురించి కొంత ముచ్చటిద్దాం.

చక్కని దాన నంచు, నెల జవ్వని నంచు
జగంబులోన, పేరెక్కినదాన నంచు
పతి ఎంతయు, నాకను రక్తుడంచు" నిక్కిన

చక్కని సత్యభామ రాజసం నుండి తొణికిసలాడే వీరవనిత శ్రీసత్రాజిత్ మహారాజుయొక్క అనురాగాల, గారాలపట్టి అన్నిటా తనే మిన్న అనుకునే ఆత్మాభిమానం పొంగిపొర్లే రాచబిడ్డ. అపురూప సౌందర్యశోభిత, అనుపమాన లావణ్యా విరాజిత. ఆమె దూర్వాసాంశ సంభూత అని అందరికీ తెలుసు. ఒక్క కొనచూపుతోనే శ్రీ గోపాలచక్రవర్తిని ఆకట్టుకున్న అదృష్టశాలి అన్నది జగద్విదితమే. శృంగార రసోత్తుంగతరంగ సత్యభామ.

సత్రాజిత్ మహారాజు సూర్యానుగ్రహంవల్ల రోజుకి కొన్ని బారువుల బంగారాన్ని ప్రసాదించే శమంతకమణిని పొంది, ఆ మణిని ధరించి సూర్యునివలె ప్రకాశిస్తూ శ్రీకృష్ణ దర్శనార్థమై ద్వారకకు వెళ్ళాడు.

ఆ మణిని తన కిమ్మని లోకకల్యాణార్థం, శ్రీకృష్ణుడు సత్రాజిత్‌ను అడిగాడు.

కేవలం దేవదేవుడే అడిగాడు కదా అదీ లోకకల్యాణార్థం అని సత్రాజిత్ ఆ మణిని ఇయ్యలేదు. ఆయన స్వార్థం ఆ మణిని ఇయ్యనివ్వలేదు. కాస్సేపు అవి ఇవీ చెప్పి ఆ వాసుదేవుని ఆతిధ్యంపొంది, తన స్వస్థలానికి వచ్చేశాడు సత్రాజిత్తు.

ఒక రోజున సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఆ మణిని దాల్చి వేటకై అడవికి వెళ్ళాడు. ఒక సింహం ప్రసేనుణ్ణి చంపి ఆ మణిని ఎత్తుకుపోతుంటే జాంబవంతుడనే భల్లూకరాజు సింహాన్ని సంహరించి ఆ మణిని తీసుకెళ్ళి తన గారాలబిడ్డ జాంబవతి ఊయలకిపైన క్రీడా కందుకముగా అలంకరించాడు.

ఆ సంగతి తెలియక శ్రీకృష్ణుడే ప్రసేనుణ్ణి హతమార్చి అశమంతక మణిని అపహరించుకు పోయాడనే అపవాదు ఆయనపై బడింది. ఈ అపనింద నిజమే అనుకుని సత్రాజిత్ శ్రీకృష్ణునిపై కక్షబూని అసత్య ప్రచారం చెయ్యనారంభించాడు.

కేవలం అవతారమూర్తి అయిన శ్రీకృష్ణపరమాత్మ కూడా ఆ అపవాదుకి చింతించి, జాంబవంతుడిమీద యుద్ధానికి వెళ్ళాడు.

ఆ యుద్ధంలో ఓడిపోయిన జాంబవంతుడు, శ్రీకృష్ణుని యొక్క బలపరాక్రమాలకు అచ్చెరువంది, తన ప్రియపుత్రికను శ్రీకృష్ణునకిచ్చి పెండ్లిచేసి, మణితోకూడా తన పుత్రికను కృష్ణునితో ద్వారకకుపంపాడు.

తన యందుగల అపవాదు బాపుకునే నిమిత్తం శమంతకమణిని తీసుకుని సత్రాజిత్తు వద్దకు బయలుదేరాడు శ్రీకృష్ణుడు. జరిగిన సంగతంతా అంతకుముందే విన్న సత్రాజిత్తు పశ్చాత్తాపపడ్డాడు తన తొందరపాటుకి. తన ఏకైక పుత్రిక శ్రీకృష్ణుని తనూ విలాస సౌందర్య పరాక్రమాదులు విని ఆయనపై మరులుగొన్న సత్యభామను శ్రీకృష్ణమూర్తికిచ్చి అతివైభవోపేతంగా పెండ్లిచేసి, శమంతకమణితో గూడ అల్లుని వెంట తన తనూజను పంపి చరితార్థుడయాడు.

అది మొదలు త్రికరణశుద్ధిగా భర్తనే ప్రేమించి ఆరాధించి సామాన్యులకు గర్విష్టిగానూ దురహంకారిగానూ భర్తను వశవర్తుని చేసుకున్న మాయలాడిగాను కనిపిస్తుంది.

కాని శ్రీకృష్ణుని ఆమె ఒక్కతే సాటిమనిషిగా ప్రేమిస్తోందేమో అనిపిస్తుంది.

పుట్టగానే దేవకీవసుదేవులు నువ్వు మానవమాత్రుడివి కావు కేవలం శ్రీమహావిష్ణువు అని స్తుతిస్తారు.

రేపల్లెలో వయసుకి మించిన పనులుచేసి గోవర్ధనగిరి చిటికిన

వేలుపై నిలిపి గో గోపికలను రక్షించటం, బకాసురుణ్ణి అజగరుణ్ణి [illegible]సురుణ్ణి వధించటం, మొదలైనవి చేసినప్పుడు, నందుడు యశోదా కూడా [illegible] మనుష్యమాత్రుడవు కావు నాయనా అని మొరపెట్టుకున్నారు.

పైగా ఒకప్పుడు తననోట పుజ్జగాలు చూపించిన కృష్ణుణి చూసి [illegible]పోయింది యశోదమ్మ.

అలా నివ్వెరపోయిన యశోద "కలయో వైష్ణవమాయయో?" [illegible]కుంటూ.

"యశోదాదేవిని కానో" అనికూడా అనుకుంది.

ఉద్ధవుడు, అక్రూరుడు, అర్జునుడు, కూడా అనుకున్నారు.

"కేవలం భగవంతుని అంశ మనకుంది" అని

రుక్మిణీదేవి శ్రీకృష్ణుడు విష్ణువు అవతారమే అని పూజించింది. [illegible] గోపికా స్త్రీలు ఎనమండుగురు పట్టమహిషులు కూడా [illegible] కొలిచారు.

ధృతరాష్ట్రుడు, ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు మొదలైన [illegible] వీరంతా దేవుడనే నమ్మారు కదా?

[illegible] శ్రీకృష్ణుని సత్యభామ ఒక్కతే సాటి మానవుడిగా [illegible] ప్రేమించింది, అని చెప్పక తప్పదు. ప్రేమించటమే కాదు, [illegible] పోషించింది. అలరించి- అదలించింది. కవ్వించింది-కోపగిం[illegible] [illegible] తూలనాడింది. అలిగింది. మూతి ముడిచింది. ఏడ్చింది, పంత[illegible], పంతం నెగ్గించుకుంది కూడా, నవ్వింది, నవ్వించింది. ఆనంద[illegible]డంలో మునిచి తేల్చింది భర్తని. స్వాధీన పతిక అన్నారు ఆమెను. ఆమె ఆశయం ఒకే ఒకటి. తన భర్త ప్రేమ తన ఒక్కతెకే సొంతం. వేరెవ్వరికి దక్కకూడదు.

సత్యభామ తన మనోహరుని ఎడబాటు ఇంచుకంతయినా సహించ

లేదు. కాస్త కనుమరుగయాడా ? ఎక్కడ వున్నాడో? ఏంచేస్తున్నాడో అనే తపన, ఆవేదన, చెంతచేరకినుక.

ఆ రుక్మిణి సౌధానికి వెళ్ళాడేమో? ఆమె పాదపూజచేసి అలరిస్తోందేమో అనే వ్యక్రోషం ఆమెను నిలువనీయదు.

మిత్రవింద వీణాగానంతో స్వామిని తన్మయుణ్ణి చేసి లోబరచుకుంటుందేమో? అనే భయం.

జాంబవతి శ్రీకృష్ణుని మేన శ్రీ చందనమలంది వశం చేసుకుంటోందేమో ? లక్షణ కన్నయ్యకు చామరం వీచి చరితార్థం అవుతుందేమో ? అనే ఆవేశం, నీలాసుందరి నల్లనయ్యతో వనవిహారం చేసి తీయని ఫలాలు తినిపిస్తోందేమో? అనే దిగులు, ఆవేదన.

భద్ర తన స్వామితోగూడి తూగుటుయ్యాలపై పరవశిస్తోందేమో అని మంట. కాళింది తన అపురూప నాట్యంతో తన భర్తని చల్లని చక్కని పానీయాలు తాగించి మైమరపిస్తోందేమో అనే దుగ్ధ. ఇవి కాక ఆ రాధవుంది చూశారు. ఆవిడను చూచేప్పటికే ఒళ్ళు మరచిపోయేస్వామి. ఆమెతోగూడి ఏ చెట్లంట పుట్లంట, ఏ మహారణ్యాలల్లో, ఏ యమున ఒడ్డుకో లాక్కుపోతుందేమో? అనే జుగుప్స. ఆమెను ఒకచోట నిలువనీయదు.

ఎల్లప్పుడూ స్వామి ఆమె చెంతనే వుండాలి. తనే సేవచేయాలి. తన చేతులతో స్వయంగా శ్రీ చందనమలందవల్నే, తనే చామరంవీవాలి. సుగంధభరిత పుష్పమాలికలు తనే ధరింపచెయ్యాలి స్వామికి. తామిద్దరే బంగారు తూగుటుయ్యాలపై వూగవలె. ఉద్యానవనాల్లో తామిద్దరే, తనతో గూడే విహరించవలె. తన స్వహస్తాలతో కపురంపులిడె మందీయవలె. నిరంతరం నీడలా తనే వుండాలి స్వామివెంట. కాదు కాదు. స్వామియే తనవెంట నీడలా వుండాలి. మరెవ్వరికీ ఆ భాగ్యం దక్కకూడదు. ఎంతసేపూ ఆ సత్యభామకు ఇదే తపన. ఇదే ఆలాపన. దానికి కొంచె

మైన వ్యతిరిక్తం అయిందా ? తన మనసున భరించలేదు సహించలేదు. తీరా స్వామి తన ఎదుట నిలచేసరికి వల్లమాలిన అలుక ఇలా సాహిత్య లోకాన భారతీయ పురాణేతిహాసాలలో గల సత్యభామ పా తగురించి ఎవరు ఎంత చెప్పినా ఏ మహాకవులు, ఎంతరాసినా ఏదో మిగిలిపోతుం దేమో ఇంకా రాయవలసిందీ, చెప్పవలసిందీ అనిపించక మానదు కదా ?

ఈ బృందావనం అందరిదీ అనీ
ఈ గోవిందుడు అందరి వాడనీ
చాలా లేటుగా తెలుసుకుందామె.

*                    *                    *

కలహ భోజనుడు, నారదుడు అత్యంత పరిమళభరితము మహిమాన్వితమూ అయిన పారిజాతాన్ని తెచ్చి కృష్ణునికిచ్చి "స్వామీ నీ కత్యంత ప్రేమపాత్రులైన అప్తులకియ్యి ఈ పుష్పాన్ని" అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించాడు స్వామి. తనిప్పుడు రుక్మిణీదేవి అంతఃపురంలో వున్నాడు. ఆ పుష్పరాజాన్ని రుక్మిణికి బహూకరించటమే సమంజసంగా వుంటుందనుకున్నాడు. అలాగే చేశాడు. అందులో తప్పేముంది ?

ఆ క్షణంలో అక్కడేవున్న సత్యభామ చారులు (ఇష్ట సఖులు) ఆ సన్నివేశాన్ని అనేకరంగులు పూసి తమ దేవికి చేరవేశారు.

అది వింటూనే రోష కషాయిత నేత్ర అయింది సత్యభామ. పొగలూ సెగలూ గ్రక్కుతూ స్వామి రాకకై క్షణమొకయుగంలా ఎదురుచూస్తోంది సత్యభామ.

ఆయన వస్తూనే రానున్న తుపాను పసిగట్టాడు పసిగట్టే పలుకరించాడు. ఆ పలకరింపుకు మామూలుగా అయితే ఆమె పులకరించేదే. కాని అప్పటి ధూకుడు అలాంటిది. పులకరింపు లేదు సరికదా అలిగింది.

తొలిగి మళ్ళీ అలిగింది. అవనతవదన అయింది. అశృపూరిత

చింది. ప్రయత్నపూర్వకంగా మాటలు పెగుల్చుకుంది.

ఇష్టసఖులు చెప్పిన మాటలు గంటకొట్టినట్టు చెవుల్లో మారు మ్రోగు తున్నాయి.

"సవతులందరూ రుక్మిణికి హెదా క్రాంతులౌతారా ?"

"ఆ మహిమాన్వితము, పరిమళభరితము అయిన ఆ దేవలోక పారిజాతం ధరించేందుకు ఆమె ఒక్కతెకే అర్హతవుందా ?" అన్నవి తలుచుకున్న కొలది ఆమె హృదయం ఉడికిపోతోంది. ఈ మాటలన్నీ ఒక ఎత్తు, ఆ దేవర్షి అన్న ఆ ఒక్కమాట ఒకఎత్తు.

"తనకి అత్యంత ప్రేమపాత్రులైనవారికి ఇయ్యమని ఆ పుష్పం ఇచ్చాడు. సరే, ఇవ్వమన్నాడే అనుకో. ఈ నల్లనయ్యకి ఆమాత్రం ఇంగితం వుండక్ఖర్లేదూ. ఇన్నాళ్ళ ప్రేమ, ఏమైపోయినట్లు, సత్యాక్షేమ దనే నానుడి ఏమైపోయినట్లు, తగుదునమ్మా అని ఆ రుక్మిణితల్లో ఎలా ........ఛీ ఛీ ఛీ ఇంక వూహించటానికి కూడా మనసొప్పలేదు. అయితే ఆ రుక్మిణీ అత్యంత ప్రీతిపాత్రురాలైతే మరి నేనేమీ కాదా ?

పట్టపురాణి అనే పదమునకు సార్ధకత నేటికి కల్గిందని రుక్మిణి దేవి మురిసిపోతోందా ? ఇప్పుడు ఆ అపూర్వపుష్పాన్ని పొంది ? ఒకటి ఆ పుష్పాన్ని పొందటం, ఆ పువ్వుతోబాటుగా భర్త అనురాగం తద్వారా తన అదృష్టాన్ని గెల్చుకోవటం, సత్యాపతి అనేమాట అర్ధరహితమయిం దని నేటితో రుజువయిపోయిందని ఆమె కులుకా ? ఇక నుంచి స్వామి తన వశంలోనే వుంటాడు కదా అనే ఆనందోత్సాహాలతో తబ్బిబ్బైపో తుంటుంది కాబోలు. ఇంత అవమానంపొంది అదీ సవతి సమక్షంలో నేను జీవించి ఎందుకు ?

ఇన్నాళ్ల సత్యభామ ప్రేమంతా వ్యర్థమేనా ? లేదు అలా జరగ

టానికి వీల్లేదు. ఈ ప్రపంచం తలక్రిందైనా సరే, సత్యాపతి సత్యాపతే. నేను గీచిన గీటు దాటటానికి వీల్లేదు. నా స్వామి, నా యానతి మీరజాల గలడా? నా నాధుడు నాకనుసన్నల్లో నడవాల్సిందే. స్వామికి ప్రీతి పాత్రులు, అత్యంత ప్రీతిపాత్రులెవరు? పట్టమహిషి రుక్మిణా? ప్రాణ ప్రియ సత్యభామా? అది ఈవేళ తేలిపోవాల్సిందే. ఈ వేదన నేను భరించలేను. ఈ అవమానం నేను సహించలేను. ఈ పౌరుషహీన మైన బ్రతుకు నేను బ్రతకలేను ఈ చేదు జీవితం నాకొద్దు.

ఇన్నినాళ్ళ నా వన్నెయు, వాసియు, తరిగిపోయిన తరువాత ఇక నేనేందుకు?

ప్రాణములపై యాశతో ఇంకా నేను జీవనముల విడవకపోవటమే ఆశ్చర్యం.

ఇన్ని రోజులనుంచి నాధుడు నా పట్ల నెరపినది నటనయేనా? అని తలుచుకున్నప్పుడు శిరసు భూమివైపు వంగిపోతోంది. ప్రాణాలు పై కెగిరిపోతున్నాయి.

ఎంతమంది ప్రజలు మా ప్రేమయిక జీవులపై ఉదాహరణలు ఎంత అబ్బురంగా చెప్పుకోలేదూ? అదంతా కల్లయేనా? రుక్మిణియందు చూపించిన అనాదరణ నటనయా? ఎప్పుడు ప్రాణేశ్వరుడు ఆమె అనురక్తుడేనా? ఇంత జరిగాక కూడా నామేన ఇంక జీవంవుంది. అంటే ఆశ్చర్యపడాల్సిందే. నాలాటిది ఇక అసువులు బాయటమే సరైన పని. ప్రాణత్యాగం కన్న ఉత్తమమైన వేదిక? ఎవరుమేలు చేయువారో? ఎవరు కీడు చేయువారో లోకులెరుగరా? స్వామి ఎరుగడా? నెవరికి కీడు జేయుదాననో? మేలుచేయుదాననో ప్రాణేశుడెరుగడా? పోనీ. శ్రీకృష్ణుడు ఆ భోజసుత నింటవున్నాడు కనుక ఆమె ఏమికించపడునో అని తలచి మర్యాదపాటించి ఆ పారిజాతపుష్పమామెకొసంగియున్నాడు.

అంతమాత్రాన సపతులు తన యున్నతిని వైభవాన్ని, మానాన్ని మంట గలిపారని దురపిల్లటం పిచ్చి పనేమో?

ఇంతకి శ్రీకృష్ణుని మెప్పుపొందటానికే ఆ జడధారి నారదుడు ఆ పారిజాతపుష్పం అంత మహిమగలది అని చెప్పాడేమో?

పైగా ఆ పుష్పం వాడిపోదట, ఆ తరువాత స్వర్గధామం చేరు కుంటుందట. ఆ మహర్షి మాటలు నమ్మదగ్గవిగా వున్నాయా అసలు?

నేనేమో అవన్ని విని మనసుపాడు చేసుకుంటున్నానా? మాడి ఆరమరికలు లేని కూర్మి.

కపటమెరుగని మమతలుమావి.

కలలోనైన నవ్వులకైన నామాట జవదాటి ఎరుగునా నాస్వామి?

చెలులు నాతో ఏవేళ ఏమి చెప్పుదురో అని భయపడిపోయి లంచాల్నిచ్చేవాడు కదా నా ప్రియుడు?

అయితే ఆ పారిజాత ప్రసూనం రుక్మిణి కొసగటం తనను కించ పరచటం కాదా?

అంతమాత్రము ఆ జగదారాధ్యుడికి ఎందుకు తోచలేదు. ఎదుట వున్నప్పుడేనా సత్యయందలి అనురాగం? కాస్తచాటైతే ఆ అనురాగ మంతా గంగపాలై అవమానమే వెలికివస్తుందా?

ఇప్పుడు జరిగినదానిలో సహజత్వమేవున్నది కాని దారుణమేమీ జరిగిపోలేదులే. అనుకోవటానికి సత్యభామాదేవి మనసు సుతరామూ ఒప్పు కోటంలేదు. స్వామికి ఈ సంఘటనతో మరిచిపోలేని పాఠం చెప్పాలని ఆమెకి చాలా అభిలాషగావుంది.

తను చేసినది తప్పే అని, జీవితంలో ఇలాటి తప్పు ఇక చేయ

నన్ను చెప్పి ప్రాణవల్లభుడు పశ్చాత్తాప హృదయంతో పరితపించాలనీ, తన పాదాలవద్ద శిరసు వంచాలని ఆమె కోరిక.

ఆయన చేసిన నేరం చిన్నదేమీ కాదు. రుక్మిణికి పారిజాతం ఇచ్చాడు కదా?

శ్రీకృష్ణ స్వామివారు సత్యసౌధానికి వస్తున్నారు అనే సూచనలు వినిపించాయి. ఇష్టసఖులవద్దనుంచి సత్యభామాదేవి సౌధమంతా చిన్నబోయింది. మునపటి కళలేదు. సందడిలేదు, ఆనందోత్సాహాల్లేవు. ఆమె శయ్యామందిరం అంతా నిశ్శబ్దంగా, నిరామయంగా ఏ విధమైన అలికిడి లేకుండా, నీళ్ళులేని తటాకంలాగా వెన్నెలలేని రాత్రిలాగావుంది.

సత్యాదేవి ఎప్పుడైతే శయ్యామందిరాన కనబడలేదో అప్పుడే శ్రీకృష్ణుడు అనుకున్నాడు ఆమె అలిగిందని, ఏకాంత గృహంలోవుందని సఖులు సైగల ద్వార కృష్ణునకు ఎప్పుడైతే సూచించారో అప్పుడే జరిగిన దంతా అర్థమై పోయింది కృష్ణుడికి. ఆయన వ్యూహానిజమే అయింది. తన నగల ఆభరణాలన్నీ తీసివేసింది. జుట్టువిరబోసుకుని నేలపై పవళించి కోపతీవ్రతచేవచ్చే శ్వాసలతో పగపట్టిన తాచులాగ కనిపిస్తోంది సత్యాదేవి.

ఆమె కోపాన్ని పోగొట్టటానికి చెంగకత్తె వీస్తున్న వీవన ఆమె చేతినుండి అందుకుని తనే వీస్తున్నాడు. కృష్ణుడు తన ప్రాణప్రియ అయిన సాత్రాజితికి.

సత్యాదేవి జీవితేశ్వరుని మేనిపరిమళం వచ్చి తాకి స్వామిరాకను తెలియజేసింది.

సత్యా! నా ప్రాణప్రియా! ఎందుకు నాపై అలిగావు. నేను చేసిన నేరమేమిటి? నామీద నీకెవరైన చాడీలు చెప్పారా? నీ కుసుమకోమల మైన శరీరాన్ని నేలశయనించి ఎందుకు కష్టపెడతావు? నాపై నీకు

ఎందుకు దయతప్పింది? లతాంగీ! నీ ఆజ్ఞ ఎన్నడైన మీరానా? నామీద ఎందుకు అలిగావు? దయలేదా ఈ దీనుడిపై?" అంటూ మెల్లగా కాళ్ళ వద్ద ఆసీనుడై అలా తమలపాకులవంటి పాదాలపై తలవాల్చాడు శ్రీకృష్ణుడు. "సల్పమైన పొరపాటు చేసానే అనుకో ఈ దీనుడికి ఇంత శిక్షా? అనిన ప్రాణనాథునివైపు చురచుర చూస్తూ కళ్ళనుండి నిప్పులు రాల్చుతూ.

దూర్త గోపాలా! మాయావీ అని చెప్పబోయి కోపావేశంవల్ల ఏమి చెప్పలేకపోయింది. ఈ దాసుని క్షమించలేవాదేవి అంటూ నమస్క రించిన గోపాలుని అతి వినయం సత్యాదేవి కోపాన్ని ద్విగుణీకృతం చేసింది. తనపాదాలపై ఒరిగిన ప్రాణనాథుని చురచుర చూసింది సత్య భామ. వాసవాదిసురలకు పూజాపాత్రమైన ఆ మన్మధ జనకునిశిరస్సును వామపాదంతో తన్నింది సత్యభామ. కవి అంటాడు శ్రీకృష్ణుడు ఆయన ప్రాణప్రియ సత్యభామ కోపాన్ని పోగొట్టటానికై నమస్కరించటంలో ఎంత మాత్రం తప్పులేదు. ఆ జగన్నాటకాన్ని నడుపటానికి అలా నటించక తప్పదు. లేకపోతే ఆ నాటకం చక్కబడదు. అది కళంకము గూర్చేదికాదు అని.

అంతేకాకుండా అది కామశాస్త్రపద్ధతి. అలంకార శాస్త్ర సరళి. నాయకుడు చేసిన ఈ పని రసాన్ని పోషిస్తుంది కనుక యసింద్యము అని.

లతాంగి నిత్యపదములు మృదుపల్లవ కోమలం కనుక ఆ తాపు కృష్ణునకు ఎంతమాత్రం నొచ్చింది కాదు. మీదుమిక్కిలి ఆమె పాదాలు నొచ్చెనేమో అని బాధపడిపోయాడట.

ఇక భామగారి తన్నుకూడా తప్పు లేదంటాడు కవి. ప్రణయ వ్యాపారంలో అనేకం జరుగుతుంటాయి. ఇదికూడా అందులోని భాగమే అంటాడు పెగా.

"పేరలుకన్ జెందినయట్టి కొంతలుచిత వ్యాపారముల్ నేర్తురే" అన్నాడు. నాయిక కపకర్ష నాపాదించేది కూడా కాదిది అన్నాడు.

అత్యంత క్రోధిత అయిన నాయిక ఉచితానుచితాలు ఎరుగక పోవటం సహజమే కదా అంటాడు.

ఆ తాడనం గౌరవహాని చేకూర్చదు సరికదా మీదు మిక్కిలి మన్మథోద్రేకం కల్గిస్తుందని కూడా అన్నాడు కవి. అందుకే ఆ కుహనా గోపాలుడు.

"అయ్యో! నీ పాదం నొచ్చిందా దేవీ!" అన్నాడు.

కుహనాగోపాలుడు అనగా ఆ మాట కృష్ణరాయలకు కూడా వర్తిస్తుంది. కవి మనసులో ఆయన అంటే రాయలూ దక్షిణనాయకుడే కదా శ్రీకృష్ణుని మాదిరి.

* * *

శ్రీకృష్ణదేవరాయ మహీజాని తన ప్రియురాలైన తిరుమలదేవి ప్రణయక్రీడలో పాదతాడనం జరిగిందని కదా? కృష్ణదేవరాయలు అందువల్లనే కదా కొన్ని దినాలు మందిరానికి పోక దేవికి మనఃక్లేశాన్ని కల్గించాడు. ఆ ఆరణపు కవియగు ముక్కుతిమ్మనకి ఎరిగించింది తన మానసికమైన వ్యథని.

అప్పుడా కవి పారిజాతాపహరణం రసవత్తరంగా రచించి రాయలకి కృతిఇచ్చి తద్వారా ఆయన మనసు మార్చగలిగాడు. కృష్ణ రాయలు కూడ సరసుడు కనుక చిన్న విషయాన్ని పెద్దగా తీసుకున్నా నేమో అనవసరంగా అనుకుని శ్రీకృష్ణుడే ఆ ప్రియురాలి పాదతాడి తాన్ని తేలికగా తీసుకున్నాడు కదా మన్మథ సంగ్రామంలో అవన్నీ మామూలు విషయాలే అనే స్థితికి వచ్చాడు. కవిగారి కోరికకూడా అదే కదా?

శ్రీకృష్ణుడు తన చెలికాలు నొచ్చినందుకు బాధపడి మరీపెద్ద బహుమతి ఏమివ్వాలా అని ఆలోచించాడు పెద్ద మనసుతో.

"దేవర్షి ఆ పుష్పం నాకిచ్చిన సమయాన రుక్మిణి నా చెంత వుంది కనుక బాగుండదేమో అని ఆమెకిచ్చాను గాని నా మనసంతా ఎప్పుడూ నీ చెంతనే వుంటుందనీ, నీవు నాకు ప్రాణాధిక ప్రియతమవని నీవెరుగవా?"

"నిన్ను చూడనిదే నేను క్షణమైన నిలువగలనా? నా మనసు నీ వెరుగవా? ఒక పువ్వుకోసం ఇంత వగపెందుకు?

దేవేంద్రు డెత్తివచ్చినా గాని, ముల్లోకాలూ దండెత్తి వచ్చినా గాని నీకు ఆ పారిజాతవృక్షమే తెచ్చి ఇస్తాను సత్యా! ప్రాణప్రియా! నమ్ము నామాట అన్నాడు.

ఆ మాటకు సత్యభామాదేవి మొహం మబ్బులు వీడిన చంద్ర కిరణంలా ప్రకాశించింది. మరికొన్ని మధురోక్తులతోనూ, చతురసంభాషణతోనూ మిగిలిన కోపంకూడా పోగొట్టి అక్కున జేర్చుకున్నాడు, మదనజనకుడు. ఇది నిజమా స్వామీ?" అని అడిగిన సత్యభామకు లోగడ తను చేసిన సత్యప్రతిజ్ఞలన్నీ జ్ఞప్తి చేసి, నేనంతా నమ్మదగనివాడనా?

నేనంత అసత్యవాదినా?

బీరాలు, డబ్బరలు పల్కువాడనా?

అని జాలిగా ముఖంపెట్టి దీనంగా చూశాడు ఆమె వైపు. ఆమె మనసు ఆ మాటకి తరుక్కునిపోయింది.

"లేదు ప్రభూ! మీరు పల్కినమాటల దృఢతకోసం అలా అడిగానని అనునయించి శయ్య విడచి బైటకొచ్చింది. చెలులు ఎంతో సంభ్రమంతో ఎదురేగి జలకమాడించేందుకు సంతోషంతో ఎంతోసందడితో స్నానగృహానికి చేర్చారు. సంపెంగతైలం ఒడలంతా పూశారు. చందనం

నలుగు పెట్టారు చెలులు. పన్నీట జలకమార్చారు. అగరుధూపమేశారు. కురులనార్చారు. పట్టుచీర బంగారురంగుది అలంకరించారు. చెవులకు కెంపులుతాపిన కర్ణాభరణాలు అలంకరించారు. రత్నాల ఆభరణాలనేక మైనవి ధరింపజేశారు. అరణపు చెలికత్తెలు కురులను బహుచక్కని రీతిలో శిగసమార్చారు. హంసలు చెక్కిన జడబిళ్ళనమర్చారు, ఆత్మీయు లైన సఖులు అంగుళీయములు వేళ్ళకిఅమర్చారు. కస్తూరి బొట్టునుదుట నమర్చారు. పచ్చ కర్పూరపు కాటుక ఆ విశాలాక్షి కళ్ళకు అలదారు. మొలకు నొడ్డాణము చుట్టారు. పగడాలు రైక బిగుతుగా తొడిగారు. వడ్డాణం చుట్టు అలలు మాదిరి సరములు కెరటాలమాదిరి కదలాడే సరములు అమర్చారు. ఆ గొలుసులకు రవ్వలు తాపారుగనుక చెమక్కున మెరుపులీనుతున్నాయి. కాళ్లకు అడుగు కదిలించేటప్పుడు ఘల్లుఘల్లున సవ్వడిచేసే పాంజేబులు అమర్చారు. కాలివేళ్లకి వెలకట్టలేని మట్టెలు దొడిగారు. అడుగుతీసి అడుగువేసి నడుస్తుంటే రాజహంసలాగ వయ్యా రాలతో ఒరిగిపోతోందా భామ. చూసేందుకా సౌరభం రెండుకళ్లు చాల టమే లేదు. ఆ హొయలు, ఆమె రూపులు, ఆ వాలుచూపులు, ఆ తళుకులు, ఆ అందెల ఘల్లుఘల్లుమనే శబ్దం, వినేవాళ్ల హృదయాలు ఝల్లుఝల్లుమనిపించె ఆ రవళి మనసుకి ఆనందపు కెరటం అలా అలా మోసుకుపోయి మైమరపిస్తోంది.

ఆమెకి ఏమీ తీసిపోనట్టు స్వామికి కూడా అలంకారం చేశారు సఖులు. బంగారు బిందెలతో పన్నీరు కలిపిన జలాలు తెచ్చి వెండి గాజుల్లో పోస్తున్నారు, హడావిడి పడిపోతున్నారు. ఆ జగన్మోహనుడి సేవలో తమ జన్మ సార్థకం చేసుకుంటున్నారా సుందరాంగనలు. ఒక స్త్రీ బంగారు బిందెలు పూర్ణకుంభాలు అందిస్తుంటే మరొకతి అందు కుంటోంది. వేరొకతి స్నానం చేయిస్తోంది. ఇంకొకతె జిలుగు వస్త్రా లతో కురుల తడియొత్తుతోంది. అగరుగంధపు పొగ సౌధమంతా చుట్ట బెడుతోంది. ఒక యోషాలలామ పట్టుపీతాంబరం అందిస్తోంది. తన్మ

యంగా ఒక బాల ఆ స్వామికి ప్రియమైన తులసిమాల అల్లుతూంది. ఆమె అందించిన మాల అందుకుని ఆ మానినీమన్మధుడికి అలంకరిస్తోంది. తన్మయంగా తన జీవితానికి ఇదే సార్ధకత అని.

కస్తూరి తిలకం దిద్దుతోంది ఆ మోహనాంగుడిని ఒక లతాంగి. పక్కని భోజ్యాలు అమర్చారు ఉన్నతాసనంపైన సువాసనలవీనే పానీయాలు అమర్చారు.

శ్రీకృష్ణ సత్యలకి చెలులంతా చేరి కొసరి, కొసరి తినిపించారు. ఒక చేత వీణవాయించి వినిపిస్తుంది. వీనుల విందుగ ఒక లలనామణి మురళివాయించి వారి శ్రమ బాయునట్లు చేస్తుంది. వారంతా సంగీత చతురలు రసజ్ఞులు. ఒక చతుర పచ్చకర్పూరపు విడెములందిస్తుంది పరసోక్తులతో.

ఓ చెలి, ఇంతలో బయటనుంచి వడిగావచ్చి నారదమునీంద్రుల రాక నెరింగించిపోయింది.

సత్యభామా శ్రీకృష్ణులు వచ్చిన దేవర్షికి ఎదురేగి నమస్కరించి అర్ఘ్యమిచ్చి తెచ్చిఉన్నతాసనాన సుఖాసీనుల గావించి ఆయనకు అతిధి పూజజేసి మృష్టాన్నాదులు సమృద్ధిగా వడ్డించి వీవనతో విసురుతూ నిలబడ్డారు.

ఓ సత్యాభామాదేవి నీ సేవలకు సంతోషించాను. నిన్ను ఏమని అశీర్వదించను? బంధుజనులంతా నిన్ను పొగుడుతున్నారు. నిన్ను చుట్టాల సురభివని, నగరి జనులంతా నిన్ను శ్లాఘిస్తున్నారు. సవతులు నినుగాంచి సిగ్గుపడుతున్నారు. స్వాధీన భర్తృకతగాంచిన స్త్రీవి, కావలసిన ప్రాభవోన్నత వైభవములన్నీ అమరియున్నాయి. సామాన్యబుద్ధిని నేనేమని నిన్ను దీవించను?" అన్నాడు నారద మహాముసీంద్రుడు. నరకాసురునిపై కేగువరకు ఆనాడు వీడలేదు. నేడు పారిజాతం గొను

[illegible]
కనుక పారిజాతము నీకు సులభసాధ్యమే సుమీ అని చెప్పాడు.

ఆ ప్రకారంగా సత్యభామను ఆశీర్వదించి శ్రీకృష్ణునిగాంచి నన్ను మరువకు దేవదేవ అని ముమ్మారు చెప్పిపోయి వచ్చెదనని ఆ ఇరువురికి చెప్పి, దేవర్షి తనదారిన దను నిష్క్రమించాడు.

ఆ మరునాడు వందిమాగధులను మధురవాక్యాలాకర్ణిస్తూ మేలు కాంచిన శౌరి తన నిత్యకృత్యములు కావించుకుని పురోహిత సహితంగా ఆస్థాన మంటపానికి వేంచేసి గురుజనాలకు నమస్కరించి, బంధువుల నాదరించి పిన్నలు మొక్కులు గైకొని ఉచితాసనం గైకొని మనసులో గరుడుణ్ణి తలచాడు.

నారదముని వచ్చి పారిజాత పుష్పమిచ్చుట
సత్యభామకి ఆగ్రహము వచ్చుట
తను ఆమెను వేడికొనుట
తానొనర్చిన శపథమును, అంతా
ప్రేమతో గరుడినికి చెప్పాడు నందనందనుడు!
మహాప్రసాదముగా భావించాడు గరుత్మంతుడు!

ఎందువల్ల అంటే తన పూర్వవైరంకూడా తీరుసని ఎప్పటినుండో ఇంద్రుని పైన కోపం నేటికి తీరునవకాశం వచ్చిందీ కదా? శ్రీకృష్ణ కార్యం సాధించుట తన పగ తీర్చుకొనుట అదను వచ్చెగదా అని గరుడుడు వూహించాడు. ఒక శుభముహూర్తాన ఆ పక్షీంద్రుని భుజాగ్రముపై ఒకవైపు శ్రీకృష్ణుడు ఒకవైపున ఆయన ప్రియపత్నియు నిలువగా వినువీధిని పయనమై మేఘాలలోనికి చొచ్చుకుపోయాడు ఇంద్రుని కభిముఖంగా పయనించాడు పక్షీంద్రుడు. చూసేవారికి మేఘాలమధ్య మెరుపుల్లా కనిపిస్తున్నారు వాళ్ళు

శంఖమును, చక్రమును, శార్ఙ్గము అనే ధనువు గదయును

మహావిష్ణు స్వరూపమైన కృష్ణునెడబాయవు కదా. శ్రీకృష్ణుడు మార్గ మధ్యంలో సత్యభామకి మేరుపర్వతాన్ని గూర్చి వర్ణించి చెప్పాడు.

ఓ కురంగలోచనా? అదిగో వారె సిద్ధులు. రత్నకుండలాలంకృతులై తెల్లని తలపాగలు ధరించి శివధ్యానం చేయువారు వారే విద్యాధరులు.

ఓ పూర్ణచంద్రవదనా! యక్షుల సమూహంతో గూడుకున్నవారే గంధర్వులు, చూశావా?

అదిగో భగీరథుడు తపస్సుచేసి గంగను తెచ్చిన ప్రదేశం దివి నుంచి భువికి వచ్చిన గంగ. అదే పవిత్రమైన గంగ. సగరపుత్రులు వేయిమందిని పవిత్రులగావించి, మోక్షమనే సౌధం ఎక్కించుటలో నిచ్చెన అయింది ఈ గంగ. నమస్కరించమన్నాడు సత్యభామను శ్రీకృష్ణుడు.

అమరావతీ పట్టణప్రాంతమదిగో, వైజయంతమనే ఇంద్రుని సౌధ రాజ మదిగో చూడు కోమలీ.

యుద్ధభూమికి వెనుచూపక పోరాడి ప్రాణాలు పోగొట్టుకునే వీరులు, యథావిధి యజ్ఞము లాచరించిన మహీసురులు, సంసార పాశముల కట్టుట త్రెంచుకున్న యోగిపుంగవులూగల రావీట అని చెప్పాడు. తన ప్రాణప్రియకు.

దేవేంద్రుడు దూరమునందే చూసి కృష్ణునకు ఎదురేగి ఐరావతం దిగి, జయంతుడు మొదలగువారు వెంటరాగా శ్రీకృష్ణుని చెంతకు వచ్చి శిరస్సువంచి నమస్కరించాడు.

ఇంద్రుని లేవనెత్తి యాలింగనం గావించి కుశలప్రశ్న లడిగాడు.

దేవేంద్రుడు తన ధర్మపత్నిని పిల్చాడు, కృష్ణుని రాక ఎరింగించాడు. ఎంతకాలంనుంచో కోరిక కల్గివున్నారు. శచీదేవి మొదలగు

అంతఃపుర కాంతలు. సర్వమహాపురుష లక్షణ లక్షితుడగు ఆ సుంద రాంగుని చూడాలని. రాజమార్గం పై దివ్యరథం వెళుతుంటే గవాక్షాల నుంచి కొందరు చూశారు. సౌధాగ్రాలనుంచి మరికొందరు చూశారు. అష్టాంగములతో నమస్కరించారు. అనగా సాష్టాంగము అని అర్ధము. అలా నమస్కరించిన వారిని కుశల ప్రశ్నలతో కొందరిని, క్రీగంటి చూపులతో కొందరిని ఆశ్వాసించి ఊరడించాడు శ్రీకృష్ణుడు.

సౌధరాజమంతా నిండిపోయింది గోపాలచక్రవర్తిని దర్శించే స్వర్గవాసులతో, రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమలకు కూడా చాలా కుతూహలంగా వుంది. ఆ భువనమోహనమూర్తిని చూడాలని ఆకాంక్షతో తహతహలాడిపోతున్నారు. కారణం కల్పించుకోవాలి కదా! లేకపోతే ప్రవేశమే లేదు. వింజామరలు చేతబూని 'తప్పుకోండని' అందరిని రెండు పాయలుగా తొలగదోసుకుని లోపలికెళ్ళి ఇరువైపుల వింజామరలు వీస్తూ నిలబడిపోయారు.

శౌరి నీవైపు చూస్తున్నాడని ఒకతె సైగచేయగా, ఇంకొకతె నాకంతభాగ్యమా? కాదు. ఆ కంసారి నీవైపే చూస్తున్నాడని సైగలతో గుసగుసలతో మాత్సర్యంతో ఒండొరులు వాదించుకుంటున్నారు.

నీవు ప్రౌఢవు అన్నీ తెలిసిన జాణవు కనుక నీవైపే చూస్తున్నాడు ఆ జగదేక సుందరుడు. అని ఒకరంటే,

నాదేముందిలే, నీకంతా ముందేవుంది కదా నీవా పరిపూర్ణయౌవన వతివి, చిన్నదానివి నీవైపు చిరునవ్వుతో ఎలా చూస్తున్నాడో చూడు ఆ మానినీ మన్మథుడు, అని ఇంకొకరు ఇలా చెణుకులు ఒకరిపై ఒకరు విసురుకుంటూ ఆ సౌధమంతా సందడిగా కోలాహలంగా హడావిడిగా నిష్ఠురోక్తు లాడుకుంటూ తిరుగుతున్నారు రమణులంతా. ఆ దేవదేవుని దర్శన కాంక్షతో తపించిపోతున్నారంతా

ఒక తన్వి మాధవునిపై లాజలు చల్లింది. వెంటనే ఆమె కొప్పు మోహపరవశమున వీడి మల్లెలు వాటంతటవే జల్లబడ్డాయి. ఆపై నేత్రములు ఆనందభాష్పములు జల్లాయి. మెడలోని ముత్యాలహారము తెగి స్వామి పాదముల ముత్యములు జల్లినట్లు భాసించాయి.

ఒకానొక సుందరాంగి తన పెంపుడు చిలుకను తెచ్చి దానిచేత క్రిష్ణా, క్రిష్ణాయని పిలిపించింది. మాధవుడు ఆ పిలుపుకి వెనుదిరిగి తనని పిలచినది ఎవరా అని చూడ ఆ మానిని మాధవుని చూపులతో చూపులు గలిపి చిరునవ్వులు చిందించింది. ఆ జగన్మోహనుడు నవ్వాడు. సత్యాదేవి ఇది చూసింది.

కృష్ణుడిట్లు సురాంగనా కృత్యములు సత్యకు చూపుట తన సౌందర్య మహిమాప్రకాశనార్థము. దానివల్ల సత్యానురాగం ద్విగుణీకృతం అవటానికే కదా ? ఆ అమరావతిని గల స్త్రీలందరి మనసులు శ్రీకృష్ణుని యందు అనురక్తిగలిగి వున్నాయి. వారంతా పరిపూర్ణ విషయానురాగులై వున్నారనుట నిర్వివాదాంశము.

అదితినిచూచి వచ్చే నెపంతో పోయి, కుండలాల జంటను అతిదికిచ్చి దేవతల మాత అయిన అదితికి నమస్కరించి కుశలమడిగాడు స్వామి. ఆమె చెంతను కూర్చుండబెట్టుకుని ఒడలంతా తడిమి ఆనందబాష్పాలు రాలగ గద్గదస్వరంతో సృష్టి స్థితిలయకారకుడైన ఓ నందనందనా! త్రిమూర్తిస్వరూపా నిన్ను కొనియాడ నాతరమా, వేదాలకి అతీతుడవు, అని పల్కి ఆ దేవేంద్రుడు మొదలైన దేవతలమాత దశావతార వర్ణనచేసి స్తుతించి నీకు శుభంకల్గుగాక అని ఆశీర్వదించింది.

అందుకే కదా ఆ మాధవుడు ముందుగా అతిదిని దర్శించి వచ్చాడు. అమరవిభుండు, వినయావనతుడై సమస్తవైభవము గల వైజయంతమున (తన సౌధాన) విడిది యుండమని కోరాడు.

మాధవుడంగీకరించి నందనోద్యానములో సత్యాసహితుడై విహరించ, స్వామిని సేవించవలెననుకోరికతో షడృతువులు ఏక కాలముననే సాక్షాత్కరించాయి. అంటే అన్ని రుతువులయందు పండేపండ్లు ఏకకాలమందే ఫలించాయి. అన్ని రుతువులందు పూచే పూలన్నీ ఏక కాలమందే పుష్పించాయి అప్పటికప్పుడు.

సురపొన్నలు చక్కగా పుష్పించాయి. చంద్రకాంత శిలా వేదికలు చంద్రకాంతికి గొప్ప తేజోవంతంగా ప్రకాశిస్తున్నాయి.

ఆ కల్పవక్షము మహత్వము ఆ చందన వృక్షము గుబాళింపు చూసి సత్యాదేవి అచ్చెరువందుతోంది. పారిజాతవృక్షం కన్నులపండువుగా చూసుకుంటోంది తన స్వతం మాదిరి. తొందరపెడుతోంది.

ప్రాణప్రియా! ఇంకా ఆలశ్యమెందుకు పారిజాతం పెకలించుకు పోదామని.

'నీ మాట నిలబెట్టుకో సత్యదూరుడవుగాకు' మని ప్రతిమాలుకుంటోంది.

వీళ్ళుచేసే మర్యాదలకు లొంగిపోయి పారిజాతవృక్షం మాటే మరిచిపోతాడేమో ఆయన అని,

తాము వచ్చినపని మాటిమాటికి జ్ఞాపకంచేస్తోంది సత్య. సత్య తొందరపాటుకి నవ్వుకుంటున్నాడు శ్రీకృష్ణుడు. ఆ అనిమిష కాంతలందరు మందాకినీ నదిలో స్నానమాడవలెనను కోరికతో ఆభరణములన్నియు విసర్జించి చీని చీనాంబరములన్నీ విడచి, పల్చనివి చిన్నవి నారబట్టలు ధరించి సుదీర్ఘములైన కురులు తడియకుండా పైకి గొప్ప కొప్పుగా మలచుకున్నారు.

వారి తను కాంతి అప్పుడే విరిసిన మల్లిపూలను ఎదిరిస్తోంది అంటే మల్లెపూలకన్నా వారి శరీరచ్ఛాయ మిన్నగా వుంది. తెల్లని దేహ

ప్రతిభగల దేవకాంతలు, గొప్ప కొప్పులుగల నిర్జరవధూటులు, జలక్రీడ లాడే నిమిత్తమై మందాకినీ నదిలో ప్రవేశించారు.

ఒకరిపై నొకరు దోసిళ్ళతో నీళ్లు చిమ్ముకుంటూ, కిలకిల నవ్వు కుంటూ, అలలు సృష్టిస్తూ, నీళ్ళలో చాపలవలె నీదుతూ కంఠంలోతు నీళ్లలో కూర్చుని తనువంతా నీళ్ళలో నుండి ముఖకమలములు మాత్రం నీటిపైకి తేలియాడు పద్మములాయని చూచువారికి భ్రాంతి కలిగిస్తూ, ఉత్సాహపూరితమైన ధ్వనులు చేస్తున్నారు.

సత్యాదేవి కోరికపై శ్రీకృష్ణుడు కూడా మందాకినిలో జలక్రీడ లాడేందుకు నదిలో దిగాడు.

ఇక దేవతాస్త్రీల ఆనందం వర్ణనాతీతం. స్వామి భుజమాసరాజేసు కుని సత్యాదేవియును మందాకినిలో జలకమాడేందుకు మొదలుపెట్టింది. తన మనోవల్లభుని భుజంపై ఆని చనువుచేసుకుని రాజహంసవలె జల క్రీడ యాడింది. అలకాపురీ రమణులలో తనుకూడా కలసిపోయి దేవతా స్త్రీలలో తనూ ఒక ధవళాక్షివలె జలక్రీడలాడింది సత్యభామాదేవి. ఏమీ అదృష్టమండి సత్యభామది ? ఆమె వారిలో కలిసిపోయి వారిలో ఒక్కరి వలె శోభిస్తోంది. ఆనాడు భువినిగల గోపికలతో జలక్రీడలాడి యమునా నదిని పవిత్రంచేసిన గోపాలచక్రవర్తి.

ఈనాడు దివిని (దేవలోకాన) దేవకాంతల (నాకవనితల) గూడి జలక్రీడలాడి మందాకినిని పునీతను గావించాడు. గోపాలదేవుడు! నన్ను తనతో కూడ భువికి తీసుకునిపోవు నను ఆనందోత్సాహాలతో నర్తిస్తోందా అన్నట్లు ఆ పారిజాతపు వృక్షం కొమ్మలన్నీ అటు ఇటు తెగ వూగు తున్నాయి. త్వరగారమ్మని తొందరపెడుతున్నాయి.

తక్కిన వృక్షరాజాలు "మన చిరకాలస్నేహం మరచి శౌరివెంట

వెళ్ళిపోవటానికే నిశ్చయించావా ? వద్దు, వద్దు సుమీ మన చెలిమివిడచి వెళ్ళవద్దు" అని పక్షిపడిగా తలలూపుతున్నాయట. చీకట్లు జగమంతా ముట్టిపెట్టాయి. ఆ రాత్రి వైజయంతమను దేవేంద్రుని సౌధంలో సుఖనిద్ర పరిపి ఆ మరునాడు ఉదయాన ప్రయాణోన్ముఖుడై, గరుడునధిరోహించి శ్రీకృష్ణసత్యలు నందనవనానికి వెళ్ళారు. గోకులంలో గోవర్ధన పర్వతం ఎత్తినట్లు తన భుజస్కంధముమీద పెళ్ళగించిన పారిజాత వృక్షాన్ని నిల్పి ఉత్సాహంగా గరుత్మంతుని భుజస్కంధముపై సత్యభామ మడికి సంతోషం నెలకొల్పాడు స్వామి.

శ్రీకృష్ణుడు పారిజాతాన్ని పెళ్లగించి పైకెత్తనా వృక్షము చుట్టుకొనియున్న లతలు "నా ధామమ్ము విడచిపోదువా, నిన్ను పోనీను" అని బిగపట్టి తమ శక్తికొలది వెనకకీడ్చినట్లు ఆ వృక్షరాజమును తీసుకొనిపోకుండా నడ్డగించినట్లున్నది. లోకంలో భార్యలు ప్రాణనాధు నెడబాయజాలనట్లు దోచుచున్న ... చమత్కరించాడు. అలా పారిజాతము పెకలించి తీసుకుని ... హరణము కదా ! అని నందనవన పాలకులు అడ్డగించారు.

"ఎకిది తనసా, యాదవవీర. దేవేంద్రునికి మాటమాత్రమైనా చెప్పకుండా, ఆ పారిజాత వృక్షాన్ని అలా పెకలించుకుని తీసుకుపోవటం ... కాదా ?" అని అడిగారు. శ్రీకృష్ణుడు ఆ మాటకు జవాబుగా "పాలకడలిలో పుట్టిన లక్ష్మిని గ్రహించినవానికి, కౌస్తుభాన్ని గ్రహించినవానికి వానితోబుట్టిన వృక్షాన్ని తీసుకుపోయి సొంతంచేసుకునే ... వుంది" అని దబాయించి కయ్యానికి కాలుదువ్వాడు.

"దీనికి ఎవరితోనూ చెప్పనవసరంలేదు. ఇంద్రుడెవరు? ఇంద్రాణి ఎవరు ?" అని కూడా తూలనాడాడు.

ఈ మాటలు వనపాలకులు వెళ్ళి తమ ఏలిక అయిన దేవేంద్రుడితో చెప్పారు

ఈ గర్వోక్తులను విని ఇంద్రుడు శచీదేవి కూడ దిగ్భ్రమ జెందారు.

తనని అలక్ష్యము చేసినందుకు కుపితుడై మూర్తీభవించిన రుద్ర మూర్తే అయాడు.

అప్పటి కప్పుడు సేనసంతా ఆయత్తం చేసుకున్నాడు గజాలూ, హయాలూ, దివ్య రథాలూ.

అమరావతి అంతా అల్లకల్లోలమయిపోయింది. "నీ తమ్ముడు, నీ మిత్రుడు, నీ ఇంటికి వచ్చి ఇంద్రుడు చేసిన మర్యాదలన్నీ పొంది, 'పారిజాతాపహరణ'మనే అకార్యమొనర్చెను. భళీ! మేలైనబంధువే?" అని లోకులంతా అనుకుంటున్నారు.

యదు వంశోద్భవుడా! పారిజాతవృక్షం హరించేవా? అని దేవేంద్రుడు కుపితుడై వజ్రాయుధం తీశాడు. నా వజ్రాయుధం యొక్క పదును తెలిసివున్న గరుడుడయినా చెప్పలేదా అనుకుంటూ సేనాసమేతుడై వీరావేశంతో నగర ద్వారంవద్దకు వచ్చాడు. ఐరావత మధిరోహించి వచ్చే ఇంద్రునకిరువైపుల అర్థపతి కుబేరుడు, నలకూబరుడు. ఆయన కుమారుడు మణికంఠుడును, జయంతుడును వచ్చి నిలిచారు.

ఈశానుడు, శివాంశ సంభూతుడగుటచే త్రిశూలం చేత ధరించి, సమరోత్సాహంతో వచ్చి నిలచాడు. మరుత్తులు, వసువులు, విశ్వులు, రుద్రులు, భాస్వరులు, తుషితులు, మొదలుగా గలవారంతా వచ్చి నిలిచారు. చిత్రసేనుడు మొదలైన గంధర్వులుకూడా వచ్చి చేరారు.

ఈ కావ్య పఠనం కావిస్తుంటే ఆనాడు రాయలవారి సభలో విన్న వారికి కృష్ణదేవరాయల దిగ్విజయ యాత్ర, జయభేరుల మ్రోతలు, జ్ఞప్తికి రాకమానవుకదా?

సురలంతా వచ్చి నిలచి ఓ పారిజాతవృక్షమును దొంగిలించిన వాడా! నిలు, నిలు, ఇక ఎక్కడికి పోలేవు అని చుట్టుముట్టారు. శ్రీకృష్ణుడు సత్యభామను పారిజాతవృక్షాన్ని ఒకచోట దించి ధనువుచేబూని యుద్ధసన్నద్ధుడైనాడు. ఇలా ఇంద్రుడికి ఉపేంద్రుడికి పోరు ఘోరమై పోయింది. ఒకరుకన్న మరొకరు తీక్షణమైన శస్త్రాలతోనూ అస్త్రాలతోను ఒకరినొకరు నొప్పించుకుంటున్నారు, తీవ్రంగా సురేంద్రుడును, ముకుందుడును ఇలా విడచిన అస్త్రాలు ఆకాశమంతా పందిరివలె అల్లుకుని వెల్తురుని చేరనీయకుండా అంధకార బంధురమై లోకాల్ని మండింపజేస్తున్నాయి. అటు సురులు, ఇటు నరులుకూడా హాహా కారాలు చేస్తున్నారు.

ఆ సమయంలో నాదేమీ తప్పులేదు అని సురేంద్రుడు, నాదేమీ తప్పులేదని ముకుందుడును అనుకుంటున్నారు. మామూలు ప్రకారంగానే విరించి గలుగజేసుకుని ఏమిటయ్యా మీపని. సహోదరులిద్దరు మహా వీరాధి వీరులేకదా ? మీరిద్దరు పోరు సల్పటం లోకానికే అరిష్టం కనుక మీ మీ బాణచయాన్ని ఉపసంహరించుకోండని కోరాడు.

మదనారికూడా విచ్చేసి లోకాలన్నీ మాడిమసై పోతున్నాయి కనుక మీరు యుద్ధం ఆపండని చెప్పాడు.

"తప్పంతా నాదే, నిన్నడక్కుండా పారిజాతాన్ని తీసుకు వెళ్లటం, ఈ వృక్షం నాకు కావాలటయ్యా? సత్యమనసుపడి కోరిందని కాని" అన్నాడు మాధవుడు.

"కాదు సోదరా! తప్పంతా నాదే గోరంతలు కొండంతలు చేసి యుద్ధాయత్తం చేశాను. అయినా నాతో మాట మాత్రం చెపితే నీ భార్య కోరిన పారిజాతం నీ పెరటిలో నాటించనా? "నన్నుక్షమించు" అన్నాడు సురపతి. యుద్ధం మామూలుగానే సమసిపోయింది అందరూ సంతోషాంతరంగులై సత్యాకృష్ణులకు ఎన్నో కానుకలిచ్చి పారిజాతవృక్షంతో పాటుగా వీడ్కోలు ఇచ్చారు.

దిగ్విజయంగా ద్వారకకు వచ్చి ఆ పారిజాతవృక్షాన్ని పూజా పునస్కారాలతో అర్చించి నమస్కరించి, ఒక శుభముహూర్తాన సత్యభామాదేవి తన పూదోటలో నాటింది. ఆనాడు విజయగర్వంతో వైభవోపేతంగా వేడుక చేసుకుంది.

* * *

కవి అన్నవాడు కప్పవిప్ప సమర్థుడు అని మరోసారి ఋజువయింది. కత్తి కన్న కలం గొప్పది. ఆ నాటకానికిదే ఉదాహరణ. కాకపోతే రాయలంతటివాడు అలిగాడు. ఆయనకి చెప్పగల సమర్థత ఎవరికుంది. పైగా చెప్పటానికి ఈయన ఏమీ తెలియనివాడా? బహుభాషా వేత్త అనేక భాషల్లో అనేక గ్రంధాలు రచించిన దిట్ట. అలుకకూడా ప్రణయకోపం కనుక. ఆయన రశిక చక్రవర్తి కనుక సరసుడు కనుక కవి చెప్పిన ఉదాహరణని చక్కగా సరసంగా తనకు అన్వయించుకుని అర్థం చేసుకుని ప్రణయ సన్నివేశాల్లో అలా జరుగుతుండటం పరిపాటే అని ఆ ఆవేశం, ఆ అలుక, శాశ్వతం కాకూడదని అలా శాశ్వతమే అయితే రసాభాసు కాకుండా పోతుందా? విషాదాంత మవదా? అలా కాకుండా వుండటమే రసజ్ఞత అనుకున్నాడు. 'ఆ పారిజాతాపహరణం' అనే గ్రంధాన్ని కృతి గైకొన్నాడు ఆనాటిసభలో.

ఆ గ్రంధ రాజానికి కృతిభర్తగా తన అదృష్టాన్ని ప్రశంసించుకుని ఆ కృతి కర్తకు అనేకమయిన కానుకలు, దుశ్శాలువలు ఇచ్చి గౌరవించాడు.

అందరూకూడా ఆ గ్రంధ రాజాన్ని కొనియాడారు. నంది తిమ్మన ఇలా జవాబిచ్చాడు.

శ్రీ సాహితీ సమరాంగణ సార్వభౌమా! ఆంధ్రభోజా అని అష్ట దిగ్గజ కవిరాజ పోషక శ్రీకృష్ణదేవరాయలవారికి నమస్కార శతము లందించి చెప్పాడు.

ప్రభువులు గ్రంధరాజాన్ని అర్థంచేసుకుని దానియందుగల గొప్ప తనాన్ని గౌరవించారు. అదే నా జీవితానికి సార్థకత. అదే నాకు అవధి లేని ఆనందపారావారం, తమరిచేత కానుకలు అందుకొనకపోవటం అవి ధేయతే అవుతుంది. నేను ధన్యుణ్ణి, ప్రభూ ధన్యుణ్ణి! అని శిరసా మనసా ప్రణామం చేశాడు.

బాహ్యానికి అందరికి తెలిసేది కాక రాయలవారి మనసుకే తాకే మరొక అర్థం, పరమార్థం వుంది.

శ్రీ రాయలవారికి తిరుమలదేవిపై వున్న అలుక ఆ గ్రంధరాజం విన్న తరువాత పటాపంచలగుట, తిమ్మనకు ఆనందదాయకం కాదా?

కవులు గ్రంధాలు రాయటం, ప్రభువులు కనకాభిషేకాలూ, బిరుదులు. కానుకలు ఇవ్వటం అనాదిగా వస్తున్నదే. కాని ఈవాళ కొత్తగా వచ్చినదేమీ కాదు కదా?

ఇప్పుడు ఈ సందర్భంలో తిరుమలదేవిపై రాయలకు కలిగిన కినుక పోగొట్టుటయే ఈ గ్రంధరచన యొక్క ముఖ్యోద్దేశం.

నంది తిమ్మనగారి ముఖ్యోద్దేశం, సత్సంకల్పం, సంపూర్ణంగా నెరవేరినట్లు రాయలవారి కన్నులే తిరుగులేని సాక్ష్యానిస్తున్నాయి. కనుక తన లక్ష్యం సాధించ కలిగాడు. కనుక సంతోషస్వాంతుడయాడు. ఇది చాలు ఈ జన్మకి అనుకున్నాడు.

శ్రీకృష్ణదేవరాయలు తిరుమలదేవి అభ్యంతర మందిరానికి వెళ్ళేందుకు వేగిరపడుతున్నారు. విలువైన కానుకలు సమకూర్చుకుంటు న్నారు. బహుకాల వియోగానంతరం పునఃస్సమాగమం ఎంత ముచ్చట? ముందుగా కబురందింది కనుక. అంతఃపురంలో తిరుమలదేవికి కూడా అంతే తొందరగావుంది. సమయిం చప్పున గడవటం లేదు. కాలం స్థంభించిపోయిందా బొత్తిగా అనుకుంటోంది. ఆవిడ చెలికత్తెలు అలంక

రించే హడావిడిపరుగులు ఎటూవుండనేవుంది. తిమ్మనగారిపై కృతజ్ఞతతో దేవి మనసంతా నిండిపోయింది.

కాలమే మాన్పాలి కదా గాయాన్ని!

రాయలవారికి తిరుమలదేవికి మధ్య వచ్చిన పొరపొచ్చాలు తిమ్మన కవిగారికి తెలిశాయని రాయలకి తెలిసిపోయింది. ఆయన గ్రహించినట్టు కవిగారికి తెలిసింది. అయినా ఎవరికి వారు ఇక ఆ విధమైన సంభాషణమరచిపో దలచారు అంతే!

ఇది చక్కని రసవత్తర కావ్యమనటంలో సందేహం లేదు. మహాభాగవతంలోని దశమస్కంధయందలి కేవలం మూడుశ్లోకాల్లో వర్ణించిన ఈ కథని మాతృకగా కావ్యాన్ని రాశాడు తిమ్మనార్యుడు.

ఆంధ్ర సరస్వతికి రాయలకాలం స్వర్ణయుగమని పేరు అందులోనూ తిమ్మనగారు పారిజాతాపహరణం రాసిన కాలం రత్నయుగం.

పారిజాతం గొడవై పోయాక నారదుడు సత్యభామను మరికొంచెం వుడికించాలనే వుద్దేశంతో ఆమెతో అన్నాడు. భర్తను తనవశవర్తుని చేసుకునే ఒక ఘనమైన వ్రతం వుందంటూ వచ్చాడు.

ఆ కవ్వింపుకు లోబడిపోయి ఆ మౌని వాక్చాతుర్యానికిలొంగిపోయిన సత్యభామ "ఏమావ్రతం? ఏమాకథ?" అని ఆతృతగా అడిగింది. "భర్తృదానవ్రతం" అని చెప్పి వివరించాడు.

ఒక శుభముహూర్తాన స్నానాదికములచే సుచియై భర్తను ఒక సద్బ్రాహ్మణునకు దానమీయవమ్మా అని చెపితే ఉలికిపడింది ఆమె.

"భర్తని దానమియ్యటమా, చెప్పకండి ఇక" అని చెవులు రెండు అరచేతులతో మూసుకుంది వినలేనట్లు.

"పూర్తిగా వినవమ్మా సత్యాదేవీ ఖంగారుపడకు. నీ భర్త బరువు

తూచి తూగినంత సువర్ణం కాని ధనంగాని బ్రాహ్మణునకిచ్చి, నీ భర్తను నీవు తిరిగి పరిగ్రహించవచ్చు. అప్పుడు అనగా అటుపిమ్మట నీ భర్తను నీకు వశవర్తి అయి నువ్వు గీచిన గీటు దాటడు నమ్ము నా మాట" అంటాడు నారదమహర్షి. తనవద్ద కావలసినంత బంగారం వుందని ధైర్యంతో సరేఅంది.

మరొక్కసారి ఆ వ్రతాన్ని చెప్పించుకొని నారదుని నోటంట సావధానంగా విన్న సత్యభామకి దానగ్రహీత ఎవరైతే బాగుంటుంది అనే మీమాంస వచ్చిపడింది. మహర్షి అయితే గొడవలేకుండా, ఎవరికి తెలియకుండా గుట్టుగా అయిపోతుంది అని ఆలోచించింది.

మళ్ళీ ఎవరో ఎందుకు మీరే ఎందుకు కాకూడదు. దానగ్రహీత? అని అడిగింది నారదుడిని.

కాస్సేపు బ్రతిమాలించుకుని "తథాస్తు" అన్నాడు నారదుడు. శుచియై నారదమహర్షికి తన పతిని దానమిస్తుంది సత్యభామ.

అంతవరకు తేలిగ్గానే జరిగింది వ్రతం ఇప్పుడు వ్రతానికి పూర్వ భాగం ముగిసింది.

కష్టమంతా ఉత్తరభాగంలోనే వుంది.

'తుల' తెచ్చారు పరివారం.

స్వామిని ఒకవైపు కూర్చుండ బెట్టారు. మరొకవైపు ధన కనక వస్తు వాహనాలు తెచ్చిపడవేస్తున్నారు పరిచారకులు. తన ఏడువారాల నగలు, తనతండ్రి ఇచ్చిన నగలు, శమంతకమణి. బారువుకొలది రోజూ ఇచ్చే సువర్ణం తెచ్చి పడేశారు. ధనేతరములు వేసిన వైపు తేలిపోతూనే వుంది కాస్తయినా క్రిందకు దిగవేదు. స్వామి కూర్చున్న వేపుమాత్రం నేలమీదనే వుంది. రవ్వంతయినా పైకి లేవలేదు. ముక్కుముంగెరతో

సహా అన్నీ పడివైచినా కాని కొంచమైనా తూగలేదు. ఆమె ధైర్యం దిగజారిపోనారంభించింది.

ఇప్పుడేది దారి? ఇక తనవద్దేమీ లేదే? ఈ సంగతి తెలిస్తే సవతులందర్లో ఎంత తలవంపు? ఎంత అవమానం? మౌని ఈవ్రతం ఎందుకు చెప్పాడు? పోనీ చెపితే మాత్రం తన ఆలోచన ఏమైంది?

పట్టపురాణి రుక్మిణిని అడిగితే ఏదైనా యోచన చెప్పునేమో? తనకు మాత్రం భర్త కాడా కృష్ణుడు? తను కాస్త తగ్గాలి రోజు మంచిది కాదు కనుక తప్పదు అనుకుంది.

ఆమె సౌధానికి తను వెళ్ళటమా అని ఒక్క క్షణం తటపటాయించింది. తప్పదని నిశ్చయించుకుని లేచింది.

నారదుడు తొందర చెయ్యటం మొదలెట్టాడు. తను స్వామిని తూచుకోకపోతే స్వామిని నారదుడు తీసుకుపోతే స్వామి నారదుని వెంబడించి ఆయనతో వెళ్ళిపోతాడనే వూహే దుర్భరంగా వుంది. స్వామిని ఎడబాసి మనగలదా తను?

కృష్ణస్వామి కన్నుల్లో దిగులు, నిస్సహాయత నటించాడు. క్షణం కూడా జాగుచెయ్యలేదు సత్యభామ.

పరుగున రుక్మిణి సౌధానికి వెళ్ళింది. ఆమె పాదాలు పట్టుకుంది. ఆత్మాభిమానం విడచి ఆత్మీయతగా అక్కా! అని పిలిచింది సత్యభామ. పరిస్థితి అంతా వివరించింది. నారదమహర్షి మాయ చేశాడంది. తన నిస్సహాయతని వెలిబుచ్చింది. ఈ విపత్తునుంచి ఒడ్డున జేర్చగలదానవు నువ్వేనని ఉబికి వస్తున్న కన్నీళ్ళను చేలాంచెలముతో అద్దుకుంది.

“చెల్లీ నా దగ్గర ఏమి భూషణాలున్నవో నెన్ను డెరుగడా” అంది రుక్మిణీ అక్కడేవున్న సవతులు తలోమాటా అన్నారు.

"భర్తను దానమిచ్చే వ్రతముంటుందా?" అని ఒకరంటే "ఎంత సాహసం?" అని మరొకరు బుగ్గలు నొక్కుకున్నారు. "నీకొక్కదానికే భర్తా? మమ్మల్ని ఎవరినైనా సలహాఅడగాలనైనా తోచలేదా?" అని ఒక జాణ అంటే "మేం ఇప్పుడు గుర్తొచ్చామా?" అని వగలాడి దెప్పిపొడిచింది. అందరూ వచ్చారు వ్రత ప్రారంభస్థలానికి.

నారదమహర్షి వ్రతాన్ని, వ్రతమహత్యాన్ని మరోసారి అందరకు వివరించాడు సావధానంగా.

అందులో తన తప్పుకాని పొరబాటుగాని లేదని ఋజువు చేసుకున్నట్టు రుక్మిణి ముందుకువచ్చి శ్రీకృష్ణుడికి ప్రదక్షిణ నమస్కారం చేసింది. నారదుడు 'ఆగు తల్లీ' అన్నాడు. సత్యభామాదేవీ చక్కగా విను నేను చెప్పేది. నీవు శ్రీకృష్ణ స్వామిని తూచుకోలేకపోయావు. అనగా ఆ విశ్వవ్యాపిని తులతూచటం నీకు అలవికాని పనయిందన్న మాట అంతేకదా!" అవునని తలవూపింది సత్య అదోవదన అయి.

"ఇక ఇప్పుడు ఎవరు తూచుకోగల్గితే స్వామివాళ్ళ వశవర్తి అవుతాడు. అనగా వారి ఆజ్ఞానువర్తి అవుతాడు."

మాయా మానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు అంతా చూస్తున్నాడు సత్యవైపు జాలిగా చూశాడు. సత్యా నన్ను ఈ మౌనిపరం చేస్తావా? అన్నట్టు. "భయపడకండి స్వామీ" అని చెపుతోంది కళ్లతోనే. కాని తనకే భయమేస్తుంది. తన ధైర్యమే దిగజారిపోతోంది. పూర్వాపరాలేమీ ఆలోచించకుండా ఈ వ్రతంలోకి ఉరకటం మొదటి నా తప్పు అనుకుని పశ్చాత్తాపపడుతోంది సత్యాదేవి. ఆమె మనసు పరిపరి విధాలుగా పోతోంది.

పెంచినవాళ్లుండగా, కన్నవాళ్లుండగా ఇంకా కట్టుకున్నవాళ్లుండగా తనెలా దానమిచ్చింది కృష్ణయ్యను అని అంతా ఆడిపోసుకోరా? ఏడుగురు

పట్టమహిషులు పదహారువేలమంది గోపికాస్త్రీలు ఏకమై తనను కఠినోక్తు లాడరా? సవతులందరికి లోకువై పోవటానికే వచ్చిందీ వ్రతం.

ఈ మహర్షి ఎన్నిమాటలాడాడని "ఏమమ్మా సత్యాదేవీ! ఇక నువ్వు స్వామిని తూచుకోలేవని తేలిపోయింది. ఇక ఈ పని నీవల్ల కాదని నీ బిక్కమొగమే చెపుతోంది. నాకు శలవిస్తే స్వామిని దీసుకుని పోతాను. ఎవరైనా కొనిగలవారుంటే కొంటారు" అన్నాడుకదా? ములు కుల్లానాటి నా మనసు ముక్కలు ముక్కలుగా చేశాయే ఆ మాటలు.

ఈ మహర్షి మాటలు భరించలేకే గదా? అబ్బబ్బ! అలా తొందర పెడతాడేం తన కొంపంతా మునిగిపోయినట్టు.

ఆలోచనలతో వికలమైపోయిన మనస్సుని మళ్ళీ అక్కడకు తీసుకొచ్చి ప్రస్తుత పరిస్థితిలో కొచ్చింది నారదుని కేకలతో.

'తుల'లో వుంచిన సువర్ణమంతా బయటకు తీసిరాసిగా పోశాడు.

"అమ్మా రుక్మిణీ! నీ పని కానియ్యి" అన్నాడు నారదుడు.

భర్తకి వందనం చేసింది. త్రికరణశుద్ధిగా "నేనే కనుక భర్త నుపాసించే అర్ధాంగినైతే ఈ తులసిదళంతో సరితూగు స్వామీ" అని ప్రార్థించిందేమో మరి. ఒక్కక్షణం రుక్మిణి కన్నులర్ధనిమిలితాలయ్యాయి మనసులో ఏమనుకుందో మనకు తెలియదుకాని తులసిదళం 'తుల'లో వెయ్యగానే స్వామి కూర్చున వైపుది పైకిలేచి రెండువైపుల ఆ త్రాసు సరితూగింది, ఆ ఆశ్చర్యాన్నించి తేరుకోకముందే.

నాపని అయిపోయింది నాకు శలవియ్యి కృష్ణా! అని నమస్క రించి నారాయణ స్మరణ చేసుకుంటూ మెల్లగా జారుకున్నాడా నారద మహర్షి. ఆమె తూచుకోగల్గింది గనుక రుక్మిణి వశవర్తి అయి ఆమెవెంట వెళ్ళే కృష్ణుని చూసి ఏమీ అనలేని, ఏమి చేయలేని సత్య తన స్వామి మూర్తిని తన హృదయపీఠం మీదే ప్రతిష్టించుకుంది. ఇహ ఇప్పుడు

సత్యభామాదేవికి కళ్ళు తెరిచినా మూసినా అంతా కృష్ణమయంగానే తోస్తుంది.

మనోవ్యధకి, అసూయకి, మాత్సర్యానికి, చింతకి అతీతమైన స్థితి అది. చెలికత్తెలంతా కళవళపడ్డారు.

ఆత్మ విశ్వాసం ఘోరంగా దెబ్బతిని చిత్తుగా ఓడిపోయింది పాపం అనుకున్నారు. స్వామి చెంతలేని కారణంగా ఈవిడ ఉన్మత్తురాలై పోతోందని భ్రమించారు.

తమ సొంతమనుకున్న అపురూపవస్తువును, ఇతరులు తన్నుకుపోతే పొందే పరితాపతప్త సత్యభామ అనుకున్నారు చెలులు. ఏదిఏమైనా మునుపటి సత్యభామ కాదు. అంతా మారిపోయింది "దేవీ! మీరు ఊరట చెందండి. మేమిప్పుడే హుటాహుటిన వెళ్ళి స్వామిని మీఎదుట నిలబెట్టి మా సామర్థ్యం చూపుతాం మీకు. మీరలా దిగులుపడితే మేం భరించలేం అన్నారు.

ఇష్ట సఖిని చూసి చిరునవ్వు నవ్వింది సత్యభామ. ఆ నవ్వులో విరక్తివుంది. విజ్ఞానంవుంది. అందరూ అనుకునే అసూయ, అలుక, అజ్ఞానం అంతరించిన ఆ నవ్వు ఆ చూపులూ అంతర్గతమైనవి. తేజోవంతంగా వెల్గుతున్నాయి. స్వామి తన చెంతనేవున్నాడు. తనలోనే వున్నాడు. (హృదయంలో) ఇదివరలో స్వామి ప్రసాదించిన వరమేమో ఆ వరం అత్యున్నతము అమోఘము అయినది.

ఈ రకంగా సత్యభామ పాత్ర సాహిత్యలోకాన ప్రేమలోకాన, కూడా ధృవతారగా మలిచాడా స్వామి అనిపించక మానదు.

* * * *

రాలు కూచిపూడి వారు అతి లావణ్యమూర్తిగా, అత్యంత అలంకార శోభితంగా మలచి జగతిని సుస్థిరం చేశారు.

సత్యభామ హృదయం తెలిసినవారు, పారిజాతాపహరణం, కృతి కర్త ముక్కుతిమ్మన, సిద్ధేంద్ర యోగి ఈ ఇద్దరేమో అనిపిస్తుంది. సత్యభామ ఆవేదన, విరహవేదన, నివేదన 50 దరువుల్లో, కందలూ, కందార్థాలూ, సీసలు, సీసార్ధాలు, ద్విపదలు, ద్విపదార్థాలూ, అర్ధచంద్రికలూ, ఏలలూ, దవళాలూ, జోలలు, త్రిపుటలు ఇంకా సంస్కృత శ్లోకాలూ వుంటాయి.

కర్నాటక సంగీతమే అయినా దేశీయ సాంప్రదాయంతో ఆలపిస్తారు. తాళాలు దేశీపద్ధతిలో ఉంటాయి.

ఈ నృత్య నాటికలో వీటిని సలాంజతులని అంటారు. దీన్లో అష్టవిధ నాయికలు, విప్రలంబ, శృంగార కరుణరసాలు ప్రధానంగా నవరసాలు, దశవిధావస్థలూ ప్రదర్శిస్తారు. వీటన్నిటిలో సత్యభామ బహు విజ్ఞానం, రాజసం ప్రస్ఫుటమౌతాయి. ఈ కలాపంలో కృష్ణుడు కనుపించడు. సత్యభామ ఒక్కతే రంగంమీద కనుపిస్తుంది, ఆ విరహానికి కారణం చాలా చిన్నది.

ఒకనాడు పడకటింటి ముచ్చట్లో.

అందచందాల్లో ఎవరుగొప్ప? నీవా? నేనా? అని శ్రీకృష్ణస్వామి వారు అడుగగా ఆయనయందు అతిచనువు కల్గివున్నందువల్ల దుడుకుగా 'నేనే' అంటుంది సత్యభామ.

వెంటనే స్వామి అలిగి వెళ్ళిపోతాడు.

చెంతలేనిదే క్షణం నిలువలేకపోయింది. మామూలుగా విరహిణులకు పొడచూపే బాధలే ఆమెను దహించివేస్తుంటాయి.

వెన్నెల వేడవుతుంది. శ్రీచందనంలో చల్లదనమే లోపిస్తుంది. పాన్పుపై చల్లిన మల్లెలే మరునిశరాలై వేధిస్తాయి. నిశలు దీర్ఘములై తోస్తాయి. గడియొక యుగమై తోస్తుంది. అది సహజమే కదా ప్రేమికు లకు. కొంతసేపు అంతర్మథనం జరిగాక, తన మనసు తన ఆవేదన చివరకు తన ప్రియసఖికి సర్వం విశదపర్చుతుంటుంది.

అసలు వేదికమీదకు వచ్చేప్పుడే "ఓ మగువా, ఓ చెలియా, సఖియా, లలగా వయ్యారి ముద్దుల సత్యభామనే, అని తన్ను తాను పరి చయం చేసుకుంటుంది.

ఆడు గడుగునా రాజసం, ఆత్మాభిమానం తొణికిసలాడుతుంటాయి. "పదియారువేల కోమలు లందరిలో గోపాలదేవుని ప్రేమ దోచిన భామని" అని ఇంతిని, చామంతిని, విరిబంతిని మరుదాంతిని అనికూడా పరిచయం చేసుకుంటుంది. ఆహా! ఏమి ఆభామ సౌభాగ్యం. అది ఎవరి కొస్తుంది. "అందంలో ఆనందంలో గోవిందుకు కనువిందునై" అనే అదృష్టశాలి. ఆమె కాక మరెవరు ?

"నందనందను నెందు గానక గుందుచున్నా నని" విరహోత్కంఠయై వాపోతుంది. కూచిపూడి నాట్యంలో జీవించిన సత్యభామ, మాధవి యనే ఇష్టసఖిని బిలచి, ఆమెచే ప్రశ్నలు అడిగించుకుని స్వామిపేరు చెప్పటానికి మురిపిస్తుంది, సిగ్గాయెనమ్మా అని, తన స్వామి కోపకారణం తన చెలికెరింగించి, స్వామి ఇక నా కన్నులబడకపోతే, నా మేన ప్రాణాలు ఇక నిలవనంటుంవి ఇక. నేను జీవించియుండటం కల్ల అంటుంది.

తన చెలిని స్వామివద్దకు పంపి సర్వం ఎరింగించమంటుంది. తన స్త్రీ సహజమైన చాపల్యంతో అన్నమాటలు మన్నించమని ఆ మానినీ మన్మథుణ్ణి మనసారా కోరుకుంటుంది.

అంతే కాదు శ్రీకృష్ణప్రభువు పేరు చెప్పటానికే తన చెలి దగ్గర తెగ సిగ్గుపడిపోతుంది. 'సిగ్గాయెనమ్మా' అని ఎంతో ముచ్చటగా అభినయిస్తుంది, పాడుతుంది. రెండు అరచేతులూ ముఖానికి అడ్డుపెట్టుకుని పక్కకు తిరిగి, వేళ్ల సందునుంచి దొంగచూపులు చూస్తూ సిగ్గుపడుతుంది. ఆ సిగ్గు పండిత, పామర మనోరంజకంగా వుంటుంది.

కృష్ణుని చెంతకు చెలి రాయబారం తీసుకెడుతుంటే ఎన్నో శుభ శకునాలు కనిపిస్తాయి. శకునాలు మంచివాయెనమ్మా, ఉత్తరాన ఉరుము ఉరిమిందట, అదే మంచిశకునంగా పొంగిపోతుంది సత్యభామ. అలా ప్రియసఖిని స్వామివద్దకు రాయబారం పంపి. చివరకు అనుకుంటుంది. "ఎంత రాజసమో ఆ గొల్లవానికి" అని సంచారీ భావాలు చక్కగా చూపుతుంది సత్యభామ.

సత్యభామ వేషధారిణి చక్కని జ్ఞానంకల్గివుండి, వెనక పాట గాయకులు మంచి పాండిత్యం చక్కని గాత్రం కల్గివుంటే, ఓ హో! శ్రోతలకి స్వర్గారోహణమే కదా?

నాట్యంలో మేటి అనిపించుకున్నవారికి, ప్రేక్షకులలో

ఓహోహో! "ఈ నాటి నాట్యమెంత బాగుంది. న భూతో న భవిష్యతి" అని అనుకున్నప్పుడు ఆ కళాకారిణికి సత్యభామ జడ బహూకరించే ఆచారముండేది.

నిడుపైన ఆ జడ ఒక తెరమధ్యగా గుచ్చి ఆ తెరకిరువైపులా ఇద్దరు ఆ తెరను పట్టుకుని వేదికమీదకు వచ్చేవారట. సాంప్రదాయ సిద్ధంగా ఆ జడ బహూకరించి ప్రేక్షకులకు, కనువిందు చేసేరు ఆ జడకు చివరగా కుచ్చులు, ఆ కుచ్చులు కుడిచేతపట్టి కుడివక్షంమీదుగా బొడ్డు కిందవరకు వ్రేలాడే జడతో వయ్యారంగా ఆ పూలభారానికి ఆగి ఆగి అడుగువేస్తూ 'భామనే సత్యభామనే' అనే పాటతో ప్రారంభమైన

నృత్యం, స్వామికి సఖి చేతపంపిన రాయబారం విజయవంతంగా ఫలిస్తుంది. స్వామి కరుణిస్తాడు సత్యని. చివరకు వేణుగానరవంతో సత్యాదేవి విరహం శమిస్తుంది. అది కృష్ణాగమనానికి నాంది కదా ?

ఇలా సాహిత్యలోకాన, నాట్య ప్రపంచాన కూడా సత్యభామ పాత్ర సాటిలేనిది.

నాట్యలోకాన దక్షిణ ప్రాంతీయులకు సత్యభామ అద్వితీయము, అనుపమానము అయి తన ప్రతిభను విరజిమ్మితే, నృత్యరీతుల్లో, ఉత్తరాది ప్రజలకు రాధ పాత్ర అమోఘము, అఖండము అయి తన ప్రజ్ఞను వెదజల్లింది. అందుకే ఆ అమరమూర్తికి, అక్షయకీర్తి.

ఇలా నిరుపమానము, నిత్యాదర్శము అయిన సత్యభామ శృంగారాదులగూర్చి ఎంతచెప్పినా, సంపూర్తి కాదు. ఇంకా కొంత మిగిలిపోయే వుంది అనిపిస్తుంది.

## రచయిత్రి ఇతర పుస్తకములు

1. చేజారని స్వర్గం
2. స్వర్ణపంజరం
3. దీపిక
4. తేనె చినుకులు
5. వైజయంతి
6. శ్రీకారశంఖం
7. ఆనందనిలయం
8. ఏక్ అవిష్ జిందగి (హింది)
9. ప్రేమిస్తాను